


# అంతరంగం

# AN INTRODUCTION TO LIONISM




COMPILED & NARRATED BY
Lion Dr. G.V. PURNACHAND MJF
Dist. Chairperson, Orientation, Dist. 324 C4

PUBLISHED BY
Lion G. VIDYAVATHI MJF
Dist. Chairperson, Information, Dist. 324 C4

Lion **Garlapati Vidyavathi** MJF born on 12-01-1956 at Guntur, a centre for culture and heritage. She is an intensive activist immersed in the Lionsitic projects since one and a half Decade. She is the District Chairperson, Informatin and Women Membership Development and Participation.



She joined Lionism in the year 1986 through Lioness Movement and was elected as Lioness District President in the Year 1992-93.

She is the charter President for Lions Club of Vijayawada Vijetha and served the District in various capacities as ZC, RC and DC for several times.

She received Two International President's Awards 4 extension Awards and one Guiding Lion Award.

She was Adjudged as outstanding President in District and Multiple, out standing Region Chair Person, Lion of the Region, Lioness of the Region, Lion of the District and outstanding DC for Several times.

She donated Rs. 1,00,000/- to Veterinary Hospital District Project and larger amounts to other projects including Lions District Office.

Garlapati Vidyavathi Prasad Rao Sri Vasavi Seva Sangham Bhavan at Krishna Lanka, Vijayawada is the best example for her charity. She is connected with many Social & Cultural organisation.

As District Chair Person, for Child Health Care, she sponsored 50 Camps and Distributed Medicines during 1999-2000. Similarly in the year 2000-2001 she sponsored 150 Diabetes Awareness Camps and during 2001-02, as DC for LCIF & Child Eye Care she was instrumental in conducting 100 Child Eye Care Camps and Distributed more than 1000 spectacles to correct refraction error. In the Next year, she was continued as Chair Person for LCIF and she promoted 25 MJFS during the above two year tenure.

She sponsored Numerous other Medical Camps and distributed Medicines including 50 Dental Camps in one day on the occassion of Gandhi Jayanthi and one thousand Family Planing Camps in the Millennium year.

She also received Mother Teresa Millennium Seva Puraskar, through the hands of Dr. C. Narayana Reddy, Uttama Attagaru Award, Manchiki Satkaram (Annam Satya Narayana Charitable Trust Award).

With the divine blessings of Matha Siva Chaitanya she started an Old Age Home "Matru Chaya Anadha Ashramam at Nutakki.

She is the First Lady Lions President, Lady Zone Chairperson and Lady Region Chairperson in our District 324 C4. She is a Melvin Jones Fellow

She and her spouse Lion G.D.V. Prasada Rao, who is also most involved and dedicated Lion Leader have two sons - Karunakar & Sridhar.



THE INTERNATIONAL ASSOCIATION OF LIONS CLUBS
LIONS CLUBS INTERNATIONAL®
DISTRICT 324 C4 :: 2003-04




# అంతరంగం

(THE INNER HEART)

## AN INTRODUCTION TO LIONISM

కూర్పు

**లయన్ డాక్టర్ జి.వి.పూర్ణచంద్, MJF**

డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్, ఓరియెంటేషన్

ప్రచురణ

**లయన్ జి.విద్యావతి, MJF**

డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్, ఇన్‌ఫర్మేషన్

1

# "ANTHARANGAM"

# (The Inner Heart)

# -An Introduction to LIONISM

Compiled and Narrated by

**Lion Dr.G.V. PURNACHAND** MJF

District Chairperson, Orientation 2003-04

SUSRUTA AYURVEDIC SPECIALITY HOSPITAL

1st Floor, Satnam Towers,

Opp : Buckinghampet Post Office,

Governorpet, VIJAYAWADA - 520 002

Phs : 0866 - (O) 5568185, (R) 2483677

Mobile : 94401-72642. Mobitel : 5678185

Ist Edition :

**November-2003**



Title Design :

**D. RAMA KRISHNA REDDY**

Type Setting By :

**PRINT PLAZA**

VJA. Ph : 3119696

Published By : **Ln. G.VIDYAVATI, MJF**

District Chairperson, Information, District 324 C4

41-3-74, Rice Shop Bajar, Krishnalanka, Vijayawada.

Tel : 0866 (O) 2577816, 2576520, (R) 2521117, Cell : 98491 29989

2



It is a delight for me very extremely, because, it is my dream to bring a mannual containing complete information about Lionism update, during my tenure as District Governor.

I have choosen Ln. Dr. G.V.Purnachand, MJF who is a knowledgeable and senior Lion of many years standing, and requested him to accept this assignment.

As rightly presumed, Dr.Purnachand has done his job excellently. He compiled maximum upto date information and brought to light the inner heart of Lionism.

It is upto the Lion Leaders and Club Officers to make use of this information and strengthen thier Administrative capabilities. I request every lion Member to go through this book **Antharangam** and enrich knowledge.

At the same time, it is my sincere duty to congratulate Ln.G.Vidyavati, DC for Information and Women Membership Development & Participation, who has readily come forward to publish such an useful work and making available free of cost for all the Cabinet Members and Club Presidents, Secretaries. I am sure that this book will focus attention on all the aspects and it will go a long way illuminating the Golden Path.

Once again I state "Creativity and people are my areas of strength". This Project work furthers my statement.

Thanking you all.

Yours in Lionism

**D.GOPINATH**, MJF

District Governor, District-324 C4



My dear Dr. Purnachand

Greetings & Best Wishes

I am happy to learn that you have compiled and narrated another book which is unique in its kind in Telugu "**Antharangam**" - exploring the latest information about Lionism. In the recent past, you have already published four more books and booklets on Lionism. This time you narrated the Lionistic principles and procedure in Telugu Language in a commendable manner. As you are a senior and popular writer in Telugu, your tallent appears in each of the pages of this book. Please accept my congratulations.

The strenuous job that you are assigned was justified by Ln. G.Vidyavati, MJF, District Chairperson, information, the publisher of this book, who never used to hesitate to takeup herculian tasks.

I also take this apportunity to compliment Ln.Vidyavati and wish her the best in her endeavour.

Thanking you,

Yours in Lionism

**Ln. Dr. Y. JAGANMOHAN RAO**, PMJF

Vice District Governor, District-324 C4



## లయన్ జి.విద్యావతి MJF

డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్, ఇన్‌ఫర్మేషన్

లయనిజాన్ని బాగా అర్థం చేసుకుంటున్న కొద్దీ మరింత క్రమశిక్షణ కల్గిన వ్యక్తులుగా మనందరం ఎంతో బాగా పని చేయగల్గుతాము.

లయన్ శ్రీహరి రావు గారు వంటి మన పాస్ట్ గవర్నర్లు ఎంతో కాలంగా ఎన్నో విషయాలు ఎన్నో సార్లు చెప్తూ వస్తున్నారు. అవి మనకి ఎంతో ఉపయోగపడ్డాయి.

ముఖ్యంగా ఇటీవలి కాలంలో అనేక మార్పులు లయనిజంలో కొత్తగా చేయడం జరిగింది. వాటి వివరాలన్నింటినీ మన సభ్యులకు తెలియచేసే ఏర్పాటు చేయవల సిందిగా డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్, ఇన్‌ఫర్మేషన్‌గా నన్ను మన గవర్నర్ లయన్ డి.గోపీనాథ్, MJF గారు ఆదేశించారు. అందుకోసం నవంబర్ 30, 2003న విజయవాడలో, ఒక సెమినార్‌ను నిర్వహించాలని సంకల్పించాను.

మంచి రచయిత, తెలుగులో అనేక పుస్తకాలు రాసిన సీనియర్ లయన్స్ సభ్యులు లయన్ డా॥జి.వి.పూర్ణచంద్,MJF గారు లయనిజంలో చక్కని పరిజ్ఞానం కల్గిన వ్యక్తి కావడంతో, గవర్నర్ గారి సూచన మేరకు, వారిని మంచి పుస్తకం తయారు చేయమని అందులో అన్ని విషయాలు లయనిజానికి సంబంధించినవి తప్పనిసరిగా వుండేలా చూడమని, పది కాలాల పాటు అది రిఫరెన్స్ పుస్తకంగా వుండాలని కోరడం జరిగింది.

పాస్ట్ గవర్నర్ లయన్ తాతినేని శ్రీహరిరావు MJF గారు, లయన్ టి.దుర్గా మల్లేశ్వరరావు, MJF గారు మా ఈ ప్రయత్నానికి తమ ఆశీస్సులు అందజేశారు.

చాలా స్వల్పకాలంలో ఎంతో అమూల్యమైన పుస్తకాన్ని రచించి, ఇచ్చిన డా॥పూర్ణచంద్ గారికి మా అభినందనలు తెలుపుతున్నాను. ఇలాంటి మంచి ఇన్‌ఫర్మేషన్‌ను ప్రచురించి మీ అందరికీ అందించడం నాకెంతో గర్వకారణంగా వుంది.

ఈ పుస్తకాన్ని సద్వినియోగం చేసుకోవడం మన అందరి బాధ్యత. ఇందులో ఎన్నో విలువైన విశేషాలున్నాయి. డిస్ట్రిక్ చైర్‌పర్సన్, ఇన్‌ఫర్‌మేషన్‌గా నా బాధ్యతలను నెరవేరుస్తూ మన డిస్ట్రిక్ట్ లోని ప్రతి లయన్స్ సభ్యుడికీ ఇందులోని విశేషాలు అందాలనేది నా ఆకాంక్ష. కేబినెట్ మెంబర్స్‌కు, క్లబ్ ప్రెసిడెంట్ సెక్రటరీలకూ, ఈ పుస్తకాలను నేను అందజేస్తున్నాను. మీరూ, మీ క్లబ్ సభ్యులు దీన్ని చక్కగా ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని అంకితం స్వీకరించడానికి అంగీకరించిన మన ప్రియతమ నాయకులు ఇంటర్నేషనల్ డైరెక్టర్, లయన్ చిగురుపాటి వరప్రసాద్, PMJF గారికి నా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.



# అమూల్యత్వాన్ని సంతరించుకొన్న సాధికారిక గ్రంథం "అంతరంగం"

లయన్ తాతినేని శ్రీహరిరావు
పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్

నాయకత్వ లక్షణాలతో అందిన అవకాశాన్ని అనితర సాధ్యంగా మలచుకోవడం, చేపట్టిన పనిని ఉన్నత ప్రమాణాలలో సాధించటం ఎన్నదగ్గ లక్షణాలుగా చెప్పవచ్చు.

లయన్ డా॥ పూర్ణచంద్ ఈ లక్షణాలు పుష్కలంగా కల్గిన నాయకుడు.

లయనిజం ఒక మహాసాగరం. అందు తరంగాలు చైతన్య దీపికలు. మానవ మేధస్సూ సాగరం లాంటిదే. అందు ప్రేరణ కొద్దీ తరంగాలు ఉద్భవిస్తాయి. అట్టి ప్రేరణ కారణంగా లయనిజ సాగర గర్భం నుంచి వెలికి తీసిన అమూల్య ముత్యాల సరాలు ఈ 'తరంగం'లో కూర్చిన విషయాలు.

మొదటి "తరంగం" లోనే పాఠకులకు అవగత మౌతుంది. ఈ మన లయనిజ పరిశోధకుడు డా॥ పూర్ణచంద్ ఎంతో శ్రమించి చరిత్ర శోధించి అమూల్య విషయాలు మన ముందుంచారు. పాఠకులను ఆ సాంతం చదివించే తీరు చక్కని సరళ శైలిలో వుంది!

మన రచయిత బహు గ్రంథకర్త కావటంతో అమూల్య విషయాల ద్వారానే పాఠకుల ఉత్కంఠత కొనసాగించుతూ సాగిందీ రచన.

మన మాతృభాషలో లయనిజంలోని అమూల్య, సంక్లిష్ట విషయాలు కూడా సులభ శైలిలో అందించడం ఈ పుస్తకం ప్రత్యేకత.

సజీవమైన లయనిజం కాలానుగుణంగా అనేక మార్పులకు లోనవుతున్నది. అట్టి అధునాతన మార్పులను కూడా సేకరించి అందించినందుకు ప్రత్యేకించి అభినందించాలి.

అపార అనుభవం కల్గిన సభ్యులకు కూడా అందుబాటులో లేని అనేక విషయాలు ఇందుండటం ద్వారా అమూల్యత్వాన్ని సంతరించుకున్నది ఈ లయనిజం సాధికారిక గ్రంథం. లయనిజ శిఖరాల నధిరోహించ గోరే ప్రతివారూ ఈ పుస్తకాన్ని ఒక రిఫరెన్స్ బుక్‌గా వినియోగించుకొనదగ్గది. మున్ముందు కాలాలలో వచ్చే మార్పులను కూడ చేర్చి పుస్తకంతో పాటుగా భద్రపరచుకుని ఉపయోగించండి.

"KNOWLEDGE IS POWER" అనేది మన లయన్సుకు అందుబాటులోకి తెచ్చి తద్వారా స్వచ్ఛమైన లయనిజం వ్యాప్తికి దోహదం చేయడం ఈ పుస్తకపు ముఖ్యోద్దేశం. ఈ ధ్యేయం నెరవేరటానికి రచయిత శోధనా చాతుర్యం ఎంతగానో ఉపకరించింది. అందుకు ప్రత్యేకించి అభినందించాలి.

ఈ పుస్తకాన్ని ప్రచురణ బాధ్యతలను చేపట్టిన Ln.విద్యావతి గారికి, వారిని నిరంతరం ప్రోత్సహించే Ln.ప్రసాదరావు గారికి ప్రత్యేక అభినందనలు.

మున్ముందు మరిన్ని లయనిజ సాధికారిక గ్రంథాలు మాతృభాషలో వెలువడేందుకు ఇది ప్రేరణ కావాలని తద్వారా మహోన్నతమైన లయనిజం మాననీయం కావాలని ఆకాంక్షిస్తూ అందరికీ అభినందనలు.



# ఒకే ఒక్క సేవా మహా సామ్రాజ్యం

**లయన్ డా॥ జి.వి.పూర్ణచంద్, MJF**
డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్, ఓరియెంటేషన్

మానవీయమైన స్పందనలన్నింటి లోనూ అతి బలీయమైనది 'సేవా స్పందన'! - అది సమస్త మానవతత్వానికి మూలమై, మానవ జీవితానికి ఒక చోదకశక్తి (Driving Force) గా మనిషిలో చేతనావృతాలను ఆవిష్కరింప చేస్తుంది. సేవా స్పందన మనిషిని సమాజం వైపు నడిపిస్తుంది. సమాజం పట్ల నిబద్ధతని (Committment) ప్రేరేపిస్తుంది. వ్యక్తిలో సామాజిక స్పృహని రగిలింప చేస్తుంది. మానవ అస్తిత్వపు ఆలోచల్ని తట్టిలేపి తృష్ణ, తృప్తి, త్యాగం, అర్పణ, ఆరాధన, తపన - ఇలాంటి అనుభూతుల వెల్లువని సృష్టింప చేస్తుంది.

★ ★ ★

మహాభారత పర్వాల్లాగా లయనిజంలో పద్దెనిమిదేళ్ళ సాహచర్యం పూర్తిచేసుకున్నాక నాకు ఇప్పుడు అన్పిస్తోంది - లయనిజం ఒక తీయని దిగులు - ఒక చెరగని స్వప్నం - అత్యంత సుఖవంతమైన వేదన... Sweet Agony అని! లయనిజం ఒక అనుభూతి... అది మధురానుభూతి!!

ఆ అనుభూతి విశిష్టతని, దాని అందచందాల్ని, దాని మనోగత భావాల్ని పరిచయం చేసే ఒక మధురావకాశం ఇలా నాకు లభించింది. లయనిజం 'అంతరంగం' వెలుగు నీడల్ని అందరి దృష్టికి తెచ్చే ప్రయత్నం ఇది -

ఫలితం చిన్నదే గాని, ప్రయాస పెద్దది! లయనిజంలోని తాత్వికత, జీవన వివచేనా తత్పరత, పాలనా చాతుర్య ఛ్ఛాయల్ని వితర్కించి విశ్లేషించడం శక్తికి మించిన భారమే!

★ ★ ★

లయనిజానికి ప్రతి సంస్థతోనూ పోలికలు కన్పిస్తాయి. కానీ ఏ ఒక్క సంస్థా పోలికకు రాలేని ఒకే ఒక్క సేవా మహా సామ్రాజ్యం లయనిజం! దాని గుండె లోతుల్ని తరచి చూసే ప్రయత్నాలు గతంలో చాలా సార్లు జరిగాయి. ఇది వాటికి కొనసాగింపు మాత్రమే!

నా చిరకాల మిత్రులు లయన్స్ జిల్లా గవర్నర్, జిల్లా 324 సి-4, లయన్ డి.గోపీనాథ్ ఈ బృహత్కార్యాన్ని నాతోనే పూర్తి చేయాలని ఆశించడం, అందుకు కావలసిన సహాయ సంపత్తులన్ని అందించడం, ప్రోత్సహించడం నాకొక వరం అయ్యింది. ఈ వరమిచ్చిన మా 'డి.జి.' కి నా కృతజ్ఞతలు.

"ముందు మీరు పుస్తకం తయారు చేయండీ... మిగతా విషయాలు నేను చూస్తాను –" అని భుజం చరిచి నడిపించారు పాస్ట్ గవర్నర్, లయన్ టి.దుర్గా మల్లేశ్వరరావు.

లయన్స్ జిల్లా 324 సి–4 లో ఇరవై ఏళ్ళ తర్వాత 100 శాతం గవర్నర్ సాధించి, సభ్యత్వం విషయంలో రెండో ప్రపంచ రికార్డు నెలకొల్పిన నేత్రజ్యోతి లయన్ దుర్గామల్లేశ్వరరావు గారు పూనుకోకపోతే ఈ పుస్తకంలో అక్షరం కూడా రాసేవాణ్ణి కాదేమో.. ఆయన నియామకంతో డిస్ట్రిక్ట్ కేబినెట్ సెక్రటరీగా పనిచేసిన అనుభవం నాకు చాలా పాఠాలు నేర్పింది.

ఇదంతా ఒక ఎత్తయితే, 'డాక్టరు గారూ! మీరు పుస్తకం త్వరగా పూర్తిచెయ్యండి – దాన్ని ప్రచురించి జిల్లాలో ప్రతిక్లబ్‌కి, ప్రతి కేబినెట్ మెంబర్‌కీ ఇస్తాను – తాజా మార్పులన్ని మనవాళ్ళకు తెలియాలి" అంటూ ముందుకొచ్చి పుస్తకం పూర్తి చేయించి అచ్చు వేసి వెలువరించిన సీనియర్ నాయకురాలు, డిస్ట్రిక్ చైర్‌పర్సన్ – ఇన్‌ఫర్‌మేషన్, లయన్ జి.విద్యావతి గారికీ, ఆమె జీవిత సహచరుడు, నా సోదరుడు లయన్ జి.డి.వి.ప్రసాద్ రావు గారికి ధన్యవాదాలు తప్ప ఇంకేమి చెప్పుకోగలను–?

ట్రైనింగ్ క్లాసులు జరిగే సమయాలలో పాస్ట్ గవర్నర్ లయన్ తాతినేని శ్రీహరిరావు మాష్టారి పాఠాలు వింటూ వుండేప్పుడు అనిపిస్తూండేది... ఇంత క్లిష్టమైన విషయాలకు ఓ మంచి "గైడ్" లాంటిది అవసరం అని! జటిలమైన లయన్స్ రాజ్యాంగ నియామావళిలో పదజాలాల్నీ, వాటి అంతరార్థాల్ని ఆయన వివరిస్తే విని, వాటిని నా అవగాహన మేరకు విశ్లేషించే ప్రయత్నం చేశాను. సాధ్యమైనన్ని పేజీల్లో తప్పొప్పుల్ని ఆయన గాలించి శోధించారు. ఈ పుస్తకానికి తాతినేని శ్రీహరిరావు గారే పరిష్కర్త.

చెప్పాల్సిన విషయాలు ఇంకా ఎన్నో వున్నాయి. చెప్పిందేమీ లేదనే అన్పిస్తోంది. కానీ, గ్రంథ విస్తర భీతి, సమయాభావం, స్థలాభావం – ఇవన్నీ ఇంతకన్నా ఇంకో అంగుళం కదలనీయడం లేదు.

లయనిజంలో సగం ప్రయాణం పూర్తయ్యాక నేటి ఇంటర్నేషనల్ డైరెక్టర్ లయన్ చిగురుపాటి వరప్రసాద్ PMJF గారితో నాకు సాన్నిహిత్యం ఏర్పడింది. నా అభ్యున్నతిని మనస్ఫూర్తిగా కోరుకొని చేయూత నందించింది ఆయనే! నాకు తగిన గుర్తింపు కల్గింప చేసింది కూడా ఆయనే!

నా 'అంతరంగం' పైన ఆయన ముద్ర వుంది! ఆ'ముద్ర'ని శాశ్వతం చేసుకోవడానికి ఈ కృతిని లయన్ చిగురుపాటికి ప్రేమగా అంకితం చేసుకుంటున్నాను.

'అంతరంగం' గ్రంథం ప్రారంభించిన నాటి నుంచీ అచ్చుప్రతులు సరి చూసి పెట్టేవరకూ తోడ్పడిన 'దుర్గతేజ' లయన్స్ క్లబ్ సెక్రటరీ లయన్ భాగవతుల బాలా త్రిపురసుందరి గారికి అలాగే, మిత్రుడు లయన్ డి.రఘురామ్‌కు నా శుభాకాంక్షలు.

టైప్‌సెట్టింగ్, చక్కని టైటిల్ డిజైన్ చేసిన ప్రింట్‌ప్లాజా, విజయవాడ అధినేత సాంబరెడ్డి గార్కి, నాగార్జున ప్రింటర్స్, విజయవాడ వారికి, విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికి నా కృతజ్ఞతలు.

# అంతరంగ తరంగాలు

## మన నినాదం - మన విధానం

## OUR SLOGAN - OUR MOVEMENT

L = **Liberty** = స్వాతంత్ర్యం, స్వేచ్ఛానిరతి, విమోచన

I = **Intelligence** = ప్రతిభ, వివేకం, విజ్ఞానం, మనోబలం, అవగాహనా కౌశలం

ONS = **Our Nations Safety,** స్వదేశీయత, జాతిభద్రత, జాతీయతాభావం, దేశం పట్ల నిబద్ధత.

స్వేచ్ఛానిరతి, ప్రతిభా వ్యుత్పత్తులు కల్గిన సేవాతత్పరులు తమదేశం పట్ల నిబద్ధతతో, తమ పొరుగువారికి సాయపడే సదాశయంతో అంతర్జాతీయంగా కలిసి నడిపిస్తున్న ఒక మహోద్యమం "LIONS"

### విధాన ప్రకటన

### MISSION STATEMENT

"ప్రపంచ ప్రజల భాగస్వామ్యంతో స్వచ్ఛంద సేవలు అందించడం ద్వారా, అంతర్జాతీయగా పరస్పరం సహకరించుకోవడం ద్వారా ప్రపంచ మానవాళి మధ్య అవగాహనా ప్రవృత్తిని పెంపొందింప చేయడం ప్రోత్సహించడం.." అనే విధానానికి కట్టుబడి నడుస్తుంది లయనిజం!!

### మహా సంకల్పం

### (OUR MOTTO)

'మోటో' అంటే మంగళాచరణం

"WE SERVE - మనం సేవలందిద్దాం -" అనే సత్సంకల్పంతో లయనిజం తన కార్యక్రమ సరళిని రూపొందించుకొంది.

జూలై 19, 1954న తన 37వ ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లో న్యూయార్క్ నగరంలో ఈ మహా సంకల్పాన్ని ప్రకటించడం జరిగింది.

### లయన్స్ ఎంబ్లమ్




★ మధ్యలో కన్పించే పెద్ద అక్షరం 'L' అనేది **Law, Liberty, Labour, Loyality, Love, Life...** ఇలా జీవనీయమైన అంశాలకు ప్రాతినిధ్యం వహించేదిగా వుంటుంది.

★ దాని చుట్టూ కన్పించే వృత్తం లయనిజానికి గల విశ్వవ్యాప్తిని ప్రతిబింబిస్తుంది. ప్రపంచ లయన్స్ సభ్యుల సంఘటిత శక్తిని సూచిస్తుంది.

* తూర్పు పడమరలు చూస్తున్న రెండు సింహాలు ఘనమైన గతానికీ, ఉజ్వల భవిష్యత్తుకీ సంకేతాలు.
* పైన LIONS అనే అక్షరాలు మన సేవాసంస్థనీ క్రింద International అనే అక్షరాలు అంతర్జాతీయతని సూచిస్తాయి.
* లయన్స్ ఎంబ్లమ్ అనేది సేవా ప్రవృత్తికి నిదర్శనం. ప్రతిఫలాపేక్ష రహిత సేవకు లయన్స్ సభ్యులు ఎప్పుడూ సిద్ధంగా వుంటారని ఈ ఎంబ్లమ్ చాటుతుంది.
* లయన్స్ ఎంబ్లమ్‌ను ధరించడం లయన్స్ సభ్యులకు ఒక గర్వకారణమైన విషయం! ఈ ఎంబ్లమ్‌ని ధరించడం అంటే మనం ప్రేమ పూర్వకమైన సేవకు ఎప్పుడూ సన్నద్ధంగా వుంటామని, చాటిచెప్పడం!

**లయన్స్ చిహ్నంలో రంగులు**

ధూమ్ర వర్ణం (బచ్చలి పండు రంగు-purple) లో కన్పించే వృత్తం విశ్వాసపాత్రతకు, దేశభక్తికీ, స్నేహ ధర్మానికీ నిదర్శనం.

మనసూ హృదయాల సమష్టి తత్త్వాన్ని (Integrity of Mind and Heart) ప్రతిఫలిస్తూ వుంటుంది. ధైర్యస్థైర్యాలకు, నిరంతర పరిశ్రమకు, అంకిత భావానికి ఈ రంగు ప్రతీకగా వుంటుంది.

బంగారపు రంగు నిజాయితీనీ, నిబద్ధతనీ, స్వచ్ఛత దాతృత్వం కల్గిన మనసునీ, హృదయాన్నీ ప్రతిబింబిస్తుంది.

మనిషి వ్యక్తిత్వానికీ, ప్రవర్తనకూ ఈ గుణాలు ప్రత్యేకతను ఆపాదిస్తాయి. ఇలాంటి గుణ సమన్వితమైన ప్రజా సమూహాలు జాతికి వన్నె తెస్తారు. దేశం గర్వించదగిన వ్యక్తులుగా రాణిస్తారు. అలా గర్వకారణమైన వ్యక్తిత్వ వికాసాలు కల్గిన వ్యక్తుల సంఘటిత సమారోహమే లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్!

**సభ్యత్వానికి పరమార్థం Meaningof Membership**

1) స్నేహభావంతో, సేవాతత్పరులైన ఇతరులతో కలిసి పనిచేయడానికి ఒక అవకాశం.
2) అందరం కలిసి ఒకే ఆదర్శానికి, ఒకే లక్ష్యానికీ అంకితంగా కృషి చేయడం.
3) ఇతరుల పట్ల సమభావాన్ని, సానుభూతినీ కలిగి వుండటం.
4) మన అభిప్రాయాన్ని వ్యక్తం చేయడానికి మనకుగా మనం కొన్ని సలహాలు సూచనలు అందించడానికి, మనమే కొన్ని చర్యలు చేపట్టడానికి లయనిజం ఒక మంచి అవకాశం.
5) లయనిజంలో సభ్యుడిగా, నాయకత్వ పటిమని నిరూపించుకోవడం ద్వారా సమర్థతని చాటుకోవడం.

# నైతిక ప్రవర్తనావళి
# LIONS CODE OF ETHICS

1. నా స్వంత వృత్తి వ్యాపారాల అభివృద్ధి పట్ల నావంతు శ్రమను కడదాకా కొనసాగిస్తూనే, ఒక మంచి సేవా తత్పరునిగా చక్కని పేరు తెచ్చుకొనేందుకు కృషి చేస్తాను.

2. నిజ జీవితంలో సాధించిన విజయాలకు, చేపట్టిన పనులకు లాభాన్ని, ప్రతిఫలాన్ని తగినంత మాత్రమే ఆశించే విధంగా ప్రవర్తిస్తాను గాని, నా ఆత్మ గౌరవాన్ని పణంగా పెట్టే విధంగా అత్యాసకు పోవడం గాని, అవకాశాల్ని స్వార్థ ప్రయోజనాలకు దుర్వినియోగ పరచుకోవడం గాని, ఇతరులు ప్రశ్నించే రీతిలో వ్యవహరించడం గానీ చెయ్యను.

3. స్వంత లాభానికీ, నా వృత్తి వ్యాపారాల అభివృద్ధికీ ఇంకొకరి నాశనాన్ని కోరవలసిన అవసరం లేదు. నా వినియోగదారులే నాకు దేవుళ్ళు. వారికి నేనెప్పుడూ విధేయుణ్ణి! అందుకు నా ఆత్మసాక్షిగా వ్యవహరిస్తాను.

4. లాభాన్ని పొందేప్పుడు నా హక్కు ముఖ్యమా - మానవతా ధర్మం, నైతికత ముఖ్యమా అనే మీమాంస ఏర్పడితే, ఇతరులకు మేలు కల్గించే దిశలోనే నడుస్తాను - అందువలన నాకు నష్టం కష్టం కల్గినా సరే!

5. స్నేహాన్ని స్నేహం కోసమే గాని స్వార్థానికి ఉపయోగించుకొనే దృష్టితో చేయకూడదు. నిజమైన స్నేహం అనేది, ప్రతిఫలాన్ని ఆశించదు. ఇది నేను స్నేహ ధర్మంగా చేస్తున్నాననే భావనలో వుంటుంది. స్నేహం ఎప్పుడూ దేనినీ కోరదు. స్నేహభావంతో అందించిన దాన్ని మాత్రమే అంగీకరిస్తుంది!

6. ఈ దేశ పౌరునిగా, ఈ రాష్ట్ర ప్రజలలో ఒకనిగా, ఈ సమాజంలో ఒక ప్రముఖునిగా, నా బాధ్యతల్ని ఎప్పుడూ గుర్తెరిగే నడుచుకొంటాను. మనసా వాచా కర్మణా నా సమాజానికి, నా రాష్ట్రానికి, నా దేశానికి నిబద్ధుడినై వ్యవహరిస్తాను. అందుకోసం నా సమయాన్ని, నా శ్రమనీ నా శక్తియుక్తుల్ని ధారపోయడానికి సన్నద్ధంగా వుంటాను.

7. ఆపన్నుల పట్ల దుఃఖభాజనుల పట్ల సానుభూతితోనే నా సహాయ సంపత్తులు అందిస్తాను. సేవలు అవసరమైన అట్టడుగు ప్రజల కోసం శక్తి వంచన లేని రీతిలో సిద్ధంగా వుంటాను.

8. ఇతరుల తప్పులెంచబోయే ముందు ఒకింత నిగ్రహాన్ని పాటిస్తూ, ఇతరుల విజయాలను ఘనంగా కీర్తించడం ఓ మంచి అలవాటు. ఏదైనా నిర్మాణాత్మకంగా వుండాలేగాని, విధ్వంస పూర్వకంగా వుండకూడదని నా విశ్వాసం.

# లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ ఆదర్శాలు
# LIONS CLUBS INTERNATIONAL OBJECTES

ప్రపంచ మానవాళి మధ్య అవగాహనా ప్రవృత్తి కల్గించి, ప్రోత్సహించడం

ప్రజారంజకమైన ప్రభుత్వ పాలన, బాధ్యతాయుతమైన పౌరజీవనం అనే సూత్రాలను పెంపొందింపచేయడం.

ప్రజాపరమైన, సాంస్కృతిక పరమైన, సామాజికపరమైన, నైతికపరమైన సమాజ ఉన్నతిపట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరచడం.

స్నేహబంధాల్ని, స్వచ్ఛమైన సౌభ్రాతృత్వాన్నీ, పరస్పర అవగాహననూ పెంచుకునేలా క్లబ్‌లను సమైక్యపరచడం.

ప్రజా సంబంధమైన విషయాలన్నింటి మీద రాజకీయ పక్షపాతం, మతతత్త్వాలకు అతీతంగా బహిరంగ చర్చా వేదికలు నిర్వహించడం.

సేవా దృష్టికల్గిన వ్యక్తులు తమ సమాజానికి ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేని సేవలందించే విధంగా ప్రోత్సహించడం, వ్యాపారపరమైన, పారిశ్రామికపరమైన, వృత్తిపరమైన, ప్రజాపరమైన సమర్థతనూ, అత్యున్నతమైన, వ్యక్తిగతమైన నైతిక ప్రామాణికతనూ పెంపొందింపచేయడం.



## ప్రార్థన

సర్వేశ్వరా! ఇది నా ప్రార్థన
నా హృదయ దౌర్బల్యము తొలగింపుము
సుఖ దుఃఖములను సమభావముతో
భరింపగల మనోబల మొసంగుము
ప్రేమానురాగాలతో
సేవలందించగల శక్తినందించుము
నిరుపేదలను తిరస్కరింపక
ధనాధికుల ముందు మోకరిల్లక
నిలుచు బలము నిమ్ము
దైనందిన సమస్యలకతీతమైన
మనోనిర్మలత్వమొసంగుము
నా సర్వస్వము
అనురాగముతో నీకే అర్పించుకునే
మనోవాంఛ ప్రసాదింపుము

## పతాక వందనం

మన జాతీయ పతాకానికి వందనం చేసి, దానిపట్ల భక్తి విశ్వాసాలను వెల్లడిస్తున్నాము.

ఉత్తమ పౌరుని బాధ్యతలను నిర్వర్తించడంలో ప్రతి ఒక్కరూ ప్రదర్శించే శ్రద్ధాసక్తుల మీద దాని ప్రతిష్ఠ, ప్రాభవం ఆధారపడి ఉన్నాయి.

సువర్ణాక్షరాలతో లిఖించబడిన దాని పవిత్ర చరిత్ర మన దేశానికి ఘనకీర్తిని సాధించేందుకు మనకు ప్రోత్సాహ ప్రోద్బలాలను అందజేస్తుంది.

మన జాతీయ పతాకం పట్ల అమితమైన విశ్వాసాన్ని ప్రకటిస్తూ, అక్షరాలా అదే మార్గాన నడుస్తామనీ, ప్రతి ఒక్కరమూ దాని ప్రాభవ వైభవాలను ఇతోధికం చేయడానికి అనువైన అవిరళ కృషిచేసి, దేశదేశాలలో సగర్వంగా, సమున్నతంగా అది ఎగిరేలా చేస్తామనీ ప్రతిజ్ఞ చేస్తున్నాము.



రమారమి ఎనభై ఏళ్ళక్రితం ఓ వ్యక్తి వేసిన ఒక చిన్న ముందడుగు కోట్లాది అనాధలకు ప్రపంచ వ్యాప్తంగా చేయూత నివ్వగలిగిన ఒక మహత్తర సేవాసంస్థకు నాంది పలికింది.

ఆనాడు ముందడుగు వేసింది మెల్విన్ జోన్స్

నగరం చికాగో - దేశం అమెరికా

అది 1917 -

మొదటి ప్రపంచ యుద్ధం మొదలై ప్రపంచ జాతుల మధ్య విద్వేషాగ్ని రగిలి బుసలు కొడ్తున్న రోజులు...

అప్పటికింకా జోన్స్ యువకుడే - కానీ, ఆయన మనసులో ఎవరికీ అందనంత ఎత్తయిన ఊహలు... "ఇతరుల కోసం ఎక్కువ శ్రద్ధ - తనకోసం తక్కువ తపన...." అనే వ్యక్తుల కూటమిని ఏర్పాటుచేయాలనే ధ్యేయం...

ఎక్కడికి వెళ్ళినా, ఎవరితో మాట్లాడినా అదే మాట్లాడసాగాడాయన... More caring about others and less concern about self...

ఆయన ఆలోచనలకు ఒక రూపు కల్పించడానికి తోడ్పడసాగింది... ఆయన మనసెరిగిన సహధర్మచారిణి "రోజ్ అమన్డా"

"అమన్డా" సగటు భారతీయ మహిళ మనస్తత్వం గలిగిన అమెరికన్ యువతి!

భర్త తోటే జీవితం ఆమెది -

★ ★ ★

చికాగో నగరంలో వ్యాపారులకు సంబంధించిన వివిధ సంస్థలకి జోన్స్ ఉత్తరాలు రాయడం ప్రారంభించాడు.

"Philosophy of Service to others" అనేది ఆయన ఉత్తరాలలోని సారాంశం. "సొంత లాభం కొంత మానుకు పొరుగువాడికి తోడుపడవోయ్" అన్న గురజాడ మహాకవి వాక్కుల వంటివే... ఆ రోజుల్లో జోన్స్ ఆలోచనల్ని ప్రభావితం చేయసాగాయి. ఆయన రాస్తున్న ఉత్తరాలు కూడా ఇతరుల్ని అంతే తీవ్రంగా ప్రభావితం చేయడం మొదలుపెట్టాయి.

"మనం ఏదైనా ఒక కొత్త సేవా సంస్థని ప్రారంభిస్తే బావుంటుందని నా(మనసు)కు అనిపిస్తోంది. మీకూ అలానే అనిపిస్తుంటే దయచేసి మనం ఒకసారి సమావేశమై అలాంటి సంస్థ ఏర్పాటు గురించి పరిశీలిద్దాం. వ్యాపారులు, వివిధ వృత్తులలోని పెద్దలు, సమాజంలోని ఉన్నత ధనిక వర్గాల వారు, ఒక సేవా సంస్థ ద్వారా ఆర్తులను ఆదుకునే పనిని ప్రారంభిద్దాం... ఇలా వుండేవి జోన్స్ వ్రాసిన ఉత్తరాలు.

ఆ రోజుల్లో ఈ ఉత్తరాలు రాసిపెట్టడం లోనూ, పెద్దలతో సంభాషించడం లోనూ, వారిని ఆహ్వానించడం లోనూ జోన్స్‌కు "రోజ్ అమన్డా" ఎంతగానో సహకరించే వారు.

లయనిజం వ్యవస్థాపనకు సహకరించిన మొదటి మహిళగా ఆమె చిరస్మరణీయురాలు.

జూన్ 7-1917న చికాగో నగరంలోని పాత "లా-సల్లె" హోటల్‌లో, మొదటి ఆర్గనైజేషన్ మీటింగ్ జరిగింది.

కాలగర్భంలో ఈ "లా-సల్లె" హోటల్ కరిగిపోయింది. కానీ, అక్కడ పురుడు పోసుకున్న 'విశ్వ సేవా రాజం' - "లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్" చిరంజీవిగా విలసిల్లుతోంది.

ఆనాటి వ్యవస్థాపకులు కన్న కలలకు ఒక సాకారం... ఈనాటి రవి అస్తమించని సేవా సామ్రాజ్యం - లయనిజం!!

★ ★ ★

1913లో వ్యాపారవర్గాల సంఘంలో సభ్యుడిగా చేరిన తర్వాత మెల్విన్ జోన్స్‌లో మానవతావాది మేల్కొన్నాడు.

జోన్స్, అప్పటికి అందరిలోకి యువకుడు! స్వంతంగా ఒక ఇన్సూరెన్స్ సంస్థని నడుపుకొంటున్న వ్యక్తి.

నాలుగేళ్ళ పాటు వ్యాపార వర్గ సంస్థలో సభ్యుడిగా ప్రధాన భూమిక వహించి పనిచేసిన ఆయనకు ఈ స్వార్థపూరిత వ్యాపార ప్రయోజనాలకు మించిన మానవతా బంధాల సాధనలోనే సార్థకత వుందనుకున్నాడు.

అప్పుడప్పుడూ మనసుకు నచ్చిన వ్యక్తులతో తన ఆలోచనల్ని పంచుకునే వాడాయన.

ఆపన్నుల కోసం ఏదైనా చేయాలనే తపన ఆయన్ని తొందరపెట్టసాగింది.

ఒకరోజు ఆ విషయాన్ని భార్య రోజ్ అమన్డాతో చర్చించాడు మెల్విన్.

అది భగవత్ప్రేరణే కావచ్చు, ఆయన చేసుకొన్న అదృష్టం కావచ్చు. సేవా సామ్రాజ్య నిర్మాతకు సహకరించిన సహధర్మచారిణిగా చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయిన పునీత

"రోజ్ అమందా" భర్త మెల్విన్ జోన్స్ ప్రతిపాదనల్ని అంగీకరించడమే కాకుండా, అందుకు ఆయనతో కలిసి పనిచేయడానికి కూడా ఆమె సంసిద్ధత వ్యక్తం చేసింది.

### లాసెల్లా హోటల్ సమావేశం

ఆశయం ఎంత ఉన్నతమైనదైనా మెల్విన్ జోన్స్ వయసులో చిన్నవాడే! అందుకే ఆయన నెలకొల్పదలచిన మహాసేవా సంస్థకు మార్గదర్శకునికై వెదకడం ప్రారంభించాడు.

డా॥ విలియం ఊడ్స్ ఆయన కళ్ళలో మెదిలాడు. జోన్స్ అప్పట్లో ఆయనకు రాసిన ఉత్తరం లయన్స్ ఇంటర్నేషనల్ రికార్డ్‌లో ఇంకా భద్రంగా వుంది. "with a view to lining up our organization with yours" "కొత్తగా ప్రారంభించ బోయే సంస్థకు దిశానిర్దేశం మీ ద్వారా జరగాలని ఆశిస్తున్నాను" అని రాశారు ఆ ఉత్తరంలో జోన్స్.



'ఊడ్స్' అప్పట్లో ఇండియానాలోని ఎవాన్స్‌విల్లెలో, ప్రజాదరణ పొందిన వైద్యుడు. మానవతావాదిగా పేరొందినవాడు. సేవాకార్యక్రమాలు నిర్వహిస్తూ సమాజసేవలో నిమగ్నమైన వ్యక్తి. జోన్స్ ఆయన్ని తన సిద్ధాంతం వైపు ఆకర్షించాడు.

లాసెల్లా పాత హోటల్లో ఆ రోజున జరిగిన ఆర్గనైజేషన్ సమావేశంలో వివిధ సంస్థలకు చెందిన 27 మంది ప్రతినిధులు హాజరైనారు.

ఈ సంస్థలన్నీ కలిసి ఒక మహా సంస్థను స్థాపించుకోవడం ఆ సమావేశం లక్ష్యం.

మిస్సోరీలోని సెయింట్ లూయిస్‌లో వున్న "వోర్టెక్స్ క్లబ్" వారినీ, మిన్నెసోటాలోని సెయింట్ పాల్‌లో వున్న "బిజినెస్ అండ్ ప్రొఫెషనల్ మెన్స్ అసోసియేషన్" వారినీ, ఇంకా కొందరు అభ్యుదయ వాదుల్నీ కూడా ఈ సమావేశానికి ఆహ్వానించారు.

'ఎక్స్‌ఛేంజి క్లబ్స్' అనే సంస్థ తప్ప తక్కిన ఆహ్వానితులందరూ, ఈ మొదటి ఆర్గనైజేషన్ సమావేశానికి హాజరయ్యారు.

ఆ సమావేశంలో చికాగో బిజినెస్ సర్కిల్ వారు ప్రతిపాదించి ఏకగ్రీవంగా ఆమోదించిన తీర్మానం సారాంశం ఇది :-

"ది ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆఫ్ లయన్స్ క్లబ్స్‌కు చెందిన డా॥ ఊడ్స్ గారితో చర్చించిన దరిమిలా, బిజినెస్ సర్కిల్ ఆఫ్ చికాగో బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ లయన్స్ సేవా సంస్థతో అనుసంధానం (Affiliation) కావాలని తీర్మానించడమైనది. ఈ అనుసంధానానికి సంబంధించి తీసుకునే అన్ని చర్యలూ శిరోధార్యంగా ఆమోదించడమైనది -"

ఇలా - వివిధ సంస్థలు లయనిజంతో తాదాత్మ్యం చెంది, క్రమేణా లయన్స్ సంస్థలుగా రూపు దిద్దుకోవడం ప్రారంభించాయి.

### మొదటి సమావేశం

టెక్సాస్ లోని డల్లాస్‌లో లయన్స్‌క్లబ్ మొదటి సమావేశం 1917 అక్టోబర్ 8,9,10 తేదీలలో జరిగింది.

మెల్విన్ జోన్స్ యాక్టింగ్ సెక్రటరీగా వ్యవహరించారు. డా॥విలియం పి. ఊడ్స్ గారు

జోన్స్ కోరిక మీద మొట్టమొదటి అధ్యక్షుడిగా వ్యవహరించడానికి అంగీకరించారు. ఆ మేరకు ఆయన ఈ కన్‌వెన్షన్‌లో ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

★ ★ ★

ఇది ఇలా వుంటే -

అక్కడ అమెరికాలో పరిస్థితి సంతోషకరంగా లేని రోజులవి.

1917లో లయన్స్ అంతర్జాతీయ సంస్థ పుట్టేనాటికే మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమై, అమెరికా కూడా భాగస్వామిగా మారిపోయింది. ఏప్రియల్ ఒకటవ తేదీ 1917న అమెరికా యుద్ధరంగంలోకి దూకింది.

అక్టోబర్ 8,9,10 మొదటి కన్‌వెన్షన్ ముగిసే సమయానికి యుద్ధ భీబత్సం ఉధృతం కాసాగింది. 1918లో సెయింట్ లూయిస్‌లో జరిగే రెండో కన్వెన్షన్‌లోపు లయన్స్ చాలా విజయాలు సాధించాలని భావించారు. కానీ, యుద్ధం ముంచుకురావడం వారి ఆశయాలకు పెద్ద ప్రతిబంధకం అయ్యింది.



యుద్ధ సహాయచర్యల్లో బాధితులకు, సైనికులకూ లయన్స్ నిమగ్నం కాసాగారు.

యుద్ధపత్రాలు (వార్ బాండ్స్) అమ్మి యుద్ధ సహాయ నిధులు సేకరించడం, సైనికులకు సహాయ సామగ్రిని పంపించే బాధ్యతల్ని ఆనాటి లయనిజం భారీ స్థాయిలో చేపట్టింది. అప్పటికి లయనిజం ఏడాది ప్రాయపు బుడిబుడి నడకల పసిపాప..

యుద్ధం సంగతి అలా వుండగా, ఇదే సమయానికి అమెరికాలో 'ఫ్లూ' విషజ్వరాలు విపరీతంగా వ్యాపించి కాల్చిన పిట్టల్లా జనం రాలిపోవడం ప్రారంభించారు.

1919లో ఈ వ్యాధి తీవ్రత ఎంతగా వున్నదంటే అమెరికా చరిత్రలో ఆ ఏడాది ఒక విషాద అధ్యాయంగా మిగిలిపోయింది.

లయన్స్ తమ ఆరోగ్యాన్ని లెక్కచేయకుండా విషజ్వరాల బారిన పడ్డ ప్రజలకు చేయూత నందించడం ప్రారంభించారు.

కొందరు హాస్పిటల్స్ ఏర్పరచారు. కొందరు హాస్పిటల్స్‌కు ఆర్థిక సహాయం చేసారు, కొందరు ఔషధాలు తగినంతగా అందుబాటు లోకి తీసుకువచ్చారు. వారి వారి పరిధిలో ఎందరో లయన్స్ ఎన్నో సేవా కార్యక్రమాలు నిర్వహించారు.

లయనిజం ఏర్పడిన మొదటి మూడేళ్ళలో వ్యవస్థాపక సభ్యులు చేపట్టిన అద్భుత సేవా కార్యక్రమాలు లయనిజాన్ని ప్రజల్లోకి చొచ్చుకుపోయేలా చేశాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాలన్నింటిలో లయన్స్ సేవా కార్యక్రమాలు విస్తరించసాగాయి.

### 1920 సింహగర్జన

1920వ సంవత్సరాన్ని సింహం గర్జించిన సంవత్సరంగా భావిస్తారు.

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసింది.

ఈ యుద్ధం కారణంగా, ఒక శతాబ్ది కాలం మానవజాతి వెనక్కి నడిచిందని బాధపడ్డారు సామాజిక వేత్తలంతా...



యుద్ధం రగిల్చిన గాయాల్ని ఉపశమింప చేసే ప్రయత్నాలు మొదలయ్యాయి. లయనిజం నిర్మాణాత్మక కార్యక్రమాలు ప్రారంభించింది.

ఒకవైపు సమాజ పునర్నిర్మాణం, ఇంకోవైపు లయన్స్‌సంస్థ సంస్థాగత నిర్మాణం.

యుద్ధకాలంలోనూ, ఫ్లూ విషజ్వరాల వ్యాప్తి సమయంలోనూ, యుద్ధానంతరమూ చేపట్టిన నిర్మాణాత్మక కార్యక్రమాలు లయనిజం పట్ల ప్రజల్లో సదభిప్రాయాన్ని కల్గింపచేశాయి.

అప్పటికే అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ప్రధాన కేంద్రాలన్నింటా లయన్స్ సంస్థలు ఆవిర్భవించాయి.

కెనడా దేశంలోకి లయనిజాన్ని తీసుకువెళ్ళే ప్రయత్నాలు ప్రారంభమైనాయి. అమెరికా కెనడాల మధ్య ఇప్పుడున్న సరళతర సంబంధాలు ఆనాడు లేవు.

కెనడా సరిహద్దు ప్రాంతాల్లో ముందుగా లయన్స్ క్లబ్‌లు ప్రారంభమైనాయి. "ఒంటారియో" రాష్ట్రంలోని విండ్సర్ పట్టణంలో మొదటి క్లబ్ ఏర్పాటవడంతో లయన్స్ సంస్థ అంతర్జాతీయ సంస్థగా ముందడుగు వేసినట్లయింది. టోరంటో, హామిల్టన్‌లలో కూడా క్లబ్‌లు వెలిశాయి.

## ఉత్తరధృవం దక్షిణధృవాలలో లయన్స్ జెండా

ఎడ్మిరల్ రిచర్డ్ 'ఇ' బిర్డ్ అనే లయన్స్ సభ్యుడు చరిత్ర ప్రసిద్ధికెక్కిన వీరసైనికుడు.

ఆయన సాధించిన విజయాలు. మనం తెలుసుకోవడం అవసరం - అవి ఎంతగానో ఉత్తేజితం చేస్తాయి మనల్ని! ఈ ఎడ్మిరల్ రిచర్డ్ వాషింగ్టన్ డి.సి. లయన్స్ క్లబ్‌లో సభ్యుడు.

యుద్ధం ముగిసిన తర్వాత ఈ వీరసైనికుడు సమాజ సేవలో కాలం గడుపుతూ వుండగా 1926లో ఉత్తర ధృవం దగ్గరకు చేరుకోవడానికి బయల్దేరిన బృందంలో ఒకడుగా ఎంపిక అయ్యాడు. ఆయనతో సహాయకుడిగా మరో వాయుసేనాని (Aviator) ఫ్లాయిడ్ బెన్నెట్ తోడు నడిచాడు.

ఇద్దరూ కలిసి 1929 మే 9న ఉత్తర ధృవంలో లయన్స్ జెండాని ఎగరేశారు. లయనిజం చరిత్రలో ఇదొక మరపురాని అధ్యాయం.

1929లో మరొక బృందం దక్షిణ ధృవయాత్రకు బయల్దేరింది.

ఎడ్మిరల్ రిచర్డ్ బిర్ట్ ఈ బృందంలో కూడా చేరాడు. ఈసారి ఆయనకి, ఆయన పై అధికారి బెరన్ట్ బాల్చెన్ తోడునడిచాడు. వీరంతా అట్లాంటిక్ సముద్రంలో ప్రయాణిస్తూ దక్షిణ ధృవానికి చేరుకున్నారు. రిచర్డ్ గారు అక్కడకూడా లయన్స్ జెండా ఎగరేశారు.

ఉత్తరధృవం నుంచి దక్షిణ ధృవం దాకా భూమండలం యావత్తూ లయనిజం వ్యాప్తి కావాలని ఆయన ఆకాంక్ష! అచిర కాలంలోనే అది ఆయన ద్వారానే నెరవేరింది!

అక్టోబర్ 1, 1926న పశ్చిమం నుంచి తూర్పులోకి ఒకేసారి పెద్ద అంగ వేసి దూకింది లయనిజం. కెనడా తర్వాత లయనిజం ప్రవేశించిన దేశం చైనాయే! చైనాలో 'Tientsin' నగరంలో మొదటి లయన్స్‌క్లబ్ ఏర్పడింది.

టియెన్‌ట్సిన్ క్లబ్‌లో 55 మంది సభ్యులు చేరారు. వీరిలో చైనావారు, బ్రిటిష్‌వారు, జర్మన్, ఇటాలియన్, ఫ్రెంచి, ఆస్ట్రియన్, జపాన్, హంగేరియన్ అమెరికన్లు వున్నారు.

ఈ చైనా క్లబ్‌తో లయన్స్ క్లబ్ సభ్యుల సంఖ్య 1000కి చేరింది.

ఇంతలో, చైనాలో మావో నాయకత్వంలో ప్రజా విప్లవం చెలరేగింది. చైనా చక్రవర్తి అధికార భ్రష్టుడైనాడు. తుపాకీ గొట్టం ద్వారానే స్వాతంత్ర్యం అనే నినాదంతో విప్లవ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. అప్పటినించీ 2002 వరకూ చైనాలో లయనిజం తిరిగి ప్రవేశించ లేకపోయింది.

ఇదే క్యూబా విషయంలో కూడా జరిగింది.

1927లో క్యూబాలో మొదటి లయన్స్‌క్లబ్ ఏర్పడింది. 32 సంవత్సరాల పాటు అక్కడ బలమైన సేవా సంస్థగా ఎన్నో విస్తృతమైన సేవా కార్యక్రమాలను చేపట్టింది క్యూబన్ లయనిజం.

కానీ, 1959 ఫిడెల్ క్యాస్ట్రో నాయకత్వంలో విప్లవ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత బలవంతంగా లయన్స్ క్లబ్‌లను మూసివేయించడం జరిగింది.

### విదుషీమణి హెలెన్ కెల్లర్

హెలెన్ ఆడమ్స్ కెల్లర్ జూన్ 27, 1880లో జన్మించారు. చిన్నప్పుడే విషజ్వరం సోకి ఆమె రెండు కళ్ళూ పోయాయి. చెవి వినికిడి శక్తి పోయింది. ఫలితంగా మూగరాలయ్యింది.

కానీ, అకుంఠిత దీక్షతో, అనితర సాధ్యమైన ఆత్మ విశ్వాసంతో కృషిచేసి, ప్రపంచ ప్రసిద్ధ వనితలలో ఒకరుగా, వేదాంతిగా, సేవాతత్పరురాలిగా వినుతికెక్కారు.

అంధత్వ నిర్మూలన కోసం ఆమె ప్రపంచ దేశాలన్నీ పర్యటించారు. దేశాధినేతల్ని కలిశారు. ఆమెరికన్ ఫౌండేషన్ ఫర్‌ది బ్లైండ్ వంటి అనేక సంస్థల్ని అంధుల సేవకోసం ఆమె వ్యవస్థాపించారు.

1961లో ఆమె మరణానికి కొన్ని రోజుల ముందు భారతదేశం సందర్శించారు. పండిట్ నెహ్రూ ఆమె కార్యక్రమాలకు సంఘీభావాన్ని ప్రకటించారు.

### 1925 ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్ హెలెన్ కెల్లర్ ప్రసంగ పాఠం

“ఇంటింటికీ వెళ్ళి తలుపుతట్టే ఒక దేవకన్య కథ మీ అందరూ వినే వుంటారు. ఆమె తలుపు తట్టినప్పుడు ఎవరూ వచ్చి తలుపు తెరవకపోతే, ఆమె ఇంకో యింటికి వెళ్ళిపోయేది. ఇంక



ఎప్పుడూ తిరిగి ఆ యింటికి రాదు... అదీ ఆ దేవకన్య కథ.

ప్రేమానురాగాలకు పాత్రమైన స్త్రీలు ఎప్పుడూ ఒకరి కోసం ఎదురుచూడరు. మీరే వారి దగ్గరకు వెళ్ళాలి. వారిని అనునయించాలి.

నేను మీకు అలాంటి ఒక అవకాశాన్ని! మీ వాకిట ముందు నిలబడి మీ తలుపు తడుతున్నాను. నన్ను ఎవరైనా దత్తత స్వీకరించండి...!

దేవకన్య మన గుమ్మంలోకి వచ్చినప్పుడు ఏం చెయ్యాలో ఆ కథ మనకు చెప్పదు. అలాగే అద్భుతమైన అవకాశాలు ఎన్నో మీ ముంగిట వున్నప్పుడు వాటిని ఎలా సద్వినియోగం చేసుకోవాలో మీరే నిర్ణయించుకోవాలి.

అలాంటి అనేకానేక అవకాశాలలో మీకు బాగా ఇష్టమైనదాన్ని మీరు ఎంచుకొంటారు. మీరు నన్ను దత్తతకోసం ఎంచుకొంటారని నమ్ముతున్నాను.

ఇక్కడున్న మీ అందరికన్నా నేను ఎంతో చిన్నదాన్ని! నేను మీకు చెయ్యగలిగిందల్లా ఒక్కటే - మీరు సేవలందించడానికి లెక్కలేనన్ని అవకాశాలు కల్పించడమే!

అమెరికన్ అంధుల ఫౌండేషన్ ఇంకా నాలుగు సంవత్సరాల లేత ప్రాయంలోనే

వుంది. అది మరింత విస్తరించి అంధులకు చేయూత నివ్వగలిగిన స్థాయికి ఎదగవలసి వుంది. అంధులు చూపును తిరిగి తెచ్చుకొని ఈ సంస్థను గుర్తించే స్థితికి అది రావాలి.

అంధులకు సేవలందించడానికి ఈ దేశం – మరో దేశం అనేది లేదు – అంతర్జాతీయంగా అవకాశాలున్నాయి – అవసరాలున్నాయి.

అద్భుతమైన ఒక గొప్ప ఆలోచనకి ఇది శ్రీకారం! అంధులుగా మారిన వ్యక్తుల జీవితాలలో వెలుగు నింపుతూ, వారికి ఆర్థికంగా చేయూత నందిస్తూ, వారు కూడా ఆరోగ్యకరమైన వ్యక్తుల్లా సాధారణ ఆరోగ్య జీవితాన్ని గడిపే అవకాశం కల్పించాలి.

ఒకసారి ఊహించి చూడండి – అకస్మాత్తుగా కళ్ళు కన్పించని స్థితి వచ్చిందనుకోండి – పట్టపగలే రాత్రిపూట వున్నట్లుగా అంతా కటిక చీకటిగా వున్న పరిస్థితిని చిత్రించుకొని చూడండి...

మీ కార్యక్రమాలు, మీ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు... ఏమీ కన్పించవు. అన్ని మాయమైపోతాయి.

అలాంటి కటిక చీకట్లో మీరు చిక్కుకున్నప్పుడు, మీ స్నేహితుడు మిమ్మల్ని చెయ్యిపుచ్చుకొని నడిపిస్తూ "నాతో రా! నువ్వు బాగా చూడగలుగుతున్నప్పుడు చేసిన పనులే చూడలేని స్థితిలో ఎలా చేయాలో నేర్పుతాను-" అంటే – మీకు ఎంతో ఆనందంగా వుంటుంది కదా!

ఈ అమెరికన్ ఫౌండేషన్ కూడా అలానే అంధులకు చేయూతనిస్తున్న సంస్థ. చూడగలుగుతున్న ప్రజలు చూడలేని వారికి అందిస్తున్న చేయూత.

నన్ను స్పృశించినప్పుడు వారి చేతి వేళ్ళలోంచి పదాలు వారి ఆత్మలోంచి కాంతి రేఖలు నా మెదడులోని చీకటిని చేరి నాకు వెలుగునిస్తున్నాయి. ఆ వెలుతురులోనే నన్ను నేను చూసుకొంటున్నాను. ఈ ప్రపంచాన్ని చూస్తున్నాను. ఆ భగవంతుణ్ణి చూస్తున్నాను.

నా టీచర్ ఇదంతా నాకు నేర్పింది – మాట్లాడలేని నా మూగతనంతో నిశ్శబ్దాన్ని ఛేదించగలిగి, చూడలేని నా అంధత్వంతో చీకటిని చీల్చగలిగి, ఈ చీకటి నిశ్శబ్దాల కారాగార వాసంలోంచి నేను నా కోసం, నేను ఇతరుల కోసం పనిచేయగలగడం ఎలాగో నాకు నేర్పింది –

అంధులకు ఇలాంటి సంరక్షణ కావాలి. డబ్బుకాదు అందివ్వవలసింది. అంధుల పట్ల సానుభూతి, ప్రేమ లేని వ్యక్తి ఎంత దానం చేసినా అది వృధా. మీరంతా సంరక్షిస్తే, ఈ దేశంలో వున్న మనుషుల్ని మనందరం కలిసి ఇలా సంరక్షించే వారిగా మార్చగలిగితే, అంధులు అంధత్వాన్ని పూర్తిగా జయించినట్లే!

లయన్స్! మీ కోసం నేను తీసుకువస్తున్న అవకాశం ఇది. అమెరికన్ ఫౌండేషన్ ఫర్ ది బ్లైండ్ ఆదర్శాన్ని మీరూ ప్రోత్సహించండి – మీరూ అదే కార్యక్రమాన్ని చేపట్టండి!

అంధత్వం అనేది లేని రోజు త్వరగా రావడం కోసం మీరు నాకు సహాయం చేయరూ...? అంధులుగా, బధిరులుగా, మూగవారుగా వున్న పిల్లలు సంరక్షకులు లేని స్థితిలో వుండకుండా మీరు సాయపడరూ...?

ఎలాంటి సహాయం అందకుండా వుండిపోయి అంధులైన స్త్రీ పురుషులు ఏ ఒక్కరూ లేని రోజు కోసం మీరు సాయపడరూ...?

నేను మిమ్మల్ని వేడుకొంటున్నాను లయన్స్... మీరు చూడగలవారు, వినగల్గినవారు, శక్తిమంతులు, ధైర్యవంతులు, దయాత్ములు కూడా!

చీకటిని జయించే ఈ మహాసమరంలో మీరంతా KNIGHTS OF THE BLIND -

అంధత్వాన్ని అంతం చేసే సేనాధిపతులుగా మిమ్మల్ని మీరు ఎందుకు రూపొందించుకోరూ....???

నా ధన్యవాదాలు
1925 ఇంటర్నేషనల్ కన్వెన్షన్
సెడార్ పాయింట్, ఓహియో,
అమెరికా, జూన్ 30, 1925

**హెలెన్ కెల్లర్ పిలుపుకు అమోఘ ప్రతిస్పందన**

1925లో హెలెన్ కెల్లర్ ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌కు ముఖ్య అతిథిగా విచ్చేసి, అంధత్వ నివారణ కోసం అంకితమై పనిచేయవలసిందిగా పిలుపునిచ్చారు. లయన్స్‌ని అంధత్వాన్ని పరిమార్చే సేనాధిపతులుగా (Knights of Blind) గా మారవలసిందిగా ఆమె కోరారు.

జులై 1926లో 'ది లయన్' మేగజైన్‌లో హెలెన్ కెల్లర్ చేసిన ఈ ఉపన్యాస ప్రభావం మీద ఒక వ్యాసం ప్రచురితమైంది. "ఈ 11నెలల కాలంలో 34 అమెరికా రాష్ట్రాలలో 143 క్లబ్‌లు ఐ క్యాంప్‌లు నిర్వహించాయి" అనేది ఆ వ్యాసం సారాంశం.

అంతకుమునుపు సంవత్సరం కేవలం 58 క్లబ్‌లు మాత్రమే ఐ క్యాంపులు నిర్వహించాయనీ, ఈ సంవత్సర కాలంలో మూడు రెట్లు అంధత్వ నివారణ కార్యక్రమాలు జరిగాయనీ, అందుకు ప్రముఖ ప్రేరణ హెలెన్ కెల్లర్ ఉపన్యాస ప్రభావమేనని ఆ వ్యాసం వివరించింది.

నిజానికి, హెలెన్ కెల్లర్ పిలుపు లయనిజంలో ఒక గొప్ప కదలికని తెచ్చింది.

★ ★ ★

తెల్లరంగులో వుండే చేతికర్ర వాడే వ్యక్తి అంధుడై వుంటాడు. ఇది ప్రపంచ వ్యాప్తంగా అమలులో వున్న విషయం. "White Cane"ని ఉపయోగించి నడిచి వెళ్ళే వ్యక్తికి ట్రాఫిక్ ఆపి దారి ఇవ్వడం ఒక సాంప్రదాయం మాత్రమే కాదు, ఒక నియమం కూడా.

అంధులు "వైట్‌కేన్"ని వాడేలా చేసిన ఘనత లయనిజానిదే! దాన్ని సాధించింది ఇల్లినాయిస్‌లోని 'పియోరియా' లయన్స్‌క్లబ్ వారు.

ఇది చాలా ఉత్తేజకరంగా వుండే ఓ కథ!

1930లో లయన్ జార్జి 'ఎ' బోన్హామ్ పియోరియా లయన్స్‌క్లబ్ అధ్యక్షుడు.

ఒకరోజు పియోరియా నగరం నడివీధిలో ఓ అంధుడు నల్లటి చేతికర్ర సాయంతో రోడ్డు దాటాలని ప్రయత్నిస్తున్నాడు. ఎవ్వరూ అతన్ని పట్టించుకోవడం లేదు. వాహనాలు రయ్యిన దూసుకు పోతున్నాయి. ఒక అంధుడు దారికి అడ్డంగా వస్తున్నాడని ఎవరూ గుర్తించి ఆగటం లేదు.

ఇది గమనించిన 'బోన్హాం' గారికి ఓ ఆలోచన చటుక్కున మెదిలింది. మామూలు మనుషులు వాడే నల్లరంగు చేతికర్రనే వాడబట్టి కదా... అతన్ని అంధుడిగా ఎవరూ గుర్తించి దారి ఇవ్వడం లేదు...? కాబట్టి, ఆ చేతికర్ర రంగు మారిస్తే అంధులకు గుర్తింపుగా వుంటుంది - అనుకున్నాడాయన.

ఇంటికి వచ్చి కాసేపు దాని మీద ఆలోచన చేశాడు. ఆఖరికి ఓ నిర్ణయానికి వచ్చాడు.

చేతికర్రలకు తెల్లటి పెయింట్ వేసి నగరంలో వున్న అంధులందరికీ వాటిని పంచిపెట్టాలనేది ఆయన పథకం.

తెల్లచేతి కర్ర వాడే వ్యక్తి అంధుడు - అని నలుగురికీ తెలియజేసేలా కార్యక్రమానికి రూపకల్పన చేసి, వెంటనే 'పియోరియా' లయన్స్‌క్లబ్ ద్వారా అమలులో పెట్టాడు.

ఊరంతా ఆ విధంగా అంధుల్ని గుర్తించడం ప్రారంభించారు. ఆ విషయాన్ని పియోరియా నగరపాలక సంస్థ కూడా గుర్తించింది.

"తెల్లచేతి కర్రతో అంధుడు రోడ్డు దాటాలని ప్రయత్నిస్తున్నప్పుడు ట్రాఫిక్ ఆగి ముందు ఆ అంధుడికి దారివ్వాలి -" అంటూ ఓ ఆర్డినెన్స్‌ను ఆమోదించి అమలు చేసింది ఆ నగరపాలక సంస్థ.

ఈ సంగతి లయన్స్ ఇంటర్నేషనల్‌కు తెలిసింది. అన్ని లయన్స్‌క్లబ్‌లూ ఈ ఆలోచనని అమలులోకి తేవడం మొదలుపెట్టాయి. క్రమేణా, అంధులంతా తెల్లచేతి కర్రలు వాడకం ప్రారంభించారు.

అంధుల కోసం, అంధత్వ నివారణ కోసం అహరహం పనిచేసే లయనిజానికి తెల్లచేతి కర్రల వాడకం అమలులోకి తేవడం మరో ఘనమైన విషయమే!

1956 నాటికి అమెరికా లోని రాష్ట్రాలన్నీ వైట్‌కేన్ సేఫ్టీ చట్టాలు అమలులోకి తీసుకొచ్చాయి.

"తెల్లజాతి కర్ర వాడుతున్న వ్యక్తికి దారి ఇవ్వాలి" అనే రూలుని క్రమేణా, ప్రపంచ దేశాలన్నీ అమలు చేయసాగాయి.

అంధులకు స్వేచ్ఛని ప్రసాదించే ఈ కార్యక్రమానికి రూపకల్పన చేసిన 'బోన్హం' ఆ విధంగా చరితార్థుడైనాడు.

ఒక కొత్త ఆలోచన ప్రపంచగతినే మార్చివేస్తుందనడానికి ఇది సాక్ష్యం. 'Innovation' అనే నినాదానికి లయనిజం ఆదినించి ప్రాముఖ్యతనిస్తూనే వుంది.

కొద్ది సమయాన్నీ కొద్దిపాటి ధనాన్నీ, కొద్దిపాటి మేధా సంపత్తినీ లయనిజం కోసం ఖర్చు పెట్టండి - చాలు అంటుంది లయనిజం. మేధా సంపత్తిని ఖర్చు పెట్టడం అంటే ఏమిటో ఈ వైట్ కేన్ కథ ద్వారా మనకు అర్థం అవుతుంది.

ఇలాగే, మొదటి ప్రపంచ యుద్ధంలో చూపు కోల్పోయిన ఓ డాక్టర్ గారు - ఆయన కూడా లయన్స్ సభ్యుడే - పాకెట్‌సైజ్‌లో వుండే బ్యాంక్ పాస్ బుక్‌ని బ్రెయిలీ లిపిలో రూపొందించాడు.

అంధుల కోసం పనిచేసే లయనిజానికి ప్రపంచ గుర్తింపు తెచ్చిపెట్టేందుకు ఎందరో లయన్స్ సభ్యులు ఇలా శ్రమిస్తున్నారు.

ప్రాతః స్మరణీయులైన వారికి మనం సమర్పించగలిగేది సేవా నీరాజనాలే.

* * *

వైట్‌కేన్ ఉదంతం లయనిజం ద్వారా అంధులకు చేయూత విజయవంతం అయ్యాక, ఇంకా ఇటువంటి అనేక కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. అందులో చెప్పుకోదగింది, మిచిగన్‌లోని, రోచెస్టర్‌లో లయన్స్ నెలకొల్పిన లీడర్‌డాగ్ స్కూల్ ఫర్ ది బ్లైండ్!

అది అంధులకు సాయపడేలా కనీసం పదివేల కుక్కలకు శిక్షణ ఇచ్చి వుంటుందని అంచనా! అంధులకు దారిచూపుతూ భద్రంగా తీసుకువెళ్ళే నేర్పు కుక్కలకు కలిగేలా ఈ శిక్షణ కొనసాగుతోంది.

కుక్కలు అంధులకే కాదు, చెవిటి, మూగ వికలాంగులకూడా ఎంతగానో తోడ్పడతాయి. తలుపులు వేసుకొని చెవిటి వ్యక్తి ఇంట్లో కూర్చుంటె, కాలింగ్ బెల్ ఎంత నొక్కినా ప్రయోజనం ఏముంటుంది? కాలింగ్‌బెల్ నొక్కక పోయినా శిక్షణ పొందిన కుక్క తన యజమానిని ఎలర్ట్ చేస్తుంది.

1939లో మిచిగాన్‌లోని డెట్రాయిట్ అప్‌టౌన్ లయన్స్ క్లబ్ వారు అంధులకు శిక్షణ ఇచ్చే స్కూల్‌ని మొట్టమొదటగా నెలకొల్పారు. రోచెస్టర్‌లో ఓ వ్యవసాయ క్షేత్రంలో ఈ స్కూల్‌ని ప్రారంభించారు. అంధులకూ ఇతర వికలాంగులకు సాయపడేలా కుక్కల్ని తీర్చిదిద్దే ఈ ఐడియా క్రమేణా లయన్స్ ద్వారా ప్రపంచ వ్యాప్తం అయ్యింది.

1956లో అమెరికా చేసిన వైట్ కేన్ సేఫ్టీ చట్టంలో కుక్క సాయంతో నడిచే వ్యక్తుల్ని కూడా చేర్చి, వారికి స్వేచ్ఛ ప్రసాదించింది!

ఈ విజయం కూడా లయనిజానిదే!

★ ★ ★

లయనిజం రెండు ప్రపంచ యుద్ధాలను చవిచూసింది.

మొదటి ప్రపంచ యుద్ధం రేపిన గాయాలను తనను సుస్థిరం చేసుకోవడం ద్వారా, ఎందరో యుద్ధ బాధితులకు తన చేయూత నందించడం ద్వారా మాన్పేందుకు పూనుకొంది.

రెండవ ప్రపంచ యుద్ధం రేపిన గాయాలకు ఐక్యరాజ్యసమితిని వ్యవస్థాపించడంలో సహకరించడం ద్వారా, ప్రపంచశాంతి లక్ష్యాన్ని నిర్దేశింప చేయడం ద్వారా లయనిజం, ఆ గాయాలను మాన్పేందుకు ప్రయత్నించింది.

రేపటి తరానికి చెందిన పిల్లల్లో ప్రపంచశాంతి పట్ల అవగాహనని రేకెత్తించడం కోసం, రేపటి తమ మనుగడ గురించిన ఆలోచనని రగిలించడం కోసం నిర్వహిస్తున్న లయన్స్ ఇంటర్నేషనల్ పీస్ పోస్టర్ కంటెస్ట్ (ప్రపంచ శాంతి చిత్రాల పోటీ) ప్రపంచదేశాల్ని ఎంతగానో ఆకట్టుకొంది.

ప్రతి ఏడాది కనీసం 30 లక్షలమంది పిల్లలు ప్రపంచ వ్యాప్తంగా ఈ శాంతి చిత్రాల పోటీలలో పాల్గొంటున్నారని అంచనా! ఈ పోటీలు 16 సంవత్సరాలుగా జరుగుతున్నాయి.

పోటీలలో మొదటి స్థానం పొందిన గ్రాండ్‌ప్రైజ్‌ను ఐక్యరాజ్య సమితిలో 'లయన్స్ డే' రోజున, న్యూయార్క్‌లో బహూకరిస్తారు. బహుమతులు పొందిన చిత్రాలు ఇంటర్నేషనల్ హెడ్ క్వార్టర్స్‌లో ఒక సంవత్సరం పాటు ప్రదర్శించబడతాయి.

చికాగోలో వున్న అతిపెద్ద మ్యూజియం "మ్యూజియం ఆఫ్ సైన్స్ అండ్ ఇండస్ట్రీ"కి ఆ తర్వాత వాటిని బహూకరిస్తారు. అవి ఆ మ్యూజియంలో ప్రదర్శించబడతాయి.

యుద్ధం వలన జరిగే అపకారం ఏమిటో యుద్ధం వలన తీవ్రంగా నష్టపోయిన జాతులకు బాగా తెలుసు. అక్కడ బతుకు వెళ్ళదీస్తున్న చిన్నారి బాలలకు ఇంకా బాగా తెలుసు. వారి ఊహల సాకారమే ఈ శాంతి చిత్రాల పోటీ!

★ ★ ★

## లయన్స్ అంతర్జాతీయ సంస్థ - ఐక్యరాజ్యసమితి పపంచ శాంతిలో భాగస్వామ్యం

ఐక్యరాజ్యసమితి ఆవిర్భావ దశనుంచి లయనిజంతో ఆ మహాసంస్థకు సంబంధ బాంధవ్యాలున్నాయి.

ఒకవిధంగా, ఐక్యరాజ్యసమితిలో ప్రభుత్వాల ప్రమేయం లేని స్వచ్ఛంధ సంస్థల (NGOs) కు ప్రముఖ పాత్ర వుండేలా చేయడంలో లయన్స్ అంతర్జాతీయ సంస్థ కృతకృత్యురాలయ్యిందనేది వాస్తవం.

డి.ఎ.స్కీన్, ఫ్రెడ్‌స్మిత్ అనే లయన్స్ ఇంటర్నేషనల్ పాస్ట్ ప్రెసిడెంట్స్ ఇద్దరితో కలిసి మెల్విన్ జోన్స్ 1945లో శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన ఐక్యరాజ్యసమితి ప్రారంభ సభ (చార్టర్ కాన్ఫరెన్స్)కు సమితి ప్రత్యేక ఆహ్వానితులుగా హాజరయ్యారు.

ఆ సదస్సులో మెల్విన్ జోన్స్ నిర్వహించిన పాత్ర గణనీయమైంది. ప్రపంచ నాయకుల్ని వివిధ దేశాధినేతల్ని అక్కడ కలుసుకునే అవకాశం ఆయనకు లభించింది. ఐక్యరాజ్యసమితిలో కేవలం రాజకీయ యంత్రాంగం మాత్రమే కాకుండా స్వచ్ఛందసంస్థలకు కూడా భాగస్వామ్యం కల్పించాలనే అంశాన్ని ఆయన సదస్సులో ప్రతిపాదించారు.

దానిమీద కొంత చర్చ జరిగిన తర్వాత ఐక్యరాజ్యసమితిలో స్వచ్ఛంద సంస్థలకు ఒక ప్రత్యేకమైన చార్టర్ ఏర్పాటు చేసేందుకు మౌలికంగా అంగీకరిస్తూ అందుకు కావలసిన నియమనిబంధనలు, విధానాలు రూపొందించడంలో సహకరించవలసిందిగా మెల్విన్ జోన్స్‌ని కోరడం జరిగింది.

అలా ఐక్యరాజ్యసమితిలో లయనిజానికి భాగస్వామ్యం ప్రారంభమైంది. అది రానురానూ మరింత సన్నిహితంగా మారి, ఐక్యరాజ్యసమితిలో ఒక రోజును లయనిజం కోసం కేటాయించే స్థితిని లయన్స్ అంతర్జాతీయ సంస్థ సాధించగల్గింది.

ఐక్యరాజ్య సమితిలో ఆర్థిక మరియు సామాజిక విభాగం (Economic and Social Council - Ecosoc) ఏర్పాటు చేశారు. యునెస్కో, యూనిసెఫ్ వంటి సంస్థలు దీని అజమాయిషీలో వుంటాయి.

ఈ "ఇకోసాక్"కు లయన్స్ అంతర్జాతీయ సంస్థ కన్సల్టేటివ్ స్టేటస్ కలిగి వుంది. ఇది మానవ సంక్షేమం కోసం పనిచేసే ఒకవిభాగం.

ఐక్యరాజ్యసమితి సెక్యూరిటీ కౌన్సిల్ ప్రధాన రాజకీయ నిర్ణయాలు చేసే విభాగం. ఇందులో వీటో అధికారం గల్గిన దేశాల ఆధిపత్యం, వారి ప్రయోజనాలకు వ్యతిరేకంగా వుండే వారిపట్ల కఠినత్వం వహించడం జరుగుతూ వుంటాయి.

అయితే, సెక్యూరిటీ కౌన్సిల్ తీసుకునే నిర్ణయాలకు 'ఇకోసాక్' పని తీరుకూ సంబంధం లేకుండా చేయడంలో మెల్విన్ జోన్స్ కృషి చేశారు.

To Create and Foster a spirit of understanding among all peoples for humanitarian needs by providing voluntary services through community involvement and international cooperation... మానవ అవసరాల పట్ల అవగాహన చేసుకునే తత్త్వాన్ని మనుషులందరిలోనూ కలిగించడం, దీనులైన ప్రజలకు స్వచ్ఛందంగా సేవలందించడంలో ప్రజలందరినీ వినియోగించడం, అంతర్జాతీయంగా మనుషులందరి మధ్య సత్సంబంధాలు నెలకొల్పడం అనే ధ్యేయాలతో పనిచేసే లయనిజం ఆదర్శాలని ఈ ఇకోసాక్ కూడా స్వీకరించేలా జోన్స్ కృషి చేశారు.

రాజకీయంగా ఒకదేశం ఇంకో దేశంతో శతృత్వం వహించవచ్చు. ఐక్యరాజ్యసమితి సెక్యూరిటీ కౌన్సిల్ ఒకదేశంపై ఆర్థిక ఆంక్షలో, సైనిక చర్యలో చేపట్టే నిర్ణయాల వంటివి తీసుకొన్నా, 'ఇకోసాక్' పని తీరుపై వాటి ప్రభావం వుండదు.

ఎందుకంటే ప్రపంచ మానవులందరి సహకారంతో వెనుకబడిన ప్రజలకు సేవలందించడం ఈ ఇకోసాక్ ధ్యేయం కాబట్టి!

ఐక్యరాజ్యసమితితో భాగస్వామ్యం నడుపుతున్నా, ఐక్యరాజ్యసమితి తీసుకునే నిర్ణయాల ప్రభావం లయనిజం మీద కూడా వుండకుండా జోన్స్ ప్రత్యేక జాగ్రత్తలు తీసుకున్నారు. అది ఆయన ముందుచూపుకు నిదర్శనం.

ఐక్యరాజ్య సమితిలో ఇంకా ఎన్నో విభాగాలున్నాయి. ప్రపంచ వ్యాప్తంగా ఈ విభాగాలన్నీ పనిచేస్తున్నాయి కూడా.

లయనిజానికి వాటితో కూడా భాగస్వామ్యం వుంది.

ఐ.రా.స. ఆహార, వ్యవసాయాల సంస్థ (Food and Agriculture Organisation) ఐ.రా.స. పిల్లల నిధి (UN children's Fund) ఐ.రా.స. పర్యావరణ కార్యక్రమం, ఐ.రా.స. ప్రకృతి వైపరీత్యాల సహకార సంస్థ (Un Disaster Relief Organisation) ప్రపంచ ఆహార కార్యక్రమం,

మాదక ద్రవ్యాల నిరోధ కార్యక్రమం వంటివెన్నో ఐక్యరాజ్యసమితి సంస్థలతో ప్రధాన భాగస్వామ్యం వహించి నడిపించింది లయన్స్ అంతర్జాతీయ సంస్థ. కాందిశీకుల విషయంలో హైకమీషర్ హోదాలో కూడా పనిచేసింది.

యునెస్కో (UNESCO) కార్యక్రమాలలో మన లియోలు ఎందరో భాగస్వాములుగా వున్నారు.

నిరోధించగల అంధత్వం (Preventable blindness) నివారణ కోసం చేపట్టిన Sight First కార్యక్రమం ద్వారా WHO తో లయనిజానికి భాగస్వామ్యం వుంది.

1947లో ఐక్యరాజ్యసమితిలో ప్రపంచ మానవుల మధ్య సత్సంబంధాలు అనే ఏకైక లక్ష్యంతో భాగస్వామ్యం వహించే నాటికి లయనిజానికి 30 ఏళ్ళొచ్చాయి.

మరో 30-31 సంవత్సరాల తర్వాత, 1978లో న్యూయార్క్‌లోని ఐ.రా.న. కార్యాలయంలో లయన్స్, లయనెస్‌లు, లియోల సమావేశం ఏర్పాటు చేసి అనేకమంది దేశవిదేశ రాయబారుల్ని ఈ సమావేశానికి ఆహ్వానించారు. ఐక్యరాజ్యసమితి ప్రతినిధుల్ని కూడా ఆహ్వానించారు. అది మొదలు ప్రతి సంవత్సరం ఒకరోజు లయనిజానికి కేటాయించడం ఒక ఆచారంగా మారింది.

ఇది అంతర్జాతీయ సేవా సంస్థలలో లయనిజానికి మాత్రమే దక్కిన ఒక గొప్ప అవకాశం.

ఇప్పుడు కొత్తగా పీస్ పోస్టర్ కంటెస్ట్‌లో గ్రాండ్‌ప్రైజ్ గెల్చుకున్న చిన్నారి ఆర్టిస్ట్‌కి ఐరాస కార్యాలయంలో జరిగే లయన్స్ దినోత్సవంలో బహుకరించడం మొదలుపెట్టారు.

1985లో ప్రపంచ వ్యాప్తంగా లయన్స్ క్లబ్‌లన్నీ అక్టోబర్ 24న ఐరాస దినోత్సవం జరుపుకోవడం ప్రారంభించాయి.

## స్త్రీలకు సమాన ప్రాతినిధ్యం

1987 - లయనిజం చరిత్రలో ఒక నూతన శకం ఆవిర్భవించిన సంవత్సరం.

'తైపాయ్'లో జరిగిన ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లో ఆ ఏడాది ఓ గొప్ప నిర్ణయం తీసుకొన్నారు.

లయన్స్ క్లబ్‌ల మౌలిక స్వరూపాన్ని ఈ నిర్ణయం మార్చివేసింది.

"లయనిజంలో సభ్యులుగా చేరగోరే పురుషులకు -" అనే వాక్యం లోంచి పురుషులు అనే పదాన్ని తొలగించి "వ్యక్తులకు" అని వుంచాలనేది ఆ నిర్ణయం.

అప్పటిదాకా నడిచిన పురుషాధిక్యత అనేది ఈ నిర్ణయంతో పూర్తిగా తొలగిపోయింది. ఆడవారు కూడా సమానంగా పురుషులతో పాటు లయన్స్ సభ్యులుగా చేరేందుకు ఈ తీర్మానం గొప్ప అవకాశం కల్పించింది.

అందరూ పురుషులే వున్న క్లబ్‌ల్లోనూ, అందరూ స్త్రీలే వున్న క్లబ్‌ల్లోనూ పురుషులూ స్త్రీలూ ఇద్దరూ సభ్యులుగా వున్న క్లబ్‌ల్లోనూ స్త్రీలు సేవా తత్పరతో ముందుకు వచ్చి సభ్యులుగా చేరడం ప్రారంభించారు.

ఈ తీర్మానాన్ని ఓటింగ్‌కు పెడితే 77 శాతం మంది అనుకూలంగా ఓటువేశారు.

పురుషాధిక్య సమాజం ప్రపంచ వ్యాప్తంగా ఇంకా నడుస్తోంది. సేవా సంస్థలలో ముందుగా స్త్రీలకు సమాన సభ్యత్వం ఇవ్వడానికి ముందుకొచ్చింది లయన్స్ అంతర్జాతీయ సేవాసంస్థ. ఈ ఘనత మనదే!

1975లో లయనెస్ ఉద్యమం ప్రారంభం అయ్యింది. స్వతంత్ర ప్రతిపత్తి గల్గిన మహిళలు నిజానికి లయన్స్‌కు సమాంతర సేవావ్యాప్తిని కల్గించారు. మహిళలలో నిగూఢంగా వున్న ఈ నాయకత్వ ప్రతిభ మరింత రాణింపు

తీసుకువచ్చేందుకు కొత్తగా చేసిన 1987 రాజ్యాంగ సవరణ రాచబాట వేసింది.

కరడు గట్టిన మతతత్త్వ దేశం పాకిస్తాన్ నుంచి నీలోఫర్ భక్తియార్ అనే మహిళ ఇంటర్నేషనల్ డైరెక్టర్ స్థాయికి ఎదిగిందంటే మహిళా ప్రాతినిధ్యం ప్రాముఖ్యత ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. కేవలం 10-12 సంవత్సరాల లయనిజం సేవలోనే ఆమె ఈ ఘనత సాధించగలగడం ఒక విశేషం.

**అంతర్జాతీయ లయన్స్ క్లబ్ సేవానిధి LCIF**

లయన్స్‌క్లబ్స్ ఇంటర్నేషనల్ ఫౌండేషన్ గురించి చెప్పుకోదగిన కొన్ని ప్రత్యేక విశేషాలున్నాయి.

1968లో ప్రారంభమైన నాటినుంచే మిలియన్ల కొద్దీ డాలర్లను సేవానిధుల రూపంలో అందించి ఎన్నో మహత్తర కార్యక్రమాలకు చేయూత నిచ్చింది. LCIF

1972-73 సంవత్సరంలో పదివేల డాలర్ల వరకూ కనీసం వంద సేవా ప్రాజెక్టులకు ఆర్థిక సాయం అందించింది.

టర్కీలో విపరీతంగా మూర్ఛ వ్యాధి వ్యాపించినప్పుడు నాలుగు లక్షల మంది మూర్ఛరోగులకు టర్కీ లయన్స్ సేవలందించారు ఆ నిధులతో!

1982-83 సంవత్సరం నాటికి పది లక్షల డాలర్ల ఆర్థిక సహాయాన్ని (Grants-in-Aid) వివిధ ప్రాజెక్టులకు చేయగలిగే స్థితికి LCIF చేరుకొంది.

భారతదేశానికి వస్తే, LCIF కు, విరాళాల రూపంలో లయన్స్ క్లబ్‌లు, సభ్యులు అందిస్తున్న మొత్తం కన్నా కనీసం ఆరురెట్లు ఎక్కువగా మనదేశంలో వివిధ ప్రాజెక్టులకు, వివిధ కార్యక్రమాలకు గ్రాంట్లు పొందడం జరిగింది!

అంధత్వ నివారణ కార్యక్రమాలలో విశేషించి కృషి చేసిన వారికి హ్యూమానిటేరియన్ అవార్డు ప్రత్యేకించి ప్రకటించి, అత్యున్నత లయన్స్ పురస్కారాన్ని అందించడమే కాకుండా, ఆర్థికపరమైన పెద్ద మొత్తంలో నిధులు కూడా సమకూర్చి వారి కార్యక్రమాలకు ప్రోత్సాహాన్ని కలుగచేసింది LCIF.

1989లో డా॥ యం.సి.మోడీ అనే భారతీయ నేత్ర వైద్యుడికి హ్యూమానిటేరియన్ అవార్డుతో పాటుగా 2 లక్షల డాలర్ల నిధిని కూడా సమకూర్చి మరింత ఉధృతంగా కంటి ఆపరేషన్లు నిర్వహింపచేసేందుకు తోడ్పడింది LCIF.

కంటి శుక్లాలకు ఆపరేషన్లు నిర్వహించడంలో డా॥మోడీ చూపించిన మార్గం భారతదేశంలో లయన్స్‌కు అనుసరణీయం! వారి తర్వాత రాజీవ్‌గాంధీ ఫౌండేషన్, అరవింద్ మఫత్‌లాల్ వంటి ప్రముఖులకు, సంస్థలకు ఈ అవార్డును అందుకున్న వారిలో వున్నారు.

**చరిత్ర గమనంలో లయనిజం**

**CHRONOLOGY OF LIONISM**

**మెల్విన్ జోన్స్ జననం :**

**జనవరి13, 1879 :**

కెప్టెన్ కాల్విన్ జోన్స్, విడియా జోన్స్ దంపతులకి అమెరికాలోని అరిజోనా రాష్ట్రంలో థోమస్ నగరంలో మెల్విన్ జోన్స్ జననం.

**జోన్స్ వివాహం : 1909**

రోజ్ అమన్డాతో తన ముప్పయ్యవ ఏట మెల్విన్ జోన్స్ వివాహం జరిగింది.

రోజ్ అమన్డా చాలా అందంగా వుండేవారట. నేషనల్ మహిళగోల్ఫ్ ఛాంపియన్ ఆమె అప్పట్లో.

బిజినెస్ మేనేజిమెంట్‌లో కాలేజి చదువు పూర్తి చేసుకొని మెల్విన్ జోన్స్ ఖాళీగా వుండకుండా జాన్సన్ & హిగ్గిన్స్ ఇన్సూరెన్స్ కంపెనీలో కొన్నాళ్ళు ఉద్యోగిగా పనిచేసి

ఇన్సూరెన్స్ రంగంలో కావలసిన అనుభవం సంపాదించుకున్నారు.

వివాహం అయిన తర్వాత తన పేరనే మెల్విన్ జోన్స్ ఇన్సూరెన్స్ కంపెనీని వ్యవస్థాపించారాయన.

**వృత్తి, వ్యాపార వేత్తల సమాఖ్యలో జోన్స్ చేరిక - 1913 మార్చి 13**

చికాగో వృత్తి వ్యాపారవేత్తల సమాఖ్య (Business Circle) లో జోన్స్ సభ్యుడిగా చేరారు. వివిధ వృత్తులలో వున్నవారు, వివిధ వ్యాపారాలు నిర్వహిస్తున్నవారూ అందరూ కలిసి ఒకరి కొకరు పరస్పర వ్యాపారాభి వృద్ధికోసం సహకరించుకోవడం ఈ సంస్థ లక్ష్యం.

జోన్స్ చేరేనాటికి ఈ సంస్థ బలహీనంగా వుంది, జోన్స్ చేరికతో జవసత్వాలు పుంజుకొంది. సంస్థ సభ్యత్వాన్ని 200కి చేర్చడంలో జోన్స్ ప్రధానపాత్ర వహించారు. ఆ సంస్థకు కార్యదర్శి అయ్యారు.

**వృత్తి వ్యాపారుల సమాఖ్యను సేవా కార్యక్రమాల వైపు మళ్ళించిన జోన్స్ : 1916**

మెల్విన్ జోన్స్ తను సెక్రటరీగా వున్న సంస్థ కేవలం స్వంత ప్రయోజనాలు చూసుకునే వ్యక్తుల కూటమిగా వుండటాన్ని ఆమోదించలేకపోయారు. తమ చుట్టూ వున్న సమాజం పట్ల బాధ్యతను ప్రదర్శించాల్సిన అవసరాన్ని గుర్తించవలసిందిగా ఆయన వృత్తి వ్యాపారుల సమాఖ్య కార్యవర్గ సమావేశంలో ప్రతిపాదించారు. సమాఖ్య కార్యక్రమాలలో ప్రజాసేవ కార్యక్రమాలను కూడా ఒక భాగంగా చేయగలిగారు.

క్రమేణా, ఇలాంటి సేవా దృక్పథం కల్గిన ఇతర సేవా సంస్థలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం ప్రారంభించారు మెల్విన్ జోన్స్.

అమెరికా సంయుక్త రాష్ట్రాల్లోని వివిధ సంస్థలతో కలిసి జాతీయ సేవాసంస్థ (National Association) ని స్థాపించే దిశగా ఆయన అడుగులు వేయడం మొదలుపెట్టారు. సామాజిక, మానవతా సంబంధాలను పెంపొందింప చేయడం తన లక్ష్యంగా ఆయన పేర్కొన్నారు. అప్పటికి ఆయన వయస్సు 37 సం॥లు మాత్రమే.

**మొదటి వ్యవస్థాగత సమావేశం 1917 మే**

జోన్స్ ప్రతిపాదనలు జాతీయతావాదుల్ని, మానవతావాదుల్ని, అభ్యుదయవాదుల్నీ క్రమేణా ఆకర్షించడం ప్రారంభించాయి. ఒక సేవాసంస్థని ప్రారంభించడానికి వ్యవస్థాగత సమావేశం (Organisatiional Meeting) కోసం అందరికీ ఆహ్వానాలు పంపారు.

**లయన్స్ క్లబ్ అవతరణ జూన్ 7, 1917**

జోన్స్ ఏర్పాటుచేసిన మొదటి సమావేశానికి 22మంది సభ్యులు హాజరైనారు. చికాగో నగరంలో పాత హోటల్ లాసల్లెలో ఈ సమావేశం జరిగింది. సుదీర్ఘ చర్చలు సాగాయి. సంస్థ స్వరూప స్వభావాలు ఎలా వుండాలనేది ఈ చర్చల్లో ప్రముఖ అంశం.

"అసోసియేషన్ ఆఫ్ లయన్స్ క్లబ్స్"ను ఏర్పరచాలని తీర్మానించారు.

అప్పటికే లయన్స్ పేరుతో ఒకటి రెండు సంస్థలు పనిచేస్తున్నాయి. 'ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆఫ్ లయన్స్ క్లబ్'లో చేరడానికి అవి కూడా ముందుకు వచ్చాయి. కానీ, లయన్స్ అనే మాటకు విస్తృత అర్థాన్ని ఆ సమావేశంలో నిర్ధారించలేదు.

బాగా చర్చలు కొనసాగిన తర్వాత ఈ కొత్త ఉద్యమానికి "లయనిజం" అనే పేరుని ఖాయం చేశారు.

మెల్విన్ జోన్స్ ఈ కొత్త ఉద్యమానికి కార్యనిర్వాహక కార్యదర్శి (Acting Secretary)

గా వ్యవహారించేందుకు అందరూ నిర్ణయించారు.

విస్తృత స్థాయిలో మొదటి సమావేశాన్ని త్వరలో నిర్వహించాలని తీర్మానించారు.

## లయనిజం మొదటి సమావేశం

## అక్టోబర్ 8-10, 1917

కేవలం నాలుగు నెలల వ్యవధిలో అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని వివిధ ప్రాంతాల్లో లయన్స్ క్లబ్‌లను వ్యవస్థాపించే కార్యక్రమంలో జోన్స్ నిమగ్నమయ్యారు.

అర్కన్సాస్, కేలిఫోర్నియా, కొలొరాడో, ఇల్లినాయిస్, లూజియానా, మిస్సోరీ, ఒక్లహోమా, టెన్నెస్సీ, టెక్సాస్ మొదలైన రాష్ట్రాలలో మొత్తం 27 లయన్స్ క్లబ్‌లు ప్రారంభం అయ్యాయి.

ఈ 27 క్లబ్‌లలో 23 క్లబ్‌లు ఈనాటికీ పనిచేస్తున్నాయి. మిగిలిన నాలుగూ పేర్లు మార్చుకోవడం గానీ, పునర్నిర్మాణం కావడం గానీ జరిగాయి. మొత్తం మీద తొలినాటి క్లబ్‌లన్నీ ఇప్పటికీ వున్నాయి.

అక్టోబర్ 8 నుంచి 10 వరకూ జరిగిన ఈ మొదటి కన్‌వెన్షన్‌లో లయనిజం రాజ్యాంగం ఉపనియమావళి ఆమోదించ బడ్డాయి. ప్రవర్తనా నియమావళి ఆదర్శాలు రూపొందించారు.

బచ్చలిపండు రంగు (Purple), బంగారపు రంగుల్ని (Gold) అధికారిక రంగులుగా పేర్కొన్నారు.

ఇండియానా రాష్ట్రానికి చెందిన ఇవాన్స్‌విల్లెలో పేరొందిన వైద్యుడు, సమాజ సేవాతత్పరుడు డా॥ విలియం పి. ఊడ్స్ గారిని మొదటి అధ్యక్షుడిగా 9 మందిని డైరెక్టర్‌లుగానూ ఎన్నుకొన్నారు. మెల్విన్ జోన్స్ సెక్రటరీ / ట్రెజరర్‌గా కొనసాగారు.

## రెండో సమావేశం

## ఆగస్ట్ 19-21, 1918

మిస్సోరీ లోని సెయింట్ లూయిస్‌లో రెండో కన్వెన్షన్ జరిగింది. మొదటి సమావేశంలో రూపొందించిన కోడ్ ఆఫ్ ఎథిక్స్, ఆబ్జెక్ట్స్‌ను ఆమోదించారు.

జిల్లా గవర్నర్ల వ్యవస్థను ప్రతిపాదించారు. మొదటి విడతగా 9 మంది గవర్నర్లను నియమించారు.

## మొదటి లయన్స్ క్లబ్ మేగజైన్ విడుదల నవంబర్ 1918

మొదటి ప్రపంచ యుద్ధం ఉధృతంగా సాగుతోంది. యుద్ధ బాధితులకు సహాయ చర్యలు ముమ్మరంగా సాగుతున్నాయి. లయన్స్ సభ్యులలో ఎక్కువమంది వివిధ హోదాలలో, సైనికులుగానో, వైద్యులుగానో, ఇంజనీర్లుగానో పాల్గొంటున్నారు. వారికి సమాచారాన్ని అందించే ఒక సాధనం కావాలి. అందుకోసం లయన్స్ క్లబ్ మేగజైన్‌ని ఎడిటర్, పబ్లిషర్‌గా మెల్విన్ జోన్స్ 1918 నవంబర్‌లో ప్రచురించారు.




నోటితో ఎముకని కరచుకొని వున్న సింహం ముఖాన్ని లయన్స్ ఎంబ్లమ్‌గా ఈ సంచికలో ప్రచురించారు.

అనేక యుద్ధ వార్తలు, యుద్ధరంగంలో లయన్స్ సభ్యుల పాత్ర, యుద్ధం సమయంలో లయనిజం ద్వారా చేయవలసిన కృషి గురించిన అనేక విశేషాలు ఈ సంచికలో వున్నాయి.

మెల్విన్ జోన్స్ ఇన్సూరెన్స్ కంపెనీ ఎడ్వర్‌టైజ్‌మెంట్ కూడా ఇందులో వుంది.

రెండవ అధ్యక్షుడు లూయీస్, రెండవ కన్‌వెన్షన్ వివరాలు, హాజరైన సభ్యుల ఫొటోలు ఇంకా ఎన్నో వివరాలు ఈ మొదటి సంచికలో వున్నాయి. ఒకవైపు ప్రపంచయుద్ధం, ఇంకోవైపు ఇన్ ఫ్లు యెంజా తీవ్రవ్యాప్తిలో వుండి, లయనిజం అందిస్తున్న సేవలకు మంచి గుర్తింపు రావడం మొదలయ్యింది. 24 క్లబ్‌లు రెట్టింపు అయి 48 క్లబ్‌లు ఏర్పడ్డాయి.

కొంత ద్రవ్యనిధి కూడా లయనిజం కోసం సమకూర్చడం జరిగింది.

**మూడవ కన్‌వెన్షన్ -**
**చికాగో - 1919 జూలై 9**

మూడవ కన్‌వెన్షన్ జరిగే నాటికి లయనిజం బాగా ప్రజామోదం పొందడమే కాకుండా వ్యవస్థాపకమైన స్వరూపాన్ని సంతరించు కోసాగింది.

డెన్వర్ లయన్స్ క్లబ్‌కు చెందిన యువ న్యాయమూర్తి హాల్‌స్టెడ్ రిట్టర్ ఈ సమావేశంలో 'లయన్స్' అనే పదానికి కొత్త అర్థాన్ని ప్రతిపాదించాడు.

ధైర్య సాహసాలకు మారుపేరైన సింహం మృగరాజు మాత్రమే కాదనీ, ఐక్యమత్యానికీ, బలసంపన్నతకూ, ప్రవర్తనకూ, పద్ధతికీ నిదర్శనం అంటూ లయనిజం ద్వారా సమకూరే అవకాశాలు (Opportunities of Lionism) అనే అంశం గురించి ప్రసంగించాడు.

లిబర్టీ, ఇంటిలిజెన్స్, అవర్ నేషన్స్ సేఫ్టీ అనే పదాలను 'L'కీ, Iకీ, ONSకూ ఆపాదించి లయనిజం ఉద్యమానికి కొత్త ఊపును తీసుకువచ్చాడాయన. 'రిట్టర్' సూచించిన L.I. ONS అర్థాలనే లయనిజం ఆదర్శాలుగా ఆమోదించడం జరిగింది.

**కెనడాలో మొదటి క్లబ్**
**మార్చి 20, 1920**

అప్పటివరకూ అమెరికా సంయుక్త రాష్ట్రాలకే పరిమితంగా ఉన్న లయన్స్ క్లబ్‌లు ఇతర దేశాలలోనూ విస్తరించడం మొదలైనాయి.

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసింది.

1920 లయనిజానికి జవసత్వాలు సమకూరిన సంవత్సరం.

మార్చి 20వ తేదీన కెనడా దేశంలోని ఒంటారియో రాష్ట్రంలో లయన్స్ క్లబ్ ఆఫ్ విండ్సర్ ప్రారంభం అయ్యింది.

అక్కడినించి లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ అనే పేరు సార్థకం కాసాగింది.

**మొదటి లయన్స్ జిల్లా కన్‌వెన్షన్**
**మే 1920**

జిల్లా గవర్నర్ల వ్యవస్థ ఏర్పడిన రెండేళ్ళకి, అమెరికాలో మొదటి డిస్ట్రిక్ట్ కన్వెన్షన్ జరిగింది.

ఒక్లహోమా లయన్స్‌క్లబ్ ఈ జిల్లా సమావేశానికి ఆతిధ్యం ఇచ్చింది.

**లయన్స్ ఎంబ్లమ్ ఆమోదం :1921**

కాలిఫోర్నియాలో 'శాంతా బార్బరా' లయన్స్ క్లబ్‌కు చెందిన మారిస్ బ్లెంక్ అనే చిత్రకారుడు రూపొందించిన లయన్స్ ఎంబ్లమ్‌ని అధికారికంగా ఆమోదించారు. అప్పటివరకూ తుంటి ఎముక నోట కరచిన సింహం ముఖాన్నే ఎంబ్లమ్‌గా వుపయోగించే వారు. ఎవరికీ సంతృప్తి కల్గించలేదు ఆ ఎంబ్లమ్.

రెండుముఖాల లయన్స్ ఎంబ్లమ్ తూర్పు పశ్చిమ దిశలుగా విస్తరించిన సర్వప్రపంచాన్ని దృష్టిలో పెట్టుకొని రూపొందించినదిగా భావించారు. అది అందరి ఆమోదం పొందింది.

అందుకు తగ్గట్టుగానే అమెరికా నుంచి తూర్పుదేశాల వైపు లయనిజం అడుగులు వేయడం ప్రారంభించింది.

### మొదటి ఇంటర్నేషనల్ పెరేడ్ : జూన్ 23, 1924

ఏడో ఏట జరుగుతున్న లయన్స్ ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌లో మొదటిసారిగా భారీ పెరేడ్ నిర్వహించారు. అప్పటినించీ అది ఒక సాంప్రదాయంగా నేటికీ కొనసాగుతోంది.

### హెలెన్ కెల్లర్ మహోపన్యాసం జూన్ 29, 1925

8వ ఇంటర్నేషనల్ కన్వెన్షన్ లయనిజం చరిత్రలో సరికొత్త మలుపుకు నాందీ పలికింది. ఆమె ఇచ్చిన పిలుపును మొదటగా అందుకున్న వారు మెల్విన్ జోన్స్. ఈ సమావేశం తర్వాత, ఆయన హెలెన్ కెల్లర్ పిలుపుకు ప్రతిస్పందించవలసిందిగా లయన్స్‌క్లబ్‌లను పదేపదే విజ్ఞప్తి చేశారు.

Sight Conservation and Work for the Blind ప్రోగ్రామ్‌ని ప్రధాన కార్యక్రమంగా చేపట్టింది లయనిజం. Sight First గా రూపాంతరాలు చెందింది.

### ఆసియా, తూర్పు దేశాలలో లయనిజం 1926

ఆసియా తూర్పు దేశాలలోకి మొదటగా లయనిజం ప్రవేశించింది, చైనాలోని తియెంట్సిన్‌లో!

కానీ, వెనువెంటనే చెలరేగిన ప్రజావిప్లవం చైనాలో సామ్యవాద ప్రభుత్వాన్ని ఏర్పరిచింది. అమెరికాలో పుట్టిన పెట్టుబడీ దారీ వ్యవస్థకు లయన్స్ క్లబ్‌లు వారసులుగా చైనా కమ్యూనిస్ట్‌లు భావించి, క్లబ్‌లను మూయించారు.

### మొదటి నెక్రాలజీ కార్యక్రమం జూన్ 21, 1926

కీర్తిశేషులైన లయన్స్ సభ్యుల సంస్మరణ కార్యక్రమం (నెక్రాలజీ)ని మొదటిసారిగా, 10వ ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌లో నిర్వహించారు.

శాన్‌ఫ్రాన్సిస్కోలో ఈ సమావేశం జరిగింది.

### పదమూడేళ్ళలో ఎనభై వేలమంది లయన్స్ : 1930

1930 సంవత్సరానికి వచ్చేసరికి 2,200 లయన్స్ క్లబ్‌లు వివిధ ప్రాంతాలలో ఏర్పడ్డాయి.

అప్పటిదాకా లయన్స్ హెడ్ క్వార్టర్స్ కార్యాలయం జోన్స్ స్వంత ఇన్సూరెన్స్ కంపెనీలోనే వుండేది.

చికాగో డౌన్‌టౌన్‌లో మెక్ - కార్మిక్ భవనంలో కొంత భాగాన్ని అద్దెకు తీసుకొని అందులోకి మార్చారు.

పూర్తికాలం పనిచేసే 30మంది ఉద్యోగుల్ని నియమించారు.

### లయనిజం పితామహుని జన్మదినం "ఫౌండర్స్ డే"

1932లో ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ జనవరి 13వ తేదీని, మెల్విన్ జోన్స్ జన్మదినం సందర్భంగా, "వ్యవస్థాపకుడి రోజు"గా జరుపుకోవాలని తీర్మానించారు.

ఆనాటికి 15 సంవత్సరాల ప్రాయంలో వున్న లయనిజం ద్వారా జోన్స్ అందించిన సేవలకు ఈ నిర్ణయం గౌరవపూర్వకమైన కృతజ్ఞతగా భావించారు. 1938లో జోన్స్ వారోత్సవాలు ప్రకటించారు. ఆ తర్వాత జనవరి నెలని జోన్స్ మాసోత్సవంగా మార్పు చేశారు.

### అమెరికాలో ఆర్థిక మాంద్యం : 1934

ఆర్థిక మాంద్యం కారణంగా అమెరికాలో కొంత అస్తవ్యస్థ స్థితి ఏర్పడింది. అయినప్పటికీ 2,600 క్లబ్‌లు లయనిజం ద్వారా సేవలు అందించగలిగాయి. 19,300 ప్రాజెక్ట్‌లు అమలుజరిగాయి.

ఈ ఏడాదే కొత్తగా సభ్యులను చేర్పించిన స్పాన్సర్లకిచ్చే "కీ" అవార్డుల కార్యక్రమాన్ని ప్రారంభించారు.

**లక్షమంది సభ్యులు 1939**

22 సంవత్సరాల సుదీర్ఘ ప్రయాణం తర్వాత 1939లో లయనిజంలో కొనసాగుతున్న సభ్యుల సంఖ్య లక్షకు చేరింది.

క్యూబా ప్రభుత్వం ఆ దేశపు అత్యున్నత గౌరవం "నేషనల్ మెరిట్ ఆనర్" ను మెల్విన్ జోన్స్‌కు ప్రకటించి సత్కరించింది.

**రెండో ప్రపంచ యుద్ధం - లయనిజం రజతోత్సవం 1940-42**

మొదటి ప్రపంచయుద్ధం రేపిన గాయాలు మానకమునుపే, ఇంచుమించు పాతిక ఏళ్ళ వ్యవధిలోనే రెండవ ప్రపంచ యుద్ధం మొదలయ్యింది.

మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో లయనిజం పుట్టింది. రెండవ ప్రపంచ యుద్ధం నాటికి అది లక్షకు పైగా సభ్యులతో ప్రపంచ వ్యాప్త ఏకైక మానవతావాద సంస్థగా నిలబడివుంది.

ఈ లక్షమంది సభ్యులలో పాతికవేలమంది అంటే కనీసం నాలుగోవంతు మంది యూనిఫాం తొడుక్కొని స్వజాతి భద్రత (Our Nation's Safety) అనే లయనిజం నినాదానికి అనుగుణంగా యుద్ధరంగంలో సైనికులుగా వీరోచిత పోరాటంలో పాల్గొన్నారని ఒక అంచనా!

1942లో రెండో ప్రపంచ యుద్ధం విజేతలు ఎవరో తేలకుండానే ముగిసింది.

లయనిజం మాత్రం విశ్వమానవ సేవలో పునీతగా తన రజతోత్సవం జరుపుకొంది.

**యుద్ధానంతరం జాతి పునర్నిర్మాణం - 1943 - 44**

జోన్స్ ప్రేరణతో అంతర్జాతీయ లయనిజం తన సభ్యులకు పునర్నిర్మాణ కమిటీలు వేసి సమాజ పురోగమనానికి కృషి చేయవలసిందిగా సూచించింది.

యుద్ధం సృష్టించిన విధ్వంసంలో పూర్తిగా నష్టపోయిన దేశాలకు చేయూత నందించేందుకు వేలాది ట్రక్కుల బట్టలు, మందులు సేకరించి పంపిణీ చేసింది. ఎమర్జెన్సీ ఔషధాలను అందించింది.

అప్పటివరకూ సెక్రటరీ జనరల్‌గా కొనసాగుతున్న మెల్విన్‌జోన్స్ ఆ పదవికి మరొకరిని ఎన్నుకోవలసిందిగా చేసిన విజ్ఞప్తిని సున్నితంగా తిరస్కరిస్తూనే, ఆయన నాయకత్వం పట్ల సంపూర్ణ విశ్వాసం ప్రకటించింది.

**ఐక్యరాజ్యసమితి సన్నాహాలు - 1945**

ప్రపంచ శాంతిని సాధించాలంటే, అన్నిదేశాల సమాన భాగస్వామ్యంతో ఒక ఐక్య చర్చా వేదికగా వుండి, సమస్యల్ని శాంతియుతంగా పరిష్కరించుకునే అవకాశాల గురించి ప్రపంచ మేధావులు తలపోస్తున్న సమయం అది.

మెల్విన్‌జోన్స్ వారి ఆలోచనల్లో పాల్పంచుకొంటూ అందుకు తగిన అవకాశాల గురించి అన్వేషిస్తున్నాడు. 1945 ఏప్రియల్‌లో ఐక్యరాజ్యసమితి వ్యవస్థాపక సభ్యుల సమావేశంలో మెల్విన్‌జోన్స్ ఇద్దరు పూర్వపు అంతర్జాతీయ అధ్యక్షులతో కలిసి ప్రత్యేక ఆహ్వానితుని హోదాలో పాల్గొన్నారు.

జోన్స్‌కు అత్యంత సన్నిహితుడైన ఆర్.రాయ్ కాటన్ లయన్స్ అంతర్జాతీయ సంస్థకు అసిస్టెంట్ సెక్రటరీ జనరల్‌గా నియమితులయ్యారు.

CARE సంస్థ నెలకొల్పబడింది. లయన్స్ ఇంటర్నేషనల్ దానికి ప్రధాన దాతగా ఈ సంస్థ ద్వారా నడిచే సేవా ప్రాజెక్ట్‌లకు గ్రాంట్లు అందించడం జరిగింది.

క్యూబా దేశ ప్రభుత్వం, రెడ్ క్రాస్ సంస్థ జోన్స్‌ని ఆర్డర్ ఆఫ్ మెరిట్‌తో సత్కరించాయి.

రెండవ ప్రపంచ యుద్ధం కారణంగా ఈ సంవత్సరం ఇంటర్నేషనల్ కన్వెన్షన్ జరగలేదు.

బదులుగా ఇంటర్నేషనల్ లీడర్లందరూ లయన్స్ అంతర్జాతీయ కార్యాలయంలో ప్రత్యేక సమావేశం జరుపుకున్నారు.

**లయనిజం ఏర్పడిన మూడు దశాబ్దాల అనంతరం :-**

1947లో ఐక్యరాజ్యసమితి ఆవిర్భావం తర్వాత దానికి 5 ప్రముఖ విభాగాలలో ఒకటైన ఆర్థిక, సామాజిక విభాగం Economic & Social Council (ECOSOC)లో శాశ్వత సలహాదారుగా లయనిజానికి ప్రముఖ స్థానాన్నిచ్చారు. (CONSULTATIVE STATUS)

1948లో స్వీడన్‌లో మొదటి లయన్స్ క్లబ్ ప్రారంభం. 1949లో ఫిలిప్పైన్స్‌లో మణీలా లయన్స్‌క్లబ్ ప్రారంభం అయ్యింది. ఆసియా ఖండంలో ఇది రెండవ దేశం.

లయన్స్ క్లబ్ లండన్ కూడా అప్పుడే ఏర్పడింది. అప్పటిదాకా గ్రేట్ బ్రిటన్‌గా వున్న ఇంగ్లీషు దేశం రెండో ప్రపంచయుద్ధానంతరం బ్రిటన్‌గా కుదించుకుపోయింది. ఆ తర్వాతే లండన్‌లో లయన్స్‌క్లబ్ ప్రారంభం అయ్యింది.

**"WE SERVE" ఆదర్శం ఎంపిక 1950**

ఇంటర్నేషనల్ బోర్డ్ ప్రపంచవ్యాప్తంగా లయన్స్‌సభ్యుల్ని లయనిజానికి ఒక ఆదర్శాన్ని (MOTTO) అందమైన మాటలతో రూపొందించి పంపమని కోరింది. ఆరువేల మంది లయన్స్ ఈ పోటీలో పాల్గొన్నారు. "WE SERVE" అనే నినాదాన్ని ఎంపిక చేశారు. కెనడా లయన్స్ సభ్యుడు ఈ నినాదాన్ని పంపించాడు. 1954లో జరిగిన ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లో దాన్ని అధికారికంగా ఆమోదించారు.

లయనిజంలో నాలుగు లక్షల మంది సభ్యులు 1950 సంవత్సరాంతానికి వున్నట్లు నమోదయ్యింది. మెల్విన్ జోన్స్‌కు జీవితకాలం సెక్రటరీ జనరల్ గౌరవాన్ని అందించారు.

ఇంటర్నేషనల్ పాలనా యంత్రాంగాన్ని ఈ సంవత్సరం పూర్తిగా ప్రక్షాళన చేశారు. ఎడ్మినిస్ట్రేటివ్ కౌన్సిల్ ఏర్పరచారు.

1952లో జపాన్‌లో టోక్యో లయన్స్ క్లబ్ ఏర్పడింది. 1953లో ఆఫ్రికా ఖండంలో, మొరాకో దేశంలో కాసబియాన్కా లయన్స్ క్లబ్ ఏర్పడింది.

చికాగో నగరంలో మిచిగాన్ ఎవెన్యూ నూతన భవన సముదాయంలోకి లయన్స్ హెడ్‌క్వార్టర్స్‌ను తరలించారు.

**రోజ్ అమన్డా అస్తమయం 1954**

జోన్స్ జీవితంలో విషాదం అలుముకుంది. అప్పటివరకూ, అన్నింటా చేయూతగా నిలిచిన 'రోజ్ అమన్డా' సేవా ప్రపంచంలోంచి శాశ్వతంగా నిష్క్రమించింది. జోన్స్ వంటరివాడైనాడు. లక్షలాది లయన్స్ సభ్యులంతా ఆయనకు తోడుగా నిలిచారు. ఆయనకు లయనిజమే జీవితం.

**భారతదేశంలో లయనిజం ప్రవేశం ఫిబ్రవరి 3,1956**

నోషిర్ ఎన్.వుండోల్ వ్యవస్థాపక అధ్యక్షులుగా బొంబాయి లయన్స్ క్లబ్ ప్రారంభం అయ్యింది.

నోషిర్ ఎన్.జె.ఖాన్, కమేందర్ కెకెబి గోద్రెజ్, షఫిక్ ఎ.మన్సూర్... వీరంతా బొంబాయి లయన్స్ క్లబ్ వ్యవస్థాపక ప్రముఖులు.

రాబర్ట్ విలియమ్స్ అనే అమెరికన్ ఎక్స్‌టెన్షన్ ఛైర్మన్‌గా పెన్సిల్వేనియా రాష్ట్రంలో శాక్స్‌టన్ లయన్స్‌క్లబ్ బొంబాయి లయన్స్‌క్లబ్‌ని వ్యవస్థాపించింది. వారం రోజుల వ్యవధిలో ఫిబ్రవరి 11, 1956న ఢిల్లీ లయన్స్‌క్లబ్‌ను కూడా వీరే వ్యవస్థాపించారు.

బోంబే క్లబ్ ముందు ప్రారంభించబడింది గానీ, ఢిల్లీ లయన్స్ క్లబ్ ముందు చార్టర్

అయ్యింది. చార్టర్ అవడమే అధికారికం కాబట్టి, భారతదేశంలో మొదటి వ్యవస్థీకృత లయన్స్‌క్లబ్ ఢిల్లీ లయన్స్ క్లబ్ అయ్యింది!

1956 సంవత్సరం పూర్తయ్యేనాటికి మొదటి ఏడాది కాలంలో 10 లయన్స్‌క్లబ్‌లు దేశంలో వివిధ ప్రాంతాలలో ఏర్పడ్డాయి.

భారతదేశం లాంటి బడుగు దేశంలో ఇంతవేగంగా కొత్త క్లబ్‌లు వ్యవస్థాపించబడడం ఆనాటి దేశకాల పరిస్థితుల రీత్యా విశేషమే!

సతీవియోగ విషాదంలోంచి జోన్స్‌ను ఊరడిల్ల చేస్తూ, ఆయనకు ఉపచర్యలు చేస్తూ మళ్ళీ సేవా ప్రపంచంలోకి ఆయన్ని తీసుకురావడం కోసం, జోన్స్ పొరుగింటావిడ 'విలియమ్ రాడిగన్' ఎంతగానో తోడ్పాటు అందించింది. ఆ తర్వాత ఆమెను జోన్స్ వివాహం చేసుకున్నారు. జీవిత చరమఘుడియల్లో ఒకరి కొకరు తోడుగా జీవించడం కోసం ఆ ఇద్దరూ ఈ వివాహ నిర్ణయానికి వచ్చారు.

1955-56 లయనిస్టిక్ సంవత్సరంలో బొంబాయి, ఢిల్లీ తదితర ప్రాంతాల్లో లయన్స్‌క్లబ్‌లు ఏర్పడ్డ తర్వాత 1956-57 సంవత్సరంలో లయన్స్ జిల్లా 304ను ఏర్పాటుచేశారు. పూర్తి భారతదేశం అంతా ఆనాడు ఒకే జిల్లా!

బోంబే క్లబ్ ఛార్టర్ అధ్యక్షులు నోషిర్ ఎన్. పుండోల్‌ని కొత్తగా ఏర్పడిన ఈ 304 లయన్స్ జిల్లాకి గవర్నర్‌గా నియమించారు. 1957-58, 1958-59 సంవత్సరాలకు్కూడా ఆయన్నే గవర్నర్‌గా కొనసాగింపచేశారు.

1957లో లయన్స్ అంతర్జాతీయ కార్యాలయాన్ని పాలనాపరంగా మరొకసారి ప్రక్షాళన చేశారు. 1958లో మెల్విన్‌జోన్స్‌కు సెక్రటరీ జనరల్ గౌరవంతో పాటు వ్యవస్థాపకుడు. (Founder) గుర్తింపును కూడా లయన్స్ అంతర్జాతీయ సంస్థ అందించింది.

## భారతదేశ వ్యాప్తంగా లయన్స్ క్లబ్స్ 1959

1959 నాటికి మొత్తం 100 దేశాలలో గాని, దేశీయ ప్రాంతాలలో గాని (Geographical Areas) లయనిజం విస్తరించి ప్రపంచంలో అత్యధిక దేశాలలో విస్తరించిన ఏకైక సేవా సంస్థగా వినుతికెక్కింది.

బ్యాంగ్‌కాక్ లయన్స్‌క్లబ్ ఏర్పడడం ద్వారా థాయ్‌లాండ్ 100వ దేశం అయ్యింది.

ఈ ఏడాది జులైలో జరిగిన ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లో భారతదేశాన్ని నాలుగు లయన్స్ జిల్లాలుగా విభజించారు. 304 ఉత్తరం (N) 304 తూర్పు (E) 304 పశ్చిమం (W) 304 దక్షిణం (S) ఇలా నాలుగు భాగాలు NEWS గా విభజించారు.

బర్మా, సిలోన్, నేపాల్‌తో సహా ఈ మొత్తం జిల్లాలన్నీ 304 మల్టిపుల్‌లో చేర్చారు.

## వేగంగా లయనిజం విస్తృతి - 1960

ఆరులక్షల సభ్యత్వానికి లయనిజం వేగంగా చేరుకొంది ఈ సంవత్సరం!

అమెరికాలోని ఫ్లోరిడాలో హియాలీ లయన్స్‌క్లబ్ (పామ్‌స్ప్రింగ్స్) 15000వ లయన్స్ క్లబ్‌గా అవతరించింది. 1960లో మరింత విస్తృతంగా కొత్త క్లబ్‌లు ఏర్పడ్డాయి.

తన చేతుల మీదుగా ప్రారంభమై తన ప్రేరణతో ఎదిగి, తన కళ్ల ముందే విశ్వమంతా విస్తరించిన మహా వృక్షంగా నిలిచిన లయనిజం మెల్విన్ జోన్స్‌కు ఎంతో సంతృప్తి నిచ్చివుండాలి.

## జోన్స్ అస్తమయం - ఆరిన సేవాజ్యోతి - 1961

1917లో జోన్స్ సెక్రటరీగా పనిచేసిన బిజినెస్ సర్కిల్ అనే వృత్తి వ్యాపార వేత్తల సమాఖ్య చికాగో లయన్స్ క్లబ్‌గా రూపొందింది. లయనిజంలో ఇదే మొదటి లయన్స్‌క్లబ్.

1961లో ఈ చికాగో లయన్స్ క్లబ్ మెల్విన్ జోన్స్ 82వ జన్మదినోత్సవాన్ని ఘనంగా జరిపింది. ఆయన పేరుతో పెద్ద మొత్తంలో స్కాలర్‌షిప్ ఫండ్‌ను ఏర్పరిచింది.

5 నెలలు గడిచాయి. జోన్స్ తన కార్యాలయానికి వస్తూనే వున్నారు. సెక్రటరి జనరల్ విధులు నెరవేరుస్తూనే వున్నారు. కానీ... అంతలోనే... 1961 జూన్ 1న పిడుగులాంటి వార్త వెలువడింది. ప్రపంచ వార్తా పత్రికలన్నీ 'జోన్స్ ఇక లేరు' అనే వార్తను ప్రచురించాయి. ఒక సేవాజ్యోతి ఆరిపోయిందని సంతాపం ప్రకటించాయి.

జోన్స్ భౌతికకాయాన్ని 5 రోజుల పాటు ప్రజల దర్శనార్థం వుంచారు. ప్రపంచ స్థాయి దేశాధినేతలు, వారి ప్రతినిధులు, లయన్స్ నాయకులు ఇంటర్నేషనల్ హెడ్‌క్వార్టర్స్‌ను సందర్శించి ఆ భవిష్య ద్రష్టకి నివాళులర్పించారు. జూన్ 5వ తేదీన అంత్యక్రియలు జరిగాయి.

ఇంటర్నేషనల్ బోర్డ్ సమావేశంలో ఆ రోజున ..... జనవరి నెలని మెల్విన్ జోన్స్ 'మాసం'గా ప్రకటించారు.

జోన్స్ జీవితం తుది ఘట్టంలో ఆయన రూపొందించిన ఆఖరి అంతర్జాతీయ సేవా కార్యక్రమం International Youth Exchange Programme. అసోసియేషన్ కార్యక్రమంగా దీన్ని ఈ ఏడాది నుంచీ అమలులోకి తెచ్చారు.

మధ్య భారతదేశంలో 304 C జిల్లాను 1962లో ఏర్పాటు చేశారు.

1963 నుంచీ పిన్‌ట్రేడింగ్ అనేది సరదా కార్యక్రమంగా ప్రారంభం అయ్యింది. ఫ్యూజీ ద్వీపం 125వ దేశంగా లయనిజం మ్యాప్‌లో చేరింది. సువా లయన్స్‌క్లబ్ ప్రారంభం అయ్యింది.

లయన్స్ సభ్యుల సంఖ్య 7 లక్షలకు చేరింది. నిజానికి చేరిన వారి సంఖ్య చాలా వుంది. దానితో పాటే, లయనిజంలోంచి వెళ్ళిపోయే వారి సంఖ్య కూడా గణనీయంగా వుంటోంది.

దీన్ని నివారించడం కోసం 1964లో మెంబర్‌షిప్ కార్యక్రమంలో భాగంగా రిటెన్షన్ కార్యక్రమాన్ని కూడా బోర్డ్ ఆమోదించి అమలుచేయడం ప్రారంభించింది.

### ఇంటర్నేషనల్ డైరెక్టర్‌గా నోషిర్ ఎన్.పుండోల్ - 1966

ఇంటర్నేషనల్ బోర్డ్ డైరెక్టర్‌గా నోషిర్ ఎన్.పుండోల్ ఎన్నికయ్యారు. భారతదేశం లయనిజంలో ప్రవేశించిన ఎనిమిదేళ్ళలోనే లభించిన ఒక అరుదైన గౌరవం ఇది.

1964-66 సంవత్సరాలకు ఆఫ్రికా సౌత్ ఏషియా ఏరియాకు ప్రతినిధిగా ఇంటర్నేషనల్ డైరెక్టర్ పుండోల్ వ్యవహరించారు.

1966 నాటికి 20వేల లయన్స్‌క్లబ్‌లు వ్యవస్థాపించబడ్డాయి. ఎనిమది లక్షల మంది సభ్యులు లయనిజంలో ఆ నాటికి వున్నారు.

ఇండియాలో మరో మూడు కొత్త జిల్లాలను ఏర్పరచారు.

304 N, E1, E2, W1, W2, S1 మరియు S2 జిల్లాలుగా భారతదేశంలో లయనిజాన్ని పునర్వ్యవస్థీకరించారు.

### లయనిజం స్వర్ణోత్సవాలు - 1967

యాభై ఏళ్ళ సుదీర్ఘ సేవాయానం పూర్తిచేసుకున్న లయనిజం ఇరవై ఒక్క వేల లయన్స్‌క్లబ్‌లతో, ఎనిమిదిన్నర లక్షల మంది సభ్యులతో నూట ముప్ఫయి ఐదు దేశాలలో, ప్రాంతాలలో విస్తరించి ప్రపంచంలో అగ్రస్థానంలో నిలిచింది.

ఆ ఏడాది ప్రపంచ శాంతి కోసం అన్వేషణ అనే అంశంలో యువకులకు వ్యాసరచన పోటీలను ప్రపంచ స్థాయిలో నిర్వహించారు. రుస్సుల్ వోడెల్ అనే బ్రిటిష్ కొలంబియాకు

చెందిన 18 ఏళ్ళ విద్యార్థికి బహుమతి లభించింది. స్వర్ణోత్సవం సందర్భంగా అక్టోబర్ 8న హ్యూమానిటేరియన్ అవార్డును కూడా ప్రతిపాదించి, ఆ ఏడాది నించీ దాన్ని ప్రదానం చేయడం ప్రారంభించారు.

డా॥ వాల్టర్ ముంజ్ అనే సామాజిక శాస్త్రవేత్తకు మొదటి హ్యూమానిటేరియన్ అవార్డు లభించింది.

### లియో క్లబ్‌ల వ్యవస్థాపన 1968

యువ కిశోరాల్లో నాయకత్వ లక్షణాల్ని, అనుభవాల్ని, అవకాశాల్ని సేవాతత్త్వాన్ని పెంపొందింప చేయడం కోసం "లియో క్లబ్‌ల వ్యవస్థను ప్రారంభించారు.

భారతదేశంలో 304-W3 అనే కొత్త లయన్స్ జిల్లాని ఏర్పరచారు. ఇది ఎనిమిదవ జిల్లా.

భారతదేశంలో మొదటి సారిగా జంషెడ్‌పూర్ లియో క్లబ్ ప్రారంభం అయ్యింది.

లయన్స్ ఇంటర్నేషనల్ ఫౌండేషన్ (LIF) ద్రవ్యనిధిని ప్రారంభించారు. ఇదే తర్వాతి కాలంలో LCIF గా మారింది.

### చంద్రమండలాన్ని చేరిన లయన్ నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ - 1969 జులై 21

ఉత్తర ధృవాన్ని, దక్షిణ ధృవాన్ని చేరిన మొదటి బృందాలలో లయన్స్ వున్నారు. అలాగే చంద్రమండలం పైన కాలిడిన మొదటి మానవుడు నీల్ ఆర్మ్ స్ట్రాంగ్ లయన్స్ క్లబ్ సభ్యుడు కావడం లయనిజానికే గర్వకారణం.

1970లో ప్రపంచ లయన్స్ వ్యక్తిగత సేవాదినంగా అక్టోబర్ 8ని జరపడం ప్రారంభించారు. మొదటి ఇంటర్నేషనల్ కన్వెన్షన్ జరిగిన గుర్తుగా ఆ రోజుకు ఆ ప్రాముఖ్యత ఇచ్చారు. వ్యక్తినించి వ్యక్తికీ, హృదయం నుంచి హృదయానికీ వ్యక్తిగతంగా సేవలందించడం ఈ కార్యక్రమం లక్ష్యం.

1971లో 100% క్లబ్ ప్రెసిడెంట్ అవార్డుని ప్రకటించారు. తర్వాతి కాలంలో ఈ అవార్డుని ప్రెసిడెంట్ ఎక్సలెన్స్ అవార్డుగా మార్చుచేశారు.

ఇదే ఏడాది లయన్స్ హెడ్‌క్వార్టర్స్‌ని ఓక్ బ్రూక్‌లో 'యార్క్' నగరంలోకి తరలించారు.

### ప్రధాన సేవా కార్యక్రమాల ఆమోదం 1972

ఇంటర్నేషనల్ బోర్డ్ 10 ప్రధాన సేవా కార్యక్రమాల్ని లయనిజం చేపడుతున్నట్లు ప్రకటించింది.

1. Sight Conservation and work for the Blind
2. Hearing conservation and work for deaf
3. Citizenship Services
4. Educational Services
5. Environmental Services
6. Health Services
7. International Services
8. Public Services
9. Recreational Services
10. Social Services

### భారతదేశంలో కొత్త లయన్స్ జిల్లాలు - 1973

1973 నాటికి పది లక్షల మంది సభ్యులు ప్రపంచ వ్యాప్తంగా లయనిజం ద్వారా సేవలందిస్తున్నారు. 150 దేశాలలో ఆనాటికి లయనిజం విస్తరించింది.

చిన్న భారతదేశంలో చిన్న చిన్న నగరాల్లో కూడా అనేక కొత్త క్లబ్‌లు ప్రారంభమైనాయి. పూర్వపు జిల్లా పేర్లను మార్పు చేసి, జిల్లాలన్నింటినీ పునర్వ్యవస్థీకరించారు.

321 : 321-A, 321-B
322 : 322-A, 322-B, 322-C
323 : 323-A, 323-C, 323-D
324 : 324-A, 324-B, 324-C, 324-D మరియు 324-E

భారత్‌లో లయనిజం మొదట ఉత్తర భారతదేశం లోనే ప్రారంభమైనప్పటికీ మిగిలిన దేశంతో పోలిస్తే దక్షిణాదిన ఎక్కువ మంది

లయన్స్ సభ్యులు ప్రతిస్పందించారు. ఫలితంగా, ఇప్పటిక్కూడా, దక్షిణ భారతదేశపు మల్టిపుల్ జిల్లా '324' దేశంలోనే కాదు, ప్రపంచంలోనే అతిపెద్ద మల్టిపుల్ జిల్లాగా అనేక సార్లు నిలిచింది.

1975లో LCIF వారోత్సవాలను ప్రతిపాదించారు. అదే సంవత్సరం లయనెస్ ఉద్యమాన్ని కూడా కొత్తగా ప్రారంభించారు.

అంతర్జాతీయ మహిళా సంవత్సరం అది. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని అంతర్జాతీయ లయనిజం ఈ లయనెస్ ఉద్యమాన్ని ప్రారంభించింది.

1976లో రెండు ప్రధాన సేవా కార్యక్రమాల పేర్లలో కొద్దిపాటి మార్పులు చేశారు.

Sight conservation and work for the Blind అనే పూర్వపు కార్యక్రమాన్ని 'Sight conservation and work with the Blind' కార్యక్రమంగా మార్పు చేశారు. 'For' అనే మాటని తీసేసి 'with' అనే మాటను చేర్చడం ద్వారా ఈ కార్యక్రమానికి ఎంతో అర్థవిస్తృతి ఏర్పడింది.

అలాగే Hearing conservation and work with the Blind అనే మార్పును కూడా చేశారు.

ఈ ఏడాదితో 30,000 లయన్స్ క్లబ్‌లు లయనిజంలో పనిచేస్తున్నట్లు నమోదైనాయి.

**లయన్ జిమ్మీకార్టర్ అమెరికా అధ్యక్షునిగా ఎన్నిక - 1977**

లయన్ జిమ్మీ కార్టర్ 100% డిస్ట్రిక్ట్ గవర్నర్ అవార్డు పొంది మంచి లయన్స్ నాయకుడిగా ఎదిగిన వ్యక్తి.

లయనిజం ద్వారా ఆయన పొందిన పాలనానుభవం ఆయన్ని రాజకీయ రంగం వైపు నడిపించింది. అన్ని అంచులూ తాకుతూ ఆయన 1977లో అమెరికా అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు.

2002వ సంవత్సరపు నోబెల్ బహుమతి కూడా ఆయనకు లభించింది. ఆఫ్రికా దేశాలలో విస్తృతంగా వ్యాపించిన రివర్ బ్లైండ్‌నెస్ అనే ప్రమాదకరవ్యాధి నివారణ కోసం ఆయన LCIF తో కలిసి పనిచేస్తున్నారు.

అమెరికా అధ్యక్షుడిగా ఎదిగిన వ్యక్తి తిరిగి ప్రజల్లోకి వచ్చి ఈ విధంగా సేవా కార్యక్రమాలు చేపట్టడం చాలా అరుదైన విషయం.

రివర్‌బ్లైండ్‌నెస్ అదుపుకోసం LCIF ఎంతగానో చేయూత అందించింది.

లయన్ జిమ్మీ కార్టర్ ఆ అవకాశాన్ని ఉపయోగించి ఆయా ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్నారు. అదే ఆయన్ని నోబెల్ బహుమతికి అర్హుణ్ణి చేసింది.

**2,500 లయనెస్ క్లబ్‌లు**

1980 నాటికి, కేవలం 5 సంవత్సరాల, వ్యవధిలో లయనెస్ క్లబ్‌లు 2,500 వరకూ చేరాయి. 63000 మంది మహిళా సభ్యులు లయనెస్ ఉద్యమంలో చేరారు.

స్వతంత్ర భావాలు కలిగి, సామాజిక సేవా దృష్టితో ముందుకు వచ్చే మహిళలకు లయనెస్ ఉద్యమం ఎంతగానో తోడ్పాటునిచ్చింది. ఒకదశలో లయన్స్‌తో సమానంగా కార్యక్రమాలు చేయగలిగిన శక్తిని లయనెస్‌లు ప్రదర్శించగలిగారు. మహిళా శక్తికి నిదర్శనంగా ప్రపంచంలోనే అత్యధిక సభ్యులు కల్గిన సంస్థగా లయనెస్ ఉద్యమం వినుతికెక్కింది.

ఇది గమనించిన అంతర్జాతీయ సంస్థ కొత్త ఆలోచనలు చేయడం ప్రారంభించింది. మహిళలకు పురుషులతో సమాన ప్రాతినిధ్యం ఇస్తూ వారిని కూడా లయన్స్‌గానే ఆహ్వానించాలనేది ఆ ఆలోచన. అందుకు కావాల్సిన రాజ్యాంగ సవరణల కోసం ఆలోచనలు మొదలయ్యాయి.

1980లోనే మరో అద్భుతం జరిగింది. ఐక్యరాజ్యసమితి లయన్స్ అంతర్జాతీయ సంస్థను ఆహ్వానించి, న్యూయార్క్‌లోని సమితి ప్రధాన కార్యాలయంలో లయన్స్ కోసం ఒక రోజు సమావేశాన్ని ఏర్పాటు చేసింది.

అలా ప్రారంభం అయ్యింది. "LIONS DAY WITH UNO" కార్యక్రమం.

ఐక్యరాజ్యసమితి ఇచ్చిన ఇలాంటి అపూర్వ గౌరవాన్ని పొందిన మొదటి సేవా సంస్థ లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్.

మొదటి సమావేశం ఐక్యరాజ్యసమితి దినోత్సవం - అక్టోబర్ 24న జరిగింది. అప్పటినించీ ప్రతీఏడాదీ ఈ కార్యక్రమం ఒక నిర్ధారిత సమయంలో జరగడం మొదలైంది.

**ఆసియా నుంచి మొదటి అంతర్జాతీయ అధ్యక్షుడు - 1981**

'కావొరు 'కాయ్' మురకమీ' జపాన్‌లోని టోక్యో లయన్స్ క్లబ్ నుంచి లయన్స్ అంతర్జాతీయ సంస్థకు అధ్యక్షుడిగా ఎన్నికైన మొదటి ఏషియన్.

చెట్లు నాటే కార్యక్రమాన్ని శాంతి చిహ్నంగా తన కార్యక్రమ ప్రాధాన్యతని ప్రకటించారు మురకమి.

ఈవిధంగా పర్యావరణ పరిరక్షణ కార్యక్రమాలలో లయనిజం ప్రపంచ నాయకత్వాన్ని పొందేందుకు అవకాశం ఏర్పడింది. కేవలం రెండు సంవత్సరాల వ్యవధిలో పదిహేను లక్షల మంది లయన్స్ సభ్యులుండాలనే లక్ష్యాన్ని మొదటగా ఈ 'మురకమీ' ప్రకటించారు.

ఇది జరిగి 22 సంవత్సరాలయినా, లయనిజం ఈనాటికీ్కూడా ఈ లక్ష్యానికి చేరుకోలేకపోయింది. దీనికి కారణం 'రిటెన్షన్' కార్యక్రమాలు బలంగా లేకపోవడమే! కొత్తగా చేరేవారి సంఖ్య, లయనిజాన్ని వదలి వెళ్ళేవారి సంఖ్య, అటూ ఇటూగా ఒకేలా వుంటోంది.

నాయకత్వం దృష్టి కూడా సభ్యత్వ నమోదు మీద వున్నంతగా సభ్యుల్ని కోల్పోకుండా నిరోధించడం మీద లేకపోవడం ప్రధాన లోపం.

చిల్లికుండని ఎన్ని నీళ్ళతో నింపినా ఏం ప్రయోజనం...??

**డయాబెటిస్ అవేర్‌నెస్ కార్యక్రమాలు ప్రారంభం - 1982**

1982లో జరిగిన ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లో డ్రగ్ అవేర్‌నెస్, డయాబెటిస్ అవేర్‌నెస్ కార్యక్రమాలను ప్రధాన కార్యక్రమాల జాబితాలో చేర్చారు.

ఆ ఏడాది లయన్స్ జర్నీఫర్ సైట్ కార్యక్రమాన్ని కూడ ప్రకటించారు.

1983 నుంచి ప్రపంచ శాంతి దినాన్ని పాటించడం ప్రారంభించారు.

1984లో భారతదేశంలో లయన్స్ సభ్యుల సంఖ్య లక్షకు చేరింది. ఇంచుమించుగా ప్రతి లయన్స్ జిల్లాలో క్లబ్‌లసంఖ్య 100కి చేరువగా వచ్చాయి.

1986లో Lions Day at UNO కార్యక్రమాన్ని LIONS Day with UNO గా మార్పుచేశారు.

మదర్‌తెరీసాకు లయన్స్ అంతర్జాతీయ సంస్థ అత్యున్నత పురస్కారం హ్యూమానిటేరియన్ అవార్డును ప్రదానం చేశారు.

**మహిళలకు సమాన ప్రాతినిధ్య చట్టం : 1987**

లయన్స్‌క్లబ్‌లో సభ్యత్వంపొందే వ్యక్తి పురుషుడు కావాలనే నిబంధనని తొలగిస్తూ రాజ్యాంగ సవరణ చేయడం ద్వారా లయన్స్ అంతర్జాతీయ సంస్థలో సభ్యత్వం పొందేందుకు స్త్రీలను కూడా ఆహ్వానించింది లయనిజం.

1987 లయనిజం చరిత్రలో గొప్ప మలుపు. విశ్వవ్యాప్తంగా వున్న ఏ సేవాసంస్థ తీసుకోని ఈ నిర్ణయాన్ని లయనిజం ఆలస్యంగానైనా తీసుకోగలిగింది. ప్రపంచ మానవాళి ఈ నిర్ణయాన్ని హర్షించింది.

**అంతర్జాతీయ అధ్యక్షుడిగా తొలి భారతీయుడు**

1989లో భారతదేశానికి గర్వకారణమైన సంఘటన లయన్ - రోహిత్ సి మెహతా అంతర్జాతీయ మూడవ ఉపాధ్యక్షుడిగా ఎన్నికైనారు. ఆ ఏడాది ప్రముఖ నేత్ర వైద్యులు డా॥ ఎం.సి.మోడీకి హ్యూమానిటేరియన్ అవార్డు ప్రధానం చేశారు.

గవర్నర్లకు సహాయంగా వుండేందుకు, పాలనాపరమైన అనుభవాన్ని సంపాదించు కునేందుకు కొత్తగా 'లెఫ్టినెంట్ గవర్నర్స్' అనే పదవిని సృష్టించి, దానికి ప్రత్యేకంగా ఎన్నికలు జరిపే పద్ధతిని 1991లో ప్రవేశపెట్టారు.

ఆ సమయానికి 324-C1 ఉమ్మడి జిల్లాలో మనం కొనసాగుతున్నాం.

లయన్ డా॥ ఆర్.ఎస్.వరప్రసాద్ మన ఉమ్మడి జిల్లాకు మొదటి లెఫ్టినెంట్ గవర్నర్‌గా ఎన్నికైనారు. 1993లో వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్‌గా ఈ పదవిని మార్పుచేశారు.

గవర్నర్ పదవికి పోటీ చేయడానికి కనీసపు అర్హతగా ఆ వ్యక్తి లెఫ్టినెంట్ గవర్నర్‌గా గానీ, వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్‌గా గానీ పనిచేసి వుండాలనే నిబంధనని ఆ ఏడాది ఆమోదించారు.

దీనివలన పాలనానుభవం కల్గిన వ్యక్తులే గవర్నర్ పదవికి ఆరోగ్యవంతంగా పోటీపడేందుకు అవకాశం ఏర్పడింది. అంతేకాదు, గవర్నర్ పదవికి అనవసరంగా పోటీ చేసేవారి సంఖ్య కూడా తగ్గింది.

1997-98 సంవత్సరంలో వైస్ గవర్నర్ పదవికి మరికొన్ని మార్పులు చేశారు. వైస్ గవర్నర్‌గా పనిచేసిన వ్యక్తిని ఎక్కువమంది జనరల్ బాడీ సభ్యులు 'ఎస్' అని ఆమోదిస్తేనే గవర్నర్‌గా ఎన్నికైనట్లు ప్రకటించే పద్ధతిని అమలులోకి తెచ్చారు.

1995లో రాజీవ్‌గాంధీ ఫౌండేషన్‌కి లయన్స్ అత్యుత్తమ ప్రతిష్ఠాత్మక "హ్యూమానిటేరియన్ అవార్డ్"ను ప్రధానం చేశారు.

1987లో కంపూచియా, బోస్నియా, హెర్బ్‌గోవినా దేశాలు లయనిజాన్ని ఆహ్వానించాయి.

1997 జులై ఫిలడెల్ఫియా కన్వెన్షన్‌లో ఎఫిలియేట్ మెంబర్ కేటగిరీని ప్రవేశపెట్టారు.

**జేసీస్‌తో ఒప్పందం**

జనవరి 19, 1998న లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్, జూనియర్ చాంబర్స్ ఇంటర్నేషనల్ మధ్య సేవా కార్యక్రమాలలో అవగాహనా పూర్వక ఒప్పందం కుదిరింది.

ఏప్రియల్ 19, 1998న "నూతన సభ్యుల విశ్వ ప్రతిష్ఠాపనోత్సవం" World wide Induction Day ని ప్రవేశపెట్టారు.

1998లోనే అక్టోబర్ 8 నుంచీ World Sight Day ని నిర్వహించడం మొదలుపెట్టారు.

ఐతే, ఇది అక్టోబర్ నెలలో రెండో గురువారం నాడు జరుగుతుంది.

జనవరి 1, 1999న ఇంటర్నేషనల్ మరో ముఖ్య నిర్ణయం తీసుకొంది. గతంలో లయనెస్ ఉద్యమం ద్వారా ఎనలేని కృషి చేసిన మహిళామణులను లయనిజంలోకి ఆహ్వానిస్తూ, వారికి ప్రవేశ రుసుము మినహాయింపు ప్రకటించింది. అలాగే, లయన్స్ జీవిత భాగస్వాముల క్కూడా ప్రవేశరుసుము మినహాయింపు నిచ్చారు. ధర్మపత్ని, జీవిత భాగస్వామి వైఫ్, హజ్‌బెండ్ లాంటి పదాలకు బదులుగా స్పౌజ్ (spouse) పదాన్ని ఉపయోగించ సాగారు.

అదే సంవత్సరం నుంచీ నెలనెలా యాక్టివిటీ రిపోర్ట్‌ను మంత్లీ మెంబర్‌షిప్ రిపోర్ట్‌లో భాగంగా ఇంటర్నేషనల్‌కు పంపించే శ్రమని తగ్గించారు. ఎం.ఎం. & ఎ రిపోర్ట్‌ల స్థానంలో ఎం.ఎం.రిపోర్టు పంపే విధానాన్ని ప్రారంభించారు.

అప్పటివరకూ అక్టోబర్, మార్చి నెలలో కొత్త సభ్యులను చేర్పించిన వారికి ప్రత్యేక గుర్తింపు ఇచ్చేవారు. 1999 నుంచి ఎప్పుడు కొత్త సభ్యుణ్ణి రిపోర్ట్ చేసినా గుర్తింపు నిచ్చే సౌకర్యాన్ని కల్పించారు. (Year Round growth programme)

యువజనుల కోసం న్యూసెంచురీ లయన్స్ క్లబ్స్‌నీ, విద్యాలయాలకి చెందిన వ్యక్తులతో క్యాంపస్ లయన్స్ క్లబ్స్‌నీ ప్రారంభించారు.

కొత్త మిలీనియం సంవత్సరంలో లియో సభ్యుల్ని లయన్స్‌గా చేర్పిస్తే వారికి ప్రవేశ రుసుము మినహాయింపు ప్రకటించారు.

జిల్లా, మల్టిపుల్ జిల్లా కన్‌వెన్షన్‌లలో ఓటు హక్కు రావాలంటే, "ఒక సంవత్సరం ఒకరోజు' ' పూర్తి చేసుకున్న సభ్యులను బట్టి ఓటుహక్కు ఇచ్చే విధానాన్ని ప్రవేశపెట్టారు.

"జర్నీ ఫర్ సైట్" కార్యక్రమాన్ని ఉపసంహరించుకుని, దాని స్థానే 'వరల్డ్ సైట్ డే' కార్యక్రమానికి ప్రాధాన్యత నిచ్చారు.

2001లో ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్ పదవికి గుర్తింపు ప్రకటించారు.

2002లో లయన్స్ ఇంటర్నేషనల్ రాజ్యాంగాన్ని కొద్ది మార్పులతో తిరిగిరాశారు. Redrafting of Lions Constitution) అప్పటివరకు, కొత్తగా ప్రారంభమయ్యే క్లబ్‌లోకి సభ్యుల్ని స్పాన్సర్ చేస్తే (చార్టర్ మెంబర్స్) అలా స్పాన్సర్ చేసిన వారికి ఎలాంటి గుర్తింపూ వుండేదికాదు. 2002లో చార్టర్ సభ్యుల్ని స్పాన్సర్ చేసిన వారికి కూడా గుర్తింపు ప్రకటించారు.

సాంస్కృతిక కార్యక్రమాలకు ఒక డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్ ఏర్పాటుకు అనుమతి ఇచ్చారు ఈ సంవత్సరమే!

2003 జులైలో డెన్వర్‌లో జరిగిన కన్‌వెన్షన్ లయనిజానికి ఆర్థిక వెసులుబాటు కల్గించింది. పెరిగిన అవసరాలకు అనుగుణంగా సభ్యత్వ రుసుము చాలని కారణంగా ఆర్థికమాంద్యం ఏర్పడిన పరిస్థితి లోంచి గట్టెక్కి మరింత సమర్థవంతంగా లయనిజాన్ని నడిపించడం కోసం పార్టీ సభ్యత్వంలో 15 డాలర్ల పెంపుని ప్రతిపాదించినప్పుడు, రెండింట మూడు వంతుల మంది సభ్యులు ఈ నిర్ణయానికి మనస్ఫూర్తిగా ఆమోదం తెలిపారు. ఈ 15 డాలర్ల మొత్తాన్ని మూడు విడతలుగా రానున్న మూడేళ్ళలో పెంపుదల చేయడానికి నిర్ణయించారు.

**జూలై 1,2003 నాటికి 28.25 డాలర్లు**
**జూలై 1,2004 నాటికి 33.20 డాలర్లు**
**జూలై 1,2005 నాటికి 39.00 డాలర్లు**

వైస్ గవర్నర్ పదవికి ఇద్దరి కన్నా ఎక్కువమంది అభ్యర్థులు పోటీ చేస్తున్నప్పుడు, పోలైన ఓట్లలో 51శాతం ఓట్లు సాధించిన అభ్యర్థి మాత్రమే గెలిచినట్లు ప్రకటించాలనే నిబంధనను ఈ ఏడాది 2003లో ఆమోదించారు.

రెండు కొత్త డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్ పదవులకు ఆమోదం లభించింది.

1. మహిళా సభ్యత్వం మరియు లయన్స్ కార్యక్రమాలలో మహిళల పాత్రను పెంపొందింప చేసే చైర్‌పర్సన్ పదవి. (Women Membership Development & Participation Chairperson)

2. క్యాంపస్ క్లబ్స్ చైర్‌పర్సన్ పదవి : ఈ రెండు పదవుల పదవీకాలాన్ని రానున్న గవర్నర్ల అభీష్టం మేరకు 3 సం॥లుగా నిర్ధారించారు.

## లయన్స్ అంతర్జాతీయ సంస్థ కొత్త సభ్యులకు కొత్తగా కల్పించిన రాయితీలు

**1. ADMISSION FEE WAIVER PROGRAMMES - 2003**

**A)** భార్యాభర్తలలో ఒకరు 10 సంవత్సరాల పాటు లయన్స్ క్లబ్‌లో సభ్యులుగా వుండి మరణిస్తే, రెండవవారు క్లబ్ సభ్యత్వం తీసుకునేప్పుడు ఎడ్మిషన్ రుసుము చెల్లించనవసరం లేకుండా మినహాయింపు ప్రకటించారు. ఇది 2001లో అమలులోకి వచ్చింది.

**B)** 2003-2004 లయనిస్టిక్ సంవత్సరంలో లయన్స్ సభ్యులు తమ జీవిత భాగస్వామి (Spouse)ని లయనిజంలో సభ్యులుగా జేరిస్తే వారికి ప్రవేశరుసుము మినహాయింపునిచ్చారు.

**C)** అయితే, 2003 అక్టోబర్ బోర్డు సమావేశంలో తీసుకున్న నిర్ణయం ప్రకారం నవంబరు 2003 నుంచి జూన్ 2004 వరకూ కొత్తగా చేరిన మహిళా సభ్యులకు ప్రవేశ రుసుము రద్దు చేశారు. అయితే, చార్టర్ సభ్యురాలిగా చేరేవారికి, కొనసాగుతున్న క్లబ్‌లో చేరేవారికి, వేర్వేరు రిపోర్టింగ్ ఫారాలను పూర్తి చేయవలసి వుంటుంది. ఈ ఫారాలు గవర్నర్ నుండి పొందవచ్చు.

**D)** ప్రస్తుతం గానీ, పూర్వం గానీ లయనెస్‌గా వున్న మహిళలు లయన్‌గా చేరడానికి అంగీకరిస్తే వారికి ఎడ్మిషన్ రుసుము మినహాయింపు వుంది.

**F)** యూనివర్శిటీలో గానీ, పీజీ కాలేజీలలో గాని చదివే విద్యార్థులు ఆ విద్యాలయం ధృవీకరణతో కేంపస్ క్లబ్‌లో గాని, నడుస్తున్న క్లబ్‌లో గాని సభ్యులుగా చేరదలిస్తే 25 డాలర్లు లేక 30 డాలర్ల ఎడ్మిషన్ రుసుము పూర్తిగా మినహాయింపు వుంటుంది.

**G)** బ్రాంచి క్లబ్‌గా నడుస్తున్న ఒక క్లబ్ పూర్తిస్థాయి కల్గిన క్లబ్‌గా రూపాంతరం చెందినప్పుడు ఆ బ్రాంచి క్లబ్ సభ్యులు చార్టర్ ట్రాన్స్‌ఫర్ రుసుము 20 డాలర్లు చెల్లించనవసరం లేదు.

**H)** పూర్వం గుర్తింపు పొందిన లియోక్లబ్‌లో సభ్యుడిగా వున్న యువకులు కొత్తగా లయన్స్ సభ్యుడిగా చేరదలిస్తే 25 డాలర్ల ప్రవేశ రుసుము గానీ, 30 డాలర్ల ప్రవేశ రుసుము గానీ చెల్లించనవసరం లేదు. పూర్వపు లియోలకు ప్రవేశ రుసుము మినహాయింపు. 2003-2004 సంవత్సరం నుంచీ అమలులోకి వచ్చింది. ప్రస్తుతానికీ ఇది 2003-04 సంవత్సరానికి వర్తించే కార్యక్రమం! అయితే, లియో క్లబ్ సభ్యుడిగా సర్టిఫికెట్ కాపీని జతపరచవలసి వుంటుంది.

**I) స్టేటస్ కో ప్రకటించడంలో కొత్తమార్పులు**

ఒక క్లబ్‌ను స్టేటస్ 'కో' లో పెట్టడానికి చేసిన ప్రతిపాదన మీద డిస్ట్రిక్ట్ గవర్నర్ గారితోపాటు వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్‌గారు కూడా సంతకం చేయవలసి వుంటుంది. ఒక క్లబ్‌ని స్టేటస్ కో లోంచి బైటకు తెచ్చే ప్రతిపాదన మీదకూడా గవర్నర్‌తోపాటు వైస్‌గవర్నర్ సంతకంచేయాలి.

'స్టేటస్ కో' లో పడిన క్లబ్‌ని రియాక్టివేషన్ చేయడంలో జోన్ ఛైర్‌పర్సన్‌కూ పాత్ర కల్పించారు. జిల్లా గవర్నర్ గారి పర్యవేక్షణలో త్వరగా ఆ క్లబ్ రియాక్టివేట్ కావడానికి ఈ నిర్ణయం దోహద పడ్తుంది.

**J) మెంబర్‌షిప్ విభాగంలో 3 సం॥ల కమిటీలు**

లయన్స్ డిస్ట్రిక్ట్‌లో మెంబర్‌షిప్‌కు సంబంధించి 3 సంవత్సరాల పాటు నిర్వహించే పదవులు ఇవి.

1. డిస్ట్రిక్ట్ ఎక్స్‌టెన్షన్ చైర్‌పర్సన్
2. డిస్ట్రిక్ట్ మెంబర్‌షిప్ చైర్ పర్సన్
3. డిస్ట్రిక్ట్ రిటెన్షన్ చైర్ పర్సన్
4. డిస్ట్రిక్ట్ క్యాంపస్ క్లబ్ చైర్‌పర్సన్
5. డిస్ట్రిక్ట్ వుమెన్స్ మెంబర్‌షిప్ డెవలప్ మెంట్ అండ్ పార్టిసిపేషన్ చైర్‌పర్సన్

ఈ 5 పదవులకు డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్‌లను నియమించే ముందు మల్టిపుల్ కౌన్సిల్ చైర్మన్‌తో జిల్లాగవర్నర్‌గారు చర్చించి ఈ నియామకాలు జరుపుతారు. అయితే, మళ్ళీ సంవత్సరం గవర్నర్ గారు ఈ పదవులలో వ్యక్తుల కొనసాగింపును ఆమోదించవలసి వుంటుంది.

**K) క్లబ్‌లో కనీస సభ్యుల సంఖ్య పది**

జూలై 1, 2004 నుంచి అమలులోకి వచ్చే విధంగా క్లబ్ కాన్‌స్టిట్యూషన్ 5వ ఆర్టికల్‌లో కొత్త ఆర్టికల్‌ను చేర్చారు. దాని[ప్రకారం కనీసం 10 మంది సభ్యులు [ప్రతిక్లబ్‌లో వుండాలి.

పదిమంది కన్నా తక్కువగా వుండే క్లబ్‌లు ఈలోగా తమసభ్యత్వాన్ని పెంపొందించుకోవాలి. లేదా వేరొక లయన్స్‌క్లబ్‌లో కలిసిపోవాలి.

కొత్తగా వ్యవస్థాపించే క్లబ్‌లో కనీస సభ్యుల సంఖ్య 20 వుండాలనే నియమంలో ఎలాంటి మార్పు లేదు. క్లబ్ ఆరోగ్యవంతమైనదిగా మనగలగాలంటే 20 మంది కనీసం వుంటేనే సాధ్యం అవుతుంది.

**L) 2003-04 నుంచి అమలులోకి వచ్చే కొన్ని మార్పులు :**

- డిస్ట్రిక్ట్ గవర్నర్ 2 లేక అంతకన్నా ఎక్కువ క్లబ్‌లను కలిపి ఒకేసారి అధికార పర్యటన (Official Visit) చేయడానికి అనుమతిచ్చారు. వీలైతే జోన్స్ స్థాయిలో క్లబ్‌లకు సంయుక్తంగా అధికార పర్యటన జరపవచ్చు.
- ఎం.ఎం.ఆర్ కాపీలు ప్రతి క్లబ్‌కూ పది మాత్రమే పంపుతారు. మిగిలిన రెండు నెలలకూ జిరాక్స్ కాపీలు వాడమని సూచిస్తున్నారు.
- గుడ్ స్టాండింగ్ వున్న క్లబ్‌లు 35 కన్నా తక్కువగానూ, గుడ్ స్టాండింగ్‌లో వున్న సభ్యులు 1250 మంది కన్నా తక్కువగానూ వున్న లయన్స్ జిల్లాలను "ట్రాన్సిషనల్ జిల్లా"లుగా వ్యవహరిస్తారు. అవి వెంటనే పూనుకొని రాజ్యాంగ పరమైన ఈ కనీసపు సంఖ్యను చేరుకోవలసి వుంటుంది.
- చైర్మన్ అనే పురుషవాచక పదాన్ని తొలగించి దాని స్థానే చైర్‌పర్సన్ అని వ్యవహరించవలసిందిగా సూచిస్తున్నారు.

**L) వైస్ గవర్నర్ పదవి ఎన్నికల్లో కొత్తమార్పు**

వైస్ గవర్నర్ పదవికి పోటీలో ఎందరు అభ్యర్థులున్నా సరే మొత్తం పోలయిన ఓట్లలో సగానికన్నా ఎక్కువ ఓట్లు సంపాదించుకోగలిగిన అభ్యర్థి మాత్రమే ఎన్నికైనట్లుగా ప్రకటించబడతారు.

ఇది జరగనప్పుడు తక్కువ ఓట్లు వచ్చిన అభ్యర్థుల్ని మినహాయించి ఎక్కువ ఓట్లు సంపాదించుకున్న మొదటి ఇద్దరి మధ్యా తిరిగి ఎన్నిక జరుపుతారు.

ఈ విధానంలో ఎన్నికలు 2004 ఏప్రియల్‌లో జరిగే కన్వెన్షన్ నుంచి అమలులోకి వస్తాయి.

**M) ఏరియా ఇంపాక్ట్ టీమ్**

**AREA IMPACT TEAM**

కొత్త క్లబ్‌ల వ్యవస్థాపనా కార్యక్రమాలను, కొత్త సభ్యుల నమోదునీ, సభ్యులు చేజారకుండా నిరోధించే కార్యక్రమాలనీ పర్యవేక్షించేందుకు అంతర్జాతీయ స్థాయిలో 23 మంది ఏరియా ఇంపాక్ట్ లీడర్స్‌ను లయన్స్ ఇంటర్నేషనల్

నియమించింది. పాస్ట్ ఇంటర్నేషనల్ డైరెక్టర్ తర్వాత స్థానాన్ని ప్రోటోకాల్‌లో ఈ ఇంపాక్ట్ లీడర్స్‌ను కేటాయించడం ద్వారా, వీరికి ఉన్నతగౌరవాన్ని ఆపాదించారు.

భారతదేశంనుంచి ఇద్దరు ప్రముఖులకు ఈ అంతర్జాతీయ గౌరవం లభించింది.

1. పాస్ట్ ఇంటర్నేషనల్ డైరెక్టర్ నరేష్ అగర్వాల్ గారు నేపాల్, పాకిస్తాన్ మరియు భారతదేశంలో MD 321, MD 323 లలో జరిగే సభ్యత్వ కార్యక్రమాలను పర్యవేక్షించి, ప్రోత్సహించి ఇతోధికంచేస్తారు.

2. దక్షిణభారతదేశంలో ప్రతిఒక్క లయన్‌కూ "కేజీఆర్"గా సుపరిచితులైన లయన్ కె.జి.రామకృష్ణమూర్తిగారు ఏరియా ఇంపాక్ట్ లీడర్‌గా శ్రీలంక, బంగ్లాదేశ్, భారతదేశంలో MD 322, MD 324 లలో జరిగే సభ్యత్వ నమోదు కార్యక్రమాలను ప్రోత్సహిస్తారు.

ఏరియా ఇంపాక్ట్ లీడర్స్ 23 మందిలో ఐదుగురు మాత్రమే పాస్ట్ ఇంటర్నేషనల్ డైరెక్టర్స్ కాని వారున్నారు. లయన్ కెజి ఆర్ ఈ అరుదైన గౌరవాన్ని అందుకని, 2002 - 03 సంవత్సరకాలంలో అత్యధిక సభ్యత్వాన్ని, క్లబ్‌లను సాధించిన వ్యక్తిగా ప్రశంసలు అందుకున్నారు

భారతీయ సంతతికి చెందిన మనోజ్‌షా అనే పాస్ట్ గవర్నర్‌గారు కూడా ఆఫ్రికాలో ఏరియా ఇంపార్ట్ లీడర్‌గా ఈ గౌరవాన్ని పొందారు. ఆయన ఆఫ్రికా దేశాలలో సభ్యత్వాన్ని పర్యవేక్షించి ప్రోత్సహిస్తారు.

### N) ఫైవ్ స్టార్ ఎక్స్‌టెన్షన్ టీమ్

**FIVE STAR EXTENSION TEAM**

జిల్లా గవర్నర్‌గారు నియమించే కమిటీ ఇది. ఇందులో : 1. లీడర్, 2. అసిస్టెంట్ లీడర్, 3. సర్టిఫైడ్ గైడింగ్ లయన్, 4. సర్టిఫైడ్ గైడింగ్ లయన్, 5. ఓరియెంటేషన్ లయన్

ఈ ఐదుగురినీ ఫైవ్‌స్టార్ ఎక్స్‌టెన్షన్ టీమ్ అనిపిలుస్తారు. వీరు డిస్ట్రిక్ట్‌లో కొత్త క్లబ్‌ల స్థాపన గురించి, వాటిని సక్రమంగా వ్యవస్థాపించడం గురించి, కొత్తక్లబ్‌ల నిర్మాణ నిర్వహణల గురించి కృషిచేస్తారు.

### O) క్లబ్‌లో ముగ్గురు సభ్యుల మెంబర్‌షిప్ కమిటీ

**3 PERSON MEMBERSHIP COMMITTEE**

సభ్యత్వ కార్యక్రమాలలో, సభ్యత్వ నమోదునూ, ఎక్స్‌టెన్షన్‌నూ, రిటెన్షన్‌లనూ కూడా చేర్చడం వలన పూర్వపు మెంబర్ షిప్ కమిటీలో వుండే ముగ్గురు సభ్యులకూ ఈ మూడు బాధ్యతల్ని అప్పగించారు.

- ముగ్గురు సభ్యుల మెంబర్‌షిప్ కమిటీ మూడు సంవత్సరాలు పనిచేస్తుంది.
- ఈ ముగ్గురులో ఒకరుచైర్మన్, ఒకరు వైస్ చైర్మన్, ఒకరు సభ్యులుగావుంటారు.
- చైర్మన్ ఒక సంవత్సరం పూర్తిచేసి విరమిస్తారు. వారి స్థానంలో రెండోసంవత్సరం వైస్‌చైర్మన్ చైర్మన్ అవుతారు. సభ్యులు వైస్‌చైర్మన్‌గా ప్రమోట్ అవుతారు. రెండో ఏడాది నుంచీ సభ్యుడి పదవికి ఎన్నికలు జరుగుతాయి.
- చైర్మన్ 1st year = సభ్యత్వనమోదు కార్యక్రమాలు పర్యవేక్షిస్తారు

వైస్ చైర్మన్ 2nd year = లీడర్‌షిప్, రిటెన్షన్ బాధ్యతలు నిర్వహిస్తారు. సభ్యులు 3rd year = ఎక్స్‌టెన్షన్ బాధ్యతలు చేపడతారు.

మెంబర్‌షిప్ కమిటీలో ఎన్నికైన ముగ్గురు సభ్యులు రొటేషన్ పద్ధతిలో అంటే, చైర్మన్ స్థానంలో వైస్ చైర్మన్, వైస్‌చైర్మన్ స్థానంలో సభ్యుడు, సభ్యుడి స్థానానికి ఎన్నికలు ఇలా జరుగుతాయి. కొత్త నిర్ణయం ప్రకారం జెనరల్‌బాడీ ఈ రొటేషన్ పద్ధతిలో వ్యక్తుల్ని కూడా ఆయా పదవులకు ఆమోదించవలసి వుంటుంది.

## లయన్స్‌క్లబ్స్ ఇంటర్నేషనల్ ప్రధాన కార్యాలయం

### INTERNATIONAL HEAD QUARTERS

### 300W, 22ND STREET, -OAK BROOK - ILLI NOIS, USA



కాశీ, జెరూసలేము, మక్కా వంటి పుణ్యక్షేత్రాలు ఆయా భక్తులకు ఎంత పవిత్రమైనవో లయన్స్ సభ్యులకు ఇంటర్నేషనల్ ప్రధాన కార్యాలయం కూడా అలాంటిదే!!

జీవితంలో కనీసం ఒకసారి ఈ సేవామహా సౌధాన్ని సందర్శించగలగడం ధన్యత!

సోమవారం నుంచి శుక్రవారం వరకూ ఈ కార్యాలయం నిత్యం సందర్శించే వేలాది లయన్స్ సందర్శకులకోసం ఉదయం 8 గంటలనుంచి సాయంత్రం నాలుగున్నర వరకూ తెరిచే వుంటుంది!

అమెరికాలోని ఇల్లినాయిస్ రాష్ట్రంలో, ఓక్‌బ్రూక్ నగరంలో లక్షాయాభైవేల చదరపు అడుగుల విస్తీర్ణంలో ఈ కార్యాలయం వుంది.

1971లో ఈ భవన నిర్మాణం జరిగింది. 1983లో ఒకసారి, 1986లో మరొకసారి ఈ భవనాన్ని అనేక మార్పులు చేసి పునర్నిర్మించారు. 2000 వ సంవత్సరంలో పై అంతస్థులో కాన్ఫరెన్స్ హాల్స్‌ని కూడా విస్తృత పరిచారు.

ఇంటర్నేషనల్ బోర్డ్ సమావేశాలు జరుపుకోడానికి అనుకూలంగా, ఆడియో విజువల్స్‌తో సహా ఆధునిక సౌకర్యాలను వాటిలో ఏర్పరచారు.

ఇది మూడంచెల భవనం. పై అంతస్తు కాన్ఫరెన్స్‌లకోసం రెండవ అంతస్తు వివిధ ఆఫీసుల నిర్వహణకోసం కేటాయించారు. మొదటి అంతస్తులో (Ground Floor) ప్రింటింగ్ యంత్రాలు, మెయిల్ గదులు ప్రచురణలు క్లబ్ సప్లయిస్, పంపిణీ తదితర విభాగాలు పనిచేస్తుంటాయి.

2003 సంవత్సరంలో డిస్ట్రిక్ట్ & క్లబ్ అడ్మినిస్ట్రేషన్ డివిజన్‌ని పునర్వ్యవస్థీకరించారు.

10 ఎకరాల విశాలమైన స్థలంలో నిర్మితమైన భవనంలో క్వార్ట్జ్ ప్యానెల్స్, కంచు కమ్మీలుతో తయారైన కిటికీలు, విశాలమైన

లాన్స్ ఏపుగా పెరిగిన మహావృక్షాలు, జపాన్ లయన్స్ నిర్మించిన ట్రాన్క్విల్ గార్డెన్ ఈ కార్యాలయానికి అదనపు శోభను ఆపాదించాయి.

**ప్రధానకార్యాలయంలో పనిచేసే వివిధ విభాగాలు**

**1. క్లబ్ సప్లైస్ & డిస్ట్రిబ్యూషన్ డివిజన్ :** సంవత్సరానికి కనీసం 80 వేల ఆర్డర్లు వివిధ లయన్స్‌క్లబ్‌ల ద్వారా ఈ డివిజన్‌కు అందుతుంటాయి. సంవత్సరానికి 20 లక్షల ఉత్తరాలను ఈ డివిజన్ పంపడంగాని, అందుకోవడంగానీ చేస్తుంటుందని అంచనా!

**2. కన్వెన్షన్ డివిజన్ :** ప్రతి సంవత్సరం 17 నుంచి 20వేల మంది లయన్స్ సభ్యులు హాజరయ్యే ప్రసిద్ధ సమావేశం లయన్స్ ఇంటర్నేషనల్ కన్వెన్షన్. సంవత్సరం ముందునుంచే ఈ డివిజన్ ద్వారా సంవత్సరం ఆఖరున జరిగే కన్వెన్షన్‌కు ఏర్పాట్లు ప్రారంభిస్తారు.

**3. డిస్ట్రిక్ట్ & క్లబ్ అడ్మినిస్ట్రేషన్ డివిజన్ :** ఈ డివిజన్‌లో నాలుగు భాషా సమూహాలకు చెందిన డిపార్ట్‌మెంట్స్ ఉన్నాయి. యూరాఫ్రికన్ భాషల విభాగం.

పసిఫిక్ - ఆసియన్ భాషల విభాగం
ఇబెరో - అమెరికన్ భాషలవిభాగం
ఇంగ్లీషు విభాగం.

13 భాషల్ని లయనిజం అధికారికంగా గుర్తించింది. హిందీ అందులో ఒకటి!

అయితే, ఇంగ్లీషుని వాడుకభాషగా మన లయన్స్ జిల్లా ఎంచుకొంది కాబట్టి మన డిస్ట్రిక్ట్ వ్యవహారాలన్నీ ఇంగ్లీషు లాంగ్వేజ్ డిపార్ట్‌మెంట్‌లో నడుస్తుంటాయి.

లీడర్‌షిప్ విషయాలు, డిస్ట్రిక్ట్ గవర్నర్ అవార్డులు, క్లబ్ ప్రెసిడెంట్ అవార్డులు వగైరా వివరాలు, ఎం.ఎం.రిపోర్ట్‌లు ఈ ఇంగ్లీషు లాంగ్వేజ్ డిపార్ట్‌మెంట్, డిస్ట్రిక్ట్ & క్లబ్ అడ్మినిస్ట్రేషన్ డివిజన్‌కు రాస్తే వివరాలు తెలుస్తాయి.

**4. ఎక్స్‌టెన్షన్ & మెంబర్ షిప్ డివిజన్ :** 15 లక్షల సభ్యత్వానికి చేరే ప్రయత్నంలో ఈ డివిజన్ ఎంతో శ్రమిస్తూ వుంటుంది.

**5. ఫైనాన్స్ డివిజన్ :** ప్రపంచవ్యాప్తంగా 55 దేశాలలో లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ పేరున బ్యాంక్ అక్కౌంట్స్ వున్నాయి 192 దేశాలు, ప్రాంతాలలో వున్న క్లబ్‌లన్నీ ఈ 55 దేశాలకు చెందిన అక్కౌంట్లలో తమ సభ్యత్వరుసుము వగైరాల్ని జమచేస్తారు.

ఇండియా, సౌత్‌ఈస్ట్ ఏషియా దేశాలకు చెందిన క్లబ్‌లన్నీ ముంబైలోని ఇంటర్నేషనల్ కార్యాలయం, అక్కౌంట్‌లో జమ అయ్యేలా పంపిస్తాయి.

**6. ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ డివిజన్ :** షుమారుగా 14 లక్షల మంది సభ్యులు, 44,500 క్లబ్‌లకు సంబంధించిన అన్ని వివరాలూ, అత్యాధునిక కంప్యూటర్ ఎక్విప్‌మెంట్‌ద్వారా ఈ డివిజన్‌లో రికార్డ్‌చేస్తుంటారు.

2003 అక్టోబర్ నెలనుంచీ సభ్యుల 6 డిజిట్ల నెంబర్లన్నీ ఈ కొత్త కంప్యూటర్ల కారణంగా మారాయి. క్లబ్ ఆఫీసర్లు ఈ కొత్తమార్పుని గమనించండి!

**7. ఇంటర్నేషనల్ యాక్టివిటీస్ & ప్రోగ్రామ్ ప్లానింగ్ డివిజన్ :** లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ ద్వారా చేపట్టదగిన సేవాకార్యక్రమాల గురించిన పరిశోధనలు, పథక రచనలు సూచనలు, సలహాలు ఈ డివిజన్‌లోంచి అందుతుంటాయి.

లయన్స్ యూత్ ఔట్‌రీచ్, యూత్ క్యాంప్స్, యూత్ ఎక్స్‌ఛేంచి, లియోక్లబ్స్, పర్యావరణం

మధుమేహం, సైట్ ఫస్ట్ ....ఇలాంటి కార్యక్రమాలను ఈ డివిజన్ సంధాన పరుస్తుంది!

**8. లీడర్‌షిప్ డివిజన్ :** లయన్స్ సభ్యుల్లో భవిష్య దృష్టితో కూడిన నాయకత్వపు చాతుర్యాన్ని పెంపొందింప చేసే అనేక లీడర్‌షిప్ కార్యక్రమాలకు ఇక్కడ రూపకల్పన జరుగుతుంది.

ఈ డివిజన్ ద్వారా లయన్స్ లీడర్‌షిప్ ఇన్‌స్టిట్యూట్‌లు అనేకం వివిధ దేశాలలో పనిచేస్తున్నాయి.

**9. లీగల్ డివిజన్ :** విధాన నిర్ణాయకులైన ఇంటర్నేషనల్ బోర్డ్ సభ్యులకు అవసరమైన లీగల్ విషయాల్ని అందించడం ఈ డివిజన్ ప్రధాన విధి. క్లబ్ రాజ్యాంగపరమైన అంశాలు వివాదాలు, పరిష్కారాలు ఈ డివిజన్‌కు సంబంధించిన అంశాలు.

**10. లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ ఫౌండేషన్ (LCIF)**

LCIF అనేది ప్రజాపరమైన (Pubilc), లాభాపేక్షలేని (Non -Profit), పన్ను మినహాయింపు గల్గిన (Tax Exemption) ఒక ఫౌండేషన్.

LCIF డివిజన్‌లో తిరిగి, అనేక డిపార్ట్‌మెంట్లున్నాయి. అందులో గ్రాంట్స్ డిపార్ట్ మెంట్ ఒకటి.

ఈ గ్రాంట్స్ డిపార్ట్‌మెంట్ ద్వారా అందే LCIF నిధులతో విస్తరించిన సేవా కార్యక్రమాలకు లయన్స్ క్లబ్‌లకు ఎంతో అవకాశం లభిస్తోంది.

మన జిల్లానుంచి ప్రతిలయన్స్ సభ్యుడూ, ప్రతిసంవత్సరం ఒక డాలర్‌కు సరిపడిన మొత్తాన్ని విరాళంగా అందిస్తున్నాడు. మనం కడుతున్న డిస్ట్రిక్ట్ రుసుములో ఈ డాలర్‌ని కూడా కలిపి చెల్లిస్తున్నాం.

అయితే, మనం చెల్లించిన విరాళాలతో పోల్చిచూసినప్పుడు, LCIF ద్వారా మనకు అందిన నిధులుకు అనేకరెట్లు ఎక్కువగా వున్నాయని అంచనా!

'మెల్విన్‌జోన్స్ ఫెలో' లుగా ఎక్కువమంది లయన్స్ సభ్యులు నమోదు అయ్యే విధంగా లయనిజంలో నాయకత్వంలో వున్నవారు ప్రోత్సహిస్తూవుంటారు.

**11. పబ్లిక్ రిలేషన్స్ & ప్రొడక్షన్ డివిజన్ :** ఈ డివిజన్ ప్రధానంగా అసోసియేషన్ ప్రచురణల్నీ, కరపత్రాల్నీ, ఇతర సమాచార పత్రాల్ని తయారుచేసి, డిజైన్‌చేసి, అచ్చు వేయించి బాధ్యతలు నిర్వహిస్తుంది.

'THE LION' మేగజైన్ ఈ డివిజన్ ఆధ్వర్యం లోనే నడుస్తోంది.

ప్రపంచ మానవుల దృష్టిలో లయనిజం ప్రతిష్ఠను ఇనుమడింపచేసే విధంగా ఈ డివిజన్ ప్రత్యేక శ్రద్ధ తీసుకొంటుంది.

2003 సంవత్సరంనుంచీ, లయన్స్‌జిల్లాలు పౌరసంబంధాల అభివృద్ధికోసం ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహిస్తే, అందుకు వెయ్యిడాలర్ల వరకూ ఆర్థిక సహాయం చేయాలని నిర్ణయించారు.

అఫిషియల్ వెబ్‌సైట్ www. lions clubs. org. ని ఈ డివిజన్ నిర్వహిస్తోంది.

ఒకసారి ఈ వెబ్‌సైట్‌లోకి వెళ్ళిచూడండి - అపారమైన పరిజ్ఞానం లభిస్తుంది - లయనిజం గురించి!!

లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ హెడ్‌క్వార్టర్స్‌లో ఈ పదకొండు డివిజన్‌లు నిర్విరామంగా పనిచేస్తుంటాయి.

ఇంటర్నేషనల్ హెడ్‌క్వార్టర్స్ ఒక ఎగ్జిక్యూటివ్ ఎడ్మినిస్ట్రేటర్, ఒక సెక్రటరీ, ఒకట్రెజరర్ నేతృత్వంలో 340 మంది

ఉద్యోగులు పైన చెప్పిన 11 డివిజన్లలో పనిచేస్తుంటారు. ప్రతిడివిజన్‌కూ డివిజన్ మేనేజర్స్ వుంటారు. వారికింద డిపార్ట్‌మెంట్ మేనేజర్స్, సూపర్‌వైజర్‌లు పనిచేస్తుంటారు.

అమెరికన్ ప్రభుత్వ చట్టం ప్రకారం లేబర్ నియమాలకు అనుగుణంగా ఈ కార్యాలయం పాలన సాగుతుంది.

ఉద్యోగులందరికి గ్రూప్ ఇన్సూరెన్స్ వంటి అనేక సౌకర్యాలున్నాయి.

5సంవత్సరాల సర్వీసు పూర్తి చేసిన "ఉద్యోగులందరికీ ఒక వెండి అవార్డు-10 సంవత్సరాల ఉద్యోగికి బంగారం అవార్డు. 15 సంవత్సరాల ఉద్యోగికి బంగారం + రూబీ, 20 సంవత్సరాల బంగారం + నెఫైర్ ఆపైన సర్వీసుకల్గిన ఉద్యోగులకు 500డాలర్ల వరకూ గిఫ్ట్ పథకాలు వంటివి అమలులో వున్నాయి.

క్రిష్టమస్ బహుమతులు, పెళ్ళి బహుమతులు ఇలాంటివి చాలా అందిస్తూ వుంటారు.

**లయన్స్‌క్లబ్‌లలో వ్యవస్థాగత అంశాలు**

**(ORGANISATIONAL CHART)**

జెనరల్‌బోడీ

↓

బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ (executes Business)

↓

క్లబ్ ప్రెసిడెంట్స్ (CEO) Chief Executive Officer

↓

| మొదటి ఉపాధ్యక్షులు | 2వ ఉపాధ్యక్షులు | 3వ ఉపాధ్యక్షులు |
|---|---|---|
| • అటెండెన్స్ కమిటీ | • డయాబెటీస్ అవేర్‌నెస్ | • గ్రీటర్ |
| • కాన్‌స్టిట్యూషన్ & బైలాస్ | • డ్రగ్ అవేర్‌నెస్ | • ఇంటర్నేషనల్ |
| • కన్‌వెన్షన్ | • హియరింగ్ అండ్ స్పీచ్ యాక్షన్ & వర్క్ విత్ ది డెఫ్ | • లీడర్‌షిప్ డెవలప్‌మెంట్ |
| • ఫైనాన్స్ | • సైట్ కన్‌జర్వేషన్ అండ్ వర్క్ విత్ ది బ్లైండ్ | • లియోక్లబ్ ప్రోగ్రామ్ |
| | | • లయనెస్ క్లబ్ ప్రోగ్రామ్ |
| • లయన్స్ ఇన్‌ఫర్‌మేషన్ | | |
| • మెంబర్‌షిప్ | | |
| • ప్రోగ్రామ్ | | |

# పలుకు బంగారం



తనను ఇతరులు ఎలా చూడాలని భావిస్తారో
వారిని అలానే గౌరవించండి
(Treat People the way they want to be treated)



★ చెవుడు, మూగ, వికలాంగుల కార్యక్రమాల కమిటీ (Hearing Speech Action and work with the Deaf)

★ పర్యావరణ కార్యక్రమాలు

★ లియోక్లబ్ కార్యక్రమాలు

★ యువతరాన్ని మరొకచోటుకు పంపడం లేదా ఆహ్వానించడం ద్వారా వారికి ఆయా ప్రాంతాలతో, సంస్కృతులతో పరిచయం కల్గించడం (Youth Exchange Program)

★ లయనెస్ క్లబ్ ప్రోగ్రామ్

★ ఇంటర్నేషనల్ రిలేషన్స్ ప్రోగ్రామ్

★ పౌరసేవలు (Citizenship Services)

★ విద్యాసేవలు (Educational Services)

★ ఆరోగ్యసేవలు (Health Services)

★ సామాజిక సేవలు (Social Services)

★ మానసికోల్లాస సేవలు (Recreational Services)

★ ప్రజాపరమైన సేవలు (Public Service)

★ అంతర్జాతీయ స్థాయిలో యువకుల కోసం క్యాంప్‌లు (Intl. Youth Camps)

## ప్రామాణిక క్లబ్ రాజ్యాంగం

### ఆర్టికల్ 1 : పేరు, నినాదం, ఆదర్శం

**1వ విభాగం**

నామం : ఈ సంస్థ పేరు
లయన్స్ క్లబ్ ఆఫ్
" ....................................... "

దీన్ని అంతర్జాతీయ లయన్స్ సేవా సంస్థల సమాఖ్య తన సభ్యురాలిగా ఆమోదిస్తూ చార్టర్ చేసింది. దాని నియమావళి ప్రకారం యీ సంస్థ పనిచేస్తుంది.

**2వ విభాగం**

నినాదం :
స్వేచ్ఛ (Liberty)
ప్రతిభ (Intelligence)
మనజాతి భద్రత (Our Nation's Safety)

**3వ విభాగం**

ఈ లయన్స్ క్లబ్ ఆదర్శం : మనం సేవలందిద్దాం (WE SERVE)

### ఆర్టికల్ 2

లయన్స్ క్లబ్ ప్రధానోద్దేశాలు ఇవి :

a) ప్రపంచ మానవాళి మధ్య పరస్పర అవగాహన కల్పించడం, ప్రోత్సహించడం.

b) ప్రజారంజకమైన ప్రభుత్వపాలన, బాధ్యతాయుతమైన పౌరజీవనం అనే సూత్రాలను ప్రోత్సహించడం.

c) ప్రజాపరమైన, సాంస్కృతికపరమైన, సామాజికపరమైన, నైతికపరమైన సమాజ ఉన్నతి పట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరచడం.

d) పరస్పర స్నేహబంధాల్ని, స్వచ్ఛమైన సౌభ్రాతృత్వాన్ని అవగాహనను పెంచుకునేలా సభ్యులందరినీ సమైక్యపరచడం.

e) ప్రజాసంబంధమైన విషయాలు అన్నింటినీ కూడా రాజకీయ పక్షపాతం, మతతత్త్వాల కతీతంగా బహిరంగ చర్చా వేదికను ఏర్పరచడం.

f) సేవాదృష్టి కల్గిన వ్యక్తులు తమ సమాజానికి ఎటువంటి ఆర్థికపరమైన ప్రతిఫలాపేక్ష లేని సేవలందించే విధంగా ప్రోత్సహించడం. వ్యాపార రంగానికి, పారిశ్రామిక రంగానికి, వృత్తిపరమైన ప్రజాపరమైన రంగాలకు ప్రైవేట్‌రంగానికి చెందిన వ్యక్తులలో అత్యంత సమర్థతను అత్యున్నతమైన నైతిక ప్రామాణికతను పెంపొందింపచేయడం.

### ఆర్టికల్ III

### సభ్యత్వం (MEMBERSHIP)

**1వ విభాగం : క్లబ్ సభ్యత్వానికి అర్హత**

(Eligibility for Club Membership)

ఉపనియమావళి ఆర్టికల్ 1లో సూచించిన విధంగా వివిధ సభ్యత్వాల కేటగిరీలలో సభ్యులుగా చేరేవారు - చట్టపరమైన మెజారిటీ తీరిన వయసు

కలవారై వుండాలి. సత్ప్రవర్తన కలిగి, సమాజంలో మంచి పేరు ప్రతిష్ఠలు కలిగి వుండాలి. వీరికి లయన్స్‌క్లబ్‌లో సభ్యత్వాన్ని కల్పించవచ్చు. ఈ సభ్యత్వం స్త్రీ పురుషులిద్దరికీ వర్తిస్తుంది. ఈ రాజ్యాంగంలో ఎక్కడైనా పురుషవాచక పదం కన్పించినా, అది స్త్రీ పురుషులిద్దరికీ సంబంధించినదిగానే అర్థం చేసుకోవాలి.

**2వ విభాగం : ఆహ్వానం మీదే సభ్యత్వం :**

**(Membership by Invitation)**

ఈ లయన్స్ క్లబ్‌లో సభ్యత్వం క్లబ్ ఆహ్వానం మీదే జరుగుతుంది. అంతేగాని, అప్లికేషన్ పెట్టుకుంటే, దాన్ని ఆమోదించే పద్ధతిలో జరగదు.

కొత్తగా ఆహ్వానించిన సభ్యులకు కావలసిన నామినేషన్ ఫారాలు ఇంటర్నేషనల్ నుంచి క్లబ్‌కు అందుతాయి.

క్రొత్త సభ్యుని పూర్వాపరాలు తెలిసిన సభ్యుడు అతని సభ్యత్వానికి ప్రతిపాదిస్తూ స్పాన్సర్‌గా సంతకం చేసి మెంబర్‌షిప్ ఛైర్మన్‌కు గానీ క్లబ్ సెక్రటరీకి గానీ అందచేస్తాడు.

ఈ నామినేషన్ ఫారాన్ని మెంబర్‌షిప్ కమిటీ క్షుణ్ణంగా పరిశీలించి కొత్తగా చేరనున్న సభ్యుడి గుణగణాలతో సంతృప్తి చెందిన తర్వాత ఈ ఫారాన్ని బోర్డు పరిశీలనకు పంపుతారు.

మెజారిటీ బోర్డు సభ్యులు ఆ వ్యక్తిని సభ్యుడిగా చేర్చుకోవడానికి ఆమోదించిన పక్షంలో, ఆ వ్యక్తిని స్పాన్సర్ సాయంతో కలిసి క్లబ్‌లోకి సగౌరవంగా ఆహ్వానిస్తారు.

మెంబర్‌షిప్ ఫారాన్ని పూర్తి చేయించి, సంతకం చేయించి, ఎంట్రన్స్ ఫీజు, సభ్యత్వ రుసుము చెల్లించిన తర్వాతే ఇంటర్నేషనల్‌కు ఆ సభ్యుణ్ణి రిపోర్ట్ చేయడం జరుగుతుంది. రిపోర్ట్ అయినప్పటినుంచి మాత్రమే ఆ వ్యక్తి లయన్స్ సభ్యుడిగా అధికారికంగా వ్యవహరించబడతారు.

## ఆర్టికల్ IV

## సభ్యత్వం రద్దు

**(Forefeiture of Membership)**

ఏ సభ్యుణ్ణయినా క్లబ్‌లోంచి ఏ కారణం రీత్యా అయినా తొలగించవచ్చు. బోర్డు సభ్యుల్లో మూడింట రెండు వంతులకు మించిన సభ్యుల ఆమోదం ఇందుకు అవసరం అవుతుంది.

## ఆర్టికల్ V

## క్లబ్‌కు బ్రాంచ్‌లు ఏర్పరచే కార్యక్రమం

**(CLUB BRANCH)**

**1వ విభాగం : బ్రాంచ్‌ల ఏర్పాటు :**

**(BRANCH FORMATION)**

ఒక కొత్త ప్రాంతంలో కొత్తగా లయన్స్ క్లబ్ ఏర్పాటు కోసం ప్రయత్నించి, పూర్తి స్థాయి క్లబ్ ఏర్పడనప్పుడు, అంగీకరించిన ఆ కొద్దిమంది సభ్యులతోనే అక్కడ ఒక బ్రాంచ్ క్లబ్‌ను ఏర్పాటు చేయవచ్చు. ఈ బ్రాంచ్ అనేది పేరెంట్ క్లబ్‌కు అనుబంధంగా నడిచే కమిటీ లాంటిది. తమ ప్రాంతంలో సేవా కార్యక్రమాలు స్వతంత్రంగా నిర్వహించుకోవడానికి ఈ బ్రాంచ్ క్లబ్‌కు అవకాశం వుంది.

**2వ విభాగం : సభ్యత్వం పితృసంస్థలోనే**

**(Membership in Parent Club)**

ఈ బ్రాంచ్ క్లబ్‌లో చేరిన కొత్త సభ్యుల సభ్యత్వం పేరెంట్ క్లబ్‌లోనూ, బ్రాంచి క్లబ్‌లోనూ వుంటుంది. పేరెంట్ క్లబ్ బోర్డు సభ్యుల ఆహ్వానం మేరకు మాత్రమే కొత్త సభ్యులు బ్రాంచ్ క్లబ్‌లో చేరతారు. బ్రాంచ్ క్లబ్‌లో సభ్యులు కూడా ఉపనియమావళి ఆర్టికల్ 1లో చూపించిన సభ్యత్వ కేటగిరీలలో ఏదో ఒకదానికి చెందివుంటారు.

**3వ విభాగం : బ్రాంచ్ క్లబ్ నిధుల సేకరణ(Fund Raising) :**

క్లబ్ సేవాకార్యక్రమాల కోసంగానీ, ప్రజోపయోగకర విషయాల కోసంగాని బ్రాంచ్ క్లబ్ నిధులు వసూలు చేయవచ్చు.

ఆ మొత్తాన్ని ఇదే సేవాకార్యక్రమం కోసం ఒక నిధిగా ఏర్పరచి, అదే ప్రయోజనం కోసం వినియోగించే విధంగా వుండాలి.

బ్రాంచ్‌క్లబ్ కో ఆర్డినేటర్ చెక్కులు, ఓచర్లమీద సహ సంతకం చేసే విధంగా, పేరెంట్‌క్లబ్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ ఆమోదించిన ఖర్చులకు మాత్రమే చెల్లింపు చేసే విధంగా ఆ నిధిని వినియోగించవలసి వుంటుంది.

**4వ విభాగం : బ్రాంచి క్లబ్ రద్దు (Dissolution)**

పేరెంట్ క్లబ్ బోర్డు సభ్యులలో రెండింట మూడు వంతులు మంది ఆమోదిస్తే బ్రాంచ్‌క్లబ్ రద్దుఅయిపోతుంది.

### ఆర్టికల్ VI
### క్లబ్ ఆఫీసర్లు
### (Officers)

**1వ విభాగం : ఆఫీసర్లు (Officers)**

ప్రెసిడెంట్, ఇమీడియేట్ పాస్ట్ ప్రెసిడెంట్, వైస్ ప్రెసిడెంట్స్, సెక్రటరీ, ట్రెజరర్, లయన్ టేమర్ (ఐచ్ఛికం) టెయిల్ ట్విస్టర్ (ఐచ్ఛికం) మెంబర్‌షిప్ డైరెక్టర్, ఎన్నికైన ఇతర డైరెక్టర్లు వీళ్ళందరినీ క్లబ్ ఆఫీసర్లుగా వ్యవహరిస్తారు.

**2వ విభాగం : పదవిలోంచి తొలగించడం (Removal)**

క్లబ్ సభ్యత్వం మొత్తంలో (జనరల్ బోడీ) రెండింట మూడు వంతుల మంది సహేతుకమైన కారణంతో నిర్ణయిస్తే ఏ క్లబ్ ఆఫీసర్ నైనా, ఆ ఆఫీసులోంచి తొలగించవచ్చు.

### ఆర్టికల్ VII
### కార్యవర్గం
### (Board of Directors)

**1వ విభాగం : కార్యవర్గ సభ్యులు (Members)**

క్లబ్ ప్రెసిడెంట్, ఇమీడియేట్ పాస్ట్ ప్రెసిడెంట్, ఉపాధ్యక్షులు, సెక్రటరీ, ట్రెజరర్, లయన్ టేమర్ (ఐచ్ఛికం), టెయిల్ ట్విస్టర్ (ఐచ్ఛికం), మెంబర్‌షిప్ డైరెక్టర్, బ్రాంచి కో ఆర్డినేటర్ (బ్రాంచి వున్నట్లయితే) ఎన్నికయిన ఇతర డైరెక్టర్లు.

**2వ విభాగం : కనీస హాజరు (Quorum) :**

మెజారిటీ బోర్డు సభ్యుల హాజరు బోర్డు సమావేశాలకు కోరమ్‌గా వుంటుంది. హాజరైన సభ్యులలో మెజారిటీ సభ్యులు తీసుకునే నిర్ణయాలు ఆమోదం పొందుతాయి. ప్రత్యేకించిన అంశాలు తప్ప మిగిలిన అంశాలు మెజారిటీ సభ్యుల ఆమోదం సరిపోతుంది.

**3వ విభాగం : విధులు, అధికారాలు (Duties & Powers) :**

బోర్డు సభ్యుల విధులు అధికారాలు ఈ రాజ్యాంగంలో సూచించడం జరిగింది. అవి గాక అదనంగా ఈ క్రింది బాధ్యతలుంటాయి.

a) ఇది క్లబ్ ఎగ్జిక్యూటివ్ బోర్డ్ (కార్యవర్గం). క్లబ్ ఆఫీసర్లు ఆమోదించిన పోలసీలను ఆచరణలో పెట్టడం (Execution) దీని బాధ్యత.

క్లబ్ కొత్తగా తీసుకునే నిర్ణయాలు, కొత్త పోలసీలు, విధాన నిర్ణయాలు ముందుగా రూపొందించబడి, పరిశీలించబడి, బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ ఆమోదం పొందిన తర్వాతే క్లబ్ రెగ్యులర్ సమావేశంలో గాని, ఆ ప్రయోజనం కోసం ఏర్పరచిన ప్రత్యేక సమావేశంలో గాని సభ్యుల ఆమోదానికి ప్రతిపాదించడం జరుగుతుంది.

b) క్లబ్ కార్యక్రమాల నిమిత్తం ఖర్చు చేయవలసిన ప్రతి అంశం బోర్డు ఆమోదం పొందిననదై వుండాలి. సేకరించిన లేక వసూలు చేసిన సొమ్ముకు మించి ఖర్చుచేసి, క్లబ్‌కు అప్పు చూపించడం ఎట్టి పరిస్థితుల్లోనూ జరగకూడదు. క్లబ్ సభ్యులు ఆమోదించిన పాలసీకి సంబంధం లేని అంశాలకు క్లబ్ నిధులను మళ్ళించడం కూడా జరగకూడదు.

**c)** క్లబ్ ఆఫీసర్ తీసుకున్న ఏ నిర్ణయాన్నయినా మార్పు చేయడానికి గానీ, ఉపసంహరించ డానికి గానీ, తిరస్కరించడానికి గానీ బోర్డుకు అధికారం వుంది.

**d)** ఆడిట్ చేసిన అక్కౌంట్‌లు, జమా ఖర్చుల పుస్తకాలూ ప్రతి సంవత్సరం బోర్డు ఆమోదానికి అందచేయవలసి వుంటుంది. బోర్డు ఎప్పుడు కోరితే అప్పుడు అక్కౌంట్‌లు అప్పచెప్పగలగాలి.

క్లబ్‌లో ఏ ఆఫీసర్ గానీ, కమిటీ గానీ సభ్యుడు గానీ క్లబ్ ఫండ్‌ను వినియోగించినప్పుడు దాని జమాఖర్చుల్ని బోర్డుకు తెలియజేయవలసి వుంటుంది. అవసరం అయితే ఆడిట్ కూడా చేయించవలసి వుంటుంది.

క్లబ్‌లో అన్ని బకాయిలు చెల్లించి గుడ్‌స్టాండింగ్‌లో వున్న ఏ సభ్యుడయినా ఈ జమాఖర్చుల వివరాల్ని పరిశీలించవచ్చు. ఈ మేరకు ఆ సభ్యుడు కోరిన పక్షంలో అందుబాటులో వున్న సమయంలో, స్థలంలో అక్కౌంట్లను పరీక్షించే అవకాశం ఆ సభ్యుడి కివ్వవలసి వుంటుంది.

**e)** క్లబ్ నిధుల్ని, రుసుముల్ని ఫైనాన్స్ కమిటీ సూచన మేరకు ఏ బ్యాంక్‌లో గానీ, బ్యాంక్‌లలో గానీ అక్కౌంట్‌లు తెరిచి సొమ్ము జమచేయాలో బోర్డు నిర్ణయిస్తుంది.

**f)** ఏ క్లబ్ ఆఫీసర్ నుంచైనా ష్యూరిటీ మొత్తాన్ని నిర్ణయించే అధికారం బోర్డుకుంది.

**g)** ఒక సేవా కార్యక్రమం పేరుతోగానీ, ఆ సేవా కార్యక్రమం నిర్వహించడం ద్వారా గానీ, ప్రజల నుంచి వసూలు చేసిన లేక సేకరించిన సొమ్ముని క్లబ్ పాలనాపరమైన ఖర్చులకు వాడేందుకు అనుమతించడం గాని, అధికారం ఇవ్వడం గానీ బోర్డు చెయ్యకూడదు.

**h)** కొత్త కార్యక్రమాలు చేపట్టేప్పుడు గానీ, కొత్త పోలసీని నిర్ణయించుకునేప్పుడు గాని, వాటి విషయాల్ని పరిశీలించి బోర్డుకు సూచించ వలసిందిగా ఒక స్టాండింగ్ కమిటీ లేక, స్పెషల్ క్లబ్ కమిటీని నియమించవచ్చు.

**i)** డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ కన్వెన్షన్లకు క్లబ్ సభ్యులలోంచి ప్రతినిధుల్ని (Delegates) ప్రత్యామ్నాయ ప్రతినిధుల్ని (Alternative Delegates) పేర్లు సూచించి నియమించే అధికారం బోర్డుకుంది. అయితే, జనరల్ బోడీ నిర్ణయానికి లోబడినదిగా వుంటుంది.

**j)** కనీసం 2 (రెండు) విడివిడి అక్కౌంట్‌లు సభ్యుల ఆమోదంతో నిర్వహించవలసి వుంటుంది. మొదటి అక్కౌంట్ : పాలనాపరమైన ఖర్చులకు (Administrative) సంబంధించిన సభ్యత్వ రుసుము, టెయిల్ ట్విస్టర్ వసూళ్ళు, క్లబ్‌లో సభ్యుల నుంచి వసూలు చేసే ఇతర సొమ్ములు ఈ అక్కౌంట్‌లోకి వస్తాయి.

రెండవ అక్కౌంట్ : క్లబ్ సేవా కార్యక్రమాలు ప్రజా సంక్షేమ పరమైన కార్యక్రమాల నిమిత్తం సభ్యుల నుంచీ, ప్రజల నుంచీ, ఇతరుల నుంచీ సేకరించిన నిధులు ఈ అక్కౌంట్‌లోకి వస్తాయి.

ఈ రెండవ అక్కౌంట్‌లో నిధుల్ని 'g' విభాగంలో సూచించినట్లుగా ఖచ్చితంగా ఏ ప్రయోజనార్థం సేకరించారో ఆ ప్రయోజనం కోసమే ఖర్చు చేయాల్సి వుంటుంది!

## ఆర్టికల్ VIII
## కన్వెన్షన్లకు ప్రతినిధులు
## (DELEGATES TO INTERNATIONAL, DISTRICT MULTIPLE DISTIRCT CONVENTIONS)

**1వ విభాగం : ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌కు ప్రతినిధుల సంఖ్యా నిర్ణయం (Delegate Entitlement to International Convention) :**

లయన్స్ అంతర్జాతీయ సంస్థ పనితీరు యావత్తూ లయన్స్ ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లలో తీసుకునే నిర్ణయాలమీదే ఆధారపడి వుంటుంది.

అసోసియేషన్‌కు సంబంధించిన విషయాలలో అక్కడ ఈ క్లబ్ అభిప్రాయాన్ని వ్యక్తపరిచే అవకాశం ఈ ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌కు హాజరు ద్వారా లభిస్తుంది.

అందుకే, క్లబ్ తరఫున ప్రతినిధుల్ని ఎంపికచేసి ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌కు పంపేందుకు అవసరమైతే వారి ఖర్చుల్ని క్లబ్ తరఫున భరించేందుకు క్లబ్‌కు అధికారం వుంది.

కన్వెన్షన్ జరిగే నెల ఒకటవ తేదీ నాటికి ఇంటర్నేషనల్ రికార్డ్‌లో క్లబ్ సభ్యులు ఎంతమంది వున్నారో అంతమందికీ పాతిక మందికి ఒక్కరు, మరియు మిగిలిన శేషంలో సగం కన్నా ఎక్కువ మంది వుంటే ఒక్కొక్క డెలిగేట్ చొప్పున లెక్కించి ప్రతినిధుల సంఖ్యను నిర్ణయిస్తారు.

అదే దామాషాలో, ప్రత్యామ్నాయ ప్రతినిధుల సంఖ్యను కూడా నిర్ణయిస్తారు. శేషంగా మిగిలిన సభ్యులు 13 మంది కన్నా ఎక్కువగా వుంటే ఒక ప్రతినిధిని, ఒక ప్రత్యామ్నాయ ప్రతినిధిని అదనంగా పంపవచ్చు. (ఉదాహరణకు 38 మంది సభ్యులున్న క్లబ్‌కు ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లో రెండు ఓట్లు వుంటాయి)

ప్రతినిధి (డెలిగేట్) / ప్రత్యామ్నాయ ప్రతినిధి (ఆల్టర్‌నేట్ డెలిగేట్) పేర్లను క్లబ్ ప్రెసిడెంట్ గానీ, సెక్రటరీ గానీ, అధీకృత క్లబ్ ఆఫీసర్ గానీ, వీరెవరూ కన్‌వెన్షన్‌లో లేనప్పుడు అక్కడ వున్న జిల్లా గవర్నర్ గానీ, జిల్లా గవర్నర్ (ఎలెక్ట్) గానీ సంతకం చేసి అందించవలసి వుంటుంది.

**2వ విభాగం : ప్రతినిధుల ఎంపిక : డిస్ట్రిక్ట్ / మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కన్వెన్షన్ (Delegate Entitlement District / Multiple Dist., Convention)**

జిల్లాకు సంబంధించిన అనేక విషయాలు జిల్లా కన్‌వెన్షన్‌లో గానీ, మల్టిపుల్ జిల్లా కన్‌వెన్షన్‌లో గానీ చర్చించబడతాయి.

ఈ లయన్స్ క్లబ్ తన పూర్తి కోటా ప్రతినిధుల్ని, ప్రత్యామ్నాయ ప్రతినిధుల్ని ఈ రెండు కన్‌వెన్షన్‌లకూ పంపించవలసి వుంటుంది. అందుకోసం ఈ ప్రతినిధుల ఖర్చుల్ని భరించే అధికారం క్లబ్‌కుంది.

ప్రతి 10 మంది క్లబ్ సభ్యులకూ ఒక ప్రతినిధిని (Delegate) ఒక ప్రత్యామ్నాయ ప్రతినిధిని (Alternate Delegate) పంపించవచ్చు.

క్లబ్‌లో చేరి ఒక సంవత్సరం ఒక రోజు పూర్తి చేసుకున్న సభ్యుల సంఖ్యని బట్టి ఈ పదిమందికి ఒకరు చొప్పున కోటా వుంటుంది. శేషంగా వున్న సభ్యులు 5 మందికన్నా ఎక్కువ వుంటే ఒక ఓటు అదనంగా వస్తుంది.

కన్వెన్షన్ నెలకు ముందు నెల మొదటి తేదీ నాటికి ఇంటర్నేషనల్ రికార్డ్సులో ఈ క్లబ్‌లో ఎంతమంది 1 సంవత్సరం పైబడిన కాలపరిమితిని పూర్తి చేసుకున్నవారు సభ్యులుగా రిపోర్ట్ అయివున్నారో ఆ సంఖ్యని బట్టి ఈ డెలిగేట్ కోటాని నిర్ణయిస్తారు. డెలిగేట్‌గా సర్టిఫై అయిన వ్యక్తులు కన్‌వెన్షన్‌కు హాజరై ప్రతి ఎన్నికకూ అలాగే ప్రతి తీర్మానానికీ తన ఇచ్ఛానుసారం ఒక్కొక్క ఓటు వేయవచ్చు.

## ఆర్టికల్ IX
## వివాద తీర్మానం
## (Dispute Resolution)

క్లబ్ సభ్యుడు, లేదా సభ్యులతో గాని, పూర్వపు సభ్యుడు లేదా సభ్యులతో గానీ క్లబ్‌కు ఏర్పడే వివాదాల్ని లేదా, క్లబ్ ఆఫీసర్‌తో ఏర్పడే వివాదాల్ని - అవి క్లబ్ సభ్వత్వానికి సంబంధించిన అంశాలు కావచ్చు, రాజ్యాంగ అతిక్రమణ, రాజ్యాంగాన్ని అన్వయించుకునే విషయాలు కావచ్చు - సంతృప్తికరమైన నిర్ణయాలు తీసుకొన్నట్లు అన్పించకపోతే - ఈ వివాద తీర్మాన మార్గం అలాంటి వివాదాల్ని పరిష్కరిస్తుంది.

ఈ వివాదానికి సంబంధించి లిఖిత పూర్వకంగా జిల్లా గవర్నర్‌ను వివాదాన్ని తీర్మానించ వలసిందిగా ఏ సభ్యుడైనా కోరవచ్చు. ఈ విజ్ఞాపన అందిన 15 రోజుల లోగా డిస్ట్రిక్ట్ గవర్నర్ ఒక పరిష్కర్త (కన్సీలియేటర్) ను నియమించి వివాదాన్ని పరిష్కరించ వలసిందిగా కోరతారు.

ఆ పరిష్కర్త ఈ వివాదానికి సంబంధంలేని క్లబ్‌కు చెందినవారై, వివాదంతో ఎటువంటి సంబంధమూ లేనివారై, వారి హోమ్ క్లబ్‌లు, వారు కూడా గుడ్ స్టాండింగ్‌లో వుండి వుండాలి. నియామకం జరిగిన 30 రోజుల లోగా వివాదానికి సంబంధించిన పత్రాలన్నింటినీ సమావేశపరిచి సర్వామోదయోగ్యమైన పరిష్కారానికి కృషి చేస్తారు. అలాంటి పరిష్కారం కుదరని పక్షంలో తన తీర్పును స్వతంత్రంగా ప్రకటిస్తారు. పరిష్కర్త తీర్పుకు అందరూ బద్ధులై వుండాలి.

### ఆర్టికల్ X
### సవరణలు
### (Amendments)

**1వ విభాగం : సవరణ విధానం (Amending Procedure) :**

ఈ రాజ్యాంగాన్ని కోరమ్ కలిగిన ఏ రెగ్యులర్ సమావేశంలో గానీ, ప్రత్యేక సమావేశంలో గానీ సవరించవచ్చు. మూడింట రెండు ($\frac{2}{3}$) వంతుల మంది హాజరైన సభ్యులు స్పష్టంగా అందుకు అనుకూలంగా ఓటు చేయవలసి వుంటుంది. ఈ సవరణ సాధారణ సమావేశంలో చర్చకు రావడానికి ముందుగా బోర్డు ఈ సవరణని పరిశీలించి వుండాలి.

**2వ విభాగం : నోటీసు (Notice) :** ఈ సవరణ అంశాన్ని ఓటింగ్‌కు పెడుతున్నట్లు ఎజెండాలో స్పష్టంగా పేర్కొంటూ 14 స్పష్టమైన రోజులకు ముందే నోటీస్ పంపి, ఓటింగ్ జరిపితే గానీ రాజ్యాంగానికి ఏ సవరణనూ చేయడానికి వీలుకాదు.

# ఉపనియమావళి
# BY-LAWS
### ఆర్టికల్ - I
### క్లబ్ సభ్యత్వం (Membership)

**1వ విభాగం : సభ్యత్వంలో వివిధ రకాలు (Membership Categories)**

a) **పూర్తిస్థాయి సభ్యత్వం (Active Member) :** లయన్స్ క్లబ్ రాజ్యాంగం ద్వారా సంక్రమించిన హక్కులు, అధికారాలు అలాగే బాధ్యతలు కూడా క్లబ్‌లో యాక్టివ్ సభ్యులకు వుంటాయి.

ఈ కేటగిరీకి చెందిన సభ్యులకు క్లబ్ స్థాయిలోగాని, డిస్ట్రిక్ట్, మల్టిపుల్, ఇంటర్నేషనల్ స్థాయిలో ఏ పదవినైనా ఆయా అర్హతల అనుసారం పొందేందుకు అవకాశం వుంటుంది. ఓటింగ్‌కి అవసరమైన ప్రతి అంశంలోనూ ఓటింగ్‌లో పాల్గొనే హక్కు వీరికి వుంటుంది.

క్లబ్ సమావేశాలకు, కార్యక్రమాలకు తప్పనిసరిగా హాజరుకావడం, సభ్యత్వ రుసుములు సక్రమంగా చెల్లించడం, కార్యక్రమాలలో భాగస్వామ్యం వహించడం, సమాజంలో లయనిజం ప్రతిష్ఠను పెంపొందింప చేసేదిగా ప్రవర్తించడం... ఇవన్నీ యాక్టివ్ సభ్యుల బాధ్యతలు!

b) **దూరప్రాంతాలలో వుంటున్న సభ్యులకిచ్చే సభ్యత్వం Member-at-Large :**

ఏ సభ్యుడైనా వేరే దూరప్రాంతంలో నివాసం ఏర్పరచుకొని సభ్యత్వాన్ని ఈ క్లబ్‌లోనే కొనసాగించదలచుకున్న వారికి, ఆరోగ్య కారణాల రీత్యా గానీ, ఇతర కారణాల రీత్యా గానీ కార్యక్రమాలకు హాజరు కాలేని వ్యక్తులకు మెంబర్ ఎట్-లార్జ్ సభ్యత్వాన్ని కేటాయిస్తారు. ఎట్ లార్జ్ అంటే స్వేచ్ఛా వర్తనం. వీలు కుదిరినప్పుడు వీరు కార్యక్రమాల్లో పాల్గొంటూ వుంటారు.

ఈ సభ్యత్వాన్ని ప్రతి ఆరు నెలలకూ ఒకసారి బోర్డు సమీక్షిస్తుంది.

మెంబర్ ఎట్-లార్జ్ సభ్యత్వం పుచ్చుకున్న వ్యక్తులకు క్లబ్ స్థాయిలోగాని, పై స్థాయిలోగానీ ఏ పదవినీ పొందే అవకాశం వుండదు. అలాగే డిస్ట్రిక్ట్, మల్టిపుల్, ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లలో జరిగే ఓటింగ్‌లలో పాల్గొనే అవకాశం కూడా వుండదు. క్లబ్ విషయాలలో మాత్రం ఓటు హక్కు వుంటుంది.

సభ్యత్వ రుసుము విషయానికొచ్చే సరికి, యాక్టివ్ సభ్యుల మాదిరే డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ రుసుములన్నీ చెల్లించవలసి వుంటుంది.

c) **గౌరవ సభ్యత్వం (Honorary) :**

సమాజంలో అత్యున్నతమైన స్థాయి కలిగిన విశిష్ఠ వ్యక్తులకు, ప్రత్యేక గౌరవ సూచనగా గౌరవ సభ్యత్వం ఇస్తారు.

ఆ గౌరవ సభ్యుడి ప్రత్యేక రుసుము, డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ సభ్యత్వ రుసుములన్నీ క్లబ్ చెల్లించవలసి వుంటుంది.

గౌరవ సభ్యుడు అన్ని క్లబ్ సమావేశాలకూ కార్యక్రమాలకు హాజరవుతుంటారు, కానీ, పదవులు పొందదానికి గానీ, ఓటు చేయడానికి గాని అవకాశం వుండదు. యాక్టివ్ సభ్యత్వం కల్గిన వ్యక్తులకున్న అధికారాలు, హక్కులు ఏవీ ఈ సభ్యత్వానికి వుండవు.

d) **కార్యక్రమాలకు హాజరు కాలేని సీనియర్ సభ్యులకు అందించే సభ్యత్వం Privileged**

15 సంవత్సరాలు ఆ పైన లయనిజంలో సభ్యుడిగా కొనసాగిన వ్యక్తులు, ఆరోగ్య కారణాల రీత్యానో, ఓపికలేకపోవడానో, సమర్థనీయమైన ఇతర కారణాల రీత్యానో ఇంకా రెగ్యులర్‌గా సమావేశాలకు హాజరు కాలేమని తెల్పిన వ్యక్తులకు "ప్రివిలేజ్డ్" సభ్యత్వాన్ని క్లబ్ బోర్డు కేటాయించవచ్చు.

వీరు ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్ సభ్యత్వ రుసుములన్నీ యథావిధిగానే చెల్లించవలసి వుంటుంది.

యాక్టివ్ సభ్యులకుండే ఓటింగ్ తదితర హక్కులు అన్నీ వీరికి వుంటాయి. కానీ, ఏ పదవినీ చేపట్టడానికి అవకాశం మాత్రం వుండదు. డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లలో ఓటింగ్‌లో మాత్రం వీరు పాల్గొనవచ్చు.

e) **జీవిత సభ్యత్వం** (Life Member)

20 సంవత్సరాలు ఆపైన ఈ క్లబ్‌లో యాక్టివ్ సభ్యుడిగా కొనసాగి ఎంతో ఉన్నతమైన సేవలు క్లబ్‌కు, సమాజానికి అందించిన సభ్యులకు జీవిత సభ్యత్వాన్ని కేటాయించవచ్చు.

లేదా, తీవ్రమైన అనారోగ్య పరిస్థితి ఏర్పడిన యాక్టివ్ లయన్స్ సభ్యుడికి కూడా ఈ జీవిత సభ్యత్వం అందించవచ్చు.

లేదా, 15 సంవత్సరాలు ఆ పైన ఈ క్లబ్‌లో యాక్టివ్ సభ్యుడిగా కొనసాగి 70 ఏళ్ళ వయసు దాటిన వృద్ధులకు జీవిత సభ్యత్వం కేటాయించవచ్చు.

జీవిత సభ్యత్వం అందించే విధానం :

1) క్లబ్ ఈ మేరకు ప్రతిపాదనను ఇంటర్నేషనల్‌కు పంపుతుంది.

2) 300 అమెరికన్ డాలర్లు లేదా దానికి సమానమైన మొత్తాన్ని సభ్యుడి భావి ఇంటర్నేషనల్ రుసుము నిమిత్తం చెల్లించవలసి వుంటుంది.

3) ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ క్లబ్ పంపిన ఈ ప్రతిపాదనని ఆమోదించవలసి వుంటుంది.

జీవిత సభ్యులకు క్లబ్ / డిస్ట్రిక్ట్ మల్టిపుల్ చెల్లింపుల నిమిత్తం ప్రత్యేక రుసుము విధించే అధికారం క్లబ్‌కు వుంటుంది.

యాక్టివ్ సభ్యులకుండే అధికారాలు, హక్కులూ అన్నీ జీవిత సభ్యులకుంటాయి - బాధ్యతల్ని సక్రమంగా నెరవేర్చినంతకాలం!

జీవిత సభ్యత్వం పొందిన వ్యక్తి వేరొక లయన్స్ క్లబ్‌లో సభ్యుడిగా ట్రాన్స్‌ఫర్ పొందదలిచినప్పుడు ఆ క్లబ్‌లోనూ జీవిత సభ్యత్వమే కొనసాగుతుంది.

f) **సహచర సభ్యత్వం (Associate Member)** వేరే లయన్స్ క్లబ్‌లో ప్రాథమిక సభ్యత్వాన్ని కలిగిన యాక్టివ్ సభ్యులు, ఈ లయన్స్ క్లబ్ వున్న ప్రాంతంలో వృత్తి వ్యాపారాలు కలిగి వుండటం గానీ, నివాసం వుండటం గానీ జరిగినప్పుడు ఈ లయన్స్ క్లబ్‌కు సహచర సభ్యుడిగా అసోసియేట్ మెంబర్‌షిప్ పొందవచ్చు.

ఆ సభ్యుని ప్రాముఖ్యత రీత్యా బోర్డు సభ్యుల ఆహ్వానం మీద ఈ సభ్యత్వం ఇవ్వబడ్తుంది. ఇది సంవత్సర కాలంపాటు వుంటుంది. ప్రతి ఏడాదీ పునఃసమీక్షిస్తారు.

అసోసియేట్ మెంబర్ పేరును ఎం.ఎం. రిపోర్ట్‌లో ఇంటర్నేషనల్‌కు గానీ, డిస్ట్రిక్ట్‌కు గానీ రిపోర్ట్ చేయవలసిన అవసరం లేదు.

అసోసియేట్ సభ్యుడికి ఈ క్లబ్ సమావేశాలకు హాజరైనప్పుడు జరిగే చర్చలలో ఓటింగ్‌లో పాల్గొనే అవకాశం వుంటుంది. అయితే, ఈ క్లబ్ ద్వారా జిల్లా, మల్టిపుల్ జిల్లా, ఇంటర్నేషనల్ కన్‌వెన్షలకు డెలిగేట్‌గా హాజరయ్యే అవకాశం మాత్రం వుండదు.

అలాగే, ఈ క్లబ్ ప్రతినిధిగా జిల్లా, మల్టిపుల్ జిల్లా, ఇంటర్నేషనల్ స్థాయిలో పదవులు పొందేందుకు గానీ, కమిటీ బాధ్యతలు స్వీకరించేందుకు గానీ అవకాశం కూడా వుండదు.

ఇంటర్నేషన్ సభ్యత్వ రుసుము గానీ, డిస్ట్రిక్ట్ సభ్యత్వ రుసుము గానీ ఈ క్లబ్‌లో సభ్యత్వం వలన అదనంగా చెల్లించనవసరం లేదు.

అయితే, క్లబ్ స్థాయిలో విధించే అనేక రుసుములు క్లబ్ నిర్ణయం మేరకు అసోసియేట్ సభ్యుడు కూడా చెల్లించవలసి వుంటుంది.

g) **కార్యక్రమాలకు హాజరు కాలేని అత్యంత ప్రముఖునికిచ్చే సభ్యత్వం Affliate Member.**

సమాజంలో గుర్తింపు పొందిన ఉన్నత వ్యక్తి క్లబ్‌లో పూర్తిస్థాయి సభ్యుడిగా కొనసాగలేక పోయినా, మన కార్యక్రమాల పట్ల ఆసక్తి వున్న వారికి క్లబ్‌లో అఫిలియేట్ సభ్యత్వాన్ని కల్పించ వచ్చు.

క్లబ్ బోర్డు సభ్యులు ఈ మేరకు నిర్ణయం తీసుకొని ఈ సభ్యత్వం స్వీకరించవలసిందిగా ఆ ప్రముఖుని ఆహ్వానిస్తారు.

అఫిలియేట్ సభ్యుడు క్లబ్ వ్యవహారాలలో వ్యక్తిగతంగా హాజరై ఓటు చేయడానికి అవకాశం వుంటుంది. కానీ, క్లబ్ ప్రతినిధిగా డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌లలో ఓటు వేయడానికి మాత్రం అవకాశం వుండదు. అలాగే, క్లబ్, డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ ఇంటర్నేషనల్ స్థాయిలలో ఏ పదవినీ పొందేందుకు కూడా అవకాశం వుండదు.

అఫిలియేట్ సభ్యుడు క్లబ్ నిర్ణయించిన మేరకు అన్ని సభ్యత్వరుసుములూ చెల్లించవలసి వుంటుంది.

**2వ విభాగం : ద్వంద్వ సభ్యత్వం (Dual Membership)**

2003 డెన్వర్ కన్‌వెన్షన్‌లో ఆమోదించిన తీర్మానం మేరకు, మనవంటి ఇతర స్వచ్ఛంద సేవా సంస్థలలో ద్వంద్వ సభ్యత్వాన్ని లయనిజం అంగీకరిస్తోంది!

**3వ విభాగం : రాజీనామాలు (Resignation)**

ఏ సభ్యుడైనా ఈ లయన్స్ క్లబ్‌లోంచి రాజీనామా చేయవచ్చు. అయితే, బోర్డ్ సభ్యులు ఆ సభ్యుని రాజీనామాను ఆమోదించవలసి వుంటుంది.

ఒకవేళ ఆ సభ్యుడు ఇంకా సభ్యత్వ బకాయిలు చెల్లించవలసి వుంటే, అవి చెల్లించేవరకూ రాజీనామాను ఆమోదించకుండా నిలుపు చేసే అధికారం బోర్డుకుంది. క్లబ్‌కు సంబంధించి ఆస్తుల్ని రాజీనామా చేసిన సభ్యుడు నుంచి వెనక్కి తీసుకోవాల్సి వుంటుంది. లయన్స్ పిన్నులు, ఎంబ్లమ్ వగైరా లయనిజానికి సంబంధించిన దేనినీ ఆ వ్యక్తి ఉపయోగించుకొనే వీలుండదు.

**4వ విభాగం : తొలగించిన సభ్యుడి సభ్యత్వ పునరుద్ధరణ (Reinstatement of Membership)**

బకాయి లేకుండానే, క్లబ్‌లోంచి తప్పుకొన్న సభ్యుడు అంటే, గుడ్ స్టాండింగ్‌లో డ్రాప్ అయిన సభ్యుణ్ణి బోర్డ్ డైరెక్టర్లు తిరిగి క్లబ్‌లోకి చేర్చుకొనేందుకు అనుమతించవచ్చు.

అలా సభ్యత్వాన్ని పునరుద్ధరించుకున్న వ్యక్తికి అతని పూర్వపు సర్వీసంతా యథాతథంగా కొనసాగుతుంది.

**5వ విభాగం : సభ్యత్వం బదిలీ (Transfer Membership)**

వేరొక లయన్స్ క్లబ్‌లో సభ్యుడిగా వున్న వ్యక్తి అనేక కారణాల వలన తన సభ్యత్వాన్ని బదిలీ చేసుకోదలిచినప్పుడు, ఆ వ్యక్తికి ఈ క్లబ్‌లో ప్రవేశం కల్పించే అవకాశం వుంది.

అయితే, బదిలీ అయి వస్తున్న వ్యక్తి పూర్వపు క్లబ్‌లో అన్ని బకాయిలూ చెల్లించి గుడ్ స్టాండింగ్‌లో వుండి వుండాలి.

పూర్వపు క్లబ్‌లో ట్రాన్స్‌ఫర్ సభ్యుడిగా ఆ వ్యక్తి డ్రాప్ అయిన నెలనుంచీ, ఆరు నెలల (6) లోపు ఏదైనా మరొక క్లబ్‌లో చేరవలసి వుంటుంది.

వేరొక క్లబ్‌లో చేరబోయే ముందు ట్రాన్స్‌ఫర్ ఫారంగానీ, సభ్యత్వం కార్డుగానీ (Current Membership Card) ఆ క్లబ్‌కు అందచేయాలి. రాజ్యాంగం 2వ సెక్షన్ 3వ అర్టికల్‌లో సూచించినట్లు, వేరే క్లబ్ వారి ఆహ్వానం మేరకు మాత్రమే సభ్యుడిగా ఆ క్లబ్‌లో అంగీకరించడం జరుగుతుంది.

**6వ విభాగం : సభ్యత్వ రుసుము చెల్లించడంలో విఫలం (Failure to Pay)**

ఏ సభ్యుడైనా సభ్యత్వ రుసుము, తదితర రుసుముల్ని చెల్లించమని కోరుతూ సెక్రటరీ గారు నోటీసిచ్చిన (60) అరవై రోజులలోపు చెల్లింపులు చేయని పక్షంలో, ఆ విషయాన్ని బోర్డు దృష్టికి సెక్రటరీ తీసుకువస్తారు. ఆ వ్యక్తిని క్లబ్ సభ్యత్వంలోంచి తొలగించాలా లేక కొనసాగించాలా అనే అంశాన్ని బోర్డు పరిశీలించి నిర్ణయిస్తుంది.

**7వ విభాగం : సభ్యుల హాజరు (Attendance)**

సభ్యులు సాధారణంగా ఎక్కువమంది ఎక్కువ కార్యక్రమాలకు హాజరయ్యేలా క్లబ్ ప్రోత్సహించవలసి వుంటుంది. ఎవరైనా ఒక సభ్యుడు వరుసగా కార్యక్రమాలకు గైర్హాజరు అవుతున్నప్పుడు ఆ సభ్యుణ్ణి ప్రోత్సహించి, హాజరయ్యేలా చేసేందుకు తగిన కృషి చేయవలసి వుంటుంది.

## 2వ ఆర్టికల్
## క్లబ్ ఆఫీసర్లు
## CLUB OFFICERS

**1వ విభాగం : విధులు (Duties)**

a) **అధ్యక్షులు :** క్లబ్ పాలనాపరంగా ఉన్నత కార్యనిర్వహణాధికారిగా అధ్యక్షులు వ్యవహరిస్తారు. సాధారణ సమావేశాలకు, బోర్డు సమావేశాలకు పిలుపునిస్తారు. అధ్యక్షత వహిస్తారు.

క్లబ్ పాలనా సౌలభ్యం నిమిత్తం, కార్యక్రమాల నిర్వహణ నిమిత్తం అనేక స్టాండింగ్ కమిటీలను ఏర్పాటుచేయడం,

ఆయా కమిటీల చైర్మన్‌లతో సహకరించి, అవి సక్రమంగానూ, సమర్థవంతంగానూ పనిచేసేలా చూస్తారు.

క్లబ్ పాలక వర్గానికి ప్రతి ఏడాదీ ఎన్నికలకు పిలుపునిస్తారు. వాటి నిర్వహణ, సక్రమంగా నోటీసులు పంపడం వంటివి అమలుచేస్తారు.

జిల్లా గవర్నర్ గారి సలహామండలి (District Governor's Zone Advisory Commitiee) లో సభ్యుడిగా సహకరిస్తూ, సలహా మండలిలో ప్రధాన పాత్ర వహిస్తారు.

b) **తక్షణ పూర్వ అధ్యక్షులు**

**(Immediate Past President) :**

గత సంవత్సరం పదవీ విరమణ చేసిన క్లబ్ అధ్యక్షులు (ఇమీడియట్ పాస్ట్ ప్రెసిడెంట్) క్లబ్ పూర్వపు అధ్యక్షులతో కలిసి, సభ్యుల్ని పలకరించడం, సమావేశాలప్పుడు విచ్చేసిన అతిధులకు స్వాగత సత్కారాలు చేయడం, కొత్తసభ్యులను ఆహ్వానించే క్లబ్ ప్రయత్నాలకు చేయూత నందించడం వంటి బాధ్యతలు నిర్వహిస్తారు.

c) **ఉపాధ్యక్షులు (Vice Presidents)**

క్లబ్ అధ్యక్షులు ఏ కారణం చేతనైనా తన బాధ్యతలు నెరవేర్చలేని పరిస్థితిలో, తరువాతి వరుస క్రమంలో ఉపాధ్యక్షులు అధ్యక్షుని బాధ్యతల్ని స్వీకరించి పూర్తి స్థాయి అధికారాలతో వాటిని నిర్వహిస్తారు.

అధ్యక్షుడి పర్యవేక్షణలో ఉపాధ్యక్షులు వివిధ కమిటీల పని తీరును అజమాయిషీ చేస్తారు.

d) **కార్యదర్శి (Secretary) :** అధ్యక్షులు మరియు బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల పర్యవేక్షణలో క్లబ్ కార్యదర్శి లయన్ డిస్ట్రిక్ట్‌కూ క్లబ్‌కూ మధ్య, అలాగే క్లబ్‌కూ లయన్స్ ఇంటర్నేషనల్‌కూ మధ్య సంధానకర్తగా వ్యవహరిస్తారు.

ఇందుకోసం కార్యదర్శి తప్పనిసరిగా :

ఎం.ఎం.రిపోర్ట్‌లు, తదితర రిపోర్ట్‌లనూ, ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ నిర్ణయానుసారం రూపొందించిన ఫారాలను పూర్తిచేసి ఎప్పటికప్పుడు ఇంటర్నేషనల్ కార్యాలయానికి పంపుతూండాలి.

డిస్ట్రిక్ట్ గవర్నర్ గారి కేబినెట్‌కు కూడా. ఎంఎం రిపోర్ట్‌తో సహా అన్ని రిపోర్టులనూ, ఫారాలను పంపుతుండాలి.

డిస్ట్రిక్ గవర్నర్ గారి సలహామండలిలో (Dist. Governor's Zone Advisory Committee) కి సహకరిస్తూ, ఈ కమిటీలో ఉత్సాహవంతులైన సభ్యుడిగా వ్యవహరించాలి.

క్లబ్ సాధారణ రికార్డులన్నీ సెక్రటరీ గారి ఆధీనంలోనే వుంటాయి. సెక్రటరీయే వాటిని నిర్వహిస్తారు. క్లబ్ సమావేశాల మినిట్స్, బోర్డు సమావేశాల మినిట్స్, అటెండెన్స్ కమిటీ నియామకాలు, ఎన్నికలు, సభ్యులు వ్యక్తిగతంగా సాధించుకున్న అవార్డుల వంటి వాటి వివరాలు, సభ్యుల చిరునామాలు, టెలిఫోన్ నెంబర్లు వారి సభ్యత్వ బకాయిలు - ఈ వివరాలన్నీ సెక్రటరి గారి రికార్డులలో వుంటాయి.

క్లబ్ కోశాధికారి సహకారంతో సెక్రటరీ తయారుచేసిన త్రైమాసిక జమా ఖర్చుల స్టేట్‌మెంట్, ఆరునెలల జమాఖర్చుల స్టేట్‌మెంట్ వగైరాలను క్లబ్ బోర్డుకు సమర్పిస్తారు.

సభ్యుల నుంచి రావలసిన సభ్యత్వ బకాయిలను వసూలు చేసి ట్రెజరర్ గారి ద్వారా బ్యాంక్‌లో జమ చేయిస్తారు. ట్రెజరర్‌కు అందిన మొత్తాలకు రసీదులు ఇస్తారు.

అత్యంత విశ్వసనీయమైన రీతిలో బాధ్యతల్ని నెరవేర్చే హామీనీ, కొంత ధరావత్తునూ, క్లబ్ నిర్ణయం మేరకు బాండ్ రూపాన ఇస్తారు.

e) **కోశాధికారి (Treasurer) :**

క్లబ్ కోశాధికారి తప్పనిసరిగా :-

సెక్రటరీ నించిగానీ ఇతరుల నుంచి గానీ సొమ్మును స్వీకరించి బోర్డు సభ్యులు నిర్ణయించిన బ్యాంక్‌లో గానీ, బ్యాంక్‌లలో గాని జమచేస్తారు.

బోర్డు డైరెక్టర్లు నిర్ణయించిన ఆమోదించిన లేక అధికారం ఇచ్చిన ఖర్చులకు మాత్రమే సొమ్ము చెల్లిస్తారు. చెక్కులు ఓచర్ల మీద క్లబ్ ట్రెజరర్ తప్పనిసరిగా సంతకం చేస్తారు. బోర్డు నిర్ణయించిన ఆఫీసర్ - సహసంతకం చేస్తారు.

క్లబ్ జమాఖర్చుల రికార్డులన్నీ ట్రెజరర్ గారి ఆధీనంలో, నిర్వహణలో వుంటాయి.

నెలకొకసారి, మూడునెలలకొకసారి, ఆరునెలలకొకసారి క్లబ్ జమాఖర్చుల అక్కౌంట్‌ను ఇంటర్నేషనల్‌కు, డిస్ట్రిక్ట్ కేబినెట్‌కు, బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌కు సమర్పిస్తారు.

అత్యంత విశ్వసనీయమైన రీతిలో బాధ్యతల్ని నెరవేర్చే హామీనీ, కొంత ధరావత్తునూ, క్లబ్ నిర్ణయం మేరకు బాండ్ రూపాన ఇస్తారు.

f) **మెంబర్‌షిప్ డైరెక్టర్ (Membership Director)**

మెంబర్‌షిప్ కమిటీ చైర్‌పర్సన్‌ని 'మెంబర్‌షిప్ డైరెక్టర్' అంటారు. ఈ పదవికి సంబంధించిన బాధ్యతలు ఇవి :

క్లబ్ సభ్యత్వ అభివృద్ధి కార్యక్రమాలు గురించిన పథకాలను బోర్డ్ అనుమతి కోసం సమర్పిస్తారు.

కొత్త సభ్యుల్ని తప్పనిసరిగా క్లబ్ సమావేశాలకు తీసుకువచ్చే విధంగా ప్రోత్సహిస్తారు.

కొత్తగా సభ్యులను చేర్పించేందుకు, చేరిన సభ్యులు జారిపోకుండా వుండేందుకు తగిన సమర్థవంతమైన పద్ధతులు అమలుజరిగేలా చూస్తారు.

సభ్యులకు లయనిజం పట్ల అవగాహన కలిగే విధంగా చక్కని ఓరియెంటేషన్ కార్యక్రమాలు నిర్వహింప చేస్తారు.

సభ్యులు ఏ కారణంగా నిరుత్సాహపడి క్లబ్ లోంచి జారిపోతున్నారో గమనించి బోర్డుకు సోదాహరణంగా వివరిస్తారు.

సభ్యులు జారిపోకుండా నిలబెట్టుకునేందుకు, కొత్త వారిని ఆకట్టుకునేందుకు తగిన కార్యక్రమాలను రూపొందించడానికి ఇతర కమిటీలతో సమన్వయాన్ని నెలకొల్పుతారు.

జోన్ స్థాయిలో ఒక మెంబర్‌షిప్ కమిటీని నియమిస్తే మెంబర్‌షిప్ డైరెక్టర్ అందులో సభ్యుడుగా వుంటారు.

g) **లయన్ టేమర్ Lion Tamer (ఐచ్ఛికం) :**

క్లబ్ ఆస్తులు తదితర వస్తు సామగ్రికి బాధ్యులుగా వ్యవహరిస్తారు.

లయన్ జెండాలు, బ్యానర్లు, గోంగ్, గ్యావెల్, ప్రేయర్ ఫ్లాగ్ ఇన్వోవేషన్ వంటి వాటిని ప్రతి సమావేశానికి ముందుగా తీసుకురావడం... సమావేశం తర్వాత వాటిని నిర్దేశిత స్థలంలో భద్రపరచడం వంటి విధులు బాధ్యతాయుతంగా నెరవేరుస్తారు.

క్లబ్ సమావేశాలలో దండనాయకుడు (Sergeant-at-arms) గా వ్యవహరిస్తారు. సభ్యుల్ని, అతిధుల్ని ఎవరి నిర్దేశిత స్థలాలలో వారిని ఆశీనులు చేయడం, సమాచార పత్రాలు వగైరా అందరికీ పంపిణీ చేయడం వంటివి నిర్వహిస్తారు.

h) **టెయిల్ ట్విస్టర్ Tail Twister :(ఐచ్ఛికం)**

క్లబ్‌లో సామరస్య భావం నెలకొల్పడం టెయిల్ ట్విస్టర్ విధి. సభ్యుల మధ్య ఐక్యతా భావాన్ని పెంపొందించడం, హుషారు చేయడం, సరదాగా గడిపేలా ప్రోత్సహించడం చేస్తారు. అందుకోసం కొన్ని సరదా మార్గాలు

అనుసరిస్తారు. స్టంట్స్, గేమ్స్, చిన్న చిన్న ఫైన్‌లు వేయడం వంటి ఎత్తుగడల్ని అవలంభిస్తారు.

టెయిల్ ట్విస్టర్ ఫైన్‌లు వేసినప్పుడు వాటిని రద్దుచేస్తూ తీర్పులు చెప్పకూడదు. అయితే, టెయిల్ ట్విస్టర్ ఫైన్‌లు బోర్డు ముందుగా నిర్ణయించినంతకు మించకుండా వుండాలి. ఒక సమావేశంలో ఒక సభ్యుడికి రెండుకన్న ఎక్కువ సార్లు ఫైన్ విధించడం కూడా చెయ్యకూడదు.

సభలో వున్న సభ్యులంతా కలిసి ఏకాభిప్రాయంతో టెయిల్ ట్విస్టర్‌కు ఫైన్ విధించవచ్చు. టెయిల్ ట్విస్టర్ విధించిన ఫైన్‌ల మొత్తాన్ని క్లబ్ ట్రెజరర్‌కు అందించి ఆ మేరకు రసీదు పొందవలసి వుంటుంది.

**2వ విభాగం : పదవులు పొందేందుకు అర్హత (Eligibility for Office ) :** ఈ క్లబ్‌లో పూర్తిస్థాయి సభ్యత్వం (Active Membership) కలిగి ఏ బకాయిలు లేకుండా Good Standingలో వున్న వ్యక్తులకు మాత్రమే ఏ పదవులైనా పొందేందుకు అర్హత వుంటుంది.

**3వ విభాగం : ప్రయాసకు తగిన పరిహారం (Compensation)**

లయనిజంలో ఏ పదవీ బాధ్యతల్ని నెరవేరుస్తున్న వ్యక్తికైనా పనిచేసినందుకు తగిన ప్రతిఫలం గానీ, పరిహారం గానీ ఇచ్చే అవకాశం లేదు. ఒక్క సెక్రటరీ విషయంలో మాత్రం బోర్డు సభ్యుల నిర్ణయం మేరకు కొంత ప్రతిఫలం కేటాయించవచ్చు.

## 3వ ఆర్టికల్

## సమావేశాలు, కనీసపు హాజరు

## (MEETINGS AND QUORUM REQUIREMENTS)

**1వ విభాగం : సాధారణ సమావేశాలు (Regular Meetings)**

బోర్డు డైరెక్టర్లు నిర్ణయించిన మేరకు, నిర్ణయించిన స్థలాలలో, సమయాలలో సాధారణ సమావేశాలు జరుగుతుంటాయి. ఎన్ని రోజులకు ఒకసారి జరపాలనేది కూడా బోర్డు నిర్ణయించిన మేరకు జరుగుతుంది.

అన్ని సమావేశాలు సమయానికి మొదలై సరిగ్గా సమయానికి పూర్తి కావాల్సి వుంటుంది.

ఈ రాజ్యాంగం, ఉపనియమావళిలో ప్రత్యేకంగా చెప్పబడిన అంశాలు మినహా, తక్కిన అన్ని సమావేశాలకూ, మీటింగ్ నోటీసులు పంపవలసిన విధానం క్లబ్ బోర్డు సభ్యులు చేసిన నిర్ణయం మేరకు జరుగుతుంది.

**2వ విభాగం : ప్రత్యేక సమావేశాలు (Special Meetings)**

క్లబ్ అధ్యక్షులు తన అధికారాల రీత్యా ప్రత్యేక సమావేశాలు ఎప్పుడు అవసరం అని భావిస్తే అప్పుడు ఏర్పాటు చేయవచ్చు.

లేదా బోర్డు సభ్యుల కోరిక మీద కూడా ప్రత్యేక సమావేశాలను ఏర్పాటు చేయవచ్చు.

ప్రత్యేక సమావేశాన్ని కోరిన వ్యక్తుల అభీష్టం మేరకు ఆ ప్రయోజనం కోసం, నిర్ణీత సమయంలో, నిర్ణీత స్థలంలో ఆ సమావేశాలు జరుగుతాయి. ఈ సమావేశాల నోటీసును (10) పది రోజుల ముందుగా సభ్యులందరికీ అందేలా పంపవలసి వుంటుంది.

**3వ విభాగం : వార్షికోత్సవం (Charter Anniversary) :**

దీన్ని 'Charter Night' అని వ్యవహరిస్తుంటాం. క్లబ్ వార్షికోత్సవం అనేది ఏడాదికొకసారి లయనిజం ఆశయాలనూ, నైతిక నియమావళినీ, క్లబ్ సాధించిన ఘన చరిత్రనూ స్మరించుకొంటూ క్లబ్ పట్ల ప్రత్యేక అంకితభావం, శ్రద్ధ పెంపొందింప చేసుకోవడానికి ఉద్దేశించిన కార్యక్రమం ఇది.

**4వ విభాగం : వార్షిక సమావేశం**
**(Annual Meeting) :**

లయనిస్టిక్ సంవత్సరం ముగింపు సమయంలో బోర్డు డైరెక్టర్ల నిర్ణయం మేరకు వార్షిక సమావేశం జరుగుతుంది.

కొత్త కార్యవర్గం ప్రమాణ స్వీకారం (Installation) చేయడం, పదవీ విరమణ చేస్తున్న కార్యవర్గం నెరవేర్చిన కార్యక్రమాల సమీక్ష (Report) ను అందించడం వంటివి ఈ వార్షిక సమావేశాలలో జరుగుతాయి.

**5వ విభాగం : కనీస హాజరు (Quorum)**

క్లబ్ సభ్యులలో మెజారిటీ (అంటే సగం కన్నా ఎక్కువ మంది) హాజరు కావడం క్లబ్ సమావేశాలకు కోరమ్‌గా నిర్ణయించబడింది.

ప్రత్యేకంగా చెప్పబడిన అంశాలకు తప్ప తక్కిన అంశాలలో మెజారిటీ సభ్యులు తీసుకున్న నిర్ణయమే క్లబ్ నిర్ణయంగా భావించబడ్తుంది.

**6వ విభాగం : సభ్యత్వంలో శ్రేష్ఠత్వం**
**(Good Standing)**

క్లబ్ సెక్రటరీ నోటీసు పంపిన (60) అరవై రోజుల వరకూ క్లబ్‌కు చెల్లించవలసిన బకాయిలు చెల్లించకుండా వున్న సభ్యుడు క్లబ్ సభ్యత్వంలో శ్రేష్ఠత్వాన్ని (Good standing) కోల్పోతాడు. ఆ బకాయిలు పూర్తిగా చెల్లించే వరకూ కూడా శ్రేష్ఠత్వం లేని స్థితిలోనే ఆ సభ్యుని సభ్యత్వం కొనసాగుతుంది. సభ్యత్వంలో శ్రేష్ఠత (Good Standing) వున్న వారికి మాత్రమే ఓటింగ్ అర్హత గానీ, పదవులు పొందే అర్హత గానీ వుంటాయి.

**7వ విభాగం : బోర్డు ఆఫ్ డైరెక్టర్ల సాధారణ సమావేశాలు**
**(Board of Directors Regular Meetings)**

బోర్డ్ ఆఫ్ డైరెక్టర్‌లు నెలకొకసారి తప్పనిసరిగా జరుపుకునే సాధారణ సమావేశాలు బోర్డు నిర్ణయించిన మేరకు నిర్ణయించిన చోట్ల నిర్ణయించిన సమయాలలో జరుగుతాయి.

**8వ విభాగం : బోర్డు ఆఫ్ డైరెక్టర్ల ప్రత్యేక సమావేశాలు**
**(Board of Directors, Special Meetings)**

ప్రత్యేకంగా జరిగే బోర్డు సమావేశాలు క్లబ్ అధ్యక్షులు అవసరం అని భావించి ఏర్పాటుచేసినప్పుడు గానీ లేదా, ముగ్గురు కన్నా ఎక్కువ మంది బోర్డు సభ్యులు ప్రత్యేక సమావేశాన్ని కోరినప్పుడు గానీ, అధ్యక్షులు నిర్ణయించిన సమయంలో, స్థలంలో జరుగుతాయి.

## ఆర్టికల్ IV
## ఎన్నికలు, ఖాళీలు, భర్తీలు
## ELECTIONS AND FILLING VACANCIES

తక్షణ పూర్వ అధ్యక్షులు తప్ప మిగిలిన లయన్స్ క్లబ్ ఆఫీసర్లకి ఈ క్రింది విధంగా ఎన్నికలు జరుగుతాయి.

**1వ విభాగం : నియామక సమావేశం :**
**Nomination Meeting**

ప్రతి సంవత్సరం మార్చి నెలలో క్లబ్ ఆఫీసర్ల నియామక సమావేశం (Nomination Meeting) జరుగుతుంది. బోర్డు డైరెక్టర్లు ఈ సమావేశ తేదీని, సమయాన్ని, స్థలాన్ని నిర్ణయిస్తారు.

ప్రతి సభ్యుడికి ఈ సమావేశం నోటీసును కనీసం 14 స్పష్టమైన రోజులు ముందుగా పంపవలసి వుంటుంది.

**2వ విభాగం : నియామక కమిటీ :**
**(Nominating Committee)**

క్లబ్ అధ్యక్షులు నామినేటింగ్ కమిటీని ఏర్పాటు చేస్తారు. ఈ కమిటీ నియామక సమావేశంలో వివిధ క్లబ్ ఆఫీసర్ల పదవులకు తగిన పేర్లను సూచిస్తుంది.

ఇదే సమావేశంలో ఎవరైనా సభ్యుడు ఏదైనా పదవికి పోటీ చేయదలచినప్పుడు సభలోంచి నామినేషన్ వేసేందుకు అవకాశం వుంటుంది. ఎన్నికల సమావేశంలో ఆ పదవికి ఎన్నికలు జరుగుతాయి.

**3వ విభాగం : నియమించిన వ్యక్తి కొనసాగలేనప్పుడు**

**(Nominee Unable to serve)**

నియామక సమావేశానికీ, ఎన్నికల సమావేశానికి మధ్య సమయంలో ఏ పదవికి నియమితుడైన వ్యక్తి అయినాసరే, తాను ఆ పదవి చేపట్టలేనని భావించినప్పుడు, ఆ పదవికి వేరెవరూ పోటీకి నామినేషన్ వేసివుండని పక్షంలో, వేరొక అభ్యర్థిని నియామక కమిటీ ఎంపికచేసి, ఎన్నికల సమావేశంలో ఆ పేరును ప్రకటిస్తుంది!

**4వ విభాగం : ఎన్నికల సమావేశం**

**(Election Meeting)**

ఎన్నికల సమావేశం ప్రతి సంవత్సరం ఏప్రియల్ 15లోపు జరపవలసి వుంటుంది.

దాన్ని జరిపే తేదీ, సమయం, స్థలం అన్నీ బోర్డు నిర్ణయిస్తుంది.

కనీసం 14 స్పష్టమైన రోజుల కన్న ముందుగా నోటీసును సెక్రటరీ ద్వారా ప్రతి సభ్యుడికీ పంపవలసి వుంటుంది. పోస్ట్ ద్వారా పంపవచ్చు. లేదా స్వయంగానైనా ఇవ్వవచ్చు.

వివిధ పదవులలో ఒకవేళ దేనికైనా పోటీ జరిగితే, పోటీ పడిన అభ్యర్థి పేరుతో సహా వివరాలన్నీ ఎన్నికల సమావేశం నోటీసులో విధిగా వుండాలి. పైన చెప్పిన 3వ విభాగాన్ని కూడా దృష్టిలో పెట్టుకొంటూ, ఈ నోటీసులో పేర్కొన్న అభ్యర్థులందరూ ఎన్నికల సమావేశంలో ఓటు చేయబడతారని స్పష్టంగా తెలియజేయాలి!

ఎన్నికల సమావేశంలో ఇంకా కొత్తగా పోటీకి తలపడే నామినేషన్లంటూ ఏమీ వుండకూడదు.

**5వ విభాగం : వార్షిక ఎన్నికలు :**

ఈ ఆర్టికల్‌లోని 8వ విభాగంలో వివరించబోతున్న విధంగా, 2వ సంవత్సరం డైరెక్టర్లు తప్ప తక్కిన అందరూ ఎప్పటికప్పుడు ప్రతి సంవత్సరం ఈ విధంగా ఎన్నిక కావలసిందే!

జులై 1 నుంచి అధికార బాధ్యతలను స్వీకరించి ఒక సంవత్సరం పాటు అధికారంలో కొనసాగుతారు. లేదా తరువాతి సంవత్సరం ఆఫీసర్లు ఎన్నికయ్యే వరకూ కొనసాగుతారు.

**6వ విభాగం : సభ్యత్వసంఘం**

**(Membership Committee)**

మెంబర్‌షిప్ కమిటీలో ముగ్గురు ఎన్నికైన సభ్యులు 3 సంవత్సరాల కాలానికి పనిచేస్తారు.

మొదటి సంవత్సరం ఈ ముగ్గురు సభ్యుల ఎన్నిక ఇలా జరుగుతుంది :-

ఒక సభ్యుడు (1) ఒక సంవత్సరం, రెండవసభ్యుడు (2) రెండు సంవత్సరాలు, మూడవ సభ్యుడు (3) మూడు సంవత్సరాలు సభ్యులుగా కొనసాగేందుకు ఎన్నికౌతారు.

అక్కణ్ణించి, ప్రతి సంవత్సరం మూడు సంవత్సరాల సభ్యుడికి ఎన్నిక జరుగుతుంది.

ఈ విధంగా ప్రతి సభ్యుడూ రొటేషన్ పద్ధతిలో మూడేళ్ళ మెంబర్‌షిప్ కమిటీలో పనిచేస్తారు. మూడు సంవత్సరాలు సభ్యుడిగా కొనసాగే వ్యక్తిని మొదటి సంవత్సరం (First Year) సభ్యుడు అంటారు. ఈయన మెంబర్‌షిప్ కమిటీలో సభ్యుడుగా వుంటారు.

రెండు సంవత్సరాలు వుండే సభ్యుణ్ణి సెకండ్ ఇయర్ సభ్యుడు అంటారు. ఈయన వైస్‌ఛైర్మన్‌గా వుంటాడు.

1 సంవత్సరం వుండే సభ్యుణ్ణి థర్డ్ ఇయర్ సభ్యుడు అంటారు. ఈ సభ్యుడు మెంబర్‌షిప్ కమిటీ ఛైర్‌పర్సన్‌గా వుంటాడు. ఈయనే మెంబర్‌షిప్/డైరెక్టర్‌గా క్లబ్ బోర్డులో కొనసాగుతారు.

మూడు సంవత్సరాల పాటు మెంబర్‌షిప్ కమిటీలో వుండే ఫస్ట్ ఇయర్ మెంబర్‌కు క్లబ్ సభ్యత్వ అభివృద్ధి బాధ్యతలు అప్పగించారు.

రెండవ సంవత్సరం సభ్యునికి క్లబ్‌లో సభ్యులు జారిపోకుండా చూసే బాధ్యత (రిటెన్షన్) అప్పగించారు. క్లబ్ సభ్యులలో నాయకత్వ లక్షణాలను పెంపొందించే కార్యక్రమాల బాధ్యత కూడా ఈయనకే అప్పగించారు.

మూడవ సంవత్సరం సభ్యుడు మెంబర్‌షిప్ డైరెక్టర్ అయిన వ్యక్తికి కొత్త క్లబ్‌ల వ్యవస్థాపనా బాధ్యతలు (Extention) అప్పగించారు.

**వివరణ :** కొత్త సభ్యులను చేర్పించడం, (Recruting of New Members) చేరిన వారు జారిపోకుండా చూడడం (Retentiion), కొత్త క్లబ్‌ల వ్యవస్థాపన (Extension) అనే మూడు అంశాలనూ మెంబర్‌షిప్ కార్యక్రమంలో భాగంగా చేసి, ముగ్గురు సభ్యుల మెంబర్‌షిప్ కమిటీలో ముగ్గురికీ ఈ విధంగా మూడు బాధ్యతలూ అప్పగించడం జరిగింది.

**7వ విభాగం : డైరెక్టర్ల ఎన్నిక :**

డైరెక్టర్లలో సగం మంది ప్రతి సంవత్సరం జరిగే ఎన్నికల్లో ఇతర ఆఫీసర్లతో పాటు ఎన్నికై వారితో పాటే జులై 1నుంచి పదవిలోకి వచ్చి, ఆ పదవిలో 2 సంవత్సరాల పాటు కొనసాగుతారు. మరుసటి సంవత్సరం మరో సగం మంది రెండు సంవత్సరాల కాలానికి ఎన్నికైనప్పుడు, వీరు ఒక సంవత్సరం డైరెక్టర్స్ అవుతారు.

క్లబ్ ప్రారంభ సమయంలో మాత్రం సగం మంది డైరెక్టర్లను రెండు సంవత్సరాల కాలానికి, సగం మంది డైరెక్టర్లను ఒక సంవత్సర కాలానికి ఎన్నుకొంటారు.

**వివరణ :** రెండు సంవత్సరాల కాలానికి ఎన్నికైన డైరెక్టర్లని ఫస్ట్ ఇయర్ డైరెక్టర్స్ అనీ, ఒక సంవత్సర కాలానికి ఎన్నికై డైరెక్టర్లని సెకండ్ ఇయర్ డైరెక్టర్స్ అనీ పిలుస్తారు.

**8వ విభాగం : ఓటు వేసే విధానం (Ballot)**

ఎన్నికలు బ్యాలెట్ విధానంలో జరుగుతాయి. ఓటు వేసే అర్హత కల్గిన హాజరైన సభ్యులు ఓటింగ్‌లో పాల్గొంటారు. అనేకమంది ఒకే పదవికి పోటీ చేసినప్పుడు అత్యధిక ఓట్లు పొందిన వ్యక్తి గెలుపొందినట్లు ప్రకటించబడతారు. దీన్ని Plurality of vote అంటారు.

**9వ విభాగం : పదవి ఖాళీ అయినప్పుడు (Vacancy) :**

క్లబ్ ప్రెసిడెంట్ పదవి గానీ, వైస్ ప్రెసిడెంట్ పదవి గానీ ఏ కారణం చేతనైనా ఖాళీ అయినప్పుడు ఉపాధ్యక్షులు తమ ర్యాంక్ ననుసరించి ఆ పదవులలో ఏర్పడిన ఖాళీల్ని భర్తీ చేస్తారు.

ఒకవేళ ఏ ఉపాధ్యక్షులూ ఆ పదవిని చేపట్టడానికి ఆమోదించకపోతే, బోర్డ్ సభ్యులు ప్రత్యేక ఎన్నికల సమావేశం కోసం (14) పద్నాలుగు స్పష్టమైన రోజుల కన్నా ముందుగా తగిన సమయం, తేదీ, స్థలాలను ఎంపికచేసి, ఆ మేరకు నోటీసు పంపుతారు. ఈ ఎన్నికల సమావేశంలో ఖాళీ అయిన, ఆ పదవికి ఎన్నిక జరుగుతుంది.

మిగిలిన క్లబ్ ఆఫీసర్లలో ఏ ఇతర పదవి ఖాళీ అయినా, బోర్డ్ డైరెక్టర్లే పూనుకొని క్లబ్ సభ్యులలోంచి ఒకరిని మిగిలిన కాలానికి ఆ పదవికి ఎంపిక చేస్తారు.

డైరెక్టర్ల పదవులు ఖాళీ అయి, క్లబ్ బోర్డు కోరంకు కావలసిన కనీస సంఖ్యకన్నా తగ్గినప్పుడు ఏ సాధారణ సమావేశంలో అయినా ఆ పదవులకు ఎన్నికలు జరపవచ్చు. అందుకు తగిన నోటీసును వీరెవరూ లేని సందర్భంలో, మిగిలిన ఏ క్లబ్ ఆఫీసర్ గానీ, డైరెక్టర్ గానీ, ఏ మెంబర్ అయినా సరే నోటీసు ఇవ్వవచ్చు.

ఇప్పుడు చెప్పబోయే 10వ విభాగంలో సూచించిన విధానాన్ని అనుసరించడం ద్వారా ఈ ఖాళీలను పూర్తిచేయవచ్చు.

**10వ విభాగం : పదవి స్వీకరించవలసిన క్లబ్ ఆఫీసర్ల ఖాళీలను పూరించడం (Replacement of Officers dect)**

ఎన్నికలలో క్లబ్ ఆఫీసర్‌గా ఎన్నికై ఏ కారణం చేతనైనా, స్వీకారం జరగక మునుపే ఆ పదవిలోంచి తప్పుకోవడం గానీ, లేక ఆ పదవి ఖాళీ కావడం గానీ జరిగినప్పుడు, క్లబ్ అధ్యక్షులు ప్రత్యేకంగా “నియామకం మరియు ఎన్నికల సమావేశం” Nomination cum Election Meeting కోసం 14 రోజుల వ్యవధిలో నోటీసును పోస్ట్ ద్వారా గాని, స్వయంగా గానీ అందించి ఆ పదవికి ఎన్నిక జరపవలసి వుంటుంది. తేదీ, సమయం, స్థలం వివరాలన్నీ ఆ నోటీసులో స్పష్టంగా పేర్కొనవలసి వుంటుంది.

నామినేషన్ల గడువు పూర్తయిన వెంటనే ఎన్నికలు చేపట్టడం జరుగుతుంది. అత్యధికంగా ఓట్లు సాధించిన వ్యక్తిని అ పదవికి ఎన్నికైనట్లుగా ప్రకటించడం జరుగుతుంది.

## 5వ ఆర్టికల్
## రుసుములు - బకాయిలు
## (FEES OF DUES)

రుసుములు, ఇతర బకాయిలు వార్షిక సమావేశంలో క్లబ్ సభ్యులు నిర్ణయించిన ప్రకారం వసూలు చేయవలసి వుంటుంది.

**1వ విభాగం : ప్రవేశ రుసుము :**

కొత్తగా చేరే సభ్యులు, మానేసి తిరిగి చేరిన సభ్యులు, ట్రాన్స్‌ఫర్ అయి ఈ క్లబ్‌లో చేరిన సభ్యులకు క్లబ్ ప్రవేశ రుసుము. నిమిత్తం రూ॥ ....... విధించవచ్చు. ఇది క్లబ్ ప్రవేశ రుసుము / ఇంటర్నేషనల్ ప్రవేశ రుసుముతో దీనికి సంబంధం లేదు.

క్లబ్ విధించే ఈ ప్రవేశ రుసుములో ఇంటర్నేషనల్‌కు, డిస్ట్రిక్ట్‌కు చెల్లించవలసిన ప్రవేశరుసుము కూడా కలిపి వసూలు చేయవచ్చు.

ప్రవేశ రుసుమును సెక్రటరీ గారు ఆ సభ్యుణ్ణి ఇంటర్నేషనల్‌కు రిపోర్ట్ చేసేందుకు ముందే వసూలు చేయవలసి వుంటుంది.

క్లబ్ నిమిత్తం విధించే ప్రవేశ రుసుము విషయంలో బోర్డు డైరెక్టర్లదే తుది నిర్ణయం.

ట్రాన్స్‌ఫర్ సభ్యుడికీ, ఆరు నెలలలోపు తిరిగి చేరిన సభ్యుడికీ ప్రవేశ రుసుము విధించే విషయంపై బోర్డు నిర్ణయం తీసుకొంటుంది.

**2వ విభాగం : వార్షిక బకాయిలు (Annual Dues)**

ప్రతి క్లబ్ సభ్యుడు ఏడాదికొకసారి వార్షిక బకాయిలు (Annual Dues) చెల్లించవలసి వుంటుంది. క్లబ్ విధించే ఈ వార్షిక బకాయిలలో సభ్యుడి పేర్న చెల్లించవలసిన ఇంటర్నేషనల్ రుసుములు (International Dues) డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ రుసుములు (Simple of Sub District and Multiple) అన్ని కలిసి వుంటాయి.

ఇంటర్నేషనల్ నుంచి వచ్చే The Lion మేగజైన్ వ్యయం ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌లకు పాలనాపరంగా అయ్యే వ్యయం వార్షికంగా జరిగే కన్వెన్షన్ ఖర్చులూ అన్నీ వుంటాయి.

సభ్యులు సంవత్సరానికి ముందే ఈ బకాయిలన్నింటినీ క్లబ్‌కు చెల్లించవలసి వుంటుంది. ఎప్పుడెప్పుడు, ఏఏ కేటగిరీ సభ్యులు ఎంతెంత చెల్లించాలనే నిర్ణయం తీసుకునే అధికారం క్లబ్ బోర్డుకుంది!

| | |
|---|---|
| పూర్తిస్థాయి (Active) సభ్యత్వం | Rs ........... |
| దూర ప్రాంతాలలో నివసించే వారి (Member at Large) సభ్యత్వం | Rs ........... |
| గౌరవ (Honorary) సభ్యత్వం | Rs ........... |
| కార్యక్రమాలకు హాజరు కాలేకపోతున్న సీనియర్ సభ్యులకు (Privileged) ఇచ్చే సభ్యత్వం | Rs ........... |
| జీవిత (Life) సభ్యత్వం | Rs ........... |

సహచర (Associate) సభ్యత్వం Rs ...........
కార్యక్రమాలకు హాజరు కాలేని ప్రముఖ
వ్యక్తులకు ఇచ్చే (Affiliate) సభ్యత్వం Rs ...........

బోర్డు నిర్ణయించిన ప్రకారం – క్లబ్ ట్రెజరర్ గారు, ఈ విధంగా వసూలు చేసిన మొత్తాలలోంచి, డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ రుసుము లన్నింటినీ ఇంటర్నేషనల్ రాజ్యాంగం, ఉపనియమావళి ననుసరించి చెల్లిస్తారు.

## 6వ ఆర్టికల్

## బ్రాంచ్ క్లబ్‌ల ఆలనా పాలనా

20మందికన్నా తక్కువ మంది చేరినప్పుడు కొత్త క్లబ్‌ను స్థాపించే అవకాశం వుండదు. అలాంటప్పుడు ఆ ప్రాంతంలో చేరినంత మంది సభ్యులతోనే ఒక బ్రాంచి క్లబ్‌ను ఏర్పాటు చేయవచ్చు.

వేరే లయన్స్‌క్లబ్ ఏదీ లేని ప్రాంతాలలో బ్రాంచిక్లబ్ ఏర్పాటుకు అవకాశం వుంటుంది.

ఒక క్లబ్‌కు ఇలా ఎన్ని బ్రాంచ్‌లయినా, వేర్వేరు ప్రాంతాలలో వుండవచ్చు. అయితే బ్రాంచి క్లబ్ ఏర్పడినట్లుగా జిల్లా గవర్నర్‌గారు ధృవీకరించవలసి వుంటుంది.

**1వ విభాగం : సమన్వయ కర్త (Co-ordinator) ఉపసమన్వయకర్త (Vice-Coordinator)**

బ్రాంచ్ క్లబ్‌లో సభ్యులుగా వున్న వ్యక్తులు తమలోంచి ఒకరిని సమన్వయకర్త గానూ వేరొకరిని ఉప సమన్వయకర్త గానూ ఎన్నుకొంటారు.

వీరిద్దరిలో బ్రాంచిక్లబ్ సమన్వయకర్త పితృసంస్థ (Parent club) బోర్డులో సభ్యుడిగా ఆహ్వానించబడతాడు. పితృసంస్థ సాధారణ సమావేశాలకు, బోర్డు సమావేశాలకు ఈ సమన్వయకర్త విధిగా హాజరై బ్రాంచ్ క్లబ్ నిర్వహిస్తున్న కార్యక్రమాల వివరాలు, నెలవారీ జమాఖర్చులు వగైరాలన్నీ నివేదిస్తారు.

క్లబ్‌కు, బ్రాంచ్ క్లబ్‌కు మధ్య చక్కని సమన్వయం కోసం క్లబ్ సభ్యులు అర్థవంతమైన చర్చ చేసి తగిన సలహాలు, సూచనలూ ఇచ్చి బ్రాంచ్‌క్లబ్ వారిని ప్రోత్సహిస్తారు. బ్రాంచ్ క్లబ్ సభ్యుల్ని, సాధారణ సమావేశాలోనూ, ఇతర కార్యక్రమాలన్నింటిలోనూ ఉత్సాహంగా పాల్గొనేలా చేస్తారు.

ఉపసమన్వయకర్త కూడా బ్రాంచ్ క్లబ్ సభ్యులలోంచే ఎన్నికౌతారు. క్లబ్ పాలన, మినిట్స్ రికార్డింగ్, నెలవారి జమాఖర్చుల అక్కౌంట్‌లు వంటివి పితృసంస్థకు సమర్పిస్తారు. బ్రాంచి క్లబ్‌కు సంబంధించిన అన్ని కార్యక్రమాలను పర్యవేక్షిస్తారు.

**2వ విభాగం : సంధాత (Liaison)**

బ్రాంచి క్లబ్ బాగోగులు పర్యవేక్షించడానికి ఒక సంధాత (Liaison)ని పేరెంట్ క్లబ్ ఏర్పాటు చేస్తుంది. ఈ 'సంధాత' బ్రాంచ్ క్లబ్‌కు మూడవ ఆఫీసర్‌గా పనిచేస్తారు.

**3వ విభాగం : ఓటు వేసే అధికారం(Voting Entitlement)**

బ్రాంచి క్లబ్ సభ్యులు తమ బ్రాంచ్ క్లబ్ ద్వారా జరిగే కార్యక్రమాలకు ఓటింగ్‌లో పాల్గొనే అధికారంతో పాటు, తమ పేరెంట్ క్లబ్‌లో కూడా ఓటింగ్ అధికారం కల్గిన సభ్యులౌతారు. పేరెంట్ క్లబ్ సమావేశాలలో కనీసపు హాజరును (కోరమ్) లెక్కించేప్పుడు, హాజరైన బ్రాంచి సభ్యులు కూడా పరిగణించబడతారు. పేరెంట్ క్లబ్ సభ్యులు ఎవరైనా బ్రాంచ్ క్లబ్ సమావేశాలకు హాజరైతే నూరు శాతం అటెండెన్స్ నియమం ప్రకారం హాజరుపడ్తుంది.

## 7వ ఆర్టికల్

## ఉపసంఘాలు (COMMITTEES)

**1వ విభాగం : పాలకసంఘాలు (Standing Committees)**

క్లబ్ ప్రెసిడెంట్ గారు ఈ దిగువన సూచించిన పాలక సంఘాలను నియమిస్తారు.

వీటిలో, మెంబర్‌షిప్ కమిటీ మాత్రం ఎన్నికైన సభ్యులు. మిగతా కమిటీలన్నీ అధ్యక్షుల వారిచే నియామకం జరిగేవే! (నాల్గవ ఆర్టికల్‌లో ఆరు-ఏడు విభాగాలు చూడండి)

**పాలనాపరమైన కమిటీలు**

**(Administration Committees) ఇవి :**

అటెండెన్స్, బులెటిన్ ఎడిటర్
రాజ్యాంగం మరియు ఉపనియమావళి
కన్వెన్షన్, ఫైనాన్స్, గ్రీటర్స్
ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, లీడర్‌షిప్ డెవెలప్‌మెంట్
లయన్స్ ఇన్ఫర్మేషన్
మెంబర్‌షిప్, ప్రోగ్రామ్, పబ్లిక్ రిలేషన్స్

**సేవాపరమైన కమిటీలు**

**(Activities Committees) ఇవి :**

షుగర్‌వ్యాధి అవగాహన
పర్యావరణ సేవలు
చెవిటి మరియు మూగ వ్యాధి నివారణ కార్యక్రమాలు
అంతర్జాతీయ సంబంధాల కార్యక్రమాలు
లియో క్లబ్ కార్యక్రమాలు
లయనెస్ క్లబ్ కార్యక్రమాలు
అంధత్వ నివారణా కార్యక్రమాలు
యూత్ ఎక్స్‌ఛేంజ్ కార్యక్రమాలు
యూత్ ఔట్‌రీచ్
లయనిజం ఆమోదించిన కార్యక్రమాలలో ఇవి ప్రధానమైన సేవా కార్యక్రమాలు :

ఇవి కాక, సిటిజెన్‌షిప్ సేవలు, విద్యాపరమైన సేవలు, ఆరోగ్యపరమైన ఇతర సేవలు, సామాజిక సేవాకార్యక్రమాలు, మనోల్లాస కార్యక్రమాలు, ప్రజా కార్యక్రమాలు, ఇంటర్నేషనల్ యూత్ క్యాంప్స్ వంటి కార్యక్రమాలకు కూడా కమిటీలు నియమించి, వాటిని నిర్వహించవచ్చు.

**2వ విభాగం : ప్రత్యేక కమిటీలు (Special Committees)**

ప్రత్యేక కమిటీ ఏదైనా అవసరం అని అధ్యక్షులు భావించినా లేక బోర్డు సభ్యులు భావించినా ఆ కమిటీ నియామకం జరుగుతుంది. ఎప్పటికప్పుడు, ఆయా పరిస్థితులను బట్టి, ఆయా అవసరాలను బట్టి క్లబ్ అధ్యక్షులు బోర్డ్ అనుమతితో వీటిని నియమిస్తారు.

**3వ విభాగం : అధ్యక్షునికి అధికారతః సభ్యత్వం**

**(President Ex-Officio)**

క్లబ్ ప్రెసిడెంట్ పాలనాపరమైన, సేవా పరమైన అన్ని కమిటీల లోనూ అధికారతః సభ్యుడుగా (ex-officio Member) వుంటారు.

**4వ విభాగం : కమిటీలలో సభ్యులు**

**(Committee Members)**

అన్ని కమిటీలకూ ఒక్కొక్కదానికి ఒక్కొక్కరిని ఛైర్‌పర్సన్ గానూ, పైన 2వ విభాగంలో చెప్పిన రీతిలో, అవసరమైనట్లైయితే ఒకరిద్దరిని సభ్యులుగా ఈ కమిటీలో నియామకం చేయవచ్చు.

**5వ విభాగం : కమిటీ కార్యక్రమాల నివేదన**

**(Committee Reporting)**

ఒక్కో కమిటీ, దాని ఛైర్‌పర్సన్ ద్వారా నెలనెలా తమకు అప్పగించిన బాధ్యతల గురించి బోర్డుకు నివేదిస్తారు.

## 8వ ఆర్టికల్

## సభా సాంప్రదాయాలు

## (PARLIAMENTARY PRACTICES)

ప్రత్యేకంగా క్లబ్ రాజ్యాంగంలో గానీ, ఉపనియమావళిలో గానీ, సూచించిన అంశాలు మినహా, సభ నిర్వహణ గానీ, కార్యక్రమాల నిర్వహణ గానీ, బోర్డు సమావేశాల నిర్వహణ గానీ, కమిటీ సమావేశాలు గానీ - 'రాబర్ట్స్ రూల్స్ ఆఫ్ ఆర్డర్-" తాజా ప్రచురణని ఎప్పటికప్పుడు

అనుసరిస్తూ క్లబ్ కార్యకలాపాలను నడపమని లయన్స్ రాజ్యాంగం సూచిస్తోంది.

### 9వ ఆర్టికల్
### ఇతరములు
### (MISCELLANEOUS)

**1వ విభాగం : లయన్స్ చిహ్నం, అందులో కన్పించే రంగులు (Embelm, Colours) :**

లయన్స్ చిహ్నం, అందులో ఉపయోగించే రంగులన్నీ లయన్స్ అంతర్జాతీయ సంస్థ ఉపయోగించేవి గానే వుండాలి గానీ, అందుకు భిన్నంగా వుండకూడదు.

**2వ విభాగం : లయన్స్ ఆర్థిక సంవత్సరం (Finance Year) :**

జులై 1 నుంచీ జూన్ 30 వరకూ లయన్స్ ఆర్థిక సంవత్సరంగా పిలవబడ్తుంది. (దాన్ని లయనిస్టిక్ సంవత్సరం అనీ, లయన్స్ సంవత్సరం అనికూడా పిలుస్తుంటారు)

**3వ విభాగం : అడ్రసుల లిస్ట్ (Honorary Mailing List)**

ప్రతి క్లబ్ ఆహ్వానాలు వగైరా పంపేందుకు రూపొందించుకున్న గౌరవ మెయిలింగ్ లిస్ట్‌లో ఇంటర్నేషనల్ కార్యాలయం, జిల్లా గవర్నర్ చిరునామాలు తప్పనిసరిగా వుండాలి. క్లబ్ చేపట్టే ప్రతి కార్యక్రమం విధిగా వారి దృష్టిలోకి వెళ్ళవలసిన అవసరం వుంది.

**4వ విభాగం : రాజకీయ పక్షపాతం మత వివక్షత (Partisan Politics / Religion) :**

ఈ లయన్స్ క్లబ్‌ల ద్వారా ఏ వ్యక్తినీ ఒక రాజకీయ పార్టీకి గానీ, రాజకీయ వేదికలకు గానీ, చట్ట సభలకు గానీ ఎన్నికలలో అభ్యర్థిగా ప్రతిపాదించకూడదు. మతపరమైన వివక్షతకు సంబంధించిన అంశాలను క్లబ్ సమావేశాలలో చర్చించకూడదు.

**5వ విభాగం : వ్యక్తిగత ప్రయోజనాలు (Personal Benefit) :**

పదవుల కోసం ఆరాటంలో బాధ్యతా యుతమైన క్లబ్ అధికారులు గానీ, సభ్యులు గానీ, లయనిజంలో ఈ సభ్యత్వాన్ని స్వంత ప్రయోజనాలు కాపాడుకోవడానికీ, రాజకీయ ప్రయోజనాలు పొందడానికీ ఎట్టి పరిస్థితుల్లోనూ ఉపయోగించుకోకూడదు.

ఏకమొత్తంగా క్లబ్‌లో అందరూ కలిసి కూడా ఇలాంటి చర్యలకు పాల్పడకూడదు.

**6వ విభాగం : నిధుల కోసం అభ్యర్థన : Solicitation of funds :**

ఈ క్లబ్ సభ్యులు కాని వ్యక్తులు, క్లబ్ సమావేశాలకు వచ్చి సభ్యుల నుంచి నిధులు వసూలు చేయడానికి వీల్లేదు.

క్లబ్‌లో నిర్ణయించిన కార్యక్రమాలకు భిన్నంగా ఇలాంటి పరిస్థితి ఏదైనా వచ్చి నిధులు కొంత కేటాయించవలసి వచ్చినప్పుడు, అందుకు సంబంధించిన కమిటీకి గానీ, బోర్డుకు గానీ నివేదించి, చర్చించి తగిన నిర్ణయం తీసుకోవాలి!

### 10వ ఆర్టికల్
### సవరణలు
### (AMENDMENTS)

**1వ విభాగం : సవరణలు చేసే విధానం (Amending Procedure)**

ఈ ఉపనియమావళిని కోరం గల్గిన ఏ రెగ్యులర్ సమావేశంలో గానీ, ప్రత్యేక సమావేశంలో గానీ సవరించవచ్చు - మార్పు చేయవచ్చు. హాజరైన వారిలో మెజారిటీ సభ్యుల ఆమోదంతోనే ఉపనియమావళికి మార్పులు చేసుకోవచ్చు.

**2వ విభాగం : నోటీసు పంపడం (Notice)**

ఉపనియమావళికి ఏ సవరణ గానీ, మార్పుగానీ చేయదల్చుకున్నారో దాన్ని ఉటంకిస్తూ 14 రోజుల వ్యవధిలో నోటీసు సభ్యులందరికీ అందేలా పంపి, సభలో చర్చకు ప్రతిపాదించి ఓటింగ్‌కు పెట్టవలసి వుంటుంది.

మెజారిటీ సభ్యుల నిర్ణయమే తుది నిర్ణయం!

**సభ్యత్వ కేటగిరీలలో పరిమితులు**

**(MEMBER CATEGORY LIMITS)**

క్లబ్‌లో గౌరవ సభ్యులు, (Honorary Member) ఆసంస్థ మొత్తం సభ్యుల్లో 5 శాతానికి మించి వుండకూడదు. శేషం సగానికన్నా ఎక్కువగా వుంటే ఇంకొక గౌరవ సభ్యుడికి అవకాశం వుంటుంది.

అలాగే, సమావేశాలకు హాజరుకాలేక పోయే అత్యంత ప్రముఖులకిచ్చే ఎఫిలియేట్ సభ్యత్వాన్ని మొత్తం క్లబ్ సభ్యులలో 25 శాతం మించి కేటాయించకూడదు.

వివరణ : క్లబ్‌లో ఎప్పుడూ పూర్తిస్థాయి సభ్యుల సంఖ్య ఎక్కువగా వుండాలి. ఓటింగ్ హక్కులు, నిర్ణయాధికారాలు వారికే వుంటాయి కాబట్టి, ఎంతో తప్పనిసరి పరిస్థితులలో మాత్రమే ఇతర కేటగిరి సభ్యత్వాల కేటాయింపు చేయవలసి వుంటుంది.

## LIONS CLUBS INTERNATIONA

**Members added and dropped**
**(As per official LCI records)**

| Year | LCI | | | ISAME | | | INDIA | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | Added | Dropped | Growth | Added | Dropped | Growth | Added | Dropped | Growth |
| 1990-91 | 184536 | 171521 | 13015 | 33686 | 29877 | 3809 | 26286 | 23641 | 2645 |
| 1991-92 | 196738 | 175487 | 21251 | 32689 | 31960 | 729 | 25262 | 24633 | 629 |
| 1992-93 | 180270 | 178468 | 1802 | 35679 | 33196 | 2483 | 24194 | 25192 | -998 |
| 1993-94 | 182445 | 184053 | -1608 | 40343 | 34971 | 5372 | 30315 | 24863 | 5452 |
| 1994-95 | 191155 | 178729 | 12426 | 42700 | 33057 | 9643 | 30299 | 23393 | 6906 |
| 1995-96 | 194688 | 186163 | 8525 | 44108 | 33218 | 10890 | 33287 | 24228 | 9059 |
| 1996-97 | 182769 | 185755 | -2986 | 40075 | 38362 | 1713 | 29400 | 27289 | 2111 |
| 1997-98 | 179702 | 180021 | -319 | 44048 | 33866 | 10182 | 30378 | 24408 | 5970 |
| 1998-99 | 185765 | 190491 | -4726 | 53036 | 42468 | 10568 | 38641 | 31344 | 7297 |
| 1999-00 | 189496 | 190278 | -782 | 51934 | 46213 | 5721 | 40396 | 32932 | 7464 |
| 2000-01 | 163983 | 198444 | -34461 | 35872 | 49484 | -13612 | 26555 | 38127 | -11572 |
| 2001-02 | 161697 | 181340 | -19643 | 33141 | 35416 | -2275 | 23742 | 27240 | -3498 |
| TOTAL | 2193244 | 2200750 | -7506 | 487311 | 442088 | 45223 | 358755 | 327290 | 31465 |

## వివిధ సభ్యుల బాధ్యతలు (Obligations)

| కేటగిరీ | తప్పనిసరి హాజరు | ఇంటర్నేషనల్ బకాయిల సక్రమ చెల్లింపు | కార్యక్రమాలలో వ్యక్తిగతంగా పాల్గొనడం | సభ్యుని ప్రవర్తన |
|---|---|---|---|---|
| 1. Active | తప్పనిసరిగా హాజరు కావాలి | అన్నీ సభ్యుడే చెల్లించాలి | తప్పనిసరిగా పాల్గొనాలి | ప్రతిష్ఠాత్మకంగా వ్యవహరించాలి. |
| 2. Affiliate | తప్పనిసరిగా హాజరు కానవసరంలేదు | అన్నీ సభ్యుడే చెల్లించాలి | వీలైనప్పుడు పాల్గొంటారు | " |
| 3. Associate | మాతృసంస్థకు హాజరు కావాలి అసోసియేట్ సభ్యుడుగా వున్న సంస్థకు హాజరు కానవసరం లేదు | మాతృసంస్థకు మాత్రమే చెల్లించాలి | వీలైనప్పుడు పాల్గొంటారు | " |
| 4. Honorary | హాజరు కానవసరం లేదు | అన్ని బకాయిలు క్లబ్ చెల్లిస్తుంది | వీలైనప్పుడు పాల్గొంటారు | " |
| 5. Life | తప్పనిసరిగా హాజరు కానవసరం లేదు | డిస్ట్రిక్ట్, క్లబ్ బకాయిలు మాత్రమే చెల్లించవలసివుంటుంది | వీలైనప్పుడు పాల్గొంటారు | " |
| 6. Member -at-Large | తప్పనిసరిగా హాజరు కానవసరం లేదు | అన్ని బకాయిలు చెల్లించాలి | వీలైనప్పుడు పాల్గొంటారు | " |
| 7. Privileged | తప్పనిసరిగా హాజరు కానవసరం లేదు | అన్ని బకాయిలు చెల్లించాలి | వీలైనప్పుడు పాల్గొంటారు | " |

## హక్కులు, అధికారాలు (Rights & Privileges)

| కేటగిరీ | పదవులు పొందే అర్హత | ఓటుహక్కు వినియోగించుకునే అవకాశం | డెలిగేట్‌గా సమావేశంలో పాల్గొనే అవకాశం |
|---|---|---|---|
| Active | ఉంటుంది | ఉంటుంది | ఉంటుంది |
| Afflilate | ఉండదు | క్లబ్ విషయాల వరకూ ఉంటుంది | ఉండదు |
| Associate | ఉండదు | మాతృసంస్థ ద్వారా కన్‌వెన్షన్లన్నింటికీ వుంటుంది. అసోసియేట్ సభ్యుడుగా వున్న సంస్థలో క్లబ్ విషయాలవరకూ వుంటుంది | ఉండదు |
| Honaray | ఉండదు | ఉండదు | ఉండదు |
| Life | ఉంటుంది. | పూర్తిస్థాయి సభ్యత్వం (Active) బాధ్యతలన్నిటినీ నెరవేరిస్తే - ఉంటుంది. | పూర్తిస్థాయి సభ్యత్వం(Active) భాధ్యతలన్నీ నెరవేరుస్తే ఉంటుంది. |
| Member-at-large | ఉండదు | క్లబ్ విషయాలవరకూ ఉంటుంది. | ఉండదు. |
| Privileged | ఉండదు | ఉంటుంది | ఉంటుంది. |

తరంగం మూడు

# విధి - విధానం

## వికేంద్రీకృత అధికారాలు - విస్తరించిన విధానాలు

# DUTIES & PROCEDURE

## లయన్స్ క్లబ్ విధులు
### (LIONS CLUB OBLIGATIONS)

అంతర్జాతీయ లయన్స్ సేవా సంస్థల సమాఖ్య (International Association of Lions Clubs) లో సభ్యురాలిగా వున్న లయన్స్‌క్లబ్‌లో మనం సభ్యులుగా వున్నాం. అంతేగానీ, లయన్స్‌క్లబ్స్ ఇంటర్నేషన్‌లో ప్రత్యక్షంగానూ, నేరుగానూ మనం సభ్యులం కాదు. ముందుగా ఈ విషయాన్ని గుర్తించండి!

మనం సభ్యులుగా వున్న మన లయన్స్ క్లబ్‌ని సభ్యురాలిగా ఆమోదిస్తూ, లయన్స్ అంతర్జాతీయ సంస్థ అధ్యక్షుడు, సెక్రటరీ సంతకంచేసిన ఆమోదపత్రాన్ని చార్టర్ అంటారు.

మన క్లబ్ చార్టర్ అయిన క్షణం నుంచీ మనల్ని అధికారికంగా లయన్స్‌గా వ్యవహరించడం జరుగుతుంది.

చార్టర్ అయిన లయన్స్‌క్లబ్ తన సభ్యత్వాన్ని అంతర్జాతీయ లయన్స్ సేవాసంస్థల సమాఖ్యకు చెల్లిస్తుంది. ప్రతి క్లబ్ చెల్లించవలసిన సభ్యత్వ రుసుము ఆక్లబ్‌లో వున్న సభ్యుల సంఖ్యని బట్టి వుంటుంది.

చార్టర్డ్ లయన్స్ క్లబ్ అంటే అర్థం ఇది! అలా ఛార్టర్ అయిన క్లబ్‌కు కొన్ని విధులు, బాధ్యతలూ వున్నాయి. వాటిని ప్రతి లయన్స్ క్లబ్ తప్పనిసరిగా పాటించవలసి వుంటుంది. ఈ విధుల్నే "క్లబ్ ఆబ్లిగేషన్స్" అంటారు.

a) నిర్ణయించబడిన రీతిలో క్లబ్ సమావేశాలను తప్పనిసరిగా నిర్వహించడం.

b) సంవత్సర కాలానికి సరిపడిన సభ్యత్వ రుసుముని వసూలు చేయడం. అలా వసూలు చేసిన సభ్యుల సభ్యత్వ రుసుములోంచి డిస్ట్రిక్ట్, మల్టిపుల్ మరియు ఇంటర్నేషనల్ రుసుముల్ని, క్లబ్ పాలనా పరమైన ఇతర రుసుముల్నీ చెల్లించడం...

c) సభ్యులు సక్రమంగా ఎక్కువ సంఖ్యలో హాజరయ్యేలా ప్రోత్సహిస్తూ, వారిని ఉత్తేజపరచడం...

d) పౌరపరమైన, సాంస్కృతిక పరమైన సామాజిక పరమైన, నైతికపరమైన (Civil, Cultural, Social, Moral) అభివృద్ధిని కాంక్షించే కార్యక్రమాలనూ, అంతర్జాతీయ అవగాహనని పెంపొందించే కార్యక్రమాలనూ చేపట్టడం...

e) లయన్స్ ఇంటర్నేషనల్ కార్యాలయానికి ప్రతినెలా సభ్యత్వ వివరాలతో కూడిన రిపోర్ట్‌ని పంపించడం

f) ప్రతి ఆరునెలలకూ ఒకసారి ఇంటర్నేషనల్ ఆఫీస్‌కు క్లబ్ ఆర్థిక పరిస్థితి గురించి తెలియజేస్తూ ఎకౌంట్స్ స్టేట్‌మెంట్ కాపీని పంపించడం.

g) ప్రతిఏడాదీ, ఏప్రియల్ 15 నాటికి క్లబ్ పాలకవర్గం (Club Officers) ఎన్నికలు పూర్తి చేయడం...

(ఈ పాలక వర్గం జూలై 1 నుంచి క్లబ్ పాలనా బాధ్యతలు స్వీకరిస్తుంది.)

h) క్లబ్ సభ్యులుగా చేర్తున్న వ్యక్తుల పూర్వాపరాలను గురించి క్షుణ్ణంగా తెలుసుకోవడం... (కొత్తగా చేరనున్న సభ్యుని వివరాలు, సమాజంలో అతని స్థితి, సమాజం పట్ల అతనికి గల నిబద్ధతల్ని క్షుణ్ణంగా పరిశీలించాకే ఆ వ్యక్తిని సభ్యుడిగా ఆహ్వానించి, స్వీకరించి రిపోర్ట్ చేయవలసి వుంటుంది.)

i) లయనిజం కీర్తి ప్రతిష్ఠల్ని పెంపొందిచేలా, వాటిని నిలబెట్టేలా బాధ్యతాయుతంగా పనిచేయడం.

j) లయన్స్ ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్లు ఎప్పటికప్పుడు తీసుకునే నిర్ణయాలు ప్రతి లయన్స్‌క్లబ్ కూ శిరోధార్యాలుగా వుంటాయి. వాటిని అవగాహన చేసుకొని పాటించడం...

k) లయన్స్ ఆదర్శాలను (objects) ప్రవర్తనా నియమావళిని (Code of Ethics) ప్రతి లయన్స్ సభ్యుడూ పాటించే విధంగా చూడడం.

l) క్లబ్ స్థాయిలో ఎక్కడైనా ఎప్పుడైనా ఏదైనా విభేదం ఏర్పడినప్పుడు, లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ పద్ధతి ద్వారా 'వివాద తీర్మానం' (Dispute Resolution) ప్రవేశపెట్టి చర్చించి దాన్ని పరిష్కరించుకోవడం...

## లయనిజం ప్రధాన కార్యక్రమాలు
## ACTIVITIES OF THE ASSOCIATION

1. లయన్స్ అంతర్జాతీయసేవా సంస్థ తన ప్రధానమైన సేవా బాధ్యత (Service Commitment) గా ప్రకటించిన ఒకే ఒక అంశం. దృష్టిదాన సమారోహం. Sight First

అంధత్వాన్ని నిరోధించడం, అంధత్వాన్ని నివారించడం (Prevention & Reversing of Blindness) ఈ కార్యక్రమంలో ప్రధానాంశం.

2. ఇంకా అనేక Major Service Activities ని లయన్స్ అంతర్జాతీయ సేవా సంస్థ తన కార్యక్రమాలుగా ప్రకటించింది.

(A) సమాజపరమైన (Community Services) సేవలు

పౌరపరమైన (Citizenship) సేవలు

సాంస్కృతికపరమైన (Cultural) సేవలు

విద్యా సంబంధమైన (Educational) సేవలు

ఆరోగ్య పరమైన (Health) సేవలు

ప్రజాపరమైన (Public) సేవలు

మానసోల్లాస (Recreational) కార్యక్రమాలు

సామాజిక సేవలు (Social Services)

(B) డయాబెటీస్ అవగాహనా కార్యక్రమం Diabetes Awareness

ప్రజలకు షుగర్ వ్యాధి పరిజ్ఞానాన్ని కల్పించడం (Community Education)

షుగర్‌వ్యాధి చికిత్సా శిబిరాలు (Screening Camps)

లయన్స్‌నేత్ర ఆరోగ్యకార్యక్రమం (Lions Eye Health Programme LEHP)

షుగర్ రోగులకు మనశ్శాంతిని కల్పించే మానసోల్లాస కార్యక్రమాలు (Recreational Camps for Diabetics)

(C) పర్యావరణ సేవలు (Environmental Services)

- వాడిన కళ్ళజోళ్ళ పునర్వినియోగ కార్యక్రమాలు (Recycling of Eye Glasses)
- కాలుష్య వ్యతిరేక కార్యక్రమాలు (Anti Pollution Effects)
- మొక్కలు నాటడం (Tree Plantation)
- వాతావరణ కాలుష్యాన్ని కల్గించే అంశాలమీద ప్రత్యే శ్రద్ధ (Environmental Intiates)

D. చెముడు, మూగ వ్యాధుల నివారణ మరియు బధిరులకోసం పనిచేయడం (Hearing and speech Action and work with the Deaf)

- బధిరత్వ నివారణకు సంబంధించిన నివారణోపాయాలు, సమాచారం, సామగ్రి, సహాయ కార్యక్రమాలు (Communication Aids / Asistive devices)
- శ్రవణ యంత్రాల పునర్వినియోగం Hearing Aid Recyding Program (HARP)
- బధిరుల సహాయార్థం కుక్కలకు శిక్షణ నిప్పించి అందించడం.

చెవి, గొంతు పరీక్షా శిబిరాలు (Hearing Screchings)

బధిరులకు, మూగవారికీ మానసోల్లాసాన్ని కల్గించే కార్యక్రమాలు (Recreational Camps)

చెవిటి, మూగ వ్యాధులు కల్గినవారికి వివిధ ప్రోత్సాహక కార్యక్రమాలు చేపట్టడం.

e) అంతర్జాతీయ సంబంధాలు పెంపొందింప చేయడం (INTERNATIONAL RELATIONS)

ఇందులో భాగంగా జరుగుతున్న కార్యక్రమాలు ఇవీ :-

- అంతర్జాతీయంగా లయన్స్‌క్లబ్‌ల మధ్య సంబంధాలు పెంచుతూ, రెండు క్లబ్‌లూ కలిసి ఒకే కార్యక్రమం చేపట్టడం (International club Twinning)
- అంతర్జాతీయ సంబంధాల మాసోత్సవ నిర్వహణ (International Relations Month)
- 'ఐక్యరాజ్యసమితిలో లయన్స్‌రోజు' (Lions Day with the United Nations)
- ఒక లయన్స్‌క్లబ్ మరొక లయన్స్‌క్లబ్‌కు పరస్పరం సహకరించుకోవడం (Lions Inter club Assistance Programe)
- వివిధ దేశాల స్టాంపులు, నాణేలు ఒకరికొకరు మార్పిడి చేసుకోవడం (Stamps & Coins collection & Exchange)
- ప్రపంచ శాంతి దినోత్సవం (World Peace Day)

f) యువతరం కోసం లయనిజం కల్పిస్తున్న అవకాశాలు (Lions opportunities for Youth)

- లయన్స్ అంతర్జాతీయ శాంతి చిత్రాల పోటీ Lions International Peace Poster Contest
- యువతీయువకుల్ని వేరొక ప్రాంతం వారు ఆహ్వానించి, వారికోసం కొన్ని విజ్ఞాన వినోద విహార కార్యక్రమాలను నిర్వహించడం. (Intl. Youth Exchange)
- లియోక్లబ్స్ ఏర్పాటు (Leo clubs)
- లయన్స్ అంతర్జాతీయ యువజన శిబిరాలు (Lions International Youth Camps)
- పిల్లలు, యువజనుల సంక్షేమ కార్యక్రమాలలో పూర్తిభాగస్వామ్యం (Lions Partnerships for children and Adolescents)
- లయన్స్ 'అన్వేషణ' ప్రత్యేకకార్యక్రమం Lions Quest Programme
- "మానవ సేవలో యువజన నాయకులు" అవార్డు Lions Young Leaders inservice Awards.
- యువజనులకోసం లయనిజం (Lions youth Outreach)
- "21వ శతాబ్దపు యువ సేవా రాయబారులు" అవార్డులు Young Ambassidors of the 21st century Awards.

G) దృష్టిదానం, అంధులకోసం పనిచేయడం : (Sight Conservation and work with the Blind)

- అంధులకు ఉపయోగించే వస్తుసామాగ్రిని అందించడం. (Assistive devices)
- అభివృద్ధిచెందిన దేశాలలోని పిల్లలకు కంటి ఫొటో స్క్రీనింగ్ క్యాంప్స్
- అంధులకు విద్యాబుద్ధులు నేర్పించడం (education for the blind)
- వాడిన కళ్ళజోళ్ళ పునర్వినియోగం (Eye glasses recyding)
- హెలెన్ కెల్లర్ జన్మదినోత్సవం
- లయన్స్ ఐ బ్యాంక్‌లు
- చూపు మందగించిన వారికి సేవలు (Low Vision Projects)
- అంధులకు మానసోల్లాసకార్యక్రమాలు (Recreational Camps for the visually impaired)
- కంటి శస్త్రచికిత్సా శిబిరాలు (Sight first) Special olympics openin geyes Programme
- దృష్టి మందగించిన వారికి, అంధులకు ఉపయోగపడే ఇతర సేవాకార్యక్రమాలు (Support Services for the Blind and visually impaired)
- కంటి పరీక్షా శిబిరాలు
- తెల్ల చేతికర్రల దినోత్సవం (White Cane Day)
- ప్రపంచ 'దృష్టిదాన' దినోత్సవం (World Sight Day)

## మన మల్టిపుల్‌లో వున్న వివిధ లయన్స్ జిల్లాలు

### MULTIPLE DISTRICT 324 - AREAS

ప్రస్తుతం మన మల్టిపుల్ 5 రాష్ట్రాలు, ఒక కేంద్రపాలిత ప్రాంతాలకు విస్తరించి 18 Lions జిల్లాలుగా వుంది. AP, Goa, Karnataka, Keral, Tamilnadu & Union Territory of Pondicherry.

### తమిళనాడు

1. 324 A 1 : చెన్నయ్ నగరంలోని వివిధ పోస్టల్ డివిజన్లు ఈ జిల్లాగా రూపొందాయి.

2. 324 A 2 : తంజావూరు, నాగపట్నం, పుదుక్కోటి, తిరుచిరుపల్లి, రారూర్ పెరంబదూరు, కరైక్కల్ (పాండిచ్చేరిలో భాగం) ఈ ప్రాంతాలన్ని ఒక లయన్స్ జిల్లాగా వున్నాయి.

3. 324 – A3. చెన్నయ్ పరిసరాల్లోని భాగాలు (చెన్నయ్ నగరంతప్ప), కడలూర్, విల్లుపుర, తిరువన్నామలై, వెల్లూర్, కాంచీపురం, తిరువల్లూర్, మాహె, యానాం, కరైక్కల్ ఇవితప్ప మిగిలిన పాండిచ్చేరి యూనియన్ టెరిటరీ యావత్తూ ఈ జిల్లాగా ఏర్పడ్డాయి.

4. 324 – B1 – నీలగిరీస్, కోయింబత్తూరు రెవెన్యూ జిల్లాలు 324 B1 గా ఏర్పడ్డాయి.

5. 324 – B2 : ధరమ్‌పురి, సేలం, ఈరోడ్, నమక్కల్ రెవెన్యూ జిల్లాలు.

6. 324 – B3 : దిండిగల్, మధురై శివనాగ, థేని రెవెన్యూజిల్లాలు.

7. 324 – B4 రామానందపురం, విందునగర్, తిరునల్వేలి, టూటికోర్న్, కన్యాకుమారి మరియు అండమాన్ నికోబార్ ద్వీపసమూహాలు.

8. 324 C – 1: శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పుగోదావరి రెవెన్యూజిల్లాలు.

9. 324 – C2 : హైదరాబాద్ రెవెన్యూ జిల్లాలో సికిందరాబాద్ మున్సిపల్ ఏరియా తప్ప మిగిలిన భాగం, మెదక్, నిజామాబాద్, మహబూబ్‌నగర్, నిర్మల్ పట్నం (ఆదిలాబాద్ జిల్లా), తాండూర్, పరగి, షంషాబాద్, వికారాబాద్, చేవెళ్ళ (రంగారెడ్డిజిల్లా) ఇవన్నీ ఆంధ్రప్రదేశ్‌లోని జిల్లాలు. వీటితో పాటు, కర్నాటక రాష్ట్రంలోని గుల్బర్గా, బీదర్, శక్తినగర్, రాయచూర్, మొదలయిన ప్రాంతాలు.

10. 324 – C3 : కరీంనగర్, ఖమ్మం, వరంగల్, నల్గొండ, ఆదిలాబాద్ (నిర్మల్ తప్ప) రెవెన్యూ జిల్లాలన్నీ, సికిందరాబాద్ మున్సిపాలిటీ ప్రాంతాలన్నీ, రంగారెడ్డిజిల్లాలో మిగిలిన ప్రాంతాలు.

11. 324 C – 4 : కృష్ణా, పశ్చిమగోదావరి రెవెన్యూ జిల్లాలు.

12. 324 – D1 : మైసూర్, చామరాజనగర్, బెంగళూర్, మాండ్యా, కోలార్ - కర్నాటక రాష్ట్రంలోని ఈ జిల్లాలన్నీ, వీటితో పాటుగా చిత్తూరు రెవెన్యూ జిల్లా పూర్తిగా ఈ కర్నాటక రాష్ట్రంలోని ప్రాంతాలు.

13. 324 – D2 : బెల్గాం, బీజాపూర్, ఉత్తర కన్నడ (బత్కాల్ నగరం మినహా), ధార్వాడ్, బళ్ళారి, గడగ్, కొప్పల్, బగల్‌హాట్, హావేరి, రాయ్‌చూర్ (శక్తినగర్, రాయ్‌చూర్ నగరాలు తప్ప) రెవెన్యూ జిల్లాలు.

14. 324 – D3 : గుంటూరు, ప్రకాశం, నెల్లూరు అనంతపూర్, కడప, కర్నూల్ –రెవెన్యూ జిల్లాలు.

15. 324 – D4 : ఉడుపి, షిమోగా, చిత్రదుర్గ, దావణగేరె, జిల్లాలు, భత్కల్ (ఉత్తర కన్నడ జిల్లా) నగరం.

16. 324 – D5 : దక్షిణ కన్నడ, కొడగు, హసన్, చిక్ మగళూర్ - జిల్లాలు.

17. 324 – E1 : త్రివేంద్రం, క్విలాన్, పట్టణం తిట్ట, కొట్టాయమ్, అలెప్పి, ఎర్నాకుళం ఇడుక్కి రెవెన్యూ జిల్లాలు.

18. 324-E2: త్రిచూర్, పాలఘాట్, మల్లపురం, కోజికోడ్, మైనాడ్, కన్ననోర్, కాసర్గాడ్ జిల్లాలు మరియు మాహె (పాండిచ్చేరి) ప్రాంతాలు.

ప్రభుత్వ నిర్ణయాలవల్ల ఒక రెవెన్యూ జిల్లాలోని సరిహద్దులు మారినప్పుడు, అందుకు అనుగుణంగా లయన్స్ జిల్లాల అమరికలో మార్పులు చేస్తారు.

ఈజిల్లాల పునర్నిర్మాణానికి రాజ్యాంగ సవరణ అవసరం లేకపోయినా మల్టిపుల్‌లోని అన్ని క్లబ్‌లుకూ ఈ మార్పుగురించి తెలియచేసి తగిన విధంగా జిల్లాని పునర్నిర్మించవచ్చు. అయితే జిల్లా మౌలిక స్వరూపంలో మార్పులేకుండా ఈ కార్యక్రమం జరగవలసి వుంటుంది.

**తాజావార్త**

2003 - 04 లయనిస్టిక్ సంవత్సరంలో 324 లయన్స్ మల్టిపుల్ జిల్లాలో మరికొన్ని ఉపజిల్లాలు విభజితమై కొత్తగా 5 కొత్త జిల్లాల ఏర్పాటుకు ఇంటర్నేషనల్ బోర్డు అనుమతి లభించింది. అవి 324 A1 - A1, A4, A5 గా, C3 - C3, C5, A3 - A3, A6 గా, D3 - D3, D6, E1 - E1, E3, E4, E2 - E2, E5. (పునర్నిర్మాణమైన జిల్లాల స్వరూపం అందవలసి వుంది.)

**మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కౌన్సిల్**

**(COUNCIL OF GOVERNORS)**

మనం చెప్పుకున్న ఈ 18 లయన్స్ జిల్లాల్ని సబ్‌డిస్ట్రిక్ట్స్ (ఉపజిల్లాలు) అంటారు.

అంటే, ఇవి మల్టిఫుల్ డిస్ట్రిక్ట్‌కు ఉపజిల్లాలుగా వున్నాయన్నమాట!

మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌ని ఆ జిల్లాలోని 18 జిల్లాల గవర్నర్లూ కలిసి కౌన్సిల్ ఆఫ్ గవర్నర్‌లుగా ఏర్పడి పరిపాలన సాగిస్తారు.

**గవర్నర్ల కౌన్సిల్ (Council of Governors)**

1. కౌన్సిల్ ఆఫ్ గవర్నర్స్ అంటే, మల్టిపుల్ జిల్లాలోని జిల్లా గవర్నర్ల పాలనా మండలి. దీన్ని మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కౌన్సిల్ అంటారు.

2. ఈ కౌన్సిల్‌లో మొత్తం జిల్లాల సంఖ్యలో సగానికి మించకుండా కొంత మంది ఇమీడియేట్ పాస్ట్ గవర్నర్లని కూడా సభ్యులుగా తీసుకొంటారు.

3. ఇంటర్నేషనల్ బోర్డు సభ్యులు, పూర్వపు సభ్యులు కూడా ఈ కౌన్సిల్‌లో గౌరవ సభ్యులుగా వుంటారు.

4. లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ ప్రతినిధుల్ని కూడా ఇందులో ఎక్స్ అఫిషియో సభ్యులు గా కో ఆప్ట్ చేసుకోవచ్చు.

5. పదవీ విరమణ చేస్తున్న కౌన్సిల్ ఛైర్మన్ కూడా ఈ గవర్నర్ల కౌన్సిల్‌లో ఎక్స్ అఫిషియో మెంబర్‌గా వుంటారు. కానీ, ఓటింగ్‌లో పాల్గొనరు.

6. గవర్నర్ల కౌన్సిల్‌లో ఇంటర్నేషనల్ బోర్డు సభ్యులు, బోర్డు పూర్వపు సభ్యులు ఇంటర్నేషనల్ ప్రతినిధులు, పదవీ విరమణ చేస్తున్న కౌన్సిల్ ఛైర్మన్ మాత్రం ఓటింగ్‌లో పాల్గొనరు.

7. ఓటింగ్ అర్హత కల్గిన సభ్యులు మెజారిటీ హాజరుకావడమే గవర్నర్లకౌన్సిల్ సమావేశాలకు కోరమ్‌గా వుంటుంది.

**గవర్నర్ల కౌన్సిల్‌కు ఎన్నికలు**

**Election of officers of council of Governors**

గవర్నర్ల కౌన్సిల్‌లో ఛైర్మన్, వైస్‌ఛైర్మన్, సెక్రటరీ పదవులకు జరిగే ఎన్నికలలో అభ్యర్థులుగా పదవీ విరమణ చేస్తున్న డిస్ట్రిక్ట్ గవర్నర్లు పోటీ చేస్తారు. పదవిలోకి వస్తున్న డిస్ట్రిక్ట్ గవర్నర్ (Dist. Governors elect) లు ఓటర్లుగా వుంటారు. ఓటింగ్ రహస్య బ్యాలెట్ పద్ధతిలో జరుగుతుంది.

ఏ కారణంచేతనైనా పదవీ విరమణచేస్తున్న (Out Going) గవర్నర్లలోంచి ఏ ఒక్కరూ ఈ పదవి చేయడానికి ముందుకు రాలేకపోతే,

ఓటర్లుగా వున్న "గవర్నర్ ఎలెక్ట్" లు తమలోంచి ఒక్కొక్కరిని ఆ పదవులకు ఎన్నుకొంటారు.

ఈ ఎన్నికలన్నీ మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కన్వెన్షన్ జరగడానికి 12 గంటల ముందే పూర్తి కావలసివుంటుంది.

ఇంక, కౌన్సిల్ ట్రెజరర్ పదవికి మాత్రం పదవీ ప్రమాణం చేయనున్న గవర్నర్ ఎలెక్ట్‌ల లోంచే ఒక్కరిని ఎన్నుకొంటారు. మిగిలిన పదవులతోపాటు ఈ పదవికి కూడా రహస్య బ్యాలెటింగ్ పద్ధతిలోనే ఎన్నికలు జరుగుతాయి.

**గవర్నర్ల కౌన్సిల్ అధికారాలు**

**Powers of Multiple dist. Council**

మల్టిపుల్ స్థాయిలో పనిచేసే గవర్నర్ల కౌన్సిల్ లయన్స్ అంతర్జాతీయ సంస్థ నియమావళి కనుగుణంగా వ్యవహరిస్తుంది.

తన వ్యవహారశైలినీ, పాలనావిధానాన్నీ నిర్దేశించేందుకు రూపొందించుకున్న మల్టిపుల్ డిస్ట్రిక్ట్ రాజ్యాంగాన్ని అనుసరించి ఇది వ్యవహరిస్తుంది.

ఈ మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కౌన్సిల్‌నే కౌన్సిల్ ఆఫ్ గవర్నర్స్ అనీ, గవర్నర్ల కౌన్సిల్ అనికూడా వ్యవహరిస్తారు. గవర్నర్ల కౌన్సిల్‌కు ఈ విస్తృతాధికారాలున్నాయి :-

a) మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కౌన్సిల్ అనేక కార్యక్రమాల నిమిత్తం కమిటీలను నియమిస్తుంది. వీటిలో పాలనాపరమైన కార్యక్రమాలుంటాయి, సేవాపరమైన కార్యక్రమాలూ వుంటాయి. మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌ద్వారా, లయన్స్ జిల్లాలను ప్రభావితం చేయడానికి ఈ కమిటీలు వినియోగ పడతాయి.

b) మల్టిపుల్ జిల్లా ఆస్తులు, నిధులూ, కార్యక్రమాలూ అన్నీ కౌన్సిల్ అధీనంలోనే నడుస్తాయి.

c) మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కన్వెన్షన్; కౌన్సిల్ సమావేశాలూ, తదితర ప్రత్యేక సమావేశాలనూ నిర్వహిస్తుంది.

**సమావేశాల నిర్వహణ**

కౌన్సిల్ మొదటి సమావేశం జిల్లా గవర్నర్‌లు ఇంటర్‌నేషనల్‌లో ప్రమాణ స్వీకారం చేసిన రోజునుంచీ (60) అరవై రోజులలోపు జరుగుతుంది.

మల్టిపుల్ డిస్ట్రిక్ట్ సమావేశంలో జరిగిన ఎన్నికల అనంతరం ప్రాథమికంగా జరిపిన సమావేశంలో మొదటికౌన్సిల్ సమావేశం ఎక్కడ, ఏ తేదీన జరిగేదీ, రాబోయే కౌన్సిల్ అంగీకారం మేరకు రాబోయే కౌన్సిల్ సెక్రటరీ వర్తమానం పంపుతారు. ఏడాదికి 4 సార్లు సమావేశాలు జరుగుతాయి.

**జిల్లా వార్షిక సమావేశం**

**District Convention Annual**

ప్రతి ఏడాది నిర్ణీతసమయంలో నిర్ణీత కార్యక్రమాలను నిర్ణీతమైన పద్ధతిలో జరిపే సమావేశాల్ని కన్‌వెన్షన్స్ అంటారు.

కాన్ఫరెన్స్‌లు నిర్ణీతమైన రీతిలో జరగవు. ఎప్పటికప్పుడు ప్రత్యేకమైన అంశాలనిమిత్తం జరిగే సమావేశాలని లేదా చర్చా వేదికలని కాన్ఫరెన్సులంటారు. ఇంటర్నేషనల్ స్థాయిలోనూ, డిస్ట్రిక్ట్ స్థాయిలోనూ, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ స్థాయిలోనూ జరిగే వార్షిక సమావేశాల్ని కన్‌వెన్షన్ అనే పిలుస్తారు.

1. డిస్ట్రిక్ట్ కన్‌వెన్షనల్‌లు మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్ల కన్నా కనీసం 15 రోజుల ముందర జరగవలసి వుంటుంది.

2. డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్ జరిగేచోటు, సమయం, తేదీ వగైరాలను నిర్ణయించడంలో డిస్ట్రిక్ట్ కేబినెట్‌దే తుది నిర్ణయం.

3. డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్‌కు ఆతిథ్యం ఇచ్చే అవకాశం ఎవరికి ఇవ్వాలనేది డిస్ట్రిక్ట్ కన్వెన్షన్‌కు ముందుగా అందిన క్లబ్‌ల ఆహ్వానాలను పరిశీలించి డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్‌లో నిర్ణయిస్తారు. కారణాంతరాల మూలంగా అట్టి నిర్ణయాన్ని మార్పు చేసే హక్కు డిస్ట్రిక్ట్ కేబినెట్‌దే.

4. ప్రతి క్లబ్‌లో 10మంది సభ్యులకు ఒక ఓటు, చివరికి మిగిలిన శేషంలో 5మందికన్నా ఎక్కువవుంటే ఒక ఓటు అదనంగా వుండటం, ఒక సంవత్సరం ఒక రోజు పూర్తికాని కొత్త లయన్స్‌క్లబ్‌లకు ఒక ఓటు మాత్రమే రావడం ఇవన్నీ మల్టిపుల్ కాన్వెన్షన్‌కు వర్తించినట్లే డిస్ట్రిక్ట్ కన్వెన్షన్‌కూ వర్తిస్తాయి.

5. రిజిస్ట్రేషన్ ఫీ చెల్లించి పేరు నమోదు చేసుకొని ధృవపత్రాలు (Credential forms) తీసుకొన్న డెలిగేట్‌కు గాని, ప్రత్యామ్నాయ డెలిగేట్‌కు గానీ (Alternate Dellegate) ఓటు హక్కు వినియోగించుకొనేందుకు, చర్చలలో పాల్గొనేందుకు, అవకాశం వుంటుంది.

6. ఇంటర్నేషనల్ ఆఫీసర్లకూ, పూర్వపు ఇంటర్నేషనల్ ఆఫీసర్లకూ, డెలిగేట్ కోటాతో నిమిత్తం లేకుండా, రిజిస్ట్రేషన్‌తో నిమిత్తం లేకుండా ఓటు హక్కుంటుంది.

**కనీసపు హాజరు (QUORUM)**

లయిన్స్‌జిల్లా కనెవెన్షన్‌లకు '50' మంది రిజిస్ట్రేషన్ చేయించిన డెలిగేట్లు హాజరయి వుంటే కోరమ్ సరిపోతుంది. కార్యక్రమాన్ని నిర్వహించవచ్చు. మల్టిపుల్ కనవెన్షన్‌కు మాత్రం 100 మంది కోరమ్ వుండాలి.

8. డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్‌లో అర్థవంతమైన చర్చలు జరుగుతాయి. మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌కుగాని, ఇంటర్నేషనల్‌కుగాని పరిశీలనార్థం సూచనలు చేస్తూ తీర్మానాలను పంపించే అవకాశం ఈ జిల్లా కన్‌వెన్షన్ కుంటుంది.

9. ప్రతి ఏడాది క్రమంగా జరిగే జిల్లాకన్‌వెన్షన్ కాకుండా, ప్రత్యేకంగా మధ్యంతర సమావేశాన్ని కూడా జిల్లాస్థాయిలో నిర్వహించవచ్చు. అలాంటి మధ్యంతర సమావేశాన్ని Mid Term District Conference అంటారు.

మధ్యంతర సమావేశాన్ని ఎన్నికలు తప్ప ఏ ప్రత్యేకమైన అంశం కోసం అయినా నిర్వహించవచ్చు.

30 రోజుల నోటీసుతో ఈ సమావేశాన్ని నిర్వహించవచ్చు.

**మల్టిపుల్ జిల్లా వార్షిక సమావేశం**

**Multiple District Convention**

ప్రతిఏడాదీ జరిగే ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌కు కనీసం 15 రోజులకన్నా ముందుగా మల్టిపుల్ జిల్లా వార్షిక సదస్సు జరుగుతుంది. మల్టిపుల్ జిల్లాలోని ఏదో ఒక లయన్స్ జిల్లా పరిధిలో ఈ మల్టిపుల్ కన్వెన్షన్ జరుగుతుంది.

ఈ వార్షిక సదస్సు జరిగే తేదీ, సమయం, వేదికల్ని కౌన్సిలే నిర్ణయిస్తుంది.

సాధారణంగా లయన్స్ జిల్లా గవర్నర్స్ ద్వారా, ఈ సమావేశానికి ఆతిథ్యం ఇచ్చేందుకు అనుమతి కోరుతూ అందిన ఆహ్వానాల నుంచి ఒక జిల్లా ఆహ్వానాన్ని మల్టిపుల్ జిల్లా కన్వెన్షన్‌లో నిర్ణయిస్తారు. అట్టి అనుమతి పొందిన జిల్లా ఆహ్వానాన్ని పూర్తి వివరాలు సేకరించి కౌన్సిల్ సెక్రటరీ కౌన్సిల్‌లో చర్చించి సమావేశం జరిగే చోటుని కౌన్సిల్ నిర్ణయిస్తుంది.

మల్టిపుల్ కన్వెన్షన్‌కు దాని ఉపజిల్లాలలోని ప్రతి లయన్స్ క్లబ్ నుంచీ విధిగా సభ్యులు హాజరు కావలసి వుంటుంది.

క్లబ్‌లో ప్రతి పదిమంది సభ్యులకీ ఒకరు ఓటువేసే ప్రతినిధిగానూ, వేరొకరు ప్రత్యామ్నాయ ప్రతినిధి (Alternative

Delegaive)గానూ ఈ సదస్సుకు హాజరై ఓటింగ్‌లో పాల్గొనవచ్చు.

ఒక సంవత్సరం ఒకరోజు కాలపరిమితి పూర్తి చేసుకున్న సభ్యులలో ప్రతి పది మందికీ ఒకరికి చొప్పున ఓటింగ్ చేసే అవకాశం వస్తుంది. చివరికి శేషంగా మిగిలిన సభ్యులు 5 కన్నా ఎక్కువ మంది వుంటే ఒక ఓటు అధికంగా వస్తుంది.

ఆ ఏడాది కొత్తగా ప్రారంభమైన లయన్స్ క్లబ్ లో సభ్యులు, ఒక సంవత్సరం ఒకరోజు కాల నియతిని పూర్తిచేసి వుండరు కాబట్టి ఆ క్లబ్‌కు ఒక ఓటు మాత్రమే వుంటుంది.

డిస్ట్రిక్ట్ కన్వెన్షన్‌కు, మల్టిపుల్ కన్వెన్షన్‌కూ ఇవే రూల్సు వర్తిస్తాయి-

అయితే చర్చలలో పాల్గొనడానికి ఓటు హక్కు పొందిన డెలిగేట్లు, ప్రత్యామ్నాయ డెలిగేట్లతోపాటు రిజిస్ట్రేషన్ ఫీ చెల్లించిన లయన్స్ సభ్యులుకూడా అర్హులే! రిజిస్ట్రేషన్ చెల్లించి క్రెడెన్షియల్ తీసుకోవడం డెలిగేట్‌ల బాధ్యత.

డిస్ట్రిక్ట్‌గవర్నర్లు, ఇంటర్నేషనల్ డైరెక్టర్లు, ఇంటర్నేషనల్ వైస్ ప్రెసిడెంట్స్, ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్స్, ఇమీడియట్ పాస్ట్ ప్రెసిడెంట్‌ను ఇంటర్నేషనల్ ఆఫీసర్లంటారు.

వీరు తమ స్వంత లయన్స్ క్లబ్‌లలో యాక్టివ్ కేటగిరీ సభ్యులై వుండి సభ్యత్వ రుసుములు చెల్లించి గుడ్ స్టాండింగ్‌లో వుండాలి.

ఈ ఇంటర్నేషనల్ ఆఫీసర్లకు డెలిగేట్ కోటా అనేది వర్తించదు. (క్లబ్ సభ్యత్వం, రిజిస్ట్రేషన్ ఫీజు చెల్లించటాలతో నిమిత్తం లేకుండా ఓటు హక్కు వుంటుంది.)

పాస్ట్ గవర్నర్లక్కూడా ఇలానే మల్టిపుల్ కన్వెన్షన్ లోనూ, డిస్ట్రిక్ట్ కన్వెన్షన్‌లోనూ ఓటు హక్కు నేరుగా వుంటుంది. వీరంతా క్లబ్ డెలిగేట్స్ కోటాలోకి రారు.

**కనీస హాజరు (QUORUM) :**

మల్టిపుల్ కన్వెన్షనలో రిజిస్ట్రేషన్ చేయించుకొన్న డెలిగేట్లు 100 మంది హాజరైతే కోరమ్ పూర్తయినట్లుగా భావించబడ్తుంది.

**ఓటుహక్కు వినియోగం :**

ఓటు హక్కు వున్న డెలిగేట్లుగానీ, ప్రత్యామ్నాయ డెలిగేట్లుగానీ, ముందుగా రిజిస్ట్రేషన్ చేయించుకొని, క్రెడెన్షియల్స్ తీసుకోవాలి. క్రెడెన్షియల్స్ వున్నవారు మాత్రమే ఓటుచేయడానికి అర్హులు. వ్యక్తిగతంగా వచ్చి ఓటు వేయాలే తప్ప, పోస్ట్‌ద్వారా గాని, మరొక వ్యక్తిద్వారా గానీ, పరోక్షంగా గానీ ఓటువేసే అవకాశం (PROXY VOTING) లేదు.

**మల్టిపుల్ జిల్లాకు నిధులు :**

మల్టిపుల్ జిల్లా పాలనకోసం సంవత్సరానికి 12 రూపాయల చొప్పున ప్రతిలయన్స్ సభ్యుడు లయన్స్ జిల్లాద్వారా మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌కు చెల్లిస్తున్నాడు.

అంటే, నెలకు 1 రూపాయిచొప్పున ప్రోరేటా పద్ధతిలో మనం మన డిస్ట్రిక్ట్ ద్వారా మల్టిపుల్ జిల్లా బకాయిలు చెల్లిస్తున్నాం.

## ఇంటర్నేషనల్ కనెవెన్షన్
## (THE INTERNATIONAL CONVENTION)

అంతర్జాతీయ లయన్స్ సంస్థ వార్షిక సమావేశం International Convention ప్రపంచ స్థాయి గల్గిన సంస్థలు నిర్వహించే సమావేశాలన్నింటికన్నా పెద్ద స్థాయిలో జరుగుతుంది.

జూన్ చివరివారంలోగాని, జూలై మొదటి వారంలోగానీ సాధారణంగా ఈ సమావేశం జరుగుతుంది. ఒక వారం రోజుల పాటు అంతర్జాతీయంగా లయన్స్ సభ్యులు పరస్పరం స్నేహ సంబంధాలు పెంపొందించుకోడానికి ఈ సమావేశాలు ప్రతిసారీ తోడ్పడ్తుంటాయి.

సాధారణంగా ఈ అంతర్జాతీయసమావేశం అనేది కుటుంబంతో సహా అందరూ పాల్గొనేదే. అయినప్పటికీ నిర్ధారించబడిన (Certified) ప్రతినిధులు మాత్రమే ఓటింగ్‌లోగానీ, చర్చలలోగాని పాల్గొనే అవకాశం వుంటుంది.

బకాయిలులేని గుడ్ స్టాండింగ్‌లో వున్న ప్రతి లయన్స్‌క్లబ్ నుంచి ప్రతినిధులు ఈ అంతర్జాతీయ లయన్స్ కన్వెన్షన్‌లో పాల్గొంటారు. క్లబ్‌లో ప్రతి పాతిక మంది సభ్యులకు ఒకరికి ప్రాతినిధ్యం ఇస్తారు. మిగిలిన శేషం సగం కన్నా ఎక్కువ వుంటే మరొక ఓటు అదనంగా వస్తుంది. అంటే, 38 మంది సభ్యులున్న క్లబ్‌లో ఇద్దరికి ఓటువేసే అవకాశం ఇస్తారు.

ప్రతి చర్చనీయాంశానికీ ఓటింగ్ జరుగుతుంది. ఇంటర్నేషనల్ రెండవ ఉపాధక్షుని పదవికీ ఇంటర్నేషనల్ డైరెక్టర్స్ పదవులకూ ఎన్నికలు జరుగుతాయి.

5 సంవత్సరాల ముందునుంచే ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్ ఎక్కడ జరిగేదీ నిర్ణయం అవుతుంది. ఎప్పటికప్పుడు 5వ సంవత్సరం కన్‌వెన్షన్ జరిగే దేశాన్ని నిర్ణయిస్తుంటారు.

ఆతిథ్యం ఇచ్చే నగరాన్ని BIDDING CITY అనీ, దేశాన్ని బిడ్డింగ్ దేశం అనీ, ఆతిథ్యం అవకాశం కల్పించమని కోరే ఫారాన్ని "బిడ్ ఫారం" అనీ అంటారు. వివిధ మల్టిపుల్స్ నుంచి ఆతిథ్యం కోసం వచ్చిన బిడ్ ఫారాలను పరిశీలించి ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ 5వ దేశం పేరుని నిర్ణయిస్తారు.

వచ్చేఏడాది జరగబోయే ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌కు సంబంధించిన ఏర్పాట్లన్నీ 12 నెలలముందు నుంచీ చేయడం ప్రారంభిస్తారు.

హోటల్ వసతిసౌకర్యాలు భోజనా సౌకర్యాలు, పెరేడ్, ఉపన్యాసకులు, ట్రైనింగ్ క్లాసుల్లో ఫాకల్టీ... వీటన్నింటికి ఏడాది ముందు నుంచే నియామక ఏర్పాట్లు ప్రారంభం అవుతాయి. అంటే, ఒక కన్వెన్షన్ ముగియగానే రెండో సంవత్సరం కన్వెన్షన్ ఏర్పాటు మొదలౌతాయన్నమాట!

## లయన్స్ అంతర్జాతీయ అధ్యక్షుడు
## INTERNATIONAL PRESIDENT

లయనిజంలో క్లబ్ ప్రెసిడెంట్ స్థాయినుంచి అంచెలంచెలుగా ఎదిగి అంతర్జాతీయ లయన్స్ సంస్థకు అంతర్జాతీయ అధ్యక్షుడిగా ఎన్నికవుతారు.

డిస్ట్రిక్ట్ గవర్నర్ గానూ, ఇంటర్నేషనల్ డైరెక్టర్ గానూ విజయవంతంగా తమ బాధ్యతలకు నెరవేర్చిన వ్యక్తులకే అంతర్జాతీయ అధ్యక్షుడిగా ఎన్నికయ్యే అవకాశం వుంటుంది.

రెండవ ఉపాధ్యక్షుడిగా రహస్యబ్యాలెట్ విధానంలో ఎన్నిక అయి, రెండో సంవత్సరం మొదటి ఉపాధ్యక్షుడిగానూ, మూడో సంవత్సరం అధ్యక్షుడిగానూ లయనిజం పాలనా బాధ్యతలను నెరవేరుస్తారు.

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్‌గారి పదవీకాలం ఒక సంవత్సరం. ఈ పదవి సమయంలో ఆయనకు ఎలాంటి జీత భత్యాలూ వుండవు. లయనిజంలో ప్రతి పదవీ స్వచ్ఛందసేవే!

జీవిత కాలంలో లయన్స్ అంతర్జాతీయ అధ్యక్షుడిగా ఒకసారే ఎన్నిక అవుతారు. మరోసారి పోటీచేసే అవకాశం వుండదు.

రెండవ ఉపాధ్యక్షులు మొదటి ఉపాధ్యక్షులుగా, ఆ తర్వాత అధ్యక్షులుగా ఎంపిక కావడం అనేది ఒక సాంప్రదాయం. మూడేళ్ళ తర్వాత అధ్యక్షుడిగా పనిచేయునున్న వ్యక్తిని ముందుగానే ఎన్నుకోవడం ద్వారా అనుభవంతో పాటు అంతర్జాతీయంగా లయన్స్ నాయకులతో వ్యక్తిగత సంబంధాలు నెలకొల్పు కోవడానికి, మంచి అవకాశాలు ఏర్పడతాయి.

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ ఇంటర్నేషనల్ బోర్డు సమావేశాలకు అధ్యక్షత వహిస్తారు. బోర్డ్ నిర్ణయాలను అమలుపరిచే ఎగ్జిక్యూటివ్ కమిటీకి కూడా ఆయనే అధ్యక్షులుగా వ్యవహరిస్తారు.

తన సంవత్సర పదవీకాలంలో ఆరు ఖండాలలోని ప్రపంచదేశాలలోని లయన్స్ జిల్లాలను సందర్శిస్తూ కనీసం 2 లక్షల కిలో మీటర్ల మేర ప్రయాణిస్తారు.

ఆయాదేశాల దేశాధినేతల్నీ, దేశ ప్రముఖుల్నీ, పత్రికలవారినీ కలుసుకొని లయనిజం అందిస్తున్న సేవలవివరాలు తెలియజేస్తారు.

లయన్స్ అంతర్జాతీయ సంస్థకు ఆయన ప్రతినిధి. ప్రపంచ దేశాల మధ్య సదవగాహన పెంపొందింప చేయడం ఆయన బాధ్యత!

ఒకవైపు ప్రపంచ పర్యటన చేస్తూనే, ఇంటర్నేషనల్ ప్రధాన కార్యాలయం ద్వారా జరిగే పనుల్ని పర్యవేక్షిస్తూనే, తప్పనిసరిగా మెంబర్‌షిప్, ఎక్స్‌టెన్షన్ కార్యక్రమాలను ప్రోత్సహించే బాధ్యతలు నెరవేరుస్తారు.

ఈ విషయాలపై ఎప్పటికప్పుడు కొత్త పద్ధతిలో, కొత్త ఆలోచనలతో ఒక కార్యచరణ ప్రణాళికతో ముందుకు వస్తారు. "దిలయన్" మేగజైన్‌లో తన ప్రణాళికల గురించిన వివరాలు, తన విజయాల గురించి ప్రస్తావిస్తూ వ్యాసాలు రాస్తారు.

సంవత్సరాంతంలో జరిగే అంతర్జాతీయ వార్షిక సమావేశంలో తన పదవీ కాలంలో జరిగిన అభివృద్ధి గురించిన వివరాలతో రిపోర్టును సమర్పిస్తారు.

లయనిజంపట్ల సంపూర్ణ పరిజ్ఞానం, అవగాహన, అంతర్జాతీయ స్థాయి వ్యక్తిత్వం, పాలనా పరమైన సమర్థత, ప్రపంచదేశాలన్నీ విస్తృతంగా పర్యటించగల శక్తి, ఓర్పు, సహనం... అన్నీ వున్న వ్యక్తులే ఈ పదవికి చేరుకోగల వారౌతారు.

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ చేసిన వ్యక్తికి తన హోమ్ క్లబ్ ద్వారా జీవిత సభ్యత్వాన్ని ప్రసాదిస్తారు.

పదవీ విరమణ చేసిన మరుసటి సంవత్సరం అంటే ఇమీడియేట్ పాస్ట్ ప్రెసిడెంట్‌గా కూడా ఆయన ఇంటర్నేషన్ బోర్డులో మరో సంవత్సరం పాటు సభ్యుడిగా కొనసాగుతారు. అలాగే LCIF కు చైర్మన్‌గా వ్యవహరిస్తారు.

**మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కౌన్సిల్ చైర్ పర్సన్**

ఇంటర్నేషనల్ ప్రకటించిన ప్రోటోకాల్ ప్రకారం మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కౌన్సిల్ చైర్‌పర్సన్ తర్వాతే జిల్లా గవర్నర్ వస్తారు.

మల్టిపుల్ జిల్లాలో వున్న సబ్‌డిస్ట్రిక్ట్స్ అన్నింటినీ సమన్వయపరిచే (Co - ordinator) బాధ్యత మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కౌన్సిల్ చైర్‌పర్సన్ గారిది!

కౌన్సిల్ ఆఫ్ గవర్నర్స్ నిర్ణయాలకు అనుగుణంగా కౌన్సిల్ చైర్ పర్సన్ వ్యవహరిస్తారు.

a) అసోసియేషన్ ఆశయాలను ద్విగ్భణీకృతం చేయడంలో సహకరిస్తారు

b) ఇంటర్నేషనల్, మల్టిపుల్, డిస్ట్రిక్ట్ కార్యక్రమాల అమలుకు కావలసిన నాయకత్వాన్ని అందిస్తారు. లక్ష్యాలు నిర్దేశిస్తారు. దీర్ఘకాలిక ప్రణాళికల్ని అమలు చేస్తారు.

సాధారణంగా జిల్లాస్థాయి నిర్ణయాలు ఆ సంవత్సర కాలానికి పరిమితంగా వుంటాయి. కానీ, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ స్థాయి నిర్ణయాలు ఎక్కువసార్లు దీర్ఘకాలికంగా వుంటాయి.

c) మల్టిపుల్‌లో వున్న లయన్స్ జిల్లాల మధ్య సామరస్యాన్ని సాధిస్తారు. ఐకమత్యాన్ని నెలకొల్పుతారు. సమస్యల్ని పరిష్కరించే దిశలో జిల్లాగవర్నర్‌లకు సాయపడ్తుంటారు.

d) కౌన్సిల్ ఆఫ్ గవర్నర్స్ సమావేశాలకూ, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కన్వెన్షన్‌కూ అధ్యక్షత వహిస్తారు.

మల్టిపుల్ డిస్ట్రిక్ట్ రాజ్యాంగానికి అనుగుణంగా వ్యవహరిస్తారు. కౌన్సిల్ ఆఫ్ గవర్నర్స్ తీసుకొన్న నిర్ణయాలను అమలు పరుస్తారు.

మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌కు సంబంధించిన అన్ని ఆదాయవ్యయాలు, రిపోర్టులు, ఫండ్స్ - అన్నీ తన తర్వాత రాబోయే కౌన్సిల్ చైర్మన్‌కు అందచేసి దిగ్విజయంగా పదవీకాలం పూర్తిచేసుకొంటారు.

### జిల్లా గవర్నర్ విధులు
### (DUTIES OF DISTRICT GOVERNOR)

ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ అజమాయిషీ లో జిల్లా గవర్నర్,తన జిల్లాలో లయనిజానికి ప్రాతినిధ్యం వహిస్తారు.

జిల్లా పాలనా బాధ్యతలన్నీ డిస్ట్రిక్ట్ గవర్నర్‌వే! ఆయన్ని డిస్ట్రిక్ట్ ఛీఫ్ ఎడ్మినిస్ట్రేషన్ ఆఫీసర్‌గా లయనిజం గుర్తించి గౌరవిస్తుంది.

గవర్నర్‌గారి నేతృత్వంలో వైస్ గవర్నర్, రీజియన్ ఛైర్‌పర్సన్, జోన్‌ఛైర్‌పర్సన్, కేబినెట్ సెక్రెటరీ, ట్రెజరర్, ఇతర కేబినెట్ సభ్యులు - వీరంతా లయన్స్ జిల్లా అభివృద్ధికి పాలనా పరంగానూ, కార్యక్రమాల పరంగానూ శక్తివంచనలేకుండా కృషి చేస్తారు.

a) జిల్లా గవర్నర్‌గా లయన్స్ సంస్థ ఆదర్శాలను ఇతోధికంగా అమలు చేసేందుకు కృషిచేస్తారు.

b) కొత్తగా ఏర్పడబోయే లయన్స్ క్లబ్‌ల ఏర్పాటును పర్యవేక్షిస్తారు.

c) లయన్స్ అంతర్జాతీయ ద్రవ్యనిధి (LCIF)ని బలోపేతం చేయడానికి, జిల్లాలో అనేక సేవా కార్యక్రమాలు అత్యున్నతంగా జరగడానికి తోడ్పడతారు.

d) కేబినెట్ సమావేశాలు, డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్ జిల్లా పరంగా జరిగే ఇతర సమావేశాలకు అధ్యక్షత వహిస్తారు.

e) జిల్లాలోని అన్ని లయన్స్ క్లబ్‌ల మధ్య సమన్వయాన్ని స్నేహసంబంధాలనూ పెంపొందింప చేయడానికి కృషిచేస్తారు.

f) కనీసం ఒకసారైనా జిల్లాలోని అన్ని లయన్స్ క్లబ్‌లనూ సందర్శించి, వారిని ఉత్తేజితుల్ని చేసి, ప్రోత్సహిస్తారు.

g) లయన్స్ రాజ్యాంగంలో పేర్కొన్నట్లుగా, ఆర్.సీ.లు, జడ్.సీలు తదితర క్యాబినెట్ సభ్యుల పని తీరుని పర్యవేక్షిస్తారు.

h) డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్ సమయంలోగానీ, క్యాబినెట్ సమావేశాలలోగానీ, మల్టిపుల్ కన్‌వెన్షన్ సమయంలోగానీ జిల్లాకు సంబంధించిన ఆదాయవ్యయాల రిపోర్ట్‌ని సమర్పిస్తారు.

i) సంవత్సరాంతంలో జిల్లాకు సంబంధించిన అన్ని వివరాల్నీ, జమాఖర్చుల్నీ తన తరువాతి గవర్నర్‌కు అందచేస్తారు.

j) తన జిల్లాలో లయన్స్ ఎంబ్లమ్ గానీ, లయనిజం పేరునిగానీ ఏఒక్కరూ దుర్వినియోగ పరచకుండా చూస్తూ, అలాంటివి జరిగినప్పుడు ఇంటర్నేషనల్‌కు రిపోర్ట్ చేస్తారు.

k) ఇంకా, ఇతర కార్యక్రమాలు తను స్వయంగా ప్రతి పాదించినవీ, పర్యవేక్షించినవీ అలాగే, ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ సూచించినవీ ఇవన్నీ జిల్లా గవర్నర్‌గారి నేతృత్వంలోనే జరుగుతాయి.

## వైస్ గవర్నర్ గారి విధులు

జిల్లాకు ఉపనాయకుడిగా వైస్ గవర్నర్ గౌరవ పూర్వకమైన బాధ్యతలను నిర్వర్తిస్తుంటారు.

a) అసోసియేషన్ ఆశయాలను మరింతంగా అమలు జరిగేలా క్లబ్‌లను ప్రోత్సహిస్తారు.

b) డిస్ట్రిక్ట్ గవర్నర్‌తో కలిసి పనిచేయడం వలన గవర్నర్ విధులు, విధానాలతో పూర్తి పరిచయం, పరిజ్ఞానం ఏర్పడతాయి.

c) ఏ కారణం చేతనయినా గవర్నర్ గారు లేనప్పుడు గానీ, గవర్నర్ ఆఫీస్ ఖాళీ అయినప్పుడు గానీ, అప్పటికప్పుడు గవర్నర్ విధులను చేపట్టడానికి సిద్ధంగా సంపూర్ణ సమాచారంతో వుంటారు.

d) జిల్లా గవర్నర్ గారు కోరిన బాధ్యతల్ని నెరవేర్చడానికి కూడా వైస్ గవర్నర్ సిద్ధంగా వుంటారు.

e) జిల్లా కేబినెట్ సమావేశాలకూ, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కౌన్సిల్ సమావేశాలకూ విధిగా హాజరౌతారు.

f) గవర్నర్ గారు రాలేకపోయిన సమావేశాలకు వారి బదులుగా అధ్యక్షత వహించి కార్యక్రమాన్ని నిరాఘాటంగా కొనసాగింప చేస్తారు.

g) వచ్చే ఏడాదికి కూడా కొనసాగే కార్యక్రమాల్లో మరింత ఉత్సాహంగా పాల్గొంటారు.

h) జిల్లా బడ్జెట్ తయారు చేయడంలో కూడా గవర్నర్ గారికి సహకరిస్తుంటారు.

i) జిల్లా సమీక్షా సమావేశాల్లో పాల్గొని బలహీనంగానూ, నిరుత్సాహకరంగానూ పనిచేస్తున్న క్లబ్‌ల వివరాలు తెలుసుకోవడం, వాటిని బలోపేతం చేయడానికి తగిన మార్గాలను అన్వేషించడం వంటి బాధ్యతలను నెరవేరుస్తారు.

j) వైస్ గవర్నర్‌గా తన పదవీకాలం పూర్తయ్యే నాటికి బలహీనంగా వున్న క్లబ్‌లను బలపరిచే తన పథకాలను ఇంటర్నేషనల్‌కు తెలియజేస్తారు.

k) MERLO Team తో పాటుగా ముఖ్యమైన ఇతర కమిటీలను కూడా జిల్లా గవర్నర్ గారు కోరిన పక్షంలో పర్యవేక్షిస్తారు.

l) జిల్లా MERLO Team కు వైస్ గవర్నర్ అధ్యక్షుడిగా వ్యవహరిస్తారు.

## కేబినెట్ సెక్రటరీ

ఇంటర్నేషనల్ ప్రకారం జిల్లాకు కేబినెట్ సెక్రటరీ, ట్రెజరర్ ఇద్దరూ వుండి తీరాలనే నియమం ఏదీ లేదు.

సెక్రటరీ, ట్రెజరర్ రెండు పదవుల్ని ఒకే వ్యక్తికి ఇచ్చే అలవాటు కలిగిన జిల్లాలూ వున్నాయి.

మనదేశంలో మాత్రం మొదటి నుంచీ సెక్రటరీగా, ట్రెజరర్‌గా వేర్వేరు వ్యక్తులే పనిచేస్తున్నారు.

కేబినెట్ సెక్రటరీ / ట్రెజరర్ విధులు ఇవి :-

1) క్యాబినెట్ సెక్రటరీ అసోసియేషన్ ఆశయాలకు ఇతోధికం చేయడానికి కృషి చేస్తారు.

2) తమకు తాముగా ఎలాంటి పరిమితులూ పెట్టుకోకుండా కేబినెట్ సెక్రటరీ, శక్తివంచన లేని విధంగా పనిచేస్తారు.

★ జిల్లాస్థాయిలో జరిగే మీటింగ్‌లో విశేషాల్ని సవివరంగా రికార్డు చేస్తారు.

★ కేబినెట్ సమావేశాలు జరిగిన (15) పదిహేను రోజుల్లోగా కేబినెట్ సభ్యులందరికీ, ఇంటర్నేషనల్ ఆఫీసుకు ప్రొసీడింగ్స్ వివరాలు తెలియజేస్తారు.

★ డిస్ట్రిక్ట్ కన్వెన్షన్‌లో జరిగిన ప్రొసీడింగ్స్‌ని కూడా క్లబ్ కార్యదర్శులకు కేబినెట్ సభ్యులకూ, ఇంటర్నేషనల్ ఆఫీసుకూ పంపుతారు.

★ జిల్లా గవర్నర్ గానీ, కేబినెట్ గానీ కోరిన సమాచారాన్ని రిపోర్ట్ రూపంలో సవివరంగా అందజేస్తారు.

★ క్లబ్‌ల నుంచి అందవలసిన బకాయిలను వసూలు చేసి, జిల్లా గవర్నర్ గారు నిర్దేశించిన బ్యాంక్‌లో డిపాజిట్ చేయడం, అలాగే గవర్నర్ గారి సూచన మేరకు ఖర్చులు చెల్లించడం వంటి బాధ్యతలు నెరవేరుస్తారు.

★ డిస్ట్రిక్ట్ పక్షాన మల్టిపుల్‌కు, ఇంటర్నేషనల్‌కు తదితర సంస్థలకు క్లబ్‌ల నుండి వసూలు చేసి చెల్లించవలసిన బకాయిల్ని చెల్లించి రసీదు పొందుతారు.

★ ఖచ్చితమైన రికార్డ్ బుక్స్, ఎక్కౌంట్ బుక్స్, మినిట్స్ బుక్స్ ఇవన్నీ గవర్నర్ గారి కాబినెట్ పర్యవేక్షణకు అనుకూలంగా సక్రమంగా నిర్వహిస్తుంటారు. కేబినెట్ సభ్యులు కూడా వాటిని పరిశీలిస్తామని కోరినప్పుడు చూపించగలిగి వుంటారు. గుడ్‌స్టాండింగ్‌లో వున్న ఏ క్లబ్ కోరినా కేబినెట్ సెక్రటరీ గానీ, ట్రెజరర్ గానీ నిర్ధారిత రికార్డులు పరిశీలించి కోరిన సమాచారం అందించగలిగి వుంటారు.

★ జమా ఖర్చులన్నింటినీ కాబినెట్ నియమించిన ఆడిటర్ ద్వారా ఆడిట్ చేయించి కేబినెట్‌కు, జనరల్‌బోడీకి సమర్పిస్తారు.

విశ్వాసపాత్రులుగా వ్యవహరిస్తూ, గవర్నర్ గారి ఆలోచనల్ని, కార్యక్రమాల్ని చక్కగా అమలుజేస్తూ, నమ్మకమైన వ్యక్తులుగా బాధ్యతాయుతంగా కేబినెట్ సెక్రటరీ, కేబినెట్ ట్రెజరర్ జిల్లా గవర్నర్‌తో పాటుగా పనిచేస్తారు.

★ ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ అందించే సూచనల్ని శిరోధార్యంగా భావించి పాటిస్తారు.

★ జమా ఖర్చులకు సంబంధించిన విషయాలు ట్రెజరర్ గారికే ప్రత్యేకించినా, తక్కిన విషయాలన్నీ కేబినెట్ సెక్రటరీ, ట్రెజరర్ లిద్దరికీ సమానంగానే వర్తిస్తాయి.

★ డిస్ట్రిక్ట్ పక్షాన పంపే అన్ని నోటీసులు, ఉత్తర ప్రత్యుత్తరాలు, డాక్యుమెంట్ల మీద కేబినెట్ సెక్రటరీ సంతకం చేసి పంపుతారు.

## కేబినెట్ విధులు - బాధ్యతలు

జిల్లా గవర్నర్ గారు తనకు అనుకూలంగా Loyal గా వుండి, తన దృష్టిలో సమర్థవంతంగా పనిచేస్తారని భావించిన వ్యక్తులతో తన కేబినెట్‌ని ఏర్పాటు చేసుకొంటారు.

ఈ కేబినెట్‌కు సెక్రటరీ, ట్రెజరర్‌లుంటారు. వారితోపాటు, ఇమిడియట్ పాస్ట్ గవర్నర్ గారు, రీజియన్ చైర్‌పర్సన్‌లూ, జోన్ చైర్‌పర్సన్‌లూ, డిస్ట్రిక్ట్ కేబినెట్ కమిటీ చైర్మన్‌లూ సభ్యులుగా ఈ క్యాబినెట్‌ని నిర్మిస్తారు.

1. ఈ కేబినెట్ గవర్నర్ గారి విధుల నిర్వహణలో సహకరిస్తూ, వారికి అనుకూలంగా పనిచేస్తూ లయనిజం ఆశయాలను ఇతోధికం చేయడానికి కృషి చేస్తారు.

ప్రధానమైన విధాన నిర్ణయాలను చేసేందుకు కేబినెట్ సమావేశాలు చర్చా వేదికలుగా ఉపయోగపడ్తాయి.

జిల్లా పాలనకు సంబంధించిన పథకాలను రూపొందించడంలోనూ, పాలసీలను తయారుచేసుకోవడంలోనూ లయనిజం అభివృద్ధి దృష్ట్యా చక్కని పథక రచన చేయడానికి గవర్నర్ గారికి సహకరిస్తాయి.

2) ఆర్‌సీలు, జడ్‌సీలు, డీసీలు, కేబినెట్ సెక్రటరీ, ట్రెజరర్‌ల రిపోర్ట్‌ల్నీ, రికమెండేషన్సనీ పరిశీలించి, వాటిగురించి క్షుణ్ణంగా చర్చించి తగిన నిర్ణయాలు తీసుకొంటుంది.

3) లయన్స్ జిల్లాకు రావలసిన క్లబ్ బకాయిలన్నీ జిల్లా ట్రెజరర్‌కు అందేలా పర్యవేక్షిస్తారు.

4) జిల్లా ఆదాయ వ్యయాల గురించి ట్రెజరర్ సమర్పించే నివేదికల్ని, ఏడాది బడ్జెట్‌నూ పరిశీలించి ఆమోదిస్తారు.

మూడు నెలలకొకసారి గాని, ఆరు నెలలకొకసారి గానీ ఫైనాన్షియల్ రిపోర్ట్‌ను ట్రెజరర్

గారు కేబినెట్‌కు సమర్పిస్తారు. డిస్ట్రిక్ట్ పరంగా వనరుల్ని ముగింపునకు బ్యాంక్‌ను ఆమోదించడం, ఆడిటర్‌ను ఆమోదించడం ఇవన్నీ కేబినెట్ నిర్ణయానుసారం జరుగుతాయి.

5) కేబినెట్ సమావేశాల తేదీలు, సమయాలు, స్థలాలను కూడ కేబినెట్ సమావేశంలో ఆమోదిస్తారు.

**డిస్ట్రిక్ట్ కేబినెట్ సమావేశాలు**

గవర్నర్ గారు తన కేబినెట్‌ని నిర్ణయించుకున్న తర్వాత ప్రతి మూడునెలలకూ ఒకసారి కేబినెట్ సమావేశాన్ని ఏర్పాటు చేస్తారు.

అందుకు సంబంధించిన కొన్ని వివరాలు మనం తెలుసుకోవలసినవి వున్నాయి -

1) మొదటి కేబినెట్ సమావేశం అనేది ఇంటర్నేషనల్ కన్వెన్షన్ ముగిసిన 30 రోజుల్లోగా జరుగుతుంది.

2) కేబినెట్ సమావేశానికి 14 రోజులు ముందుగా లిఖిత పూర్వక నోటీస్‌ని కేబినెట్ సెక్రటరీ పంపుతారు.

3) దాని సమయాన్ని, తేదీని, అది జరిగే వేదికని, స్థలాన్ని జిల్లా గవర్నర్ గారు అధికారికంగా నిర్ణయిస్తారు.

4) మీటింగ్ నోటీసులు ప్రతి సభ్యుడికి తప్పనిసరిగా అందేలా చూడాలి.

5) కేబినెట్ సమావేశాలు రెండు రకాలుగా జరుగుతాయి. ఎ) రెగ్యులర్ కేబినెట్ సమావేశాలు. ఇవి మూడు. నెలల కొకసారి జరిగే సాధారణ కేబినెట్ సమావేశాలు (బి) ప్రత్యేక (స్పెషల్) కేబినెట్ సమావేశాలు.

6) కేబినెట్ సమావేశాలన్నింటికీ డిస్ట్రిక్ట్ గవర్నర్ గారే అధ్యక్షత వహిస్తారు.

ఏ కారణం చేతనైనా గవర్నర్ గారు లేనప్పుడు వారి స్థానంలో వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్ గానీ, వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్ గారు కూడా లేని సమావేశానికి కేబినెట్ నిర్ణయించిన ఎవరైనా సీనియర్ సభ్యుడు గానీ అధ్యక్షత వహించవచ్చు.

7) స్పెషల్ కేబినెట్ సమావేశాలు :

ఇవి ఆయా సందర్భాల్లో ప్రత్యేకమైన నిర్ణయాలు అవసరమైనప్పుడు ప్రత్యేక కేబినెట్ సమావేశాన్ని గవర్నర్ గారే సమావేశపరుస్తారు.

లేదా, మెజారిటీ కేబినెట్ సభ్యులు 5 రోజుల కన్నా తక్కువ కాకుండా, 10 రోజులకు మించకుండా, సమయం ఇస్తూ గవర్నర్‌కు గానీ, కేబినెట్ సెక్రటరీకి గానీ ప్రత్యేక సమావేశం కోసం లేఖ రాసినా కూడా ఈ స్పెషల్ కేబినెట్ మీటింగ్ జరపవచ్చు.

8) కేబినెట్ సమావేశాలలో మెజారిటీ ఓటింగ్ సభ్యులు హాజరు కావడమే కోరమ్‌గా భావించాలి.

9) కాబినెట్‌లో జిల్లా గవర్నర్, వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్, ఇమీడియట్ పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్ కాబినెట్ సెక్రటరీ కాబినెట్ ట్రెజరర్, రీజియన్ చైర్‌పర్సన్స్, జోన్ చైర్‌పర్సన్లు, అంతర్జాతీయ అసోసియేషన్ సూచించిన డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్లు, ఓటింగ్ సభ్యులు.

**రీజియన్లు, జోన్లు**

**REGIONS & ZONES**

జిల్లా గవర్నర్ గారు డిస్ట్రిక్ట్‌ని రీజియన్‌లు గానూ, జోన్‌లు గానూ విభజించి జిల్లాలోని వివిధ క్లబ్‌లను వాటికి కేటాయిస్తారు.

(10) పది క్లబ్‌లకు తగ్గకుండా (16) పదహారు క్లబ్‌లకు మించకుండా రీజియన్‌లను ఏర్పాటు చేస్తారు.

అలాగే నాలుగు (4) క్లబ్‌లకు తగ్గకుండా ఎనిమిది (8) క్లబ్‌లకు మించకుండా జోన్‌లను ఏర్పరుస్తారు.

జిల్లా గవర్నర్ గారు రీజియన్లకు రీజియన్ చైర్‌పర్సన్‌లనీ, జోన్‌లకు జోన్‌చైర్ పర్సన్‌లనీ నియమిస్తారు.

జిల్లా గవర్నర్ గారు రీజియన్ చైర్‌పర్సన్, పదవిని ఉపయోగించ దలచుకోకపోతే, ఆ లయన్స్ జిల్లాలో ఆ సంవత్సరం రీజియన్‌ల ఏర్పాటు, రీజియన్ చైర్‌పర్సన్ నియామకం జరగదు.

## రీజియన్ చైర్‌పర్సన్

గవర్నర్ గారి పర్యవేక్షణలో - రీజియన్ చైర్ పర్సన్ (ఆర్.సి.) తనకు అప్పగించబడిన రీజియన్‌కు చీఫ్ ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌గా వ్యవహరిస్తారు. ఆర్.సి.గారి బాధ్యతలు ఇలా వుంటాయి.

a) అసోసియేషన్ ఆశయాలను పెంపొందింప చేసే తీరులో వ్యవహరిస్తారు.

b) తన రీజియన్‌లోని జోన్ చైర్‌పర్సన్‌ల పనితీరుని పర్యవేక్షిస్తారు.

c) అలాగే తన రీజియన్‌కు సంబంధించిన ఇతర డిస్ట్రిక్ట్ కమిటీ చైర్ పర్సన్స్, తదితర కేబినెట్ సభ్యుల పనితీరుని కూడా పర్యవేక్షిస్తారు.

d) కొత్తక్లబ్‌ల వ్యవస్థాపనలోనూ, బలహీనంగా వున్న క్లబ్‌లను బలసంపన్నం చేయడంలోనూ ఘనమైన పాత్ర నిర్వహిస్తారు.

e) తన రీజియన్‌లో కేటాయించిన క్లబ్‌ల రెగ్యులర్ సమావేశాలకు కనీసం ఒకసారయినా వెళ్ళి, ఆ క్లబ్ పని తీరు విషయంలో తన పరిశీలనాంశాలను గవర్నర్ గారికి వివరిస్తారు.

f) తన రీజియన్‌లో కేటాయించిన క్లబ్‌ల బోర్డు సమావేశాలకు కూడా కనీసం ఒకసారి హాజరై తన పరిశీలనాంశాలను జిల్లా గవర్నర్‌కు తెలియజేస్తారు.

g) తన రీజియన్‌లోని ప్రతి లయన్స్ క్లబ్ లయన్స్ రాజ్యాంగాన్ని, అందులో సూచించిన విధుల్ని సక్రమంగా అమలు పరిచేలా పర్యవేక్షిస్తారు.

h) తన రీజియన్‌లోని ప్రతి లయన్స్‌క్లబ్ నుంచి అత్యధిక సంఖ్యలో సభ్యులు ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌కు, మల్టిపుల్ కన్‌వెన్షన్లకు, డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్‌కు, రీజియన్ కాన్ఫరెన్స్‌కు హాజరయ్యేలా చూస్తారు.

i) క్లబ్ సమావేశాలకు, చార్టర్ నైట్ కార్యక్రమాలకూ హాజరౌతారు.

j) ఇవికాక ఇంకా ఇతర కార్యక్రమాలలో విధులు, బాధ్యతల్ని గవర్నర్‌గారు నిర్దేశించిన మేరకు పూర్తి చేయవలసి వుంటుంది.

k) రీజియన్ చైర్‌పర్సన్ మాన్యువల్‌లో సూచించిన విధంగా ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్‌ల నిర్ణయానుసారం రీజియన్ ఛైర్మన్ వ్యవహరించవలసి వుంటుంది.

l) ఏ కారణం చేతనైనాన రీజియన్ చైర్‌పర్సన్ తన బాధ్యతలను సక్రమంగా నెరవేర్చడంలో విఫలం అయినప్పుడు గానీ, ఏ కారణం చేతనైనా రీజియన్ చైర్ పర్సన్ ఆఫీస్ ఖాళీ అయినప్పుడు గానీ, వారి స్థానంలో మిగిలిన పదవీ కాలానికి మరొక వ్యక్తిని నియమించే అధికారం, అవకాశం జిల్లా గవర్నర్ గారిదే.

j) సంవత్సరానికి ఒకసారి జరిగే రీజియన్ సమావేశ సమయం, తేదీ స్థలాలను రీజియన్ చైర్‌పర్సన్ నిర్ణయిస్తారు.

రీజియన్‌లోని క్లబ్‌ల ప్రతినిధులు ఈ సమావేశానికి హాజరౌతారు.

## జోన్ చైర్‌పర్సన్

డిస్ట్రిక్ట్ గవర్నర్, రీజియన్ చైర్‌పర్సన్‌ల పర్యవేక్షణలో పనిచేసే జోన్ ఛైర్మన్ తన జోన్‌కు చీఫ్ ఎడ్మినిస్ట్రేషన్ ఆఫీసర్‌గా వ్యవహరిస్తారు.

లయనిజంలో నాయకత్వ లక్షణాలు పెంపొందించడానికి అట్టడుగు స్థాయి (Grass root level) నుంచీ పనిచేయడానికి జోన్ చైర్‌పర్సన్ ఎంతగానో ఉపయోగపడతాడు.

1) అసోసియేషన్ ఆశయాలను సమర్థవంతంగా అమలు చేయడంలో సహకరిస్తారు.

2) డిస్ట్రిక్ట్ గవర్నర్ గారి సలహామండలి (Dist. Governor's Advisory Committee)కి అధ్యక్షుడిగా వ్యవహరిస్తారు.

3) తన జోన్‌లో పనిచేసే ఈ జిల్లా గవర్నర్ సలహామండలి రెగ్యులర్ సమావేశాలను సమావేశపరిచే బాధ్యత జెడ్‌సీదే! అలాగే వాటికి అధ్యక్షత వహించేది కూడా జెడ్‌సీ గారే!

4) జిల్లా గవర్నర్ సలహామండలి సమావేశాలు జరిగిన 5 రోజులలోపు వాటి రిపోర్ట్‌ను ఇంటర్నేషనల్‌కు పంపుతారు.

5) కొత్త క్లబ్‌లు ఏర్పాటు చేయడానికి తన జోన్‌లోని లీడర్స్‌ని ప్రోత్సాహపరుస్తారు.

కొత్తక్లబ్‌ల వ్యవస్థాపనకు తన జోన్ ద్వారా జరుగుతున్న కృషిని ఎప్పటికప్పుడు డిస్ట్రిక్ గవర్నర్‌కు తెలియజేస్తుంటారు.

6) తన జోన్‌లో బలహీనంగా వున్న క్లబ్‌లు శక్తిని పుంజుకోవడంలో విశేష కృషి చేస్తారు. జోన్ చైర్‌పర్సన్ ప్రతిభ ఇక్కడే ఉపయోగ పడ్తుంది. జోన్ చైర్‌పర్సన్ జాగ్రత్త పడగలిగితే బలహీన క్లబ్‌లు మరింత బలహీనం కాకుండా బలసంపన్నం అవుతాయి.

కనీసం, ప్రమాద సంకేతాలను ముందుగా పసిగట్టి, ఆ విషయాన్ని గవర్నర్ గారి దృష్టికి తెచ్చేందుకు, సమీపంగా క్లబ్‌ను పరిశీలించే అవకాశం జడ్‌సీ గారికి వుంటుంది కాబట్టి, బలహీన క్లబ్‌ల్ని (Sick Clubs) ఆరోగ్యవంతంగా తీర్చిదిద్దే ప్రధాన బాధ్యత జోన్‌చైర్ పర్సన్‌కు వుంటుంది. అందుకు రీజియన్ చైర్‌పర్సన్ సహకారం తీసుకొంటూ, గవర్నర్ గారి సలహాలు సూచనల మేరకు జడ్‌సీ గారు వ్యవహరించవలసి వుంటుంది.

7) తన జోన్‌లోని లయన్స్ క్లబ్‌లు నిర్వహించే సమావేశాలకూ, కార్యక్రమాలకూ సాధ్యమైనంత వరకూ హాజరవుతుంటారు. కనీసం ఒక బోర్డు సమావేశానికైనా విధిగా హాజరు కావలసి వుంటుంది. హాజరైై, ఆ క్లబ్ పనితీరు గురించి డిస్ట్రిక్ట్ గవర్నర్ గారికి రీజియన్ చైర్ పర్సన్‌కూ వివరించే బాధ్యత కూడా ఆయనకుంది.

8) జోన్‌లో వున్న క్లబ్‌లకు ఏ సమస్య ఏర్పడినా దాన్ని గవర్నర్ దృష్టికీ, అవసరం అయితే మల్టిపుల్ దృష్టికీ, ఇంటర్నేషనల్ దృష్టికీ తీసుకువెళ్ళే బాధ్యత జడ్‌సీ గారికుంది.

9) జిల్లా కార్యక్రమాలు గానీ, మల్టిపుల్ కార్యక్రమాలు గానీ, ఇంటర్నేషనల్ కార్యక్రమాలు గానీ, ప్రత్యేకంగా చేపట్టిన ఇతర కార్యక్రమాలు గానీ తన జోన్‌లో క్లబ్‌లు ఎలా నిర్వహిస్తున్నాయో పర్యవేక్షించే బాధ్యత కూడా జడ్‌సీ గారికుంది.

10) లయన్స్ ఇంటర్నేషనల్ రాజ్యాంగానికి అనుగుణంగా క్లబ్‌లు కూడా తమ స్వంత కాన్‌స్టిట్యూషన్‌ని తయారుచేసుకొని జనరల్ బాడీలో ఆమోదించి అమలు చేసుకోవల సిందిగా మనకు ఇంటర్నేషనల్ సూచిస్తుంది.

11) జోన్‌లో క్లబ్‌లన్నీ జోన్ కార్యక్రమాలకూ, రీజియన్ కార్యక్రమాలకూ, డిస్ట్రిక్ట్, మల్టిపుల్, ఇంటర్నేషనల్ కార్యక్రమాలకూ అధిక సంఖ్యలో హాజరయ్యేలా ప్రోత్సహిస్తారు.

జోన్ చైర్‌పర్సన్ పనితీరు డిస్ట్రిక్ట్ గవర్నర్ గారికి సంతృప్తికరంగా కన్పించాలి.

జోన్‌లో వున్న క్లబ్‌లు కూడా జోన్ చైర్‌పర్సన్ విషయంలో సంతోషంగా, సంతృప్తిగా వుండాలి.

గవర్నర్ గారి దృష్టిలో జడ్‌సీ ఎవరైనా అసంతృప్తికరంగా పని చేస్తున్నట్లు కనిపిస్తే, జోన్ లోని క్లబ్‌ల ప్రయోజనార్థం - ఆ జోన్ చైర్‌పర్సన్ స్థానంలో సమర్థవంతంగా పనిచేసే మరో వ్యక్తిని మిగిలిన పదవీకాలానికి నియమించే అధికారం గవర్నర్ గారికుంది.

ఏ కారణంచేతనైనా జోన్ ఛైర్‌పర్సన్ పదవి ఖాళీ అయినా, మిగిలిన పదవీకాలానికి మరో వ్యక్తిని గవర్నర్ గారు నియమించవచ్చు. లేదా, ఈ క్లబ్‌ల్ని ఇతర జోన్‌లోకి కేటాయించవచ్చు.

## డిస్ట్రిక్ట్ గవర్నర్ గారి సలహా మండలి

**District Governor's Advisory Committee**

ప్రతి జోన్‌లోనూ, జోన్‌లోని అన్ని క్లబ్‌ల ప్రెసిడెంట్లు, సెక్రటరీలు, ట్రెజరర్‌లు, సభ్యులుగా జిల్లా గవర్నర్ గారి సలహా మండలి పనిచేస్తుంది. సాంప్రదాయికంగా మనం, ఒక ఉపాధ్యక్షుణ్ణి కూడా గవర్నర్ సలహామండలిలో సభ్యులుగా వ్యవహరిస్తున్నాం.

దీనికి జోన్ ఛైర్‌పర్సన్ అధ్యక్షుడుగా వ్యవహరిస్తారు.

జోన్ ఛైర్‌పర్సన్ గారి పిలుపు మేరకు ఈ సలహా మండలి సమావేశాలు జరుగుతుంటాయి.

మొదటి జోన్ అడ్వయిజరీ సమావేశం ఇంటర్నేషనల్ కన్వెన్షన్ జరిగిన 90 రోజుల లోపల జరపవలసి వుంటుంది.

రెండవ జోన్ అడ్వయిజరీ నవంబర్ నెలలో జరుగుతుంది.

మూడవ సమావేశం ఫిబ్రవరి లేదా మార్చి నెలల్లో జరుగుతుంది.

నాలుగవ సమావేశం మే నెలలో జరిగే మల్టిపుల్ సమావేశానికి నెల రోజుల ముందుగా జరపవలసి వుంటుంది. ఏప్రియల్ మొదటి వారంలోపు జరపడం మంచిది.

ఇలా నాలుగు జోన్ అడ్వయిజరీ సమావేశాలనూ విధిగా జోన్ ఛైర్‌పర్సన్ ఏర్పాటుచేసి సమర్థవంతంగా నడిపించవలసి వుంటుంది. సమావేశం పూర్తి కాగానే, ఎప్పటికప్పుడు ఇంటర్నేషనల్‌కు, గవర్నర్‌కు రిపోర్ట్ పంపడం ముఖ్యమైన అంశం.

గవర్నర్ గారి సలహామండలి అనేది జోన్ ఛైర్‌పర్సన్‌కు సహకరిస్తూ లయనిజం సంక్షేమం గురించి, జోన్ లోని క్లబ్‌ల సాధకబాధకాల్ని గురించీ గవర్నర్‌కు కేబినెట్‌కు, తెలియజేసే విధంగా పనిచేస్తుంది.

కుంటుపడ్తున్న (Sick Clubs) క్లబ్‌ల వాస్తవ స్థితిని తెలుసుకోవడానికి, అలాంటి ప్రమాద సంకేతాలు ముందే గ్రహించడానికి ఇవి తోడ్పడతాయి.

## గవర్నర్ గారి గౌరవమండలి

**District Governor's Honorary Committee**

జిల్లా గవర్నర్ గారే ఒక ఆనరరీ కమిటీని కూడా ఏర్పాటు చేస్తారు. ఇది జిల్లా గవర్నర్‌గారి గౌరవ మండలి. జిల్లాలోని పాస్ట్ ఇంటర్నేషనల్ ఆఫీసర్స్ అంటే పూర్వపు జిల్లా గవర్నర్‌లు, పూర్వపు ఇంటర్నేషనల్ డైరెక్టర్లు సభ్యులుగా ఈ గౌరవ మండలిని నిర్మిస్తారు.

ఈ గౌరవ మండలికి అధ్యక్షుణ్ణి కూడా పూర్వపు గవర్నర్‌ల లోంచి ఒకరిని నియమిస్తారు.

జిల్లా గవర్నర్ గారి పిలుపు మేరకు ఈ గౌరవ మండలి గవర్నర్ సూచించిన విషయాలు చర్చించి సలహాలిచ్చేందుకు సమావేశ మౌతుంది.

జిల్లా గవర్నర్ గారి మార్గదర్శకత్వంలో జిల్లాలో సామరస్య వాతావరణం నెలకొనేలా చూడడం ఈ గౌరవ మండలి బాధ్యత.

గౌరవ మండలి ఛైర్మన్ గారు కేబినెట్ సమావేశాలకు గవర్నర్ గారి కోరిక మేరకు హాజరై గౌరవ మండలి చర్చల సారాంశాన్ని కేబినెట్‌కు తెలియజేస్తారు.

# అధ్యక్షుడు
## దీక్షాదక్షత-పాలనా సమర్థత
## PRESIDENT

**The Chief Executive of the club**

ఇది క్లబ్ అధ్యక్షుడిగా మీ సంవత్సరం.

జీవితంలో పెళ్ళయిన సంవత్సరం, ఉద్యోగం - వృత్తిలోకి ప్రవేశించిన సంవత్సరం ఎలా మరిచిపోలేనివో... క్లబ్ అధ్యక్షుడిగా మీ పాలనాకాలం కూడా అలా చిరస్మరణీయంగా, మరవురాని మధురానుభూతులతో సంతృప్తికరమైన సేవాభాగ్యం పొందిన సంవత్సరంగా నిలిచిపోవాలి.

ఒకవైపు క్లబ్ పరిపాలన, ఇంకోవైపు క్లబ్‌సేవా కార్యక్రమాలు మీనించి ఎంతో సమర్థతని ఆశిస్తున్నాయి. మీరు అందుకు తగ్గట్టుగా దృఢంగా నిలబడగలగాలి.

**ప్రమాణస్వీకారానికి ముందే కార్యరంగంలోకి దిగాలి.**

**PLANNING IN ADVANCE**

మీ క్లబ్ సభ్యులందరినీ పేరుపేరునా కలిసి వారితో పరిచయాన్ని స్నేహబంధాల్ని ఏర్పరచుకోండి.

క్లబ్‌లో ఈ పాటికే ఏ సభ్యుడితోనైనా మీకు అభిప్రాయ భేదాలుంటే ఒక మెట్టు మీరే దిగివచ్చి వాటిని పరిష్కరించుకోండి.

శ్రీరామచంద్రుడికి "స్మిత పూర్వభాషి" అనే పేరుంది. నవ్వుతూ ముందు పలకరించే తత్త్వం ఆయనదిట. మీరంటే ఎడముఖంగా వున్న సభ్యుడ్ని మీరే ముందు నవ్వుతూ పలకరించి స్నేహహస్తం అందిస్తే మీ పాలన రామరాజ్యమే అవుతుంది!!

**క్లబ్ అధ్యక్షుడిగా మీ బాధ్యతలు - పరిమితులు**

క్లబ్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా మీరు ఈ ఏడాదికాలం క్లబ్‌ను నడిపించవలసి వుంటుంది.

అన్ని క్లబ్ సమావేశాలకూ మీరే సభాధ్యక్షుడిగా వ్యవహరిస్తారు. క్లబ్ రెగ్యులర్ సమావేశాలకు, ప్రత్యేక సమావేశాలకు, బోర్డ్ సమావేశాలకూ మీటింగ్ నోటీసులు సెక్రటరి గారి ద్వారా పంపబడేట్లు చూడాలి.

స్టాండింగ్ కమిటీలు, ప్రత్యేక కమిటీలు ఏర్పరచి, అవి సక్రమంగా పనిచేసేలా సమన్వయం చేసుకొంటూ, అందరి సహకారంతో క్లబ్‌ను ముందుకు నడిపించాలి.

ప్రతి కమిటీలోనూ మీరు ఎక్స్ అఫిషియో సభ్యులుగా వుండి, ఆయా కమిటీలను ప్రోత్సాహపరుస్తూ కార్యోన్ముఖుల్ని చేయాలి.

బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ తీర్మానాలను అమలుపరచే ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా మీరు ఈ అధ్యక్షబాధ్యతలు నిర్వహిస్తున్నారు. మీ మనసులో వున్న ఆలోచనల్ని బోర్డులో ప్రవేశపెట్టి వారి అంగీకారంతో మాత్రమే మీరు మీ విధుల్ని నిర్వహించవలసి వుంటుంది.

మీ నేతృత్వంలో మీ లయన్స్‌క్లబ్ అంతర్జాతీయ లయన్స్ నిబంధనావళికి లోబడి పనిచేసేట్లు చూడాలి. ప్రతినెలా కనీసం రెండు రెగ్యులర్ సమావేశాలు, ఒక బోర్డు సమావేశం జరపడం రాజ్యాంగపరంగా మీ కనీస బాధ్యత.

ఫైనాన్స్‌కమిటీతో చర్చించి, వారి సూచనల మేరకు ట్రెజరర్‌తో బడ్జెట్ ప్రిపేర్ చేయించి, దానికి లోబడి ఆదాయ వ్యయాలను నిర్వహింప చేయండి. క్లబ్ సమావేశాలకు అధ్యక్షత వహించడం, సమావేశాలలో సభ్యుల హాజరు పెరిగేలా చూడడం. ఇతర లయన్స్ క్లబ్‌ల సభ్యులతో స్నేహ వాతావరణం నెలకొల్పుకోవడం ఇవన్నీ మీ బాధ్యతలే!

ఫిబ్రవరి నెలలో నామినేషన్ కమిటీ ఏర్పాటు చేయడం, మార్చినెలలో నామినేషన్ మీటింగ్, ఏప్రియల్‌లో ఎలక్షన్ మీటింగ్ నిర్వహించి

సక్రమంగా ఎన్నికల కార్యక్రమం పూర్తిచేయడం మీ ప్రధాన బాధ్యతలు. ఎన్నికలకు పిలుపునివ్వడం, ఎన్నికలు సక్రమంగా జరపడం... ఇవి రాజ్యాంగ పరమైన మీ విధులని మరిచిపోవద్దు. ఏప్రియల్‌లో ఎన్నికలు పూర్తయిన తర్వాత P.U. 101, ఫారాన్ని పూర్తిచేసి మే నెలాఖరులోగా ఇంటర్నేషనల్‌కు పంపేలా చూడడం మీ బాధ్యత.

మీ తర్వాత అధికారంలోకి వచ్చే కొత్త కార్యవర్గానికి ప్రమాణస్వీకారం ఏర్పాట్లు చేయించి, వారికి బాధ్యతలు అప్పగించే వరకూ అధ్యక్షుడిగా మీరు అన్ని వ్యవహారాలూ చక్కదిద్దవలసిందే! క్లబ్‌కు సంబంధించిన అన్ని రికార్డులూ కార్యవర్గానికి సక్రమంగా అందించి సహకరించండి! వచ్చే ఏడాది ఇమీడియేట్ పాస్ట్ ప్రెసిడెంట్‌గా మీరు బోర్డు సభ్యుడిగా వుంటారు. క్లబ్ కార్యక్రమాలలో మీ తరువాతి అధ్యక్షుడికి గైడ్‌గా వుండండి.

## సమర్థవంతమైన పాలన
## EFFECTIVE ADMINISTRATION

మీరు అధ్యక్షుడుగా పనిచేస్తున్న లయన్స్ క్లబ్ చాలా సమర్థవంతంగా పనిచేసిందనిపించుకోవాలంటే, కొన్ని ప్రత్యేకమైన కార్యక్రమాలను మీరు విధిగా చేపట్టవలసి వుంటుంది.

మీరు ఎన్ని సేవాకార్యక్రమాలు చేశారన్నదానికన్నా, చేసిన వాటిలో మీ క్లబ్ సభ్యులు ఎంత ఎక్కువమంది పాల్గొన్నారనేది ముఖ్యం. ఎక్కువమంది సభ్యుల ప్రమేయంతో మంచి సేవాకార్యక్రమం చెయ్యడం అవసరం అని గుర్తించండి.

ఫండ్ రైజింగ్ కార్యక్రమంలో మీరూ మీ సభ్యులు కొద్దివెుత్తాలను డోనేషన్ ఇచ్చినంతమాత్రాన అది గొప్ప కార్యక్రమం కాదు. దాతలు ఎంతమంది చేయూత నిచ్చారనేది పరిగణనలోకి తీసుకొంటే, మీరు లయనిజాన్ని ప్రజల్లోకి ఎంత ఎక్కువగా తీసుకువెళ్ళారో అర్థం అవుతుంది.

☆ పౌర సంబంధాలనేవి లయనిజంలో అతి ముఖ్యమైన అంశాలు. ప్రజలతో నేరుగా సంబంధాలను పెంచుకొని, వారి సహకారంతో ఆయా ప్రాంతాలలో ప్రజోపయోగకరమైన సేవా కార్యక్రమాలు చేపట్టండి. అది నిజమైన సేవాకార్యక్రమం అనిపించుకొంటుంది. ప్రజల భాగస్వామ్యం లేని సేవ నిష్ఫలం.

☆ క్లబ్‌లో కొత్తగా సభ్యులను చేర్చుకోబోయే ముందు, వారి గుణగణాలను పరిశీలించిన తర్వాతే ఎడ్మిషన్ పొందే విధంగా చూడండి. క్వాలిటీ లేని సభ్యత్వం వలన క్లబ్‌లో ఊహించని ఇబ్బందులు ఎదురౌతాయని గుర్తించండి. చక్కటి సభ్యులను చేర్చిన తర్వాత వారికి లయనిజం విధి విధానాల పట్ల చక్కని అవగాహన (Indoctrination) కల్గించి వారిని సేవాకార్యక్రమాలలో పాల్గొనేలా ప్రోత్సహించండి! అది మీ పాలనా సామర్థ్యాన్ని పెంపొందింపచేస్తుంది.

## కమిటీల ఏర్పాటు - అధికార వికేంద్రీకరణ
## COMMITTEE ASSIGNMENTS

క్లబ్ అధ్యక్షుడిగా పదవిలోకి వస్తూనే మీరు చేపట్టనున్న వివిధ కార్యక్రమాలు, వాటికోసం కమిటీలు, చైర్‌పర్సన్‌ల ఏర్పాట్ల గురించి ముందుగా ఆలోచన చెయ్యాలి.

సమర్థతకు తగినట్లుగా సభ్యులను కమిటీ చైర్‌పర్సన్‌లుగా ఎంపిక చేయడంలోనే అధ్యక్షుడి చాకచక్యం అంతా ఆధారపడి వుంది. మంచి 'మ్యాచింగ్' వుంటే అది "ఎఫెక్టివ్ టీమ్" అనిపించుకొంటుంది.

మీ సభ్యుల వ్యక్తిగత ప్రతిభని, వారి సమర్థతని, వారి అవకాశాల్ని, వారి అభిరుచినీ

మీరు ఎంతో జాగ్రత్తగా పరిశీలించి, వారిపట్ల ఒక అవగాహన ఏర్పరచుకోగలిగితే, కమిటీల రూపకల్పన తేలిక అవుతుంది.

కమిటీలు వేయడం అనేది ఒక మొక్కుబడి వ్యవహారం కాకూడదు. నియామకాలు జరిపేప్పుడు మీరు శ్రద్ధ కనబరిచి, సిన్సియర్‌గా ఆ సభ్యుడి పాత్రని, ప్రమేయాన్ని కోరుకొంటున్నప్పుడు ఆ సభ్యుడు తప్పకుండా స్పందిస్తాడు. మీరు కోరుకున్న పద్ధతిలో తనకు అప్పగించిన బాధ్యతను తనదిగా భావిస్తూ నెరవేర్చడానికి ప్రయత్నిస్తాడు. ఆయా కమిటీలకు బాధ్యుల్ని ఎంపికచేసిన తర్వాత, వారితో చర్చించి, తదనుగుణంగా మీ పాలనాపరమైన ప్రణాళిక (Planning) ను రూపొందించుకొంటే ఇంకా సులువుగా వుంటుంది.

ప్రతి కమిటీలోనూ మీరు ఎక్స్‌అఫిషియో సభ్యులుగా కమిటీ సమావేశాలకు హాజరై, సముచిత నిర్ణయాలు తీసుకునేలా వారిని ప్రోత్సహించండి. ఆయా నిర్ణయాలను బోర్డ్ సమావేశాలలో చర్చించి ఆమోదం పొందేలా చూడండి.

1. కమిటీ చైర్‌పర్సన్‌తో వారికి కావలసిన వనరుల గురించి చర్చించండి. అవి అందుబాటులో లేనివైతే, వాటిని సేకరించడానికి ఏం చెయ్యాలో ఆలోచించండి.

2. చైర్‌పర్సన్‌ల కోరిక మీద, అవసరం అయితే వారు కోరుకున్న వ్యక్తుల్ని ఆయా కమిటీల్లో సభ్యులుగా నియమించండి.

3. ఒక సేవాకార్యక్రమం జరిగేప్పుడు, ఆ కార్యక్రమానికి సంబంధించిన చైర్‌పర్సన్‌ని, సభ్యుల్ని మీరు సక్రమంగా గుర్తిస్తారనే నమ్మకం కమిటీ చైర్‌పర్సన్‌లకు కల్గించగలిగితే, వారి సహకారాన్ని మీరు మరింతగా పొందగల్గుతారు.

4. వివిధ కమిటీల విధుల గురించి మీ ప్రెసిడెంట్ కిట్‌లో అనేక వివరాలను ఇంటర్నేషనల్ కార్యాలయం మీకు అందిస్తుంది. వాటిని ఆయా కమిటీలకు అందించండి. మీరు అధ్యక్షుడిగా ఎన్నిక కాగానే, ఇంకాజూలై 1 రాలేదు కదా... అని, వచ్చే లయనిస్టిక్ సంవత్సరం దాకా ఆగవలసిన అవసరం లేదు. ఈ ఏడాది అధ్యక్షుడి అనుమతితో మీరు ఏ రెగ్యులర్ సమావేశంలోనయినా మీ కమిటీ లిస్ట్‌ని ప్రకటించి, సభాముఖంగా వారి సహకారాన్ని వచ్చే సంవత్సరం కోసం కోరవచ్చు.

5. కమిటీల లిస్ట్‌ని సభ్యులందరికీ పోస్ట్‌చేసి ఉత్సాహపరచండి. కమిటీ బాధ్యతల వివరాల్ని ఆయా చైర్‌పర్సన్స్‌కు తెలియజేయండి.

కమిటీ చైర్‌పర్సన్స్‌గా మీరు నియమించిన వ్యక్తులు తప్పనిసరిగా కార్యసాధకులుగా విశ్వసనీయులుగా వుండాలి.

ఇతర లయన్స్ సభ్యులతో సయోధ్య కల్గినవారినీ, నాయకత్వ లక్షణాలు కనపరుస్తూ తమకు అప్పగించిన బాధ్యతల నిర్వహణలో లయన్స్ సభ్యుల సహకారాన్ని పొందగల్గినవారినీ కమిటీలలోకి ఆహ్వానించండి.

చైర్‌పర్సన్ పదవులు నిర్వహించేవారు పెద్దవారైతే, వారికి సహకారం అందించేందుకు ఉత్సాహవంతులైన యువతరాన్ని కో చైర్‌పర్సన్‌లుగా నియమించండి. చకాచకా నాయకత్వపు నిచ్చెనలు అందుకోగల యువకులకు క్లబ్‌స్థాయిలో ఈ స్థాయినుండీ ప్రోత్సాహం కల్పించండి.

కొత్త సభ్యుల్ని, పాతసభ్యుల్ని ఇద్దరినీ సమానంగా చూడండి. కొత్త సభ్యులకు ఇంకాస్త ఎక్కువ ప్రోత్సాహం ఇచ్చి వారిని క్లబ్ కార్యక్రమాల్లో బాగా లోతుగా మమేకం అయ్యేలా చెయ్యండి.

ప్రత్యేకమైన కార్యక్రమం గురించి బోర్డులో చర్చించేప్పుడు, ఆ కార్యక్రమం కమిటీ

చైర్‌పర్సన్‌ని బోర్డుకు ఆహ్వానించడం ఒక ఉత్తమ సాంప్రదాయం. బోర్డు సభ్యులకు ఆ ప్రత్యేక కార్యక్రమాన్ని చక్కగా వివరించి ఆమోదం పొందేలా ప్రోత్సహించండి.

ఆ చైర్‌పర్సన్ గారికి ఆర్థిక వనరుల పరిస్థితిని, నిధుల సేకరణ విషయంలో క్లబ్ పాలసీని స్పష్టంగా వివరించి చెప్పండి. నిధుల వినియోగం విషయంలో బోర్డుకు, ఆ పైన జనరల్ బాడీకి ప్రతి ఒక్కరూ జవాబుదారులేనన్న సంగతి కూడా ముందుగానే వివరించండి. ప్రతి కమిటీ తమ చైర్‌పర్సన్ ద్వారా ఆయా కమిటీల నిర్ణయాలను, బోర్డు ఆఫ్ డైరెక్టర్స్ సమావేశంలో పరిశీలనార్థం ప్రవేశపెట్టవలసి వుంటుంది.

**ఉపాధ్యక్షులకు కమిటీల సమన్వయ బాధ్యతలు**

**(Allottment of Committees of Vice-Presidents)**

ఇద్దరు లేక ముగ్గురు ఉపాధ్యక్షుల్ని మనం ప్రతి సంవత్సరం ఎన్నుకొంటున్నాం. కానీ, క్లబ్ యాక్టివిటీలో వారి సహకారాన్ని కూడా మరింతగా తీసుకోగలగాలి. మీరు నియమించిన కమిటీలలో పాలనాపరమైనవీ, సేవాపరమైనవీ రెండూ వుంటాయి. వాటిని సమన్వయం చేసే బాధ్యతల్ని ఉపాధ్యక్షులకు అప్పగించండి.

**ఫస్ట్ వైస్ ప్రెసిడెంట్ :** లీడర్‌షిప్ డెవలప్‌మెంట్, పార్లమెంటరీ ప్రొసీజర్, మెంబర్‌షిప్, కాన్‌స్టిట్యూషన్ – బైలాస్, స్పెషల్ ప్రాజెక్టులు, యూత్ ఔట్‌రీచ్, డయాబెటిస్ అవేర్‌నెస్, సైట్‌ఫస్ట్, హియరింగ్ అండ్ స్పీచ్‌యాక్షన్, ఎన్విరాన్‌మెంట్, హెల్త్.

**సెకండ్ వైస్ ప్రెసిడెంట్ :** బులెటిన్, ప్రోగ్రాం, కన్‌వెన్షన్, పబ్లిక్ రిలేషన్స్, పబ్లిక్ సరీస్వసెస్, ఎడ్యుకేషనల్ సర్వీసెస్, ఇంటర్నేషనల్ రిలేషన్స్, సోషల్ సర్వీసెస్, రిక్రియేషనల్ సర్వీసెస్.

**థర్డ్‌వైస్ ప్రెసిడెంట్ :** లయన్స్ ఇన్‌ఫర్‌మేషన్, అటెండెన్స్, గ్రీటర్, సిటిజన్‌షిప్, లియో, యూత్ ఎక్స్‌ఛేంజ్.

ఉపాధ్యక్షులు తమ పర్యవేక్షణలోని ఆయా కమిటీలను సమావేశపరిచి, వారికి కావలసిన సూచనలు, సలహాలు అందిస్తూ కార్యోన్ముఖుల్ని చేస్తారు. కమిటీ సమావేశాలు మొక్కుబడిగా కాకుండా సిన్సియర్‌గా జరగాలి. పదే పదే జరుగుతూవుంటే కమిటి ఛైర్మన్లకు కూడా ప్రోత్సాహకరంగా వుండి, మరింత బాధ్యతాయుతంగా పనిచేసే అవకాశం వుంది!

పార్లమెంటరీ సాంప్రదాయాలు, తదితర పాలనా వ్యవహారాలలో ప్రాథమిక సూత్రాల పట్ల అవగాహన కలగడానికి ఈ కమిటీ సమావేశాలు తోడ్పడతాయి.

**ప్రణాళికా బద్ధంగా పాలన**

**PLANNING THE PRESIDENTIAL YEAR**

క్లబ్ అధ్యక్షుడిగా ఒక సంవత్సర కాలం పాటు దీక్షతో మీరు కృషిచేయడానికి సన్నద్ధులయ్యారు. అయితే, ఈ సంవత్సరం పదవీకాలంలో మీ వృత్తికీ, మీ కుటుంబానికీ పూర్తి న్యాయం చేయగలుగుతూనే, లయన్స్ క్లబ్ అధ్యక్షుడిగా మీరు దక్షత కలిగిన పాలకుడనే పేరు తెచ్చుకోగలగాలి. అందుకు మీకు ఏడాదికి సరిపడిన ఖచ్చితమైన ప్రణాళిక వుండాలి.

మీ పదవీకాలంలో మీరు చేపట్టదలచిన కార్యక్రమాలను, వాటికోసం మీరు వెచ్చించగలిగిన సమయాన్ని అంచనా వేసుకొంటూ ఒక ప్రణాళికను (Year Planing) రచించుకోబోయేముందు ఈ క్రింది అంశాలను గమనించండి.

★ మీ ఇమీడియేట్ పాస్ట్ ప్రెసిడెంట్ గారితో ఒకసారి భేటీ వేసి గత సంవత్సరం చేపట్టిన కార్యక్రమాలలో కొనసాగించవలసిన వాటిని, ముందుగా గుర్తించండి. ఆయన అనుభవాలను అడిగి తెలిసికొని, సలహాలను, సూచలను పొందండి.

★ నీ కొత్త కార్యవర్గం ప్రమాణస్వీకార మహోత్సవం ఏర్పాట్ల గురించి తక్షణం కొత్త కార్యవర్గ ఇష్టాగోష్టి సమావేశం ఏర్పాటుచేసి చర్చించండి. క్లబ్ అధ్యక్షుడిగా మీ నాయకత్వాన్ని సభ్యులు ఆమోదించేందుకు ఈ కార్యక్రమం చక్కగా తోడ్పడుతుంది.

★ మీ క్లబ్‌లో సీనియర్ సభ్యులు, పూర్వపు అధ్యక్షులందరినీ కలిసి వారి సలహాలూ, సూచనలూ పొందండి.

**ముందు చూపుతో కార్యక్రమాల రూపకల్పన**

నాయకుడికి ముందుచూపు (Vision) వుండాలి. ప్రయాణం చేసేప్పుడు ఏదారిన వెళ్ళాలో ముందు గానే ఎలా నిర్ణయించు కొంటామో, పాలనా పరమైన ప్రణాళికను కూడా అలానే ముందుచూపుతో నిర్ణయించుకో గలగాలి. ముందుగా ప్రణాళిక వేసుకోగలగడం వలన మీకు తెలియ కుండానే మీలో గట్టి ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది. మీ మీద మీకు గలిగిన విశ్వాసం, మిమ్మల్ని మరింత విశ్వశనీయమైన వ్యక్తిగా క్లబ్‌లో నిలబడేలా చేస్తుంది.

★ మిమ్మల్ని మీరు రెండు ప్రశ్నలు వేసుకోండి.

A) ఈ ఏడాది కాలంలో నేను చేపట్టవలసిన అత్యంత ముఖ్యమైన కార్యక్రమాలు ఏవి?

B) సమర్థుడైన అధ్యక్షుడిగా నేను సాధించ వలసింది ఏమిటి?

★ మీ ప్రశ్నలకు మీరు సమాధానం చెప్పుకున్న తర్వాత, వాటికి మీరు కేటాయించగలిగిన సమయాన్నీ, మీ క్లబ్‌లో వున్న వనరుల్నీ, మీ సభ్యుల సహకారాన్ని, వారి అవకాశాల్ని, ఎదురయ్యే అవరోధాల్ని, వాటిని అధిగమించే మార్గాల్నీ కూడా దృష్టిలో వుంచుకొంటూ ప్రాధాన్యతాక్రమంలో మీ కార్యక్రమ ప్రణాళికను రూపొందించుకోవడం ముఖ్యులైన లయన్స్ మిత్రుల సలహా పొందండి. లయనిజంలో మీరు ఎక్కువగా గౌరవించే వ్యక్తుల అభిప్రాయాన్ని కూడా ఈ విషయమై తెలుసుకోండి.

★ క్లబ్ తరపున మీరు తక్షణం చేపట్టవలసినవి గానీ, మెరుగు పరచవలసినవి గాని, పునరుద్ధరించవలసినవి గానీ కార్యక్రమాలు ఏమైనా మిగిలివుంటే వాటిని కూడా మీ ప్రణాళికలో చేర్చండి.

★ మీ కార్యక్రమాలు పూర్తి కావడానికి కావలసిన వనరుల్ని ఒక లిస్ట్ ప్రకారం వర్గీకరించుకోండి. వాటిని సముపార్జించడానికి వినియోగించడానికి ఏం చెయ్యాలో కూడా నిర్ణయించుకోండి. ఏడాదికి సరిపడిన ప్లాన్‌ని మీరు అధికారంలోకి రాకమునుపే వేసుకొని వుండటం వలన మీ పదవీకాలంలో టెన్షన్ వుండదు.

★ క్లబ్ సభ్యుల్లో ఎవరు ఏ బాధ్యతల్ని సమర్థవంతంగా నెరవేర్చగలరో, ఎంత కాలంలో చెయ్యగలరో ముందుగానే మీరు అంచనావేసి, వారితో సంప్రదించి వారి అంగీకారం మేరకు నియామకాలు జరిపితే మీరు పూర్తి మనశ్శాంతితో అధ్యక్షుడిగా నిలదొక్కుకున్నట్టే లెక్క. సమర్థుడైన వ్యక్తికి సమర్థవంతమైన బాధ్యతలు అప్పగించాలి... అదీ సభ్యునికి ఇష్టమైన అంశం అయివుండాలి.

★ అంతా బాగానే వుంది.... వీటన్నింటికి కావలసిన ఆర్థిక పరమైన అంశాల మాటేమిటి....? మీ కార్యవర్గం అభిప్రాయాలు కూడా పరిగణనలోకి తీసుకోండి. అదే మీకు వేయి ఏనుగుల బలం ఇస్తుంది.

ఇంక మీరు క్లబ్ అధ్యక్షుడిగా మీ సభ్యులకు ఎవరిబాధ్యతలు వారికి అప్పగించి, పై నుంచి సమన్వయం చేసుకోవడం, ప్రగతిని సమీక్షించుకుంటూ సాగిపోవడం ఇంత సులువుగా మీరు అధ్యక్ష బాధ్యతలు నెరవేర్చగలగాలి... మరీ మరీ చాకచక్యంగా!!

**రాజ్యాంగ పరిమితులు - క్లబ్ పరిపాలన**

లయన్స్‌క్లబ్ అధ్యక్షుడు అంటే మకుటంలేని మహారాజే అయినప్పటికీ ఆయన అధికారాలు బోర్డు ఆఫ్ డైరెక్టర్స్ వలన, జనరల్ బాడీ సభ్యుల వలన లభిస్తున్నవి మాత్రమే!!

క్లబ్ రాజ్యాంగం నిర్దేశిస్తున్న పరిమితులకు లోబడి, బోర్డు సభ్యుల ప్రోద్భలంతో జనరల్ బాడీ ఆమోదంతో అధ్యక్షుడు తన అధికారాన్ని చెలాయించగల్గుతారు. రాజ్యాంగానికి భిన్నంగా బోర్డుగాని, జనరల్ బాడీగాని ఏ నిర్ణయాన్ని చేయలేదు. చేయకూడదు.

**బడ్జెట్ రూపకల్పన - ఆమోదం**

లయన్స్ క్లబ్‌ల నిర్వహణ - బడ్జెట్‌కు లోబడి ప్రణాళికా బద్ధంగా సాగుతుంది. ఒక సంవత్సర కాలానికి క్లబ్ ఆదాయ వ్యయాలను ముందుగానే ఖచ్చితంగా అంచనా వేసుకొని, దాని ప్రకారం ఒక 'బడ్జెట్' రూపొందించు కోవడం ప్రతి అధ్యక్షుడి నేతృత్వంలో జరగవలసిన ముఖ్య బాధ్యత. ఆదాయానికీ వ్యయానికీ పొంతన లేని రీతిలో బడ్జెట్‌ను ప్రవేశ పెట్టకండి. ఈ ఏడాది చేపట్టే కార్యక్రమాల కోసం అయ్యే వ్యయానికి ఈ బడ్జెట్ ఒక చక్కని మార్గదర్శకంగా వుండాలి.

బడ్జెట్‌ని రూపొందించడానికి క్లబ్ అధ్యక్షుడు ఒక ఫైనాన్స్ కమిటీని నియమిస్తారు. ఆ కమిటీ సభ్యులతో అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధికారి కలిసి చర్చించి, బడ్జెట్ రూపొందిస్తారు. ఫైనాన్స్ కమిటీలో ట్రెజరర్ తప్పని సరిగా వుండాలి.

ట్రెజరర్ అన్ని విషయాలను పరిగణనలోకి తీసుకొని రానున్న సంవత్సర కాలానికి బడ్జెట్‌ను బోర్డులో ప్రతిపాదిస్తారు. బోర్డు ఈ బడ్జెట్‌ను చర్చించి, జనరల్ బాడీ ఆమోదానికి పంపుతుంది.

కార్యదర్శి, కోశాధికారి కలిసి ప్రతినెలా ప్రవేశపెట్టే ఆదాయవ్యయాల స్టేట్‌మెంటుని విధిగా బోర్డు సమావేశంలో చర్చించి ఆమోదం పొందాలి. మూడు నెలలకొకసారి జనరల్ బాడీ ఆమోదాన్ని కూడా పొందవలసి వుంటుంది.

క్లబ్ అధ్యక్షుడు నిధుల సక్రమ వినియోగం విషయంలో "స్పష్టత" (Transperancy) వుండేలా అన్ని జాగ్రత్తలూ తీసుకోవాలి. లేకపోతే సంవత్సరాంతంలో మాట పడేది ముందుగా అధ్యక్షుడే అవుతాడు. కార్యక్రమాల నిమిత్తం చేసిన ఖర్చుల తాలూకు బిల్లులు బోర్డు అనుమతితో ట్రెజరర్ చెల్లింపులు చేస్తారు.

సంవత్సరం పదవీకాలం పూర్తయిన తర్వాత మీ అక్కౌంట్లను ఆడిటర్ చేత ఆడిట్‌చేయించి మరునటి సంవత్సరం జనరల్ బాడీ సమావేశంలో ఆమోదం పొందాలి. దాని కాపీని డిస్ట్రిక్ట్‌కు, ఇంటర్నేషనల్‌కు సెప్టెంబర్‌లోపు పంపవలసి వుంటుంది.

**పార్లమెంటరీ సాంప్రదాయాలు - సభానిర్వహణ**

**KNOWLEDGE OF PARLIAMENTARY PROCEDURE & MEETING PROCEEDINGS**

ప్రపంచంలో ఎక్కడ ఏ సమావేశం జరిగినా, అవి కొన్ని సాంప్రదాయాలకు లోబడి నడుస్తాయి. దేశ అత్యున్నతమైన పార్లమెంట్ సమావేశాల నిర్వహణ కావచ్చు. లేదా ఒక మామూలు సాహితీ సాంస్కృతిక సంస్థ కావచ్చు. మరో ట్రేడ్ యూనియన్ కావచ్చు.... లేదా క్లబ్ సమావేశాలు కావచ్చు. నియమబద్ధంగా సమావేశాల నిర్వహణని పార్లమెంటరీ సాంప్రదాయంగా పిలుస్తుంటాం.

ప్రపంచ వ్యాప్తంగా గుర్తింపు పొందిన సాంప్రదాయాల్ని అనేక మంది పుస్తకాల రూపంలో వెలవరించారు కూడా!

మన లయనిజం, "రాబర్ట్స్ రూల్స్ ఆఫ్ ఆర్డర్' ' అనే పుస్తకాన్ని అనుసరించి సంస్థాగతమైన అంశాలను నిర్వహించమని సూచిస్తోంది.

అధ్యక్షుడు ఎంత చాకచక్యంగా సభను నిర్వహిస్తున్నప్పటికీ మౌలికమైన నియమాలు (Ground Rules) అనేవి లేకపోతే, సభ రసాభస అయిపోతుంది. అది సాధారణమైన చిన్న సమావేశం అయినా సరే, విధి విధానాలు తెలుసుకొంటే, సమావేశం రక్తి కట్టుంది. అధ్యక్షుడు శెహభాష్ అనిపించుకోగల్గుతాడు.

లయన్స్ క్లబ్ సమావేశాలలో హుందాగా ప్రవర్తించడానికి సభా సాంప్రదాయాలనేవి తోడ్పడతాయి. సభా సాంప్రదాయాలు కేవలం అధ్యక్షుడు మాత్రమే పాటించే అంశాలు కావు. ఇవి సభ్యులందరికీ తెలియజెప్పి, వారిని కూడా పాటించేలా చేయవలసిన సత్సాంప్రదాయాలు.

క్లబ్ సమావేశాలలో ఒక సభ్యుడు మాట్లాడుతుండగా మరొక సభ్యుడు అంతరాయం కల్గిస్తూ మాట్లాడడాన్ని Cross Talking అంటారు. ఇది సభా సాంప్రదాయానికి విరుద్ధం. సభాధ్యక్షుడిని ఉద్దేశించి (Media) ఆయన ద్వారా మాత్రమే సభ్యులు మాట్లాడాలిగాని, నేరుగా సభ్యులు ఒకరితో ఒకరు వాదనకు దిగకూడదు. సభ ఇలా క్రమశిక్షణతో నడిచినప్పుడు సభ్యుల మధ్య ఐకమత్యాన్ని సాధించడం తేలిక అవుతుంది.

సంస్థాగత విషయాలు చర్చించి నిర్ణయాలు తీసుకునే ముందు సభ్యులు ఎవరి అభిప్రాయాలను వారు వెలిబుచ్చినప్పటికీ, మెజారిటీ సభ్యుల నిర్ణయానికి అందరూ బద్ధులే.

ముఖ్య అతిధి పాల్గొన్న క్లబ్ సమావేశాల్లో (Guest Meetings) ఆ ముఖ్య అతిధి దేశానికి రాష్ట్రపతి అయినా సరే ముందుగా సభాధ్యక్షుణ్ణి సంబోధించడం, ఆ సమావేశానికి క్లబ్ అధ్యక్షుడే అధ్యక్షత వహించడం మన లయనిజం రాజ్యాంగ పరంగా కల్పించిన ఒక అవకాశం.

సభలో ముందుగా అధ్యక్షుణ్ణి ఆ తర్వాత ముఖ్య అతిధిని సంబోధించాలి. వేదికపైన అనేకమంది లయన్స్ అధికారులున్నపుడు అధ్యక్షుణ్ణి, ముఖ్య అతిధినీ సంబోధించి, మిగిలిన వారందరినీ ఒకే మాటలో సంబోధించి ఉపన్యాసానికి ఉపక్రమించవచ్చు. కానీ సభాధ్యక్షుడు మాత్రం వేదికపైన మరియు సభాస్థలిలో ఆశీనులైన అందరినీ, గుర్తించి, సంబోధించాలి. ఇది కనీస సాంప్రదాయం.

మీటింగ్‌కు ఆలస్యంగా వచ్చిన సభ్యుడు వెనక సీట్‌లో మౌనంగా వచ్చి కూర్చోవాలి. ఇది సభా మర్యాద.

మధ్యలో వెళ్ళిపోదలచిన సభ్యుడు ముందుగా అధ్యక్షుడి అనుమతి తీసుకొని, వెనక సీటులో కూర్చొని మౌనంగా నిష్క్రమించాలి. వారి వలన మీటింగ్ డిస్టర్బ్ కాకుండా వుంటుంది. ఉపన్యాసం జరుగుతున్నప్పుడు మధ్యలో సభను విడిచి బైటకు ఎవరూ వెళ్ళకూడదు. అది ప్రసంగిస్తున్న వక్తను అవమానించడం అవుతుంది.

మీరే ఉపన్యాసకుడైతే సమయపాలన చెయ్యండి. సభ్యుల సమయం చాలా విలువైనదని మరిచిపోకండి.

టైముకు మొదలుపెట్టి టైముకు ముగించేలా ఎజెండా తయారు చేసుకోండి. సమావేశాల్లో ఉత్సాహం కల్గించే సబ్జెక్టుల్ని ఎంచుకొని, మంచి వక్తల్ని ఆహ్వానించండి. ప్రతి సమావేశానికి సభ్యులు విధిగా హాజరు కావడం తమ కనీస బాధ్యతగా గుర్తించేలా చేయండి.

**సులువుగా సభను నిర్వహించే ఉపాయాలు**

నల్లేరు మీద బండిలా సభ నడిచి పోతున్నప్పుడు సభాధ్యక్షుడికి అంతకన్నా ఆనందదాయకమైన అంశం ఇంకొకటి వుండదు.

సభా కార్యక్రమాలలో ప్రతి నిమిషం జరిగే అంశాలను ముందుగానే రూపొందించుకొని, వాటికి కావలసిన సరంజామానీ, సంబారాల్ని సిద్ధంగా వుంచుకొంటే సభ సజావుగా సాగుతుంది.

సెక్రటరీతో కలిసి ఎజెండా తయారు చేయండి. ఆయన తన విధులు నిర్వర్తించేలా ప్రోత్సహించండి.

జరగబోయే సమావేశంలో ఏదైనా విషయం వివాదాస్పదం అయ్యే అవకాశం వున్నదేమో కాసింత ముందుచూపుతో ఊహించగలగాలి (Anticipation) ఒకవేళ అలాంటి వివాదాలు ఏర్పడితే వాటిని ఎలా పరిష్కరించాలో కూడా చక్కగా ప్లాన్ చేసుకోవాలి.

చర్చనీయాంశాల గురించి సభ్యులకు ముందుగానే అవగాహన కల్పించగలిగితే సమావేశం జరిగేప్పుడు అనవసరమైన చర్చలతో కాలయాపన కాకుండా వుంటుంది.

బ్యానర్, గోంగ్ అండ్ గావెల్, మినిట్స్ పుస్తకం, అటెండెన్స్ రిజిష్టర్ వగైరా క్లబ్ ఆస్థుల్ని ప్రతి సమావేశానికి ముందుగా వచ్చి ఏర్పాటు చేయమని టేమర్‌కి గుర్తుచేయండి. అన్నీ జరుగుతున్నాయో లేదో గమనించండి.

**క్లబ్ రెగ్యులర్ సమావేశాలలో ఎజెండా**

క్లబ్ రెగ్యులర్ సమావేశాలలో సాధారణంగా ఎజెండా ఈ విధంగా వుంటుంది. ప్రత్యేక పరిస్థితుల్లో అవసరాన్ని బట్టి ఈ ఎజెండాలో కొద్దిపాటి మార్పులు చేర్పులు అవసరం అయితే చేసుకోండి.

**1. Meeting Call to Order**

లయన్స్ అంతర్జాతీయ సంస్థ నా భుజ స్కంధాలపైన ఉంచిన బాధ్యతలు అధికారాల రీత్యా ఈ సభను ప్రారంభిస్తున్నాను. (I call this meeting to order) అని లేచినుంచుని గ్యావెల్‌తో గోంగ్‌పైన సన్నగా ధ్వనింపచెయ్యాలి.

**2. Prayer & Flag Salutations**

ఒకరిద్దరు సభ్యులకు ప్రార్థన, పతాక వందనాలు చెయ్యమని ముందుగానే తెలియచేసి, ప్రిపేరు అయి రమ్మని కోరండి. అక్కడకు వచ్చిన తర్వాత పుస్తకం వెతుక్కోవడం, కళ్ళజోడు వెతుక్కోవడం వంటి దుస్థితులు కలుగకుండా వుంటాయి.

ఇవి జరుగుతున్నంత సేపూ సభ్యులు లేచినుంచొని వుండాలి. వేదిక పైన జెండా వుంటే పతాక వందనం చేసేప్పుడు ఆ జెండానే చూస్తూ నిలుచోవాలి. జెండా లేకపోతే, పతాక వందనం చేసే వ్యక్తిని చూస్తూ నిలుచోవచ్చు. ప్రార్థన, పతాకవందనాన్ని చేసే వ్యక్తులతో గొంతుకలిపి అందరూ ఒకేసారి కోరస్‌గా చేయవచ్చుకూడా!

3. ప్రపంచ శాంతి కోసం మౌనం.

4. అధ్యక్షుడి తొలి పలుకులు :

ముఖ్య అతిధి పాల్గొన్న సమావేశాల్లో సభాధ్యక్షుడిగా మీ తొలిపలుకులలో సభకు, అతిధులకు స్వాగతం పలుకుతూ, క్లబ్ గురించిన వివరాలు, మీ సేవా కార్యక్రమాల సమాచారాన్ని క్లుప్తంగా ప్రస్తావించండి. ముఖ్య అతిధి ఉపన్యసించబోయే అంశం గురించి కొద్దిపాటి పరిచయ వాక్యాలు ఇవ్వండి. మీ తొలిపలుకులు అనేవి తేదీలు గంటల చిట్టాలాగా సాగదీయకండి. మీరు కూడా మీ కోసం కొద్ది నిమిషాలు కేటాయించుకొని దానికి బద్ధులై ముందుగా ప్రిపేరై ప్రసంగించండి.

5. సభకు విచ్చేసిన ఇతర లయన్స్ క్లబ్ సభ్యుల పరిచయం (Recognition of Visiting Lions)

6. సెక్రటరి రిపోర్ట్

7. ముఖ్య అతిథి పరిచయం :

ముఖ్య అతిథిని ఆహ్వానించడానికి వెళ్ళినప్పుడే వారి బయోడేటా వివరాలు తెలుసుకొని, మీ క్లబ్‌లో చక్కగా మాట్లాడగలిగిన సభ్యునితో గానీ, పరిచయం వున్న సభ్యునితో గానీ ముఖ్యఅతిథి పరిచయం చేయించండి. వారికి లేని గుణాలను ఏకరువు పెట్టి పొగుడుతూ గాని, అలాగని మరీ పొడి పొడి మాటలతో వారి ఔన్నత్యాన్ని తగ్గిస్తూ గాని ముఖ్య అతిథిని పరిచయం చేయకూడదు.

ముఖ్య అతిథి మాట్లాడవలసిన అంశం గురించి అందుకు కేటాయించిన సమయం గురించి వారితో ముందుగానే చెప్పడం మరిచిపోకండి.

8. ముఖ్య అతిథిని పుష్పమాలాంకృతుని చేయడం.

9. ముఖ్యఅతిథి ప్రసంగం.

10. ముఖ్యఅతిథితో ముఖాముఖి :

ప్రసంగాంశం మీద సభ్యులు తమ సందేహాలను మాత్రమే అడిగేట్లుగా మీరు చర్యలు తీసుకోండి. ముఖ్య అతిథితో వాదనకు దిగడం, ఆయన అభిప్రాయాలను ఖండించడం వంటివి సభామర్యాదని దెబ్బతీస్తాయి.

11. ముఖ్యఅతిథి ప్రసంగానికి ప్రతిస్పందన.

సభాధ్యక్షుడిగా మీరే ముఖ్యఅతిథి ప్రసంగానికి ప్రతిస్పందన ఇస్తే మంచిది. ఒకవేళ మీ సభ్యుల్లో పెద్దలకు ఈ అవకాశం ఇవ్వదలిస్తే ఆ విషయాన్ని ముందుగా ఆ సభ్యుడికి తెలియచేయండి.

12. ముఖ్యఅతిథికి మెమెంటో బహూకరణ.

13. ఇతర అంశాలు.

14. వందన సమర్పణ :

15. జనగణమన : రాత్రి పది గంటలు దాటిన తర్వాత సమావేశం ముగుస్తుంటే, జనగణమణ చేయకండి.

16. Meeting adjourned : సమావేశం ముగిసినట్టుగా ప్రకటిస్తూ లేచి నిలబడి గోంగ్‌ని ధ్వనింపచేసి "The meeting is Adjourned" అని పలకండి.

**క్లబ్ బోర్డ్ సమావేశాలలో ఎజెండా**

1. సమావేశ ప్రారంభం (Call to order by president)
2. హాజరు కాలేని సభ్యులు ముందుగా తెలియజేసిన సమాచారం చదవడం (Roll Call)
3. అధ్యక్షుడి తొలిపలుకులు (Remarks by President) ఆరోజు చర్చనీయాంశాల సంక్షిప్త పరిచయం చేయండి.
4. గత నెల బోర్డ్ సమావేశంలో చేసిన తీర్మానాలను మినిట్స్ బుక్‌లోంచి చదివి వాటికి ఆమోదం పొందడం (Reading and approval of minutes of previous meeting)
5. సందేశాలు, సమాచారాలు Reading of Communications
6. వివిధ కమిటీ ఛైర్మన్‌లు మరియు క్లబ్ ఆఫీసర్ల రిపోర్ట్‌లు చదివి వినిపించడం, లేదా ఆయా వ్యక్తులు సమావేశంలో వుంటే వారికి ఆ అవకాశం ఇవ్వడం (Reports of Officers andCommittee Chairmen)
7. గతంలో తీర్మానాలు చేయకుండా వదిలినవి, లేదా చర్చ కొనసాగుతున్న అంశాల పరిశీలన (Old and Unfinished Business)
8. M.M. రిపోర్ట్, డిస్ట్రిక్ట్‌కు పంపిన యాక్టివిటి రిపోర్ట్‌ల వివరాలను బోర్డుకు తెలియ చేయడం,
9. సెక్రటరీ రిపోర్ట్ (గత నెల నుంచి ఇప్పటి వరకూ చేసిన కార్యక్రమాల వివరాలు)
10. ట్రెజరర్ రిపోర్ట్ - (ఈ నెల రోజులలో ఆదాయ వ్యయాల గణాంక వివరాలు, అక్కౌంట్‌లు చెప్పడం)
11. కొత్తగా చేపట్టవలసిన కార్యక్రమాలు కొత్తగా చేయవలసిన తీర్మానాలు (New Business)

12. ఇతర విషయాలు (అధ్యక్షుని అనుమతితో)
(Any other Matter with the permission of Chair)
13. సమావేశం ముగింపు

**సభాధ్యక్షుడిగా మీరు రాణించాలంటే...**

సభాధ్యక్షుడిగా చాలా సమర్థులని మిమ్మల్ని నలుగురూ ఎప్పుడు ప్రశంశిస్తారంటే.

టాపిక్‌ని ట్రాఫిక్ తప్పించి, సభాసదుల్ని హింసించే ఉపన్యాసకులు గానీ, మాట్లాడే ఇతర సభ్యులు గానీ సభ సహనాన్ని పరీక్షిస్తున్నప్పుడు మీరు మౌన ప్రేక్షకుడి పాత్రను పోషించకుండా, అవతలి ఉపన్యాసకుడి మనసు బాధపడకుండా, చాకచక్యంగా ఆయన్ని దారిలో పెట్టినప్పుడు;

అందరి అభిప్రాయాల్ని మీరు పరిగణనలోకి తీసుకొని వాటిని క్రోడీకరించి, సింహావలోకనం చేసి, అందరికి ఆమోదయోగ్యమైన తీర్మానాన్ని తయారు చేయగలిగినప్పుడు

అభిప్రాయ భేదాలు సభ్యుల్లో తలెత్తితే వాటిని అందరికీ ఆమోదయోగ్యంగా పరిష్కరించ గలిగినప్పుడు.

ఒక వర్గం విజేతలుగా, ఇంకోవర్గం పరాజితులుగా వుండేలా మీరు తీర్పు (రూలింగ్) ఎన్నటికీ ఇవ్వవద్దు. అది మీ స్థానాన్ని బలహీన పరుస్తుంది.

వేడి చర్చలు జరిగినప్పుడు ఎవరైనా సభ్యుడు మానసికంగా బాధ పడినట్లు కనిపిస్తే వెంటనే ఆ సభ్యుడిని ప్రత్యేకంగా గుర్తించి సంతృప్తి పరచి తిరిగి మామూలు స్థితికి ఆయన్ని తీసుకురావడానికి ప్రయత్నించండి. క్లబ్‌లో మీ ఇమేజ్ పెరుగుతుంది.)

**ముఖ్య అతిథిని పిలిచినప్పుడు...**

చీఫ్ గెస్టని ఆహ్వానిస్తూ అధికారికంగా క్లబ్‌కు సంబంధించిన వివరాలు, లయనిజం ప్రాశస్త్యం, మీ క్లబ్ సాధించిన విజయాలు సంక్షిప్తంగా ఉటంకిస్తూ ఒక ఉత్తరం సెక్రటరీ గారిచేత రాయించండి. ఆయన అంగీకరించాక ధన్యవాదాలు తెలుపుతూ, సమావేశం తేదీని, సమయాన్ని గుర్తు చేస్తూ ఆహ్వానం జతపరిచి మరొక ఉత్తరం రాయడం గౌరవప్రదం.

సమావేశం జరిగిన తర్వాత ముఖ్య అతిధికి కృతజ్ఞతలు చెబుతూ, వారు ప్రసంగిస్తున్న ఫోటో, ప్రెస్ రిపోర్ట్ కాపీలు వగైరా పంపించండి.

ఆయన సభకు వచ్చినప్పుడు, ఒంటరిగా వదలకుండా అధ్యక్షులుగా మీరుగాని, క్లబ్‌లో ముఖ్యులుగానీ ఆయనతో గడపడం, ఆయనను సాదరంగా ఆహ్వానించడం, సాదరంగా వీడ్కోలు పలకడం వంటి మర్యాదలను మరిచిపోకండి. గ్రీటర్స్ కమిటీ బాధ్యతలలో ముఖ్య అతిథి, అతిథుల మర్యాదలు ముఖ్యమైనవి.

ముఖ్య అతిధికి సభా ముఖంగా మీరు టైం లిమిట్‌ని చెప్పకండి. ఎంత సమయం కేటాయించగలరో వ్యక్తిగతంగా తెలియజేయండి. ఎంత పెద్ద ఉపన్యాకులైనా 20-30 నిమిషాలకు మించి ఉపన్యాసాలు సాగకుండా వుంటే మంచిది. వేదికపైన మధ్యలో వున్న కుర్చీలో అధ్యక్షుడు కూర్చోవాలి. ఆయనకు కుడివైపున ముఖ్య అతిధి ఆశీనులు కావాలి.

సభ జరుగుతున్నంత సేపూ ఎట్టి పరిస్థితు ల్లోనూ సభాధ్యక్షుడిగా మీరు మీ సీట్లోంచి లేచి ఇవతలకు రాకండి. మీ సీట్ ఖాళీగా వుండి సభ జరగడం సత్సాంప్రదాయం కాదు. మధ్యలో వెళ్ళి అతిధులకు వీడ్కోలు చెప్పడం వంటి పనుల కోసం కూడా మీరు సీటు వదిలి వెళ్ళకండి. ఆ బాధ్యతలు గ్రీటర్ కమిటీకి అప్పగించండి. ఒకవేళ తప్పనిసరిగా మీరు సీటు వదలి

ఇవతలకు రావలసి వస్తే, ఉపాధ్యక్షుణ్ణి పిలిచి ఆ బాధ్యత అప్పగించి వెళ్ళండి. సమావేశం జరుగుతుండగా టిఫిన్లు, భోజనాలు ఏర్పాటు చేయడం డిగ్నిఫైడ్‌గా వుండదు.

**సభలో గలభాని నివారించడంలో మీ చాకచక్యం**

ఒక్కోసారి మీ నాయకత్వానికే విషమ పరీక్ష ఎదురు కావచ్చు. క్రమశిక్షణ మరిచిన సభ్యుల వలన గానీ, మీ నాయకత్వాన్ని ప్రశ్నించే సభ్యుల వలన గానీ చికాకులు కలిగినప్పుడే చాకచక్యంగా వాటిని ఎదుర్కొని సభను దారిలో పెట్టగలగాలి.

ఇలాంటి పరిస్థితులు ఎప్పుడూ ఒకేలా వుండవు. కాబట్టి, ఈ సమస్యలకు పరిష్కారాలు కూడా ఒకేలా వుండవు. మీకు మార్గదర్శకంగా వుండేందుకు ఈ సూచనలను పరిశీలించండి.

మనం చెబితే విననివాళ్ళు, ఇంకెవరి ద్వారానైనా చెప్పిస్తే వింటారేమో వెదికి వారికి ఆ బాధ్యత అప్పగించడం ఒక చాకచక్యం. ఎలాగైనా శాంతిని సాధించి, అధ్యక్షుడిగా మీరు విజయ పథాన నడవగలగాలి. సమావేశం మొదలుకాగానే కొందరు సభ్యులు తమలో తాము గుసగుసలు ప్రారంభిస్తారు. విషయాన్ని పైకి చెప్పరు. ఇలాంటి వారితో తరచూ సభా నిర్వహణ చీకాకుగా వుంటుంది. వీరి మనసులో వున్న ఆలోచనని ఒక ప్రతిపాదన (Motion) గా పెట్టమని మీరు ఆహ్వానించండి. దానిపైన బహిరంగంగా చర్చిద్దామని సూచించండి - అనవసరమైన గుసగుసలు అక్కడితో ఆగిపోతాయి.

సభ్యుల మనోభావాల్ని వారి ప్రవర్తనని బట్టి మీరు కొంత వరకూ అంచనా వేసి తదనుగుణంగా నిర్ణయాలు తీసుకోగలగడం మరో చాకచక్యం. సమావేశంలో సభ్యుల ముఖ కవళికలు, శరీరంలో కదలికల్ని మీరు అర్థం చేసుకోగలగాలి. ఒక సభ్యుడు అసహనంగా ఉన్నాడని, లేదా ఏదో మాట్లాడడానికి ప్రయత్నిస్తున్నాడని, దీని అర్థం కావచ్చు. జరుగుతున్న చర్చ తికమకగా వుందని కూడా అర్థం కావచ్చు. ఆ సభ్యుడు కొంచెం వ్యతిరేకంగానో, అయిష్టంగానో, ఆగ్రహంగానో వున్నాడని కూడా అంచనా వేయవచ్చు. ఇదే "బాడీ లాంగ్వేజి" అంటే!! అది మీరు చదవగలగాలి.

A) వాళ్ళు ఏదైనా సలహానో, సూచననో ఇద్దామని అనుకుంటూండవచ్చు

B) ఫలానా కార్యక్రమం ఏదైనా ప్రతిపాదిద్దామని అనుకుంటూండవచ్చు.

C) తోటి లయన్స్ సభ్యులతో ఫెలోషిప్‌ని ఇంకా పెంచుకోవడానికి ప్రయత్నిస్తూండవచ్చు.

D) తమ మనసులోని ఉద్వేగాల్ని (emotions) వ్యక్త పరచాలని కోరుకుంటూండవచ్చు.

E) వారికి తెలిసిన ఏదైనా విషయాన్ని నలుగురితో పంచుకోవాలనుకుంటూండవచ్చు.

ఇలా సభ్యులు అనేక రకాల భావనల్ని మనసులో పెట్టుకుని, వాటిని స్పష్టంగా వ్యక్తపరచలేకపోవడాన కొన్ని ఇబ్బందులు కల్గుతుంటాయి. అధ్యక్షుడు సభ్యుల మనసెరిగి మెలగ గలగడం అద్భుత చాకచక్యం.

★ సభ్యులందరినీ పేరుపేరునా గుర్తుపెట్టుకొని గుర్తించండి. అది మీ ప్రతిభను చాటుతుంది.

★ పార్లమెంటరీ సాంప్రదాయం ప్రకారం ఎప్పుడు మీ సభ్యుణ్ణి మాట్లాడవద్దని కోరాలో, ఎప్పుడు ఏ నిర్ణయాన్ని ఓటింగ్ కోసం పెట్టాలో, ఎప్పుడు ఏ సమస్యని వాయిదా వెయ్యాలో లేక ఒక కమిటీకి అప్పగించాలో చక్కగా ఆలోచించి, తెలివిగా మసలుకో గలిగినప్పుడు ఆ అధ్యక్షుడు దక్షుడనిపించుకొంటాడు.

# కార్యదర్శి

## కరణేషు మంత్రీ - కార్యక్రమ సంధాత

## SECRETARY- THE LIAISON OFFICER

క్లబ్ సెక్రటరీని లయనిజం కార్యక్రమ సంధాత (Liaison) గా భావిస్తారు.

"కరణేషు మంత్రి" అనదగిన రీతిలో సెక్రటరీ గారి బాధ్యతలు నడుస్తాయి. అటు క్లబ్ ప్రెసిడెంట్‌నీ, ట్రెజరర్‌నీ, ఇటు క్లబ్‌సభ్యుల్నీ, బోర్డునీ సమన్వయ పరచుకొంటూ చక్కని సంధానకర్తగా వ్యవహరిస్తారు క్లబ్ సెక్రటరీ!

లయనిజంలో మంచి సెక్రటరీగా రాణించగలిగిన వ్యక్తి నిజజీవితంలో కూడా ఉన్నతమైన వ్యక్తిత్వ వికాసం సంతరించుకో గలుగుతారు. ప్రణాళికబద్ధమైన పనితీరుని అలవరచు కోడానికి క్లబ్ సెక్రటరీగా విధులు నెరవేర్చడం ఒక గొప్ప అవకాశం!

**సంసిద్ధత : PREPARATION**

సెక్రటరీ బాధ్యతలు స్వీకరించేందుకు ముందుగా మానసికంగా సన్నద్ధులు కండి.

అందుబాటులో వున్న అవకాశాల్ని ఉపయోగించుకోవడం గురించి ఆలోచించండి.

మీ క్లబ్ గురించి, దాని సభ్యుల గురించి, ఇన్నేళ్ళుగా దాని పని తీరు గురించి తెలుసుకోండి.

లయనిజం పట్ల అవగాహన పెంచుకోండి. ఇంటర్నేషనల్ నుంచి వచ్చే వివరాలన్నింటినీ క్షుణ్ణంగా చదివి అర్థం చేసుకోండి.

**లక్ష్య నిర్దేశం Goal setting**

పాలనా పరంగానూ, సేవా పరంగానూ ఏడాదికాలం చేపట్టవలసిన కార్యక్రమాల గురించి అధ్యక్షుడితో కలిసి లక్ష్యాన్ని నిర్దేశించుకోండి.

వాటిని అమలు చేయడానికి ఒక ప్రణాళికని కొన్ని మార్గదర్శక సూత్రాల్ని రూపొందించుకోండి.

ఈ సంవత్సరకాలంలో మీ కున్న సమయాన్ని లయనిజంకోసం ఎంతమేర వినియోగించగలరో ముందుగానే టైమ్ షెడ్యూలు వేసుకోండి.

మీరు సమయాన్ని సరిగా వినియోగించు కోవడంలో విఫలమై, ఆ తప్పుని మీ క్లబ్‌మీదకు, మీ సభ్యుల మీదకు నెట్టి లయనిజాన్ని నిందించే పరిస్థితులు తీసుకురాకండి.

ముందుగానే ప్రణాళికలు వేసుకొని అధ్యక్షుడితో అవగాహనతో కలిసి పనిచేయడం ప్రారంభించండి. లయన్స్‌జిల్లా గవర్నర్ కార్యక్రమాన్ని, లయన్స్ అంతర్జాతీయ అధ్యక్షుడి కార్యక్రమాన్ని చక్కగా చదివి అవగాహన చేసుకోండి.

జిల్లా కేబినెట్ ఆమోదించి పంపిన డిస్ట్రిక్ట్ కంటెస్ట్ రూల్స్‌ను కూడా చక్కగా చదవండి. వాటి ప్రకారం సంవత్సర ప్రణాళికని రూపొందించుకోగలిగితే సెక్రటరీగా మీ పదవీకాలం విజయవంతంగా ముగిసినట్లే!

తప్పనిసరిగా మనం జరుపుతూ వస్తున్న కార్యక్రమాలు కేలెండర్ ఆప్ ఈవెంట్స్‌ని కూడా తెలుసుకొని సమయం కేటాయించుకోండి.

డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్, రీజియన్ కాన్ఫరెన్స్, జోన్ షోషల్, జోన్ అడ్వయిజరీ సమావేశాలు కేబినెట్ ఇన్‌స్టలేషన్ వంటి కార్యక్రమాలకు మీరు వ్యక్తిగతంగా విధిగా హాజరుకావాలి. వాటి తేదీలను ముందుగానే అడిగి తెలిసికొని, సమయాన్ని కేటాయించుకోండి.

### క్లబ్ సెక్రటరీ ప్రధాన ప్రధాన విధులు

### SPECIFIC DUTIES OF A CLUB SECRETARY

A తన క్లబ్‌కు సంబంధించిన విధులు

**towards home club**

క్లబ్‌కు సంబంధించిన జనరల్ రికార్డ్ అంతా క్లబ్ సెక్రటరీ అధీనంలో వుంటుంది.

మినిట్స్ పుస్తకం, కమిటీ నియామకాల వివరాలు, ఎలెక్షన్ల వివరాలు అన్నీ ఈ రికార్డుల కోవలోకే వస్తాయి. క్లబ్ సభ్యులకు వ్యక్తిగతంగా ఇంటర్నేషనల్ నుంచి వచ్చే కీ అవార్డ్స్, షెవ్రాన్‌లు వగైరా వివరాలు కూడా సెక్రటరీగారే రికార్డ్ చేయవలసి వుంటుంది.

నెలకొకసారి బోర్డుసభ్యులకూ, ప్రతి మూడు నెలలకీ డిస్ట్రిక్ట్‌కూ, జనరల్ బోడీ సభ్యులకు, ఆరునెలలకొకసారి ఇంటర్నేషనల్‌కు ఫైనాన్షియల్ స్టేట్‌మెంట్ తయారుచేసి అందజేయడం, సంవత్సరాంతంలో వాటిని ఆడిట్ చేయించడం సెక్రటరీగారి బాధ్యతే!

క్లబ్ సభ్యులనుంచి సభ్యత్వ బకాయీలు వసూలుచేసి బ్యాంక్‌లో వేయడంగాని, ట్రెజరర్‌కు అప్పగించడంగానీ చేయండి.

ప్రతి సభ్యునికీ సంవత్సర ప్రారంభంలోనే ఆయన చెల్లించవలసిన రుసుములు, బకాయిలతో సహా చెల్లించమని కోరుతూ బిల్లు పంపించడాన్ని మరిచిపోకండి!

క్లబ్ రెగ్యులర్ సమావేశాలు, బోర్డ్ సమావేశాలు, ఎన్నికలు, బడ్జెట్ వంటివి జరిగే బిజినెస్ సమావేశాలు, ఇతర కార్యక్రమాలకు సంబంధించిన ఆహ్వానాలు, సర్క్యులర్లని సకాలంలో సభ్యులకు అందేలా చూడవలసిన బాధ్యత సెక్రటరీదే!

మీ సర్క్యులర్‌లోనే మీ పనితీరు, మీ చాకచక్యం, ఆకర్షణీయంగా సభ్యులకు కన్పించాలి. అందమైన, అర్ధవంతమైన ఆహ్వానపత్రాలు ఎక్కువమంది హాజరయ్యేలా చేస్తాయి. మీరు సౌహార్ద్రంగా ఓ టెలిఫోన్‌కాల్ చేసి, వ్యక్తి గతంగా ఆహ్వానించగలిగితే, ఇంకా ఎక్కువ మంది సభ్యుల్ని హాజరయ్యేలా చెయ్యగల్గిన వారౌతారు సమావేశాలకు రాకుండా తప్పించుకొంటున్న సభ్యులతో ప్రత్యేకంగా భేటీ వెయ్యగలిగితే మీ సభ్యుల్ని నూరుశాతం హాజరయ్యేలా చేయగల్గిన ఘనత మీకు దక్కుతుంది. అందుకు మెంబర్‌షిప్ కమిటీని వినియోగించండి.

బోర్డు సమావేశాల మినిట్స్‌నీ, జనరల్ బాడీ సమావేశాల (బిజినెస్ సమావేశాలు) మినిట్స్‌నీ సకాలంలో తయారుచేసి సభ్యులకు అందజేస్తే సెక్రటరీగా మీరు సెహభాష్ అన్పించు కొంటారు.

డిస్ట్రిక్ట్‌నుంచి, మల్టిపుల్ నుంచీ, ఇంటర్నేషనల్ నుంచీ వచ్చే సమాచారాన్ని బోర్డుకూ జెనరల్ బాడీకి వివరిస్తూ వుంటే, సాధారణ సభ్యులకు కూడా లయనిజం ఎటునడుస్తోందో ఒక అవగాహన కల్గుతుంది. ఈ బాధ్యత నెరవేర్చినందుకు మీకు మంచి గుర్తింపు గౌరవం మీ సభ్యుల్లో లభిస్తుంది.

**జోన్ స్థాయిలో క్లబ్ సెక్రటరీ విధులు**

**TOWARDS THE ZONE**

నెలనెలా పంపే ఎం.ఎం రిపోర్ట్ జిరాక్స్ కాపీని జోన్/ చైర్‌పర్సన్‌కు కూడా పంపడం మరిచి పోకండి.

మూడు నెలలకొకసారి జరిగే డిస్ట్రిక్ట్ గవర్నర్స్ జోన్ అడ్వయిజరీ సమావేశాలలో మీరు, మీ అధ్యక్షులు, ఉపాధ్యక్షులు, కోశాధికారి తప్పకుండా హాజరుకావాల్సి వుంటుంది. మరిచిపోకండి.

జోన్‌సోషల్ - లయన్స్‌కుటుంబ విహార కార్యక్రమాల్లో కూడా మీరు మీ కుటుంబంతో సహా సంతోషంగా పాల్గొనవలసి వుంటుంది.

**రీజియన్ స్థాయిలో క్లబ్ సెక్రటరీ**

**TOWARDS THE REGION**

ఎం.ఎం రిపోర్ట్ కాపీని రీజియన్ చైర్‌పర్సన్‌కు కూడా పంపడం మరిచిపోకండి.

సంవత్సరం ఆరంభంలోనే రీజియన్ సెమినార్ / స్కూలింగ్ నిర్వహిస్తుంటారు. మీరూ, మీ అధ్యక్షులు, ఉపాధ్యక్షులు, కోశాధికారీ ఈ సెమినార్‌కు తప్పనిసరిగా హాజరు కావాలి. ఎందుకంటే, సెక్రటరీగా మీ విధుల్ని బాధ్యతల్ని వివరించిచెప్పే వేదిక ఇది.

రీజియనల్ మీటింగ్‌లో మీ క్లబ్‌నుంచి మీతో సహా ఎక్కువమంది సభ్యులు హాజరయ్యేలా చూడండి. కుటుంబంతో హాజరు కావాల్సిన సమావేశం ఇది.

రీజియన్ సెమినార్‌కుగాని, రీజియనల్ మీటింగ్‌కు గాని నిర్వహణ విషయంలో మీరు సహకారం అందించవలసి వుంటుంది.

### జిల్లా స్థాయిలో క్లబ్ సెక్రట్రీగా మీ విధులు

### TOWARDS DISTIRCT ADMINISTRATION

జిల్లాస్థాయిలో జరిగే కార్యక్రమాలన్నింటి లోనూ మీరు విధిగా పాల్గొంటూ క్లబ్ సభ్యులు కూడా ఎక్కువమంది హాజరయ్యేలా చూడడం మీ బాధ్యత.

కేబినెట్ ఇన్‌స్టలేషన్ ఫంక్షన్, డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్, ఓరియెంటేషన్ సెమినార్లు, MERL సెమినార్లు వంటి కార్యక్రమాలకు మీ హాజరు తప్పనిసరి.

జిల్లా గవర్నర్ గారి అధికార పర్యటనకు తేదీని ఖరారు చేసుకోండి.

సంవత్సరం చివర్లో PU-101 ఫారం, A1, ఫారం, ప్రెసిడెంట్ ఎక్స్‌లెన్స్ అవార్డు ఫారం వగైరాలు పూర్తిచేసి సకాలంలో ఇంటర్నేషనల్‌కు పంపడం కూడా మీ బాధ్యతే!

వీటిని విధిగా నెరవేర్చవలసి వుంటుందని నెరవేరుస్తానని మీరు మానసికంగా సన్నద్ధులు కావడం అవసరం.

### లయన్స్ ఇంటర్నేషనల్ స్థాయిలో క్లబ్ సెక్రటరీ విధులు

### TOWARDS CLUBS INTERNATIONAL

ప్రతినెలా ఎం.ఎం.రిపోర్ట్‌ని ఎలాంటి తప్పులూ లేకుండా సకాలంలో ఇంటర్నేషనల్‌కు పంపడం సెక్రటరీ విధుల్లో మొట్టమొదటిది. క్లబ్ మనుగడకు ఇది ముఖ్యమైన విషయం. క్లబ్ సెక్రటరీగా మీకు అందే ప్రతి సమాచారాన్నీ క్లబ్ ప్రెసిడెంట్‌కు, బోర్డు సభ్యులకూ, సంబంధిత సభ్యులకూ తెలియ చేయడం కూడా అత్యవసరమైన బాధ్యతే! ఈ సమాచారంలో లయన్స్ అంతర్జాతీయ విశేషాలే కాకుండా క్లబ్‌కు సంబంధించిన సమాచారం, కీ అవార్డ్‌లు, పిన్‌లు, షెవ్రాన్‌లు ఎక్స్‌టెన్షన్ అవార్డులు వంటివి కూడా వుంటాయి. అవి నేరుగా క్లబ్ సెక్రటరీకే వస్తాయి. వాటిని భద్రపరిచి గౌరవ పూర్వకంగా ఆయా సభ్యులకు బహూకరింపచేయడం సెక్రటరీగా మీ బాధ్యత. మీరిలా చేయవలసి వుంటుంది కాబట్టే, ఇంటర్నేషనల్ నుంచి ప్రతిఅంశం మీకే పంపడం జరుగుతుంది. ఇది గమనించండి!

### తనచుట్టూ వున్న సమాజం పట్ల క్లబ్ సెక్రటరీ విధులు

### TOWARDS THE SOCIETY

క్లబ్ సెక్రట్రరీ, క్లబ్ పౌరసంబంధాల అధికారి (PRO) కలిసి క్లబ్ ప్రతిష్ఠ ప్రాభవాల్ని పెంపొందింపచేసే కార్యక్రమాలను రూపొందించి అమలుపరచవలసి వుంటుంది.

మీరు చేస్తున్న కార్యక్రమాల వివరాలను, ఫోటోలను ఎప్పటికప్పుడు వార్తా పత్రికలకు పంపుతూ వుండండి. ఎప్పుడూ వార్తల్లో వుండేందుకు ప్రయత్నించండి.

విలేకరులను ఆహ్వానించండి. మీడియా ఛానెల్స్‌లో మీ సేవా కార్యక్రమాల 'స్ట్రిప్స్' వచ్చేలా కొంతమేర మీ పలుకుబడి వినియోగించండి.

పురప్రముఖుల్ని, సేవా తత్పరుల్ని కూడా మీ కార్యక్రమాలకు ఆహ్వానించి, వారి సహకారం పొందడం, వారికి కూడా ఆయా కార్యక్రమాలలో భాగస్వామ్యం కల్పించడం చేయండి.

### క్లబ్ రికార్డులే క్లబ్ ఆస్తులు

**RECORD KEEPING – GENERAL SUGGESTIONS**

క్లబ్ విషయాలు అన్ని క్లబ్‌లకూ ఒకేలా వుండవు. ప్రతిక్లబ్‌కూ వారికంటూ ఒక ప్రత్యేక విధానం వుంటుంది. సాధారణంగా వుండే అంశాలు ఇవి :

★ మినిట్స్ పుస్తకాలు – బోర్డు సమావేశాలకు, రెగ్యులర్ సమావేశాలకు విడివిడిగా వుండాలి. ఎప్పటికప్పుడు అందులో హాజరైన సభ్యుల సంతకాలు, జరిగిన సమావేశపు మినిట్స్ తాజాగా పూర్తిచేసి వుండాలి.

★ డిస్ట్రిక్ట్ డైరెక్టరీ

★ క్లబ్ రాజ్యాంగం నియమావళి (లేదా డిస్ట్రిక్ట్ – మల్టిపుల్ రాజ్యాంగం నియమావళి)

★ క్లబ్ మెయిలింగ్ లిస్ట్

★ కార్యనిర్వాహక కమిటీల వివరాలు

★ మెంబర్‌షిప్ ప్రపోజల్ ఫారాలు పిన్స్, మెంబర్‌షిప్ కార్డ్స్, అటెండెన్స్ మేకప్ ఫారాలు,

ఒక ముఖ్య విషయం. వ్యాపార ప్రయోజనాలు ఆశించే వ్యక్తులకు మీ క్లబ్ మెంబర్‌షిప్ మెయిలింగ్ లిస్ట్‌నుగానీ, డిస్ట్రిక్ట్ డైరెక్టరీగాని తొందరపడి ఇచ్చెయ్యకండి. వారి వలన మన సభ్యులకు ఇబ్బందులు కలగకుండా చూడవలసిన బాధ్యత సెక్రటరీదే!

### ఇంటర్నేషనల్ బిల్లింగ్

ప్రతి సభ్యుడిపేరునా క్లబ్‌లో సంవత్సర చందా ఒకేసారి వసూలు చేస్తారు. కానీ, ఇంటర్నేషనల్ మాత్రం రెండు దఫాలుగా బిల్లింగ్ చేస్తుంది.

మొదటి ఆరునెలలకు ఒకసారి, రెండో ఆరు నెలలకు ఇంకోసారి బిల్లింగ్ చేసి క్లబ్‌లకు పంపిస్తుంది.

జూన్ 20వ తేదీన మే నెల ఎం.ఎం. రిపోర్ట్ ఆధారంగా మొదటి బిల్లింగ్ చేస్తారు.

డిసెంబర్ 20వ తేదీన నవంబర్ నెల ఎం.ఎం రిపోర్ట్ ఆధారంగా రెండవ బిల్లింగ్ చేస్తారు. బిల్లింగ్ చెయ్యడం అంటే అర్థం, ఈ ఆరునెలలకూ కలిపి చెల్లించవలసిన మొత్తం ఎంతో తెలియజేయడం.

ఇంటర్నేషనల్‌కు చెల్లించే మొత్తం అమెరికన్ డాలర్లలో వుంటుంది. దాన్ని మన రూపాయిల్లోకి మార్చి ఎప్పటికప్పుడు సొమ్ము చెల్లిస్తుంటాం.

ఏ నెలకానెల 'డాలర్‌తో రూపాయి మారకం విలువని అంతర్జాతీయ మార్కెట్ రేట్‌ని బట్టి నిశ్చయం చేసి నెలకు ముందుగానే తెలియజేస్తుంది ఇంటర్నేషనల్. ఇంటర్నేషనల్ చెల్లించే ఏ మొత్తం అయినా సరే ఆ నెల రూపాయి మారకం విలువని బట్టి చెల్లిస్తుంటాం మనం.

క్లబ్ బకాయిలకు సంబంధించి ప్రతినెలా అక్కౌంట్స్ స్టేట్‌మెంట్, ఇంటర్నేషన్ నుంచి క్లబ్ ట్రెజరర్‌కు అందుతుంది. ఆ నెలలో కొత్తగా చేర్చిన సభ్యులకీ లేదా డ్రాప్ చేసిన సభ్యులకీ సంబంధించిన సభ్యత్వ రుసుముల వివరాలు ఆధారంగా నెలనెలా అక్కౌంట్స్ స్టేట్‌మెంట్ పంపుతుంది.

ఇంటర్నేషనల్‌కు ఆర్డర్ పెట్టి తెప్పించుకున్న వాటి ఖరీదును కూడా ఇందులోనే చూపిస్తారు.

మనం చెల్లించిన సొమ్ము ఇంటర్నేషనల్‌లో మన క్లబ్ అక్కౌంట్‌లో జమ అయ్యిందో లేదో కూడా తెలుస్తుంది.

ఒకవేళ మన లెక్కలకూ, ఇంటర్నేషనల్ లెక్కలకూ తేడా (DISCREPANCY) వున్నప్పుడు

మనం ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి సరి చేసుకోవచ్చు.

కొన్ని ముఖ్య విషయాలు గమనించండి.

1. జూన్ 20వ తేదీన మొదటి బిల్లింగ్ చేసేనాటికి ఇంటర్నేషనల్ దగ్గర క్లబ్ ఎం.ఎం రిపోర్ట్ ఆఖరుది (Latest) ఏ నెలది వుందో, అందులో చూపించిన సభ్యుల ఆధారంగా బిల్లింగ్ చేస్తారు.

అందుకే, మేనెల ఎంఎం రిపోర్ట్ పంపేప్పుడు అందులో చేర్చవలసినవారినీ, తీసివేయవల్సిన వారినీ జాగ్రత్తగా రిపోర్ట్‌చేసి సకాలంలో అందేలా పంపడం అవసరం అని గుర్తించండి.

సకాలంలో పంపడం అంటే, మన ఎం.ఎం.రిపోర్ట్ తర్వాతి నెల 20వ తేదీ బిల్లింగ్ జరిగేనాటికి ఇంటర్నేషనల్ కార్యాలయానికి అందేలా పంపడం అని!

2. ఒకసారి బిల్లింగ్ చేసేప్పుడు ఎంతమంది సభ్యులున్నారో అంతమందికీ ఆరునెలల కాలానికి బిల్లు చెల్లించవలసి వుంటుంది. ఈ ఆరునెలలోపే ఎవరైనా డ్రాప్ అయినా వారికి పూర్తి ఆరునెలల కాలానికీ బిల్లు చెల్లించవలసి వుంటుందని గమనించండి. ఉదాహరణకు అక్టోబర్‌లో ఒక సభ్యుణ్ణి క్లబ్‌లోంచి తొలిగిస్తే, డిసెంబర్ వరకూ అతని సభ్యత్వం కట్టవలసి వుంటుంది. అలాగే, మార్చిలో తొలగించిన సభ్యుడికి జూన్ నెలవరకూ చెల్లించవలసి వుంటుంది.

3. నిజానికి ఆరునెలల బిల్లింగ్ విధానాన్ని క్లబ్‌ల సౌకర్యం కోసమే ఏర్పాటు చేశారు. ఈ పద్ధతి లేకపోతే, జూలైతో మొదలయ్యే సంవత్సరానికి పూర్తిగా ఒకేసారి బిల్లు జరిగితే, మధ్యలో తొలగించినా సంవత్సరానికి సరిపడా సభ్యత్వ రుసుము కట్టవలసి వుంటుంది. కదా... అందుకని 'ఆరునెలలబిల్లింగ్ విధానం' సగంభారాన్ని తగ్గిస్తోంది.

4. సభ్యుల్ని కొత్తగా చేర్పించినప్పుడు రిపోర్ట్‌చేసిన నెలనుంచి మిగిలిన కాలానికి బిల్లు వస్తుంది.

ఎవరైనా సభ్యుణ్ణి తప్పనిసరిగా తొలగించవలసి వస్తే, అందుకు నవంబర్, మేనెలలు అనుకూలమైన కాలం.

వచ్చే సంవత్సరానికి అధికారంలో వచ్చే క్లబ్ ఆఫీసర్లు, క్లబ్‌లో సభ్యులందర్నీ ముందుగానే కలిసి, వుండేవారినీ, తప్పుకొనేవారినీ తేల్చుకోగలిగితే, క్లబ్‌పైన అనవసర ఆర్థిక భారం పడదు.

5. జూన్ 20 నాటికి అందేలా, మే నెల ఎం.ఎం. రిపోర్ట్ ఇంటర్నేషనల్‌కు పంపగలిగితే డ్రాప్‌చేసిన సభ్యులకు బిల్లుపడదు.

6. అలా పంపలేకపోయిన వారికి ఇంకో అవకాశం వుంది. జూన్ ఎం.ఎం. రిపోర్ట్‌లో నయినా వారిని డ్రాప్ చేసి జూలై 20 నాటికి ఇంటర్నేషనల్‌కు అందేలా పంపగలిగితే, డ్రాప్ అయిన వారికి తదుపరి బిల్లులో మినహాయింపు నిస్తారు.

7. జూలై నెలలోనే సంవత్సరం మొత్తానికీ మనం సభ్యత్వం మొత్తాన్నీ చెల్లించినా, మొదటి ఆరు నెలలకి రావలసిన బకాయిలు పోనూ మిగిలిన సొమ్మును క్రెడిట్‌లో చూపించి నిలవబెట్టారు. డిసెంబర్ 20న జరిగే రెండో బిల్లింగ్‌లో ఆనాటి డాలర్ రేట్ ప్రకారం ఆ సొమ్మును క్లబ్ బకాయిల్లో జమ చేస్తారు.

జూన్ నెలకన్నా డాలర్ మారకం రేటు డిసెంబర్ నెలలో తక్కువగా వుంటే క్లబ్‌కు మిగులువుంటుంది. డాలర్ రేటు పెరిగితే, ఆమేరకు అదనంగా చెల్లించవలసి వుంటుంది.

**చెల్లింపులు చేసేప్పుడు ప్రత్యేక జాగ్రత్తలు**

బ్యాంక్ డి.డి.తీసిన తర్వాత దాని వెనకవైపున క్లబ్‌పేరు, క్లబ్‌నెంబర్, డిస్ట్రిక్ట్ నెంబరు తప్పకుండా రాయండి. డి.డి తో పంపిన కవరింగ్ లెటర్ మిస్సయినా, సొమ్ము క్లబ్ అక్కౌంట్‌లోనే జమ అవుతుంది.

ఎందునిమిత్తం ఈ చెల్లింపు చేస్తున్నారో తప్పకుండా తెలియజేయండి.

ఇంటర్నేషనల్ నుంచి వచ్చిన బిల్లు జిరాక్స్ కాపీని దానితో జతచేస్తే మరీ మంచిది.

పంపుతున్న బ్యాంక్ డీ.డీ. జిరాక్స్ కాపీని, కవరింగ్ లెటర్ కాపీని మీఫైల్లో వుంచుకోండి.

ఇంటర్నేషనల్‌కు మీరురాసే ప్రతిఉత్తరం తప్పనిసరిగా జిల్లా గవర్నర్‌గారికి ఒక కాపీని పెట్టడం మరిచిపోకండి.

ఎం.ఎం. రిపోర్ట్‌తో కలిపి బ్యాంక్ డీడీని ఒకే కవర్‌లో పంపడంకన్నా, డీడీనీ కవరింగ్ లెటర్‌నీ కలిపి విడిగా పంపడమే శ్రేయస్కరం.

ఇంటర్నేషనల్‌కు పంపే డీడీలు గానీ, చెక్‌లు గానీ, బ్యాంక్ ఆర్డర్స్‌గానీ, Lions Clubs International, Payable at Mumbai పేర్న పంపించవలసి వుంటుంది. ఈ హెడ్‌ని సరిగా గమనించి, రాయండి.

**మినిట్స్ రికార్డ్‌చేసే పద్ధతి**

మినిట్స్ పుస్తకం అనేది క్లబ్ వంశవృక్షం లాంటిది తరతరాలుగా క్లబ్‌లో జరిగిన విశేషాలు తీసుకున్న నిర్ణయాలు, చేపట్టిన కార్యక్రమాలకు ఇది ప్రత్యక్ష సాక్షి!

క్లబ్ సెక్రటరీ ఈ చరిత్రకు సంధానకర్త. ఎప్పటికప్పుడు క్లబ్ కార్యక్రమాల విశేషాల్ని సక్రమంగా రికార్డ్ చేయడం సెక్రటరీ గారి బాధ్యత! ఆయన ఆబాధ్యతని నెరవేర్చగలిగితే క్లబ్ చరిత్ర పదికాలాలపాటు నిలబడి, తరువాతి తరాలకు అందుతుంది.

మన క్లబ్‌లో ఈ రోజు జరిగిన సంగతి మరునటి సంవత్సరానికే ఒక వార్తా విశేషంగానో చారిత్రక సన్నివేశంగానో వుంటుంది.

అనేక సంవత్సరాలకు సరిపడ ఒకే పెద్దపుస్తకాన్ని మినిట్స్ పుస్తకంగా వాడితే మంచిది.

గతంలో ఇదే అంశానికి సంబంధించి తీసుకున్న నిర్ణయాలు ప్రస్తుత అంశాలకు మార్గదర్శకంగా వుంటాయి.

మినిట్స్ పుస్తకం మీద మొదటిపేజీ నించి చివరి పేజీవరకూ నంబరింగ్ వుండాలి. మధ్య పేజీలను చించివేయడం, తొలగించడం వంటివి చేయకూడదు.

మినిట్స్ రాసేప్పుడు కొట్టివేతలు, తప్పులు లేకుండా, చదవడానికి వీలైన రాతతో వుంటే ఉపయోగకరంగా వుంటుంది.

బోర్డు మీటింగ్ మినిట్స్, రెగ్యులర్ సమావేశాల మినిట్స్ కోసం వేర్వేరు పుస్తకాలు వుండడం అవసరం.

అవసరమైన విషయాల్ని మాత్రమే రికార్డ్ చేయండి. అనవసరమైన అప్రధానమైన విషయాలన్నింటినీ మినిట్స్‌లో రాయనవసరం లేదు. అలాగని, చర్చలలో అభ్యంతరాలు ప్రతిపాదించినవీ, మినిట్స్‌లో రికార్డు చేయవలసినవీ రాయడాన్ని మరిచి పోకూడదు.

చర్చలు జరిగినప్పుడు, తీర్మానాలను ప్రతిపాదించిన వ్యక్తిపేరు, సెకండ్ చేసిన వ్యక్తుల పేర్లు, తీర్మానం ఫలితాల్ని తప్పకుండా రాయవలసి వుంటుంది.

సభకు అధ్యక్షత వహించిన వ్యక్తిపేరు; ప్రార్థన, పతాకవందనం చేసిన వ్యక్తులపేర్లు, హాజరయిన సభ్యుల సంఖ్య, అతిథులుగా వచ్చినవారు, హాజరుశాతం, కమిటీరిపోర్ట్స్,

చర్చనీయాంశాల వివరాలు, తీసుకొన్న నిర్ణయాలు, వక్తగా వచ్చినవ్యక్తి వివరాలు, ఉపన్యసించిన అంశం, దానిమీద సభ్యుల మనోభావాలు, అవార్డులు, మెమెంటోలు - వాటి వివరాలన్నీ మినిట్స్ పుస్తకాలలో మనం రికార్డు చేయవలసి వుంటుంది.

క్లబ్ చరిత్రను పరిరక్షించడం మినిట్స్ పుస్తకం ప్రత్యేక ప్రయోజనం కాబట్టి, రెగ్యులర్ సమావేశాల సమయంలో విశిష్ట వ్యక్తుల్ని వక్తలుగా అతిథులుగా ఆహ్వానించినప్పుడు, ఆ సమావేశం ఫొటోని ఆ పేజీలో అంటిస్తే బావుంటుంది. వారి ప్రసంగంలో ముఖ్యాంశాలు కూడా రాయడం పద్ధతి.

బోర్డు మీటింగ్ మినిట్స్ రికార్డ్ చేసేప్పుడు, ముందు అజెండా నెంబర్‌వేసి, అంశం రాసి, ఆ తర్వాత వివరాలు రాయాలి.

మినిట్స్ రెండు రకాలుగా రాస్తారు - మొదటిది, తీర్మానాల్ని మాత్రమే నోట్ చేసే పద్ధతి. రెండవది - చర్చలు సాగిన విధానాన్ని, సారాంశాన్ని కూడా రికార్డు చేసే పద్ధతి.

చర్చ జరిగిన వరుసలోనైనా రాయవచ్చు. లేదా నోటీసులోని ఎజెండా ప్రకారం రాయవచ్చు. మినిట్స్ రాయడం అనేది, మీటింగ్ జరిగేప్పుడు అప్పటికప్పుడే రాయాలని లేదు. ప్రతి చర్చనీయాంశం గురించి సెక్రటరీ నోట్సురాసుకొని, దాని ఆధారంగా మినిట్స్ పుస్తకంలో రాయాలి. గతనెల బోర్డు మినిట్స్‌ని ఈ నెలలో జరిగే బోర్డు సమావేశంలో ముందుగా చదివి వినిపించే సాంప్రదాయాన్ని ఈ సౌలభ్యంకోసమే ఏర్పరచారు.

## సర్క్యులర్ల తయారీ

## PREPARATION OF CIRCULARS

క్లబ్ సెక్రటరీ పంపించే సర్క్యులర్లు సభ్యులతో నెలకొల్పుకునే ప్రధాన సమాచార వ్యవస్థ! సెక్రటరీ సర్క్యులర్‌లు ఎంత సమర్థవంతంగా వుంటే, సభ్యుల్లో లయనిజం పట్ల ఆసక్తి అంతగా వుంటుంది.

సమావేశాల ఆహ్వానాలు అందంగా, ఆకర్షణీయంగా వుండేలా చూడండి. కొత్తదనాన్ని ప్రదర్శించడంలో మీ చాకచక్యాన్ని చాటుకోండి. బోర్డు సమావేశాల నోటీసు ఎజెండా పాయింట్లు అర్థం అయ్యేభాషలో, అన్ని విషయాలూ ఇమిడివుండేలా తయారు చేయండి. మరీ ఎక్కువ పేజీలు సర్క్యులర్‌లు తయారు చేయకండి. అందరూ చదివేంత సంక్షిప్తంగా, అందమైన భాషలో సాధ్యమైనంత వరకూ తెలుగులో సర్క్యులర్‌లు పంపండి.

లయనిజం పారిభాషిక పదాలకు తెలుగులో తేలికగా అర్థం అయ్యే అనువాదం కుదరనప్పుడు ఆయా పదాలను యథాప్రకారం ఆంగ్లంలోనే వాడండి.

ఆహ్వానాలు వగైరా రూపొందించేప్పుడు, అందులో క్లబ్ సభ్యుల వ్యక్తిగత విజయాలకు సంబంధించిన సమాచారం, పుట్టిన రోజులు, పెళ్ళిరోజులు - ఇలాంటి విషయాల్ని ఫుట్‌నోట్‌గా రాసి శుభాకాంక్షలు అందిస్తే సభ్యులు సంతోషిస్తారు- ముందుగా నిర్ణయం అయిన భవిష్యత్ కార్యక్రమాల్ని కూడా సర్క్యులర్‌లో తెలియజేస్తుంటే సభ్యులు ఆయాతేదీలలో తమ స్వంత పనుల్ని మార్చుకొనే అవకాశం వుంది!

క్లబ్ బులెటిన్ వచ్చేనెల మధ్యలో వెలువడుతుంది. అందులో కార్యక్రమ వివరాలుంటాయి. ఆహ్వానపత్రాలు, మినిట్స్ కాపీలు, ఇతర సమాచార పత్రాలు ఎప్పటికప్పుడు సభ్యులకు పంపించడం జరుగుతుంది కాబట్టి, వాటిలో ఈ విషయాలు తాజా సమాచారంగా ఉపయోగపడతాయి.

## వందన సమర్పకుడు క్లబ్ సెక్రటరీయే!

### PROPOSING VCTE OF THANKS

వందన సమర్పణగానీ, Vote of thanks గానీ సెక్రటరీ గారి బాధ్యతే!

రెగ్యులర్ సమావేశాలప్పుడు, బోర్డ్ సమావేశాలప్పుడు, ప్రత్యేక సమావేశాలప్పుడూ, కార్యక్రమం ముగించబోయే ముందు వందన సమర్పణ చేయడం సాంప్రదాయం.

వందన సమర్పకుడిగా సెక్రటరీగారు, కేవలం ధన్యవాదాలు తెలిపే బాధ్యతను మాత్రమే నిర్వర్తింపవలసి వుంటుంది.

ముఖ్యఅతిథి ప్రసంగం పై వ్యాఖ్యలు చెయ్యడం, తన స్వంత అభిప్రాయాలు ప్రకటించడం, తను ప్రత్యేకంగా ఉపన్యసించడం వంటివి చేస్తే సభాసదులమధ్య చులకన అవుతారు.

తెలుగులో వందన సమర్పణ విధానానికీ ఆంగ్లంలో Vote of thanks విధానానికి కొద్ది తేడా వుంది!

వందన సమర్పణ చేయడం అంటే, ఆ కార్యక్రమానికి మన ఆహ్వానాన్ని మన్నించి విచ్చేసిన అతిథులకు గౌరవ పూర్వకంగా ధన్యవాదాలు తెలపడం, ఆ కార్యక్రమ ఏర్పాట్లు సహకరించిన వారికి, స్పాన్సర్లకు, ఆతిథ్యం ఇచ్చినవారికి కృతజ్ఞతలు ప్రకటించడం, అంత సేపు ఓపికగా కూర్చున్న సభాసదులకు గౌరవం ప్రకటించడం

ధన్యవాదాలు తెలిపే తీర్మానాన్ని Vote of thanks అంటారు. ధన్యవాదాలు ఎవరికి, దేనినిమిత్తం తెలియచేస్తున్నామో వివరించి, సభ ఆమోదం కోసం తీర్మానం రూపంలో ప్రవేశపెడితే, సభాసదులు కరతాళధ్వనుల ద్వారా ఆ తీర్మానాన్ని ఆమోదిస్తారు. ఇదీ ఓట్ ఆఫ్ థ్యాంక్స్ అంటే!

## క్లబ్ సమావేశాలకు సిద్ధంగా వుంచుకోవాల్సిన అంశాలు

### CHECK - OFF LIST BEFORE A CLUB MEETING

1. గోంగ్, గ్యావెల్
2. కార్యక్రమం బ్యానర్, క్లబ్ బ్యానర్, ఇంటర్నేషనల్ బ్యానర్ (పోడియం బ్యానర్) వగైరా
3. ప్రార్థన, పతాకవందనం
4. మినిట్స్ పుస్తకం
5. ఎజెండా కాపీ, నిమిషాల ప్రకారం తయారు చేసుకున్న ప్రోగ్రాం పేపర్ Minute by Minute Programme Paper.
6. వేదికపైకి ఆహ్వానించవలసిన అతిధులను పిలవవలసిన ప్రోటోకాల్ వరుసని రాసుకొని సిద్ధంగా వుండాలి.
7. 'జ్యోతి ప్రజ్వలన' కార్యక్రమం పెట్టినప్పుడు కుంది, వత్తులు, నూనె, కొవ్వొత్తి, అగ్గిపెట్టి వంటివి ముందుగానే సిద్ధంగా వుండాలి.
8. మెమెంటోలు ఎవరెవరికి, ఏవేవి - అనేది వరుసక్రమంలో ఉంచుకుని అధ్యక్షుని చేత బహూకరింప చేయాలి.
9. వందన సమర్పణ కూడా ముందుగా తయారుచేసుకోవాలి.
10. క్లబ్ సభ్యుల్లో ఎవరికైనా "కీ" అవార్డులు గానీ షెవ్రాన్‌లుగాని, ఇంటర్నేషనల్ నుంచి వచ్చిన ఇతర గుర్తింపులుగానీ వుంటే వాటిని ఆ సమావేశంలో వున్న ఉన్నత లయన్స్ ఆఫీసర్ ద్వారా బహూకరించడానికి సిద్ధంచేసుకోవాలి.
11. సమావేశాలలో సభ్యులకు తెలియజేయాల్సిన డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ వివరాలను తయారుచేసుకోవాలి.
12. పూల దండలు, పుష్పగుచ్ఛాలు, కెమెరా, వీడియో ఏర్పాటు.

## కొత్త సభ్యుల ప్రతిష్ఠాపనోత్సవం

### INDUCTION MEETING

ఒక సభ్యుడు కలకాలం లయనిజంలో కొనసాగాలంటే, మొదటి సమావేశంలోనే ప్రేమ ఆకర్షణలు కల్గించగలగాలి. అందుకే ఆ సభ్యుణ్ణి క్లబ్‌లో ప్రవేశింపచేసే కార్యక్రమాలన్నీ ఆకర్షణీయంగా ఉన్నతంగా ప్రతిష్ఠాత్మకంగా వుండేలా చూడమని ఇంటర్నేషనల్ మనకు సూచిస్తోంది.

కొత్తగా క్లబ్‌లో చేర్తున్న సభ్యుల పేర్లు వారి వ్యక్తిగత విశేషాల్ని సేకరించి, వారిని అందంగా సభకు పరిచయం చేయండి.

కొత్త సభ్యులకు కిట్స్‌ని తెప్పించి బహూకరించడం మరిచిపోకండి. కొత్త సభ్యులకు వారి కుటుంబ సభ్యులతో సహా ఈ కార్యక్రమానికి ఆహ్వానించండి.

లయనిజంలో 'మొదటిరోజు' ఈ Induction Meeting ప్రతి కొత్త లయన్స్ సభ్యునికీ! అది మరపురాని రోజుగా, సభ్యులు గర్వపడేలా వుండాలి.

సభ్యులు చేయవలసిన ప్రతిజ్ఞ, స్పాన్సర్‌లు చేయవలసిన ప్రతిజ్ఞలు సిద్ధంగా వుంచుకోండి.

సమర్థులైన వక్తల్ని ఇండక్షన్‌కుగానీ ఇండాక్ట్రినేషన్‌కుగానీ ఆహ్వానిస్తే కొత్త సభ్యులు ఉత్తేజితులౌతారు.

### అటెండెన్స్ మేకప్ రూల్స్

క్లబ్‌లో యాక్టివ్ స్టేటస్ వున్న ప్రతి సభ్యుడికీ విధిగా వున్న ఒకే ఒక్క ముఖ్య బాధ్యత కార్యక్రమాలకు తప్పకుండా హాజరవడం!

అటెండెన్స్ అనేది సభ్యుల కనీస బాధ్యత. సమావేశాలకు సక్రమంగా హాజరుకాలేని సభ్యులకు ప్రివిలేజ్‌డ్ సభ్యత్వంగానీ, దూరప్రాంతంలో వుండే వ్యక్తికి మెంబర్ ఎట్ లార్జ్ సభ్యత్వాన్ని అవకాశం వుంటే కేటాయించడం మంచిది.

క్లబ్‌లో యాక్టివ్ సభ్యుడిగా వుండి, సమావేశాలకు రాకుండా తప్పించుకొనే అలవాటుని సాధ్యమైనంత వరకూ మాన్పించడం అవసరం.

ఏ కారణంచేతనైనా క్లబ్ సమావేశానికి హాజరుకాలేక పోయిన సభ్యుడు దానికి 13 రోజులు ముందుగాని, 13 రోజులులోపు గాని తన గైర్ హాజర్‌ను సరిచేసుకొనే వీలుంది. ఇందుకు కొన్ని మార్గాలున్నాయి.

వేరొక లయన్స్‌క్లబ్ సమావేశానికి హాజరైనట్లు తగిన సాక్ష్యాధారాలుగానీ, ఆ క్లబ్ సెక్రటరీ ద్వారా అటెంటెన్స్ స్లిప్ గానీ తీసుకొని క్లబ్‌లో అందజేస్తే హాజరు కాని రోజుకు అటెండెన్స్ పడ్తుంది.

డిస్ట్రిక్ట్ కేబినెట్‌లో సభ్యుడైన వ్యక్తి కేబినెట్ సమావేశానికి హాజరు కాలేనప్పుడు తన క్లబ్ బోర్డు సమావేశానికి హాజరైనా, క్లబ్ రెగ్యులర్ సమావేశానికి హాజరైనా కాబినెట్ సమావేశంలో అటెండెన్స్ పడ్తుంది.

అలాగే కేబినెట్ మీటింగ్ వంటి జిల్లా స్థాయి కార్యక్రమాలకు హాజరయినప్పుడు క్లబ్ సమావేశానికి గానీ బోర్డు సమావేశానికి గానీ అటెండెన్స్ పడ్తుంది.

రీజియన్ సమావేశంలో గానీ జోన్ సమావేశంలోగానీ పాల్గొంటున్నప్పుడు - స్వంత క్లబ్ కార్యక్రమం ఏదైనా వుంటే దానికి అటెండెన్స్ పడ్తుంది.

క్లబ్ స్థాయిలోగానీ, డిస్ట్రిక్ట్ స్థాయిలో గానీ ఏదైనా కార్యక్రమం జరిగే సమయంలో సభ్యుడు ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌కు వెళ్ళివుంటే, ఇక్కడ అటెండెన్స్ పడినట్టే!

అనారోగ్య కారణాల వలన సమావేశానికి హాజరు కాలేకపోతే, ఆ సభ్యునికి అటెండెన్స్ వేయవచ్చు.

మిలిటరీ సర్వీస్‌లోగానీ, ప్రభుత్వ ఉద్యోగ నిర్వహణ వలనగాని, ఎం.ఎల్.ఎ, ఎంపీ వంటి ఉన్నత పదవీ బాధ్యతలవలన గానీ ఇతర కార్యక్రమాల పని వత్తిడిలో వున్నవారు యాక్టివ్ సభ్యులే అయినప్పటికి క్లబ్ సమావేశాలకు రాలేకపోయినా వారికి మినహాయింపు నిచ్చే విషయాన్ని క్లబ్ బోర్డు నిర్ణయిస్తుంది.

**మంచి ఉత్తరాలు రాయడం అలవాటు చేసుకోండి!**

**BE A GOOD CORRESPONDENT**

లయన్స్ ఇంటర్నేషనల్‌తో క్లబ్ సెక్రటరీ జరిపే ప్రతి ఉత్తరప్రత్యురాలకూ కాపీని జిల్లా గవర్నర్‌కు పెట్టడం మరిచిపోకండి.

క్లబ్ సప్లైస్ డివిజన్‌కు ఆర్డర్‌పెట్టే ఉత్తరాలు రాస్తున్నప్పుడు గవర్నర్‌కు కాపీ అవసరం లేదుగానీ, తక్కిన అంశాలన్నీ గవర్నర్‌దృష్టిలో వుండేలా మాత్రమే క్లబ్ సెక్రటరీ కరస్పాండెన్స్ చెయ్యాలి.

ఇంటర్నేషనల్‌కు ఉత్తరాలు రాసేప్పుడు మీ లెటర్‌హెడ్ మీద క్లబ్‌నెంబర్, ఐడెంటిటీ నెంబర్, డిస్ట్రిక్ట్‌నెంబర్ వుండేలా చూసుకోండి.

'ఉభయకుశలోపరి' ఉత్తరాల మాదిరి కాకుండా, ఉత్తరం రాస్తున్న అంశానికి పరిమితంగా, సూటిగా, కొట్టివేతలు లేకుండా, టైప్‌చేసి పంపండి. "భాష" అందమైనదిగా, అర్థం అయ్యేరీతిలో వుంటే మనం ఆశించిన పని త్వరగా జరుగుతుంది.

సమాజంలో అనేకమంది అనేకవిషయాల మీద మీతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతారు. అలాగే, ప్రముఖులు, ఆఫీసర్లు, రాజకీయ నాయకులతో మీరుకూడా లయనిజానికి నంబంధించి, సేవాకార్యక్రమాలకు సంబంధించి ఉత్తరాలు రాయడం వంటివి చేస్తుంటారు. ఇలాంటి సమయంలో మీ ఉత్తరాలు ప్రొఫెషనల్‌గా వుండాలి. అవి లయనిజం ప్రతిష్ఠను పెంపొందింప చేయాలి!

ఇతరులు కోరిన విషయాలను మీరు పూర్తి చేయలేక నిస్సహాయతను తెలియజేయవలసి వచ్చినప్పుడు, అందుకు కారణాల్ని, సాయపడ లేకపోతున్నందుకు మీ విచారాన్నీ చక్కగా తెలియచేయగలగాలి.

క్లబ్‌లో సభ్యులకు ఎన్నికలకు సంబంధించి గానీ, సభ్యత్వ రుసుము చెల్లించమని కోరే సందర్భంలోగానీ, సభ్యత్వంలోంచి తొలగించే ఉత్తరాలలోగానీ, ఇతర పాలనా పరమైన అంశాలను సభ్యులకు తెలియజేసే సందర్భంలో గాని, మీ ఉత్తరాలు వ్రాతపూర్వకమైన డాక్యుమెంట్స్‌గా వుంటాయి. కాబట్టి ఆయా విషయాలకు సంబంధించి రాజ్యాంగపరమైన రూల్స్‌ని, వాటి నెంబర్లనీ తప్పకుండా ఉదహరించండి. అందువలన ఆయా వ్యక్తులతో వ్యక్తిగతంగా మీకు ఇబ్బందులు కలగకుండా వుంటాయి.

క్లబ్‌లో సభ్యత్వాన్ని అందించదలచిన వ్యక్తుల దగ్గరకు నేరుగా మెంబర్‌షిప్ ఫారాలు పుచ్చుకు వెళ్ళడంకన్నా, వారిని ఆహ్వానిస్తూ సెక్రటరీగారు ఒక మంచి ఉత్తరాన్ని ముందుగా పంపి, వారిని సంతోషింపచేసి, ఆ తర్వాత అప్పాయింట్‌మెంట్ తీసుకొని వెళ్ళితే సాధారణంగా మనం ఆహ్వానించిన వ్యక్తి నెగెటివ్ సమాధానం చెప్పలేరు. కొత్తసభ్యుడి స్పాన్సర్‌కు ఈ ఉత్తరం కాపీపెట్టడం మరచిపోకండి!

సభ్యుడు ఏ కారణం చేతనైనా తనుని సభ్యత్వంలోంచి తొలగించమని కోరినప్పుడు, వారి రాజీనామాని మీరు ఆమోదించే ఉత్తరంలో

మీ విచారాన్ని ప్రకటిస్తూ, క్లబ్‌కు ఆవ్యక్తి అందించిన సేవలు గుర్తుచేసుకొని ప్రశంసిస్తూ, ఆవ్యక్తి క్లబ్‌కు ఇంకా చెల్లించవలసిన బకాయిలు ఏమైనా వుంటే వాటిని ఉటంకిస్తూ మంచి ఉత్తరం రాయండి. మీ ఉత్తరం ఆయన్ని తన నిర్ణయం పునః పరిశీలించుకొనేలా చేస్తుంది.

**మంచి పౌరసంబంధాలు నడపండి**

**AS A PUBLIC RELATIONS OFFICER**

క్లబ్‌లో ముఖ్యమైన పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ క్లబ్ సెక్రటరీయే!

సమాజంలోని ఉన్నతులు, ఆర్తులూ ప్రతి ఒక్కరూ మనల్ని, మన కార్యక్రమాల్ని ఆమోదించి ప్రశంసించేలా సామాజిక సంబంధాలు నడిపే బాధ్యత క్లబ్ సెక్రటరీ వహించవలసి వుంటుంది.

క్లబ్‌కు ప్రచారంవస్తే, క్లబ్ సభ్యులందరికీ అది గర్వకారణమైన ప్రచారమే!

పౌరసంబంధమైన కార్యక్రమాలకు ఎక్కువ ప్రాధాన్యత నివ్వండి.

ఎక్కువ కార్యక్రమాల్లో, ఎక్కువమంది ప్రజల పాత్ర వుండేలా పథక రచన చేయండి.

పౌర సంబంధాలు సక్రమంగా వున్నప్పుడు ఫండ్ రైజింగ్ కార్యక్రమాలు సులువుగా విజయవంతం అవుతాయి. భారీ సేవా కార్యక్రమాలకు పెద్దలందరి సహకారం లభిస్తుంది!

క్లబ్ బులెటిన్‌ని కేవలం క్లబ్ సభ్యులకు మాత్రమే కాకుండా, వూళ్ళో పెద్దలకు ప్రముఖుల క్కూడా పంపించండి.

లయనిజం చేపడ్తున్న కార్యక్రమాలకు, విశేషించి క్లబ్ చేపడ్తున్న కార్యక్రమాలకూ ప్రాధాన్యతనిచ్చి క్లబ్ బులెటిన్ ప్రచురించండి. అది లయన్స్ పాఠకులకూ, లయన్స్ కాని పాఠకుల క్కూడా మంచి సమాచార వాహినిగా ఉపయోగపడ్తుంది!

**కొత్తకార్యవర్గానికి బాధ్యతల అప్పగింత**

**TRANSITIONING TO NEXT LEADERSHIP TEAM**

ఎన్నికలు జరిగి కొత్త కార్యవర్గం అధికారంలోకి రాబోయేముందు పదవీవిరమణ చేస్తున్న అధ్యక్ష కార్యదర్శుల సలహాలు, సూచనలు కోసం ఎదురు చూస్తారు.

1. వారికి క్లబ్ ఆర్థిక పరిస్థితి వివరించండి.
2. క్లబ్ ప్రతిష్ఠనీ, చేపట్టిన ప్రతిష్ఠాత్మక కార్యక్రమాల్నీ వివరించండి.
3. క్లబ్‌లో సభ్యుల పాత్ర గురించి, వారి విజయాల గురించి, వారికొచ్చిన అవార్డులు వగైరాల వివరాలు తాజాగా రూపొందించి కొత్త కార్యవర్గానికి అందించండి.
4. ఎం.ఎం.రిపోర్ట్‌లు, ఉత్తరప్రత్యుత్తరాలతో సహా క్లబ్‌కు సంబంధించిన ప్రతి అంశం క్లబ్ ఆస్తి! వాటి నన్నింటినీ కొత్త కార్యవర్గానికి అందించవలసిన బాధ్యత పదవీ విరమణ చేస్తున్న క్లబ్ ఆఫీసర్లది. ముఖ్యంగా కార్యదర్శిది!
5. కొత్తకార్యవర్గంతో కలిసి సభ్యులందరితోనూ చర్చించి, క్లబ్‌లోంచి తప్పుకునేవారిని గుర్తించి, మే నెలలోనే సాధ్యమైనంత వరకూ తొలగింపుల్ని రిపోర్ట్ చేయడం మంచిది. అందుకు కొత్తకార్యవర్గం పాతకార్యవర్గం మధ్య సమన్వయం నెలకొల్పుకోవాల్సి వుంటుంది.

అధికార మార్పిడి జరిగే ఈ మే, జూన్ నెలల్లోనే పరిణతితో వ్యవహరించగలిగితే, కొత్త కార్యవర్గం పాలనా విధానం సులువుగా సాగుతుంది. క్లబ్ ఒడిదుడుకులు లేకుండా నడుస్తుంది.

# కోశాధికారి

## ధనపాలన - వినిమయం

## CLUB TREASURER

## THE FINANACE OFFICER

ట్రెజరర్‌ని ధనపాలకుడు అంటేనే లయనిజం స్ఫూర్తికి దగ్గరగా వుంటుంది.

ధనపాలకుడిగా, అంటే - Finance Managerగా ట్రెజరర్ గురుతర బాధ్యతలు నిర్వహిస్తాడు. లయన్స్ అంతర్జాతీయ సంస్థ ట్రెజరర్ విధుల్ని చాలా చక్కగా నిర్వచించింది. ఎంతో విలువైన సమాచారాన్ని అందించింది.

ఒక మంచి ట్రెజరర్‌గా రాణించాలనుకునేవారికి ఈ సమాచారం బాగా తోడ్పడుతుంది.

### క్లబ్ ఫైనాన్స్ కమిటీ

క్లబ్ అధ్యక్షులు ఫైనాన్స్ కమిటీని నియమిస్తారు. క్లబ్ ట్రెజరర్ గానీ, ఆర్థిక వ్యవహారాలలో అనుభవం వున్న సభ్యుడు గానీ ఈ ఫైనాన్స్ కమిటీ అధ్యక్షులుగా వ్యవహరిస్తారు.

ఇది సంవత్సరం అంతా పనిచేసే కమిటీ. తరచూ సమావేశమై, క్లబ్ ఆర్థిక వ్యవహారాలను సమీక్షిస్తుంది. బడ్జెట్ తయారు చేయడంలోనూ, వ్యయ పరిమితుల్ని విధించడంలోనూ, నిధుల సమీకరణకు ఉపాయాలు అన్వేషించడంలోనూ బ్యాంక్ అక్కౌంట్స్‌ను నిర్ధారించడంలోనూ ఆర్థికపరమైన అంశాలన్నింటిలో సలహా సంఘంగా వ్యవహరిస్తుంది.

ముఖ్యంగా బడ్జెట్ తయారుచేసేప్పుడు ఆర్థిక మంత్రిత్వ శాఖ మాదిరి ఎంతో శ్రమచేసి ఒక క్రమశిక్షణా యుతమైన నిధుల వినియోగాన్ని క్లబ్ చేత ఆచరింపచేస్తుంది.

క్లబ్ ప్రెసిడెంట్ అనేక కమిటీలను నియమించి అనేక బాధ్యతలను వారికి అప్పగిస్తారు. ఆయా కమిటీలకు అనేక ఆలోచనల్లుంటాయి. పథకాలుంటాయి. ప్రణాళికలుంటాయి. అవి ఫైనాన్స్ కమిటీ దృష్టికి వచ్చినప్పుడు బడ్జెట్ తయారీలో వాటిని కూడా చేర్చడానికి వీలౌతుంది. నెలనెలా ఫైనాన్స్ రిపోర్ట్‌ను తయారుచేసి బోర్డుకు నివేదించడంలో ఈ కమిటీ ట్రెజరర్‌కు తోడ్పడుతుంది.

### బ్యాంక్ అక్కౌంట్‌లు తెరిచే పద్ధతి

బ్యాంక్‌కు వెళ్ళి నేరుగా లయన్స్ క్లబ్ పక్షాన రెండు అక్కౌంట్స్ తెరిచేందుకు అవకాశం లేదు. అందుకు కొన్ని నియమాలున్నాయి.

మొదట క్లబ్ ఫైనాన్స్ కమిటీ సూచన మేరకు బ్యాంక్ / బ్యాంక్స్‌ల పేర్లను బోర్డు ఆమోదిస్తుంది. బ్యాంక్‌ల పేర్లు ఆమోదించే తీర్మానాన్ని ఎజెండాలో చేర్చి మొట్టమొదటి బోర్డు సమావేశానికి నోటీసు పంపుతారు క్లబ్ సెక్రటరీ.

బోర్డు ఆమోదం తీర్మానాన్ని జతచేసి బ్యాంక్‌లలో అక్కౌంట్స్ తెరిచేందుకు దరఖాస్తు చేయవలసి వుంటుంది.

లయన్స్ రాజ్యాంగం ప్రకారం ట్రెజరర్ సంతకం తప్పనిసరిగానూ, బోర్డు నిర్ణయించిన ఒక క్లబ్ ఆఫీసర్ సహ సంతకం చేసే విధంగా, ఆమోదించిన తీర్మానాన్ని కూడా జతచేయాలి.

ఆ తర్వాత బ్యాంక్ వారి ఆమోదంతో అక్కౌంట్స్ తెరిచి నిధులు జమ చేయడం జరుగుతుంది.

### బోర్డు ఆమోదిస్తేనే చెల్లింపులు

ట్రెజరర్ గారు చేసే చెల్లింపులన్నీ కొన్ని పరిమితులకు లోబడినవిగా వుంటాయి. ఈ చెల్లింపులు క్లబ్ ఆదర్శాలకు, సిద్ధాంతాలకు అనుగుణంగా వుండాలి. బోర్డు ఆమోదించిన కార్యక్రమాలకు సంబంధించినవై వుండాలి.

దేని నిమిత్తం నిధులు వసూలు చేశామో దానికి మాత్రమే ఈ చెల్లింపులు జరుగుతున్నాయో లేదో చూసుకోవాల్సిన బాధ్యత కూడా ట్రెజరర్‌దే!

ఒక కార్యక్రమానికి సంబంధించి సేకరించిన నిధులు గాని, కేటాయించిన నిధులు గానీ వేరొక కార్యక్రమానికి మళ్ళించడానికి ట్రెజరర్ అంగీకరించకూడదు.

బడ్జెట్‌లో కేటాయింపు లేని కార్యక్రమాలకు బడ్జెట్ పరిమితులు దాటిపోయిన కార్యక్రమాలకు చెల్లింపులు చేయబోయేముందు ఆ విషయాన్ని క్లబ్ ఆఫీసర్ల దృష్టికి తీసుకురావడంలో ట్రెజరర్ గారు మొహమాట పడకూడదు.

ఒక ఖర్చుకు సంబంధించిన మంచీ చెడూ బోర్డుదే కాబట్టి ట్రెజరర్ ఈ విషయంలో నిమిత్తమాత్రుడు కాబట్టి, బోర్డు నిర్ణయాన్ని బడ్జెట్ కేటాయింపునీ శిరోధార్యంగా భావించి ట్రెజరర్ తన విధులు నెరవేర్చగలగాలి!

**బిల్లులూ బకాయిలూ**

అనేక రకాల బిల్లుల్ని లయన్స్ క్లబ్ అందుకొంటుంది. ఇంటర్నేషనల్ బిల్స్ Invoices for Intl. Dues : సంవత్సరానికి రెండుసార్లుగా సభ్యత్వ రుసుము బిల్లుల్ని జూన్, డిసెంబర్ నెలల్లో లయన్స్ క్లబ్‌లు అందుకొంటాయి.

డిస్ట్రిక్ట్ బిల్స్ : సంవత్సరానికి ఒకసారి డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్స్ మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కో ఆర్డినేషన్ కమిటీ ఆఫ్ ఇండియా వగైరా రుసుముల కోసం డిస్ట్రిక్ట్ గవర్నర్ గారు బిల్లు చేసి క్లబ్‌లకు పంపుతారు.

ఇంటర్నేషనల్ క్లబ్ సప్లైస్ డివిజన్‌కు ఆర్డర్ పెట్టి తెప్పించుకున్న వస్తు సామగ్రికి బిల్స్ వస్తాయి. హోటల్ బిల్స్, మీటింగ్ ఖర్చులు, ప్రింటింగ్ & స్టేషనరీ బిల్స్, ఇతర ఖర్చులకు సంబంధించిన బిల్స్ అనేకం వుంటాయి

**రీక్యాప్ స్టేట్‌మెంట్**

లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ నుంచి నేరుగా క్లబ్ ట్రెజరర్ గారి అడ్రస్‌కు నెలనెలా రీక్యాప్ స్టేట్‌మెంట్ అందుతుంది. అందులో ప్రధానంగా గమనించవలసిన అంశాలివి :

మీరు చెల్లించిన సొమ్ము రీక్యాప్ స్టేట్‌మెంట్‌లో ప్రతిబింబించిందా లేదా అనేది మొదటి విషయం.

మీరు ఇంకా కట్టవలసిన సొమ్ము విషయంలో మీరు వేసుకున్న లెక్కలు, సరిపోతున్నాయా లేదా చూసుకోవాలి. సరిపోక పోతే, (Discripancy) అందుకు కారణాలు పరిశీలించాలి. ఒకవేళ పొరబాటు ఇంటర్నేషనల్ వైపే వున్నట్లయితే ఆ విషయాన్ని మొదట బోర్డు దృష్టికి తీసుకువచ్చి చర్చించాలి. ఆ తర్వాత సెక్రటరీ గారు దానిని గవర్నర్ దృష్టికి తీసుకురావడం ఇంటర్నేషనల్‌కు ఈ తేడాని సరిచేయమని కోరుతూ ఉత్తరం వ్రాయడం వంటివి చేస్తారు. అవసరం అయితే, ఈ విషయంలో గవర్నర్ గారి చేయూత కూడా అర్థించండి.

సెక్రటరీ గారు పంపుతున్న ఎం.ఎం. రిపోర్టులలో చూపిస్తున్న సభ్యుల సంఖ్య, రీక్యాప్ స్టేట్‌మెంట్‌లో కనిపిస్తున్న సభ్యుల సంఖ్య, ఒకటేనా అనేది కూడా పరిశీలించుకోండి. తేడా వుంటే కరస్పాండెన్స్ చేయండి. మీరు పంపుతున్న ఎం.ఎం. రిపోర్టులు ఏ నెలకానెల అందుతున్నాయో లేదో కూడా రీక్యాప్ స్టేట్‌మెంట్‌లో వుంటుంది. గమనించండి.

మీరు కొత్తగా రిపోర్ట్ చేసిన సభ్యుల పేర్లు, వారి నెంబర్స్, వారి నిమిత్తం మీరు చెల్లించిన సభ్యత్వ రుసుము, ప్రవేశ రుసుమూ అన్ని రీక్యాప్ స్టేట్‌మెంట్‌లో వుంటాయి. సరిచూసుకోండి. జూన్, డిసెంబర్ నెలల్లో వచ్చే రీ క్యాప్ స్టేట్‌మెంట్లలో మీ క్లబ్ సభ్యుల పేర్లు వారి నెంబర్లు జతచేసి పంపుతారు. వాటిని కూడా సరిచూసుకోండి.

మీరు డ్రాప్ చేసిన సభ్యుని వివరాలు కూడా ఏనెల కానెల తెలియచేస్తారు. అన్నీ గమనించండి.

క్లబ్ మనుగడకు ఆయువుపట్టు ఇంటర్నేషనల్ నుంచి వచ్చే ఈ రీక్యాప్ స్టేట్‌మెంట్! చాలామంది ట్రెజరర్లు ఈ కవర్‌ని తెరిచి అందులో ఏముందో చూడరు. ఇతర క్లబ్ ఆఫీసర్లు కూడా ఆ విషయం పట్టించుకోకపోతే ఒక్కోసారి చాలా అపకారం జరుగుతుంది.

డ్రాప్ చేసిన వ్యక్తి పేరు ఇంటర్నేషనల్ లిస్ట్‌లో కరెక్ట్ గానే డ్రాప్ అయ్యిందో లేదో కూడా సరిసూచుకోండి.

## క్లబ్ బకాయిలంటే ఏమిటి?

## CLUB DUES

లయనిజం పట్ల అవగాహన లేని చాలామంది వ్యక్తులు, పై నించి ఎవరో పంపే నిధులతో లయన్స్ క్లబ్‌లు పనిచేస్తాయనీ, లయన్స్‌క్లబ్‌లో నిధులు రాసులుగా పోగుపోసి వుంటాయనీ అనుకొంటూ వుంటారు. కొంతమంది లయన్స్ సభ్యులు కూడా, తాము చెల్లించే రెండువేలు లేక మూడు వేల రూపాయల సభ్యత్వ రుసుము అంతా క్లబ్‌లోనే వుంటుంగనీ, ఖర్చులు పోనూ ఎంతలేదన్నా అరలక్షో, లక్షో మిగులు వుంటుందనీ అనుకొంటున్నవారు కూడా కొంతమంది వున్నారు. వారికి పూర్తి వివరాలు అందించడానికి క్లబ్ ఆఫీసర్లు బాధ్యత తీసుకోవాలి. ఈ క్రింది సాంకేతిక విషయాలను గమనించండి :-

క్లబ్ స్థాయి నుంచి ఇంటర్నేషనల్ స్థాయి వరకూ లయనిజంలోని ప్రతి అంశం కేవలం సభ్యులు చెల్లించే సంవత్సర సభ్యత్వ రుసుము మీదే ఆధారపడి వుంటుంది.

మొత్తం లయనిజం యావత్తూ సభ్యుల సభ్యత్వ రుసుమే నడుపుతోందని గమనించండి.

ఈ సభ్యత్వ రుసుమునే గౌరవ పూర్వకంగా సభ్యుల Financial Contribution అంటారు.

సభ్యులు చెల్లించే ఈ ఫైనాన్షియల్ కంట్రిబ్యూషన్లను సాంకేతికంగా క్లబ్ డ్యూస్ (Club Dues) అని పిలుస్తారు.

ఇవి రెండు రకాలు (ఎ) ఇంటర్నేషనల్ డ్యూస్ (బి) డిస్ట్రిక్ డ్యూస్

డిస్ట్రిక్ట్ డ్యూస్‌లోనే మల్టిపుల్ డిస్ట్రిక్ట్ డ్యూస్, ఇతర చెల్లింపులు కూడా కలిసి వుంటాయి.

**వేర్వేరు అక్కౌంట్లను కలగాపులగం చెయ్యకండి!**

ఎడ్మినిస్ట్రేటివ్ అక్కౌంట్ యాక్టివిటీస్ అక్కౌంట్‌లలో చూపించవలసిన వేర్వేరు విషయాల్ని కలగాపులగం కానీయకండి!

దేని ఖర్చుని, ఆ అక్కౌంట్‌లోనే చూపించాలి. దేని జమని కూడా ఆ అక్కౌంట్‌లోనే చూపించాలి. 'హెడ్ ఆఫ్ అక్కౌంట్'లు కూడా ఖచ్చితంగా నిర్దేశించుకొని స్పష్టంగా జమా ఖర్చుని ఆయా హెడ్స్ కింద చూపించాలి.

అడ్మినిస్ట్రేటివ్, యాక్టివిటీ నిధులు ఎట్టి పరిస్థితుల్లోనూ మరొకదాని నిమిత్తం ఖర్చు చేయకూడదు. చాలామంది, పాలనాపరమైన నిధుల్ని సేవా కార్యక్రమాలకు మళ్ళించవచ్చునని అంటుంటారు. ఇది పూర్తి వాస్తవం కాదు.

ఇందుకు కూడా బోర్డు అనుమతి లేనిదే ఆ విధమైన మళ్ళింపు కుదరదు.

పాలనాపరమైన (Administrative) అక్కౌంట్‌లో అదనపు నిధులు వున్నప్పుడే బోర్డు ఈ విషయాన్ని పరిశీలిస్తుంది.

పాలనాపరమైన అక్కౌంట్‌లో డబ్బు, ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్ బకాయిలూ ఇతర ఖర్చుల నిమిత్తం ఉద్దేశించింది. వాటిని ఆపి సొమ్మునంతా సేవా కార్యక్రమాలకు ఖర్చు చేసి చివరికి వడ్డీతో సహా ఇంటర్నేషనల్ డిస్ట్రిక్ట్ బిల్లులు చెల్లించవలసి వచ్చేసరికి ఖజానా ఖాళీ అవుతుంది. ఈ ప్రమాదాన్ని ట్రెజరర్ ముందు జాగ్రత్త పడడం ద్వారా నివారించవచ్చు.

**ట్రెజరర్ గారు దృష్టిలో పెట్టుకోవాల్సిన ఖర్చులు**

కొత్త సభ్యుల ప్రవేశ రుసుము
ఇంటర్నేషనల్ రుసుము
డిస్ట్రిక్ట్ రుసుము, M.D.CCI రుసుము
లియోక్లబ్ లెవీ
మల్టిపుల్ డిస్ట్రిక్ట్ రుసుము
డిస్ట్రిక్ట్ పర్మనెంట్ ప్రాజెక్ట్ రుసుము
ప్రింటింగ్ & స్టేషనరీ, పోస్టేజీ
టెలిఫోన్స్, టెలిగ్రామ్, ఫాక్స్
బులెటిన్ ఇతర సర్కులర్స్, డిస్ట్రిక్ట్ డైరెక్టరీ నిమిత్తం చెల్లించవలసిన రుసుము
క్లబ్ సప్లైస్ డివిజన్‌కు ఆర్డర్ పెట్టి తెప్పించుకున్న వస్తు సామగ్రి (కిట్స్ & పిన్స్ వగైరాల ఖర్చు)
ఆఫీసు బోయ్ జీతం వగైరా
సమావేశ వేదికలు హోటల్ తదితర ఖర్చులు
అవార్డులు, మెమెంటోలు, దండలు, బొకేలు
మైకు, స్క్రీనింగ్, LCD, OHP వగైరా
డిన్నర్ / ఫెల్లోషిప్ ఇతరాలు

**సాధారణంగా ఎదురయ్యే ఖర్చులు**

క్లబ్ ఇన్‌స్టలేషన్, క్లబ్ ఛార్టర్ నైట్
ఒక జోన్ అడ్వయిజరీ సమావేశానికి ఆతిధ్యం
కుటుంబ సమావేశం, విందు, వినోదం (Family get togethers)
రెగ్యులర్ సమావేశాలు, బోర్డు సమావేశం
కేలండర్ ఆఫ్ ఈవెంట్స్
కొత్త సభ్యుల ప్రతిష్ఠాపనోత్సవం (Induction)
కొత్త పాత సభ్యులకు ఉద్బోధనా కార్యక్రమాలు Indoctrination
జిల్లా గవర్నర్ గారి అధికార పర్యటన

**అడ్మినిస్ట్రేటివ్ అక్కౌంట్‌లో ఏమేం చూపించాలి?**

సభ్యులు సభ్యత్వ రూపేణా చేసే చెల్లింపులు
కొత్త సభ్యుల ప్రవేశ రుసుము
ఆతిధ్యం కోసం (Hospitality) సభ్యులు చెల్లించే రిజిస్ట్రేషన్ వగైరా ఖర్చులు
ప్రత్యేకమైన క్లబ్ లెవీలు
బులెటిన్ అడ్వర్టయిజ్‌మెంటు ఛార్జీలు,
టెయిల్ ట్విస్టర్ ఫైన్స్
ఇవన్నీ అడ్మినిస్ట్రేటివ్ అక్కౌంట్‌లో చూపించవలసిన జమలు. కేవలం పాలనాపరమైన అంశాలు. ఇందులో సర్వీస్‌కు సంబంధించిన విషయాలేవీ వుండవు.
ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్, బకాయిల చెల్లింపులూ
మీటింగ్ ఖర్చులూ
విందుల నిమిత్తం అయిన ఖర్చులు
క్లబ్ సప్లైస్ డివిజన్‌కు ఆర్డరు పెట్టి తెప్పించుకున్న వస్తు సామగ్రి నిమిత్తం అయిన ఖర్చులూ
ప్రింటింగ్, స్టేషనరీ, పోస్టేజీ, టెలిఫోన్, ఫాక్స్ తదితర ఖర్చులు, పాలనా వ్యవహారాల ఖర్చులు
క్లబ్ బులెటిన్, తదితర సర్కులర్ల ఖర్చులు
డిస్ట్రిక్ట్ డైరెక్టరీ నిమిత్తం చేసే చెల్లింపులు
... ఇవన్నీ అడ్మినిస్ట్రేటివ్ అక్కౌంట్‌లో చూపించవలసిన ఖర్చులు

**యాక్టివిటీ అక్కౌంట్‌లో చూపించవలసినవి ఇవీ...**

ఫండ్ రెయిజింగ్ కార్యక్రమాలలో సేకరించిన నిధులు
దాతలు అందచేసిన విరాళాలు
సావనీర్లలో అడ్వర్టయిజ్‌మెంట్ల మీద చేసిన వసూళ్ళు
LCIF నిమిత్తం సభ్యులు అందజేసిన విరాళాలు
... ఇవన్నీ సేవా కార్యక్రమాల అక్కౌంట్‌లో చూపించవలసిన జమలు.
ఇంకా ఖర్చుల విషయానికొస్తే,
సేవా కార్యక్రమాల నిర్వహణ కోసం చేసిన ఖర్చులన్నీ
LCIF నిమిత్తం చేసిన చెల్లింపులు

**ట్రెజరర్ గారి సాధన సంపత్తులు**

విష్ణుమూర్తికి శంఖుచక్రాల్లా, క్లబ్ ట్రెజరర్‌కు "డే"బుక్, లెడ్జర్‌లు సాధన సంపత్తులుగా వుంటాయి. రసీదుల పుస్తకం, మెంబర్ల రోస్టర్

మిగిలిన రెండుచేతుల్లో వుంటాయి. ఈ నాలుగు అంశాలూ ధరించిన చతుర్బాహువు ట్రెజరర్.

వీటిని ఎంత సక్రమంగా నిర్వహించగలిగితే అంతగా రాణింపు వుంటుంది.

**క్లబ్‌లో ప్రోటోకాల్ వున్న పదవి ట్రెజరర్**

ఒక మంచి ట్రెజరర్‌గా ప్రచారం లోకి వచ్చిన వ్యక్తులు అరుదుగా వుంటారు. సెక్రటరీ, ఆ పైన పదవులు చేస్తున్నవారికి గుర్తింపు ఎక్కువగా వుంటుంది.

పోస్టల్ ఖర్చులు పెరిగిపోవడంతో జిల్లా నాయకులు ఆహ్వానాలు సర్క్యులర్‌లు వగైరా ట్రెజరర్‌లకు పంపడం కూడా మానేస్తుంటారు.

అయినా, రాణించిన ట్రెజరర్‌లు నిజంగా నాయకత్వాన్ని ప్రదర్శించినట్లు. ట్రెజరర్‌కు క్లబ్‌లో ప్రోటోకాల్ వుంది. ప్రెసిడెంట్, సెక్రటరీల తరువాతి స్థానం ట్రెజరర్‌దే!

కానీ, చాలామంది ట్రెజరర్‌లు ఈ గౌరవాన్ని అంది పుచ్చుకోవడంలో శ్రద్ధ చూపించరు. "ట్రెజరరే కదండీ - ఈ ఏడాది మీకు పెద్దగా పని వుండదు -" అని చెప్పి ఒప్పించిన వాళ్ళే ట్రెజరర్లలో ఎక్కువ మంది వుంటారు.

మానసికంగా ఈ మాటలు వారిపైన ఎంతో ప్రభావాన్ని చూపిస్తాయి. తాము చేయవలసిందేమీ లేదనే అభిప్రాయంలో వుంటారు.

ట్రెయినింగ్ క్లాసులకు గాని, ట్రెజరర్ స్కూలింగ్‌లకు గానీ, ఓరియెంటేషన్ సెమినార్లు గానీ ట్రెజరర్ల అటెండెన్స్ చాలా తక్కువగా వుండటానికి కారణం ఇదే!

ముందే వారి మనసుల్లో కల్పించిన అభిప్రాయాలు ఈ పరిస్థితికి కారణం.

## బడ్జెట్ ఎందుకు?

క్లబ్‌లో సభ్యులు ఒక్కొక్కరూ రెండువేల రూపాయలు సభ్యత్వం చెల్లిస్తుంటే, 1800 రూపాయలు ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్ రుసుము పోగా కేవలం 200 రూపాయలు మాత్రమే క్లబ్‌లో మిగుల్తోంది.

20 మంది కనీస సభ్యులున్న క్లబ్‌కు సగటున 4,000 రూపాయిలు మిగులు వుంటుంది. ఏ ఖర్చయినా దీన్లోనే సరిపెట్టవలసి వుంటుంది. ఇంత భాగ్యానికి బడ్జెట్‌లు, బోర్డు ఆమోదాలు, అక్కౌంటులూ... ఈ హడావిడి అంతా అవసరమా...? అని అనిపించడం సహజమే!

దీనికి సమాధానం 'అవును' అనే చెప్పాలి... అంతా... అవసరమే!!

1. బడ్జెట్ అనేది ఖర్చులు చెయ్యడానికి మార్గదర్శక సూత్రాలను అందిస్తుంది.
2. ఖర్చులు చెయ్యవలసినవి ఎంతో తేలినప్పుడు, వాటికి నిధులు సమకూర్చుకోవడం ఎలాగో ఆలోచించడం ప్రారంభిస్తాం.
3. ఎడ్మినిస్ట్రేషన్ ఖర్చులు, యాక్టివిటీ ఖర్చులు విడివిడిగా జరుపుతున్నప్పుడు, ఖర్చు మీద మనకు ఒక అదుపు ఏర్పడుతుంది.
4. పనిచేసేందుకు నిధులు లేవు కాబట్టి ఇంత మాత్రానికి ఓ ప్రెసిడెంట్, ఓ సెక్రటరీ ఓ ట్రెజరర్, ఇందరు బోర్డు సభ్యులు వీళ్ళంతా మాత్రం దేనికీ? ఇందరూ కలిసి తమ సమయాన్ని, తమ ఆలోచనా శక్తిని తమ స్వంత వనరుల్ని కొద్దిగా దీనికోసం కేటాయించి ఆలోచిస్తే లయన్స్ సభ్యులకు నిధుల కొరత ఒక అంశం ఎంత మాత్రమూ కాదు. అందుకని!
5. క్లబ్ సభ్యులందరికీ క్లబ్ ఫైనాన్స్ పొజిషన్ తెలియజేయడానికి బడ్జెట్ ఉపయోగపడ్తుంది. అందుకు కావలసిన వనరుల సమీకరణకు సభ్యులను ప్రోద్భలించడానికి బడ్జెట్ తోడ్పడుతుంది.
6. చాలాచోట్ల గమనిస్తున్న అంశం ఏమంటే ఎవరో ఒక వ్యక్తి భుజాన వేసుకొని మోస్తుంటే మిగిలిన వారు ప్రేక్షకమాత్రులుగా చూస్తూ వుండటం...

ఇలా జరిగినందువలన మరునటి సంవత్సరం ఇంక ఆ వ్యక్తి మళ్ళీ మనకు కన్పించకుండా పోయే ప్రమాదం వుంది.

లోపం అనేది అందరినీ కలుపుకు పోకపోవడంలోనే వుంది. ఎవరూ కలిసి రావడం లేదు - అనడం అన్యాయం!

అందరూ కలిస్తేనే లయనిజం. మనది "We Serve" నినాదం కదా!

### ఆర్థిక అంశాలకు ట్రెజరర్ బాధ్యుడు

క్లబ్‌లో ఆర్థికపరమైన అంశం ఏదైనా దాని బాధ్యత ట్రెజరర్‌దే! ట్రెజరర్‌తో నిమిత్తం లేకుండా క్లబ్‌లో ఎవరో కొందరు ఆర్థిక విషయాలు నడపడం తప్పు. అలాగే, క్లబ్ ఆర్థిక విషయాల్లో ట్రెజరర్ తనకెందుకులెమ్మని ఆపేక్షవహించడం కూడా తప్పే!

ఆర్థిక అంశాల గురించి ప్రతి లయన్స్ క్లబ్‌లోనూ అందరికీ ఆమోదయోగ్యమైన ఒక విధానాన్ని సాంప్రదాయాన్ని ప్రతిసంవత్సరం అందరూ అవలంభించే విధంగా వుంటే అది Healthy Convention!

మంచి ట్రెజరర్‌లు వచ్చిన సందర్భాల్లో ఆ ఏడాది లయన్స్ క్లబ్ అనేక రంగాల్లో అభివృద్ధిని కనబర్చుదాన్ని మనం చాలా సార్లు గమనించాం.

అనేక రంగాల్లో ఒక క్లబ్ అభివృద్ధి సాధించేందుకు ట్రెజరర్ చక్కని భాగస్వామ్యం వహిస్తే క్లబ్ ఆర్థికంగా కూడా పరిపుష్టిగా వుంటుంది.

ఈ పుస్తకంలో క్లబ్ కాన్‌స్టిట్యూషన్ వివరంగా వుంది. చూడండి. ట్రెజరర్ పైన లయన్స్ ఇంటర్నేషనల్ ఎన్ని గురుతర బాధ్యతలు వుంచిందో అర్థం అవుతుంది.

### జమా ఖర్చుల రికార్డులు

క్లబ్ ఆర్థిక లావాదేవీలతో, జమా ఖర్చుల రికార్డులన్ని ట్రెజరర్ గారి ఆధీనంలోనే వుంటాయి. క్లబ్ తీసుకునే ఆర్థికపరమైన నిర్ణయాలకు ట్రెజరర్ బాధ్యత ఏమీ లేనప్పటికీ, ఖర్చులకు గానీ, ఆదాయానికి గానీ ట్రెజరర్ ఎంతమాత్రం బాధ్యులు కానప్పటికీ రూపాయి రాక పోకల మీద అజమాయిషీ మాత్రం ట్రెజరర్‌దే!

సభ్యుల చెల్లింపులు, బిల్లు పుస్తకాలు, రసీదు పుస్తకాలు, వోచర్లు, రుసుములు చెల్లించని సభ్యుల పేర్లు, ఇంటర్నేషనల్ బకాయిల రీక్యాప్ స్టేట్‌మెంట్స్ అన్నీ ట్రెజరర్ గారి ఆధీనంలో వుండే అంశాలు. పదవీ విరమణ చేస్తున్న ట్రెజరర్ గారు పదవిలోకి వస్తున్న ట్రెజరర్ గారికి అందజేయవలసిన అంశాలు కూడా ఇవే.

### జమా ఖర్చుల స్టేట్‌మెంట్ల తయారీ

సెక్రటరీ గానీ, ఇతరులకు గానీ అందచేసిన సొమ్మును సంబంధిత బ్యాంక్‌లలో డిపాజిట్ చేయడం ట్రెజరర్ గారి ధర్మం.

క్లబ్ బోర్డు ఆమోదం వున్న అంశాలకు మాత్రమే చెల్లింపు చేసే విషయంలో ట్రెజరర్ దృఢంగా నిలబడగలిగితే క్లబ్ ఆరోగ్యవంతంగా మనగలుగుతోంది. జమా ఖర్చుల స్టేట్‌మెంట్ తయారు చేయడంలో అనవసరమైన ప్రశ్నలకు అవకాశం ఇవ్వనివిధంగా తగిన జాగ్రత్తలు తీసుకోవడం అవసరం.

బోర్డు సమావేశాలలో సగం సమయం ఆర్థికపరమైన అంశాలకు మిగతా సమయం కార్యక్రమాల గురించిన చర్చలకు సరిపోతూ వుంటుంది. అందుకని ఆర్థికపరమైన అంశాలలో ట్రెజరర్ గారు ప్రెసిడెంట్ చూస్తారనో, సెక్రటరీ సమాధానం చెప్తారనో అలక్ష్యం చేయకుండా వ్యక్తిగత శ్రద్ధ తీసుకోవడం అవసరం.

ఫైనాన్షియల్ స్టేట్‌మెంట్ కాపీల్ని హాజరైన సభ్యులందరికీ తలొకటీ అందజేస్తే వృధాప్రశ్నలు తప్పుతాయి. ఎవరు ఏ ప్రశ్నలు వేస్తారో ముందుగానే ఊహించి, వాటికి తగిన సమాచారం సిద్ధంగా వుంచుకోవడం ఓ కిటుకు!

స్టేట్‌మెంట్‌లో అన్ని ఎంట్రీలు వుండేలా జాగ్రత్తపడండి. అక్కడికి వెళ్ళి తడుముకునే ఇబ్బందులు కొనితెచ్చుకోకండి.

మీకు ముందు పనిచేసిన ట్రెజరర్‌ల సహాయాన్ని, ఫైనాన్స్ కమిటీ సహాయాన్ని తీసుకొని బడ్జెట్, తదితర ఫైనాన్స్ రిపోర్ట్‌లు తయారుచేస్తే మీకు సుఖం.

**బ్యాంక్ అక్కౌంట్ల బదిలీ**

మీరు పదవులలోకి వస్తూనే అధ్యక్షుడు, కార్యదర్శి మీరూ ముగ్గురూ కలిసి బ్యాంక్ అక్కౌంట్లను మీ పేర్లతో మార్పిడి చేసుకోండి. ఈ మేరకు మీ మొదటిబోర్డు సమావేశంలోనే నిర్ణయాలు తీసుకొని బ్యాంక్‌కు అందజేయండి.

పూర్వపు బ్యాంక్‌లలోనే అక్కౌంట్ కొనసాగించాలనే నియమం ఏదీ లేదు. మీ ముగ్గురుకీ అందుబాటులో వుండి, పరిచయాలున్న చోట క్లబ్ అక్కౌంట్‌లు తెరవడం ఎప్పుడూ మంచిది.

**బకాయిల వసూలు**

చాలాకాలంగా బకాయిలున్న సభ్యుల్ని ఎలాగోలా ఒప్పించి చెల్లింపు చేసేలా చూడండి!

సభ్యులకు ఉత్తరాలు పోస్ట్‌కార్డ్‌ల మీద రాయకండి! అది అప్పులవాళ్ళు ఋణ వసూలు విధానం. లయనిజం బకాయిలు అలాంటివి కాదు! అవకాశం కుదరక కొంత, అశ్రద్ధ కొంత, అంతకన్నా ముఖ్యమైన ఖర్చు ఇంకేదో రావడం వంటివే ఎక్కువ బకాయిలకు కారణం. అలాంటివారిని వారి సమస్య తెలుసుకొని, ఓదార్చి, నెమ్మదిగా వసూళ్ళు మొదలుపెట్టాలే గాని, గట్టిగా అడిగేసి, కట్టని కారణంగా తీసేస్తాననడం మంచిదికాదు. ఇది లయనిజంలో మేలుచెయ్యదు.

ఎక్కువమంది సభ్యులు సకాలంలో పూర్తి సంవత్సరానికి బకాయిలు చెల్లించడానికే సిద్ధంగా వుంటారు. వారిని కలిసి, తగినంత గౌరవం ప్రదర్శించి వారి నించి రుసుములన్నీ వసూలు చేయడంలో ట్రెజరర్ గారికి తనదైన శైలి, తనదైన మార్గం వున్నప్పుడు ఆ ఏడాది క్లబ్ వర్ధిల్లుతుంది. సభ్యత్వ బకాయిలు ముందుగానే చెల్లించిన సభ్యులకు తగిన ప్రోత్సాహకాలు ప్రకటిస్తే ట్రెజరర్ గారి పదవీకాలం నల్లేరు మీద బండిలాగా సాగిపోతుంది.

ముఖం మీద చిరునవ్వు పులుముకుని ట్రెజరర్ గారు సభ్యత్వ బకాయిల్ని ముఖ్యంగా మొండి బాకీదారుల్ని కలవగలిగితే, క్లబ్ ఆర్థిక పుష్టిని పొందగలుగుతుంది.

అవసరం ఐతే ఇంకోసారి తిరగడానికైనా సిద్ధపడండి గానీ, సభ్యుణ్ణి పోగొట్టుకోడానికి ఎట్టి పరిస్థితుల్లోనూ అనుమతించకండి.

**జేబు డబ్బులు ఖర్చు పెట్టవద్దు**

అవసరమైతే జేబులోంచి డబ్బు తీసి ఖర్చుపెట్టేస్తే అది తాత్కాలికంగా ఘనమైన విషయంగా కన్పిస్తుంది. గానీ, నిజానికి దాన్ని మీ వైఫల్యం అనే అంటారు.

ట్రెజరరే కాదు, క్లబ్‌లో ఏ ఆఫీసరైనా సరే సభ్యుల పాత్ర, సభ్యుల ప్రమేయం లేకుండా తమ డబ్బునే, ఆ విధంగా బోర్డు అనుమతి లేకుండా ఖర్చు చేయడం ఆ క్లబ్ నాయకత్వ వైఫల్యమే అవుతుంది.

**మిగిలిన ఆఫీసర్లతో సామరస్యం**

క్లబ్ ఆఫీసర్ల మధ్య సామరస్యం అనేది చాలా అవసరం. అందరూ మేధావులే కాబట్టి ఆధిపత్య భావాలు స్వార్థాలు సహజంగా వుంటూ వుంటాయి. మానసిక పరిణతి పొందిన వ్యక్తులకు వాటిని అధిగమించడం సులువు.

ఆర్సీ, జడ్సీ, మైక్రోకేబినెట్, జిల్లాగవర్నర్, పాస్ట్ గవర్నర్స్ – ఇందరున్నారు ఇలాంటి విషయాల్లో సలహాలు చెప్పి సఖ్యత కుదర్చడానికి!

'ఫెలోషిప్' అనే ప్రధాన కార్యక్రమం కోసం మాత్రమే లయనిజం లోకి మనం ప్రవేశించాం కాబట్టి సఖ్యత కుదుర్చుకోవడానికి ఎవరికి వారు ప్రాధాన్యతనివ్వాలి. బిగుసుకు కూర్చుంటే అది లయనిస్టిక్ స్ఫూర్తికి విరుద్ధంగా వుంటుంది.

### అందిన సొమ్ముకు అందినట్లు రసీదులు

సభ్యుడి నుంచి ఏవిధమైన రుసుము అందినా సరే, వెంటనే దానికి రసీదు ఇచ్చెయ్యడం అలవాటు చేసుకోండి. సమావేశాలకు, ఇతర కార్యక్రమాలకూ వచ్చినప్పుడు రసీదు పుస్తకం కూడా వెంట తీసుకొస్తే అక్కడికక్కడే ఇచ్చెయ్యవచ్చు.

రసీదు పుస్తకాలకు కౌంటర్ ఫాయిల్ విధానం కన్నా, కార్బన్ పేపర్ పెట్టి అడుగున తెల్ల కాయితం వుంచే పద్ధతే సురక్షితమైంది!

వసూలయిన మొత్తాన్ని సాధ్యమైనంత వెంటనే బ్యాంక్‌కు పంపడం కూడా ఆరోగ్యవంతమైన అలవాటు.

### అక్కౌంట్లలో పారదర్శకత

చెల్లింపులన్నీ చేతిఖర్చుల రూపంలో కాకుండా చెక్కుల రూపంలో వుంటే జమా ఖర్చులు రాయడంలో అవకతవకలు జరిగే అవకాశం వుండదు.

స్వంత వ్యాపారాలలో ఎలా చిట్టా, ఆవర్జాలు (Day Book & Ledger) రాస్తామో అలాగే లయన్స్ క్లబ్ అక్కౌంట్స్ కూడా నిర్వహిస్తుంటే పారదర్శకత (Transparency) దాతలను సభ్యులను కూడా ఆకట్టుకొంటుంది.

సంవత్సరాంతంలో మీరు నిర్వహించిన అక్కౌంట్లని చక్కగా ఆడిట్ చేసి, అక్టోబర్ లోపు జనరల్ బాడీకి సమర్పించి ఆమోదం తీసుకోండి. మీ బాధ్యతలు విజయవంతంగా పూర్తవుతాయి.

### లియోక్లబ్ చెల్లింపులు

లియోక్లబ్ మీకు వున్న పక్షంలో యాక్టివిటీ అక్కౌంట్‌లో డబ్బు లేనట్లయితే, అవసరం అనుకొంటే లియోక్లబ్‌కు కట్టవలసిన 100 డాలర్ల ప్రవేశ రుసుము, 90 డాలర్ల సభ్యత్వ రుసుము సర్వీస్ ఫండ్‌లోంచి తీసి ఇంటర్నేషనల్‌కు పంపేందుకు అనుమతి వుంది. ఎందుకంటే, లియోక్లబ్ కూడా సేవా కార్యక్రమంలో ఒక భాగంగా ప్రకటించబడింది కాబట్టి!!

### లయన్స్ చారిటబుల్ ట్రస్ట్ ఏర్పాటు

FORMATION OF LIONS CHARITABLE TRUST

అధికమొత్తంలో ప్రజల నుంచి నిధులు వసూలు చేసే సందర్భంలో రిజిష్టర్ చేసిన లయన్స్ చారిటబుల్ ట్రస్ట్‌లను ఏర్పాటు చేయడం మంచిది.

లయన్స్ క్లబ్స్ అన్నీ ఫెడరల్ రిజిస్ట్రేషన్‌కు సంబంధించినవి. కానీ, క్లబ్ పక్షాన ఏర్పాటు చేసే చారిటబుల్ ట్రస్ట్ భారతీయ శిక్షాస్మృతి ప్రకారం రిజిష్టర్ అయినవి కాబట్టి, భారీ ప్రాజెక్టులు చేపట్టేప్పుడు నిధుల సమీకరణ కోసం ప్రభుత్వ రిజిష్టరయిన ట్రస్ట్ తప్పనిసరి అవుతుంది. ఇన్‌కంటాక్స్ మినహాయింపుల వంటివి పొందడానికి, ప్రభుత్వ నిధులు సాధించు కోవడానికి ట్రస్ట్ రిజిస్ట్రేషన్ చేయించడం అవసరం అవుతుంది కూడా!

ట్రస్ట్‌ను ఏర్పరచి, దానికి ఒక కార్యవర్గం ఏర్పాటుకావడంతో శాశ్వత ప్రాజెక్టులు, భారీ ప్రాజెక్ట్‌ల ఏర్పాటుకు ప్రత్యేక శ్రద్ధ కనబరిచే అవకాశం ట్రస్ట్‌కు లభిస్తుంది.

ట్రస్ట్ రాజ్యాంగం లయన్స్ క్లబ్ ఇంటర్నేషనల్ రాజ్యాంగం ఉపనియమావళికి అనుకూలంగా వుండాలి. కులమత వర్గాలకు అతీతమైన సేవా కార్యక్రమాలకు ప్రాధాన్యత నిచ్చేదిగా వుండాలి.

తరంగం నాలుగు

# కట్టుబాటు

## న్యాయపరమైన అంశాలు - సమష్టి నిర్ణయాలు

# LEGAL RESPONSIBILITIES

124

లయనిజం రాజ్యాంగానికి అనుగుణంగా లయన్స్ ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ తీసుకునే నిర్ణయాలు అంతర్జాతీయంగా పాలనా పరంగా లయనిజానికి శిరోధార్యాలుగా వుంటాయి.

అసోసియేషన్ పేరు, ఎంబ్లమ్‌లు తత్సంబంధమైన పదాలు లయనిజం వ్యాప్తిలో వున్న దేశాలన్నిటిలోనూ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కులుగా రిజిష్టర్ చేయడం జరిగింది.

'LIONS' అనే పేరు, లయన్స్ ఎంబ్లమ్, 'లయన్స్', 'లయన్స్ క్లబ్', లయన్స్ ఇంటర్నేషనల్, లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ ఈ పదాలన్నీ ఉపయోగించడానికి చట్టపరమైన అంశాలు కొన్ని వున్నాయి. ఈవిధంగా మన అసోసియేషన్‌కు సంపూర్ణంగా చట్టపరంగా రక్షణ కల్పించడం జరిగింది.

అనధికారికంగా లయనిజానికి సంబంధించిన అంశాల్ని దుర్వినియోగ పరచడం గానీ, స్వప్రయోజనాలకు వినియోగించడంగానీ ఎవరు చేసినా వారి మీద చట్టపరమైన చర్యలు తీసుకోవడానికి ప్రతి దేశంలోనూ అవకాశం వుంది.

### లయన్స్ చిహ్నం వినియోగం
### EMBLEM USE POLICY

ప్రతిదేశంలోనూ ట్రేడ్ మార్క్ చట్టాలు వుంటాయి. లయన్స్ క్లబ్‌లు వ్యవస్థాపించబడిన అన్ని దేశాలలోనూ ఆయా దేశాల ట్రేడ్‌మార్క్ చట్టాలకు అనుగుణంగా వుండి ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ లయన్స్ ఎంబ్లమ్ వినియోగించే విషయంలో చట్టపరమైన ఒక పాలసీని రూపొందించారు. దాన్ని Emblem Use Policy అంటారు.

లయన్స్ క్లబ్స్, ఇంటర్నేషనల్ మరియు దాని అనుబంధిత లయన్స్ క్లబ్‌లకు చట్టపరమైన రక్షణ కోసం అసోసియేషన్ పేరు, దాని చిహ్నాలను ట్రేడ్ మార్క్‌గా ప్రపంచ దేశాలన్నింటి లోనూ రిజిష్టర్ చేయడం జరిగింది.

అసోసియేషన్ పేరుకు, దాని చిహ్నానికి యజమాని లయన్స్‌క్లబ్స్ ఇంటర్నేషనల్ మాత్రమే!

ఈ విధంగా ఏ దేశంలో అయినాసరే, ఏ వ్యక్తీ లయన్స్ క్లబ్ పేరును గానీ, దాని చిహ్నాన్ని గానీ దుర్వినియోగం చెయ్యకుండా ఈ రిజిస్ట్రేషన్ రక్షణ కల్పిస్తుంది.

లయన్స్, లయన్స్‌క్లబ్, లయన్స్ ఇంటర్నేషనల్, లయన్స్‌క్లబ్స్ ఇంటర్నేషనల్ పదాలన్నీ ఈ విధంగా రక్షితమైనవే!

వీటిని దుర్వినియోగం కాకుండా సంరక్షించే బాధ్యత వహిస్తానని డిస్ట్రిక్ గవర్నర్‌లు, మల్టిపుల్ కౌన్సిల్ చైర్‌పర్సన్‌లు, ఇంటర్నేషనల్ డైరెక్టర్‌లు, ఇతర ఇంటర్నేషనల్ ఆఫీసర్లు వ్యక్తిగతంగా హామీ ఇస్తూ 'ఎంబ్లమ్ యూజ్ పాలసీ' పైన సంతకం చేస్తారు. ఇదీ లయనిజాన్ని దుర్వినియోగం కానీకుండా కాపాడుతున్న అంశం.

1) లయన్స్ ఎంబ్లమ్‌ను ధరించే వ్యక్తులు బాధ్యతాయుతంగా వుండాలి. లయనిజం గౌరవ ప్రతిష్ఠలకు భంగకరం కాని రీతిలో ఎంబ్లమ్‌ను వినియోగించాలి.

2) లయన్స్ కాని వ్యక్తులు ఈ ఎంబ్లమ్‌ను ఏ రకంగానూ వినియోగించరాదు.

3) ఎంబ్లమ్‌ను వినియోగించడం ద్వారా స్వంత ప్రయోజనాలు పొందే ప్రయత్నాల్ని లయన్స్ సభ్యులు గానీ, లయన్స్ క్లబ్‌లు గానీ, ఇతరులు గానీ చేయడానికి వీలులేదు.

4) లయనిజంలో సభ్యత్వం ఆసరాగా, వ్యాపారాత్మక ప్రయోజనాలు ఆశించి ఈ

ఎంబ్లమ్‌ని వినియోగించడాన్ని అనుమతించ కూడదు.

5) లయన్స్ ఇంటర్నేషనల్ కార్యాలయంలో లీగల్ డివిజన్, క్లబ్ సప్లైస్ అండ్ డిస్ట్రిబ్యూషన్ డివిజన్లు రెండూ ఎంబ్లమ్ పాలసీ విషయంలో బాధ్యత తీసుకొని వ్యవహరిస్తాయి.

లీగల్ డివిజన్ ఎంబ్లమ్‌ని అనధికారికంగా వినియోగించడాన్ని నిరోధించే చర్యలు తీసుకొంటుంది.

క్లబ్ సప్లైస్ అండ్ డిస్ట్రిబ్యూషన్ డివిజన్ అధికారికమైన వ్యక్తులకు, సంస్థలకు మాత్రమే లయన్స్ ఎంబ్లమ్ అందేలా చూస్తుంది.

క్లబ్ సెక్రటరీ ఆర్డర్ పెడితేనే క్లబ్ సప్లైస్ డివిజన్ నుంచి లయన్స్ ఎంబ్లమ్‌తో కూడిన వస్తుసామగ్రి మనకు లభిస్తాయి. అంతేగాని లయన్స్ ఎంబ్లమ్ కల్గిన వస్తువులు మార్కెట్లో పెట్టి అమ్మే వస్తువులు కావు. వాటిని అలా అమ్మడానికి వీల్లేదు కూడా!

భారతదేశంలో క్లబ్ సప్లైస్ డివిజన్ అనుమతి పొందిన అధీకృత ఏజెంట్స్ బెటర్ సర్వీసెస్, మోనార్క్ ఇంటర్నేషనల్, తేజ్ బ్రదర్స్, దినేష్‌జైన్ & కంపెనీ, సూర్యా క్రియేషన్స్, సేవక్ ఇండియా వంటి సంస్థలు లయన్స్ ఎంబ్లమ్‌తో కూడిన వస్తుసామగ్రిని, గోంగ్ గ్యావెల్, క్లబ్ బ్యానర్, లేపెల్ పిన్స్ ఇతర వస్తుసామగ్రిని ఆర్డరుపైన తయారుచేసి అందిస్తాయి.

6) లయన్స్ ఎంబ్లమ్‌తో కూడిన రకరకాల అందమైన డిజైన్లతో వివిధ లేపెల్ పిన్స్, అలాగే వివిధ 'లోగో'లను క్లబ్‌లు కూడా ఉపయోగించుకోవచ్చు. వీటిని "కన్‌వెన్షన్ డిస్ట్రిక్ట్ ట్రేడింగ్ పిన్స్" అంటారు. ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌లో ఒక పిన్స్ ఇంకొక డిస్ట్రిక్ట్ వారు పరస్పరం మార్పిడి చేసుకొని లయన్స్ సభ్యుల వినియోగార్థం ఉపయోగించుకోవచ్చు.

7) ఏ లయన్స్ సభ్యుడైనా లయన్స్ ఎంబ్లమ్‌ని దుర్వినియోగ పరచడం (లేక) అనధికారికంగా వినియోగ పరచడం చేస్తున్నప్పుడు ఈ క్రింది చర్యలు తీసుకోవచ్చు.

★ ఆ వ్యక్తి చేస్తున్న పని తప్పని తెలియజేయడం ద్వారా దానిని ఆపు చేయడం

★ దుర్వినియోగం ఆగనప్పుడు ఆ వ్యక్తి సభ్యత్వాన్ని క్లబ్‌లోంచి రద్దు చేయడం.

★ ఆ మేరకు క్లబ్ ఆ వ్యక్తిపైన తగిన చర్య తీసుకోవడంలో విఫలం అయినప్పుడు ఇంటర్నేషనల్ బోర్డు వారు ఆ క్లబ్ చార్టర్ రద్దు చేయడం గురించి పరిశీలిస్తారు.

**8) నిధుల సేకరణ విషయంలో ఎంబ్లమ్ వినియోగం :**

నిధులు సేకరించే కార్యక్రమాలు (Fund Raising Programmes) చేపట్టినప్పుడు లయన్స్ ఎంబ్లమ్‌ను ఉపయోగిస్తున్న కారణంగా "ట్రేడ్ మార్క్ వినియోగ రుసుము"ను (Trademark use charge) లయన్స్ ఇంటర్నేషనల్ నిర్ణయించి వసూలు చేసే అధికారం వుంది.

ఫండ్ రైజింగ్ చేస్తున్న విధానాన్ని బట్టి, టిక్కెట్ల మీద గానీ అమ్మకం జరుపుతున్న వస్తువుల మీద గానీ తప్పనిసరిగా "లయన్స్ ఫండ్ రైజింగ్ యాక్టివిటీ" అని ముద్రించవలసి వుంటుంది. (Fund Raising Seal) : సేకరించిన నిధులలోంచి టారిఫ్ ప్రకారం 3శాతం సొమ్ముని లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ (ముంబై) పేరుతో పంపించవలసి వుంటుంది.

9) ఇదంతా తలపెట్టడానికి ముందే, ఈ విధంగా ఫండ్‌రైజింగ్ సీల్‌ని వినియోగించి నిధుల సేకరణ చేస్తున్న వైనాన్ని గవర్నర్‌కు కాపీతో, ఇంటర్నేషనల్‌కు తెలియజేసి ఆమేరకు అనుమతి పొందవలసి వుంటుంది. ముంబై ఆఫీస్ నుంచి అనుమతి పొందితే సరిపోతుంది.

10) ఇదే విధంగా లయన్స్ పేరును గానీ, ఎంబ్లమ్‌ను గానీ, అసోసియేషన్ పేరును గానీ, లయనిజానికి సంబంధించిన పై విషయాలనన్నింటిని అన్యాక్రాంతంగా లైసెన్స్ లేకుండా ఎవరూ తయారు చేయడంగానీ, ప్రింట్ చేయడం గానీ, అమ్మడం గానీ చేయకూడదు.

11) లయన్స్ జిల్లా హద్దులను దాటి ఇతర ప్రాంతాలలో లయన్స్ క్లబ్‌లుగానీ, లయన్స్ సభ్యులుగానీ నిధుల సేకరణ ఏ రూపంలోనూ చేయకూడదు. అందుకు తగిన అనుమతి ఇంటర్నేషనల్ బోర్డు నుంచి పొందిన సందర్భాలలో మాత్రమే ఈ అవకాశం వుంటుంది.

**'అసోసియేషన్' అనే మాట వినియోగం**

**(ASSOCIATION, AS A NAME)**

ఇంటర్నేషనల్ బోర్డు, నిర్ణయానుసారం 'అసోసియేషన్' అనే పదంతోగానీ, అదే అర్థం వచ్చే సంఘం, సమితి వంటి పదాలతో గానీ ఒక క్లబ్‌నో, రీజియన్‌నో, డిస్ట్రిక్ట్‌నో, ప్రాంతాన్నో వ్యవహరించడాన్ని అనుమతించరు.

లయన్స్ క్లబ్ పేరుతో అలాంటివి చేర్చకుండా జాగ్రత్త తీసుకోవాలి.

**వ్యక్తిగతంగా వాడుకొనే వస్తువులకే లయన్స్ ముద్రలు**

**PERSONAL STATIONARY**

విజిటింగ్ కార్డులు, లెటర్‌హెడ్స్, ఆహ్వాన పత్రాలు, ఎన్వలప్ కవర్లు - పోస్ట్‌కార్డులు వంటి స్వంత స్టేషనరీ వస్తువుల మీద లయన్స్ సభ్యులు 'లయన్' ఎంబ్లమ్‌ను వాడుకునేందుకు అనుమతి వుంది. అందుకు కావలసిన గ్లాసీ ప్రింట్లను ఇంటర్నేషనల్ నుంచి ఖరీదుకు పొందవచ్చు కూడా!

అయితే, ఈ స్టేషనరీని లయన్స్ సభ్యులైన వ్యక్తులు వ్యక్తిగత విషయాలకు తప్ప, వ్యాపార ప్రయోజనాలకు ఎంతమాత్రమూ వినియోగించకూడదు.

**ఇతర సేవా సంస్థలలో సభ్యత్వం**

**(DUAL MEMBERSHIP)**

లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ మాదిరి పనిచేసే ఇతర అంతర్జాతీయ సేవాసంస్థల్లో వేటిలోనూ గౌరవ లయన్స్ సభ్యులు గానీ, ఎఫిలియేట్ లయన్స్ సభ్యులు గానీ తప్ప తక్కిన ఎవరికీ ద్వంద్వ సభ్యత్వం వుండకూడదనే నియమాన్ని 2003 సంవత్సరం నుంచీ సడలించారు. ఇప్పుడూ ఇలాంటి సభ్యత్వం అనుమతించబడ్తుంది.

**సభ్యత్వం పొందేందుకు కనీసపు అర్హత**

**(BASIS OF MEMBERSHIP)**

మెజారిటీ తీరిన ప్రతి వ్యక్తీ నీతి నిజాయితీలు మంచి నడవడి కలిగి, సమాజంలో ఉన్నతమైన స్థాయి కలిగి, కీర్తి ప్రతిష్ఠలతో ఉత్తమ పౌరులుగా రాణింపు కల్గిన వారంతా లయన్స్ క్లబ్‌లలో సభ్యత్వానికి ఆహ్వానింపదగిన వారే!

అలాంటి వారిని గుర్తించి, సభ్యత్వాన్ని స్వీకరించవలసిందిగా లయన్స్ క్లబ్‌లు స్వయంగా వారిని ఆహ్వానిస్తాయి.

Good Moral Character. Good Reputation (సత్ప్రవర్తన, మంచి కీర్తి ప్రతిష్ఠలు) అనే మాటలు లయన్స్ రాజ్యాంగంలో 3వ ఆర్టికల్ 3వ విభాగంలో పేర్కొన్నట్లుగా - లయన్స్ సభ్యులందరికీ వర్తిస్తాయి. అలాగే లయనిజంలో సభ్యులుగా చేరనున్న (Prospective) వారిక్కూడా వర్తింపచేసి అలాంటి వారినే లయనిజంలోకి ఆహ్వానించమని, అలాంటివారినే లయనిజంలో కొనసాగింప చేయమనీ లయనిజం సూచిస్తోంది.

ఏ లయన్స్ సభ్యుడైనా అనైతికమైన విషయాలపై కోర్టు తీర్పు ద్వారా నేరస్థుడిగా

రుజువైన పక్షంలో, అతని ప్రవర్తన, సమాజంలో అతని కీర్తిప్రతిష్ఠలు ఉన్నతంగా లేని పక్షంలో ఆ సభ్యుడి సభ్యత్వాన్ని ఈ క్లబ్‌లోంచి తొలిగించడానికి ఇంటర్నేషనల్ బోర్డు తీర్మానం ద్వారా అనుమతిస్తోంది.

అయితే, శిక్షాకాలం పూర్తి చేసుకుని విడుదలై బైటకు వచ్చిన వ్యక్తులలో పరివర్తన కన్పించినప్పుడు, వారిని తిరిగి లయనిజంలోకి సభ్యుడిగా ఆహ్వానించడానికి కూడా ఇంటర్నేషనల్ బోర్డు తీర్మానం ద్వారా అనుమతిస్తోంది!

**డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్, నియామకాలు ఎన్నికలు**

**DIST. CONVENTION, NOMINATION & ELECTION**

లయన్స్ జిల్లా వార్షిక సమావేశాన్ని Annual District Convention అంటారు.

★ జిల్లా గవర్నర్ ఈ సమావేశానికి అధ్యక్షత వహిస్తారు.

★ కనీసం 45 రోజుల వ్యవధిలో డిస్ట్రిక్ట్స్ కన్‌వెన్షన్ పిలుపునిస్తారు జిల్లా గవర్నర్.

★ గుడ్‌స్టాండింగ్‌లో వున్న ఐదుగురు లయన్స్ సభ్యులతో ఒక నామినేటింగ్ కమిటీని గవర్నర్ నియమిస్తారు. ఈ నియామకం వివరాలు 20 రోజుల ముందుగా జిల్లాలో అన్ని క్లబ్‌లకూ అందేలా పంపుతారు.

★ గవర్నర్, వైస్ గవర్నర్ పదవులకు పోటీ చేయాలని సంకల్పించిన వ్యక్తుల మాతృసంస్థ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ ఆమేరకు, ఆ వ్యక్తి అభ్యర్థిత్వాన్ని ఆమోదిస్తూ ఒక తీర్మానం చేస్తారు. బోర్డు తీర్మానాన్ని జనరల్ బోడీ అంగీకరిస్తూ (Ratified) తీర్మానిస్తుంది.

★ లేదా జిల్లాలో సగానికన్నా ఎక్కువ (మెజారిటీ) క్లబ్‌లు ఆ వ్యక్తి అభ్యర్థిత్వాన్ని బలపరుస్తూ తీర్మానాన్ని అందచేసినా సరిపోతుంది.

★ ఎన్నికలకు (7) వారం రోజులు ముందుగా ఈ తీర్మానాన్ని జోడిస్తూ అభ్యర్థిత్వానికి అవసరమైన అర్హతలను చూపుతూ నామినేటింగ్ కమిటీ చైర్మన్‌కు అభ్యర్థన పత్రాన్ని అందచేస్తారు. అంటే నామినేషన్ వేస్తారు.

★ నామినేటింగ్ కమిటీ చైర్మన్ తనకు అందిన నామినేషన్ పత్రాలన్నింటినీ స్క్రూటినైజ్ చేసి, సక్రమంగా వున్న వాటిని డిస్ట్రిక్ట్ గవర్నర్‌కు నివేదిస్తారు.

★ సక్రమంగా వున్న నామినేషన్లను వేసిన అభ్యర్థుల మధ్య జిల్లా గవర్నర్, వైస్‌గవర్నర్ పదవులకు విడిపోగా ఎన్నికలు జరుగుతాయి.

★ జిల్లా గవర్నర్‌కు జరిగే ఎన్నిక – 'అవును – కాదు' అనే పద్ధతిలో వుంటుంది. మెజారిటీ ఓటర్లు అంటే చెల్లుబాటైన ఓట్లలో సగాని కన్నా ఎక్కువమంది 'అవును' అని ఓటు వేస్తేనే గవర్నర్ పదవికి ఆ వ్యక్తి ఎన్నిక అయినట్లు పరిగణిస్తారు.

★ వైస్ గవర్నర్ పదవికి ఎన్నికలు కూడా రహస్య బ్యాలెటింగ్ విధానంలోనే జరుగుతాయి. పోలయి, చెల్లుబాటైన ఓట్లలో సగం కన్నా ఎక్కువ ఓట్లు సంపాదించుకున్న వ్యక్తిని ఎన్నికైనట్లుగా ప్రకటిస్తారు.

★ ఓటింగ్ జరగడానికి 24 గంటల ముందు వరకూ పోటీకి తలపడిన అభ్యర్థులలో ఎవరైనా ఉపసంహరించుకునే అవకాశం వుంటుంది.

★ జిల్లా గవర్నర్ అభ్యర్థి గాని, జిల్లా వైస్ గవర్నర్ అభ్యర్థి గానీ తమ తమ క్లబ్‌లలో గుడ్ స్టాండింగ్‌లో వుండాలి. వారి వారి క్లబ్‌లు కూడా గుడ్‌స్టాండింగ్‌లో వుండాలి.

★ వారి వారి మాతృసంస్థల నుంచి ఎండార్స్‌మెంట్‌లు (అనుమతి పత్రాలు) గాని, మెజారిటీ క్లబ్‌ల అభ్యర్థిత్వ అనుమతి పత్రాలు గానీ జతచేయాలి.

★ గవర్నర్ పదవికి వైస్ గవర్నర్‌గా వున్న వ్యక్తులు మాత్రమే పోటీ చేయడానికి అర్హులౌతారు. వైస్ గవర్నర్‌ను 'అవును – కాదు' అనే రెండు అంశాల ఆధారంగా రహస్య బ్యాలెట్ విధానంలో గవర్నర్‌గా ఎన్నుకొంటారు.

★ వైస్ గవర్నర్‌గా పనిచేస్తున్న వ్యక్తి ఏ కారణం చేతనైనా గవర్నర్‌గా పోటీ చేయడానికి సంసిద్ధత లేనప్పుడు లయన్స్ రాజ్యాంగం ప్రకారం అర్హతలూ (Qualification) వున్న వ్యక్తులు నేరుగా గవర్నర్ పదవికి పోటీ చేస్తారు. డిస్ట్రిక్ట్ కేబినెట్‌లో ఆర్‌సీగా గాని, జడ్‌సీగా గాని లేక కాబినెట్ సెక్రటరి / ట్రెజరర్‌గా గాని పని చేసి, అదనంగా, గుర్తింపు పొందిన డిస్ట్రిక్ట్ చైర్మన్ పదవిని కూడా ఒక పర్యాయం చేసివున్న వ్యక్తి ఈ పదవిని పొందేందుకు అర్హుడౌతాడు.

అలాగే, క్లబ్ బోర్డులో కూడా, కనీసం రెండు సంవత్సరాలకు తక్కువ లేకుండా సభ్యుడిగా వుండి వుండాలి.

### ఎన్నికలు - ఫిర్యాదులు - విచారణ

మల్టిపుల్ 324 రాజ్యాంగంలో 13వ ఆర్టికల్‌లో నిర్దేశించిన ప్రకారం డిస్ట్రిక్ట్ గవర్నర్‌ల పదవులకు జరిగే ఎన్నికలలో అక్రమాలకు సంబంధించిన ఫిర్యాదుల విషయంలో కొన్ని మార్గదర్శక సూత్రాలు రూపొందించారు.

1) విజయం పొందలేకపోయిన అభ్యర్థి మాత్రమే ఫిర్యాదు చేయవలసి వుంటుంది.

2) టెలెక్స్, ఫ్యాక్స్‌ల ద్వారా లిఖిత పూర్వకంగా ఇంటర్నేషనల్ హెడ్‌క్వార్టర్స్‌కు అందేలా ఎన్నికలు జరిగిన 5 రోజులలోపు ఫిర్యాదును పంపవలసి వుంటుంది.

3) మరో 5 రోజులలోపు అందేలా ఫిర్యాదుల అసలు కాపీని పంపించాలి. ఫిర్యాదులో తప్పనిసరిగా వుండవలసిన విషయాలు (Format) క్రింద విడిగా ఇవ్వడం జరిగింది. చూడండి.

4) ఫిర్యాదు రుసుము క్రింద 500 అమెరికన్ డాలర్లు చెల్లించాలి.

5) ఫిర్యాదు కాపీలను డిస్ట్రిక్ట్ గవర్నర్‌కూ, మల్టిపుల్ కౌన్సిల్ సెక్రటరీకి, ఫిర్యాదు ఎవరిపైన చేయడం జరిగిందో ఆయా వ్యక్తులకూ కాపీలు పంపించాలి. వారు కోరిన పక్షంలో ఫిర్యాదు కాపీని పరిశీలన కోసం అందించవలసి వుంటుంది కూడా.

### ఫిర్యాదు నమూనా
### (FORMAT OF COMPLAINT)

1) వాస్తవాల విశదీకరణ (Statement of Facts)

2) ఫిర్యాదుదారుని వాదం, ఆ వ్యక్తికి జరిగిన అన్యాయం అందుకోనం ఆ వ్యక్తి కోరుకొంటున్న ఉపశాంతి వివరాలు :

3) ఫిర్యాదు పెద్దటైపులో 8 1/2" × 11" సైజ్ కాయితాలమీద, 10 పేజీలకు మించకుండా, 5 పేజీలకు మించని సాక్ష్యాధారాలతో ఫిర్యాదు వుండాలి.

4) జిల్లా నెంబర్, పేరు, ఫాక్స్ నెంబర్ చిరునామాలు, ఫిర్యాదు చేయబడిన వ్యక్తుల చిరునామాలు, ఇతర వివరాలు ఎన్నికల తేదీ, ఓటింగ్ వివరాలు అన్నీ స్పష్టంగా పేర్కొనాలి. ప్రతిపేజీ క్రింద ఫిర్యాదుదారు ఇనిషియల్ వుండాలి. చివరిగా అసలు సంతకం వుండాలి.

ఇంటర్నేషనల్ బోర్డు వారు ఈ ఫిర్యాదును పరిశీలించి, వాస్తవాల ఆధారంగా అంగీకరించడం గానీ తిరస్కరించడం గానీ చేస్తారు.

మల్టిపుల్ కౌన్సిల్ అవసరం అయితే ఈ విషయంలో మధ్యవర్తిత్వం నెరపవచ్చు.

### ఒక సంవత్సరం ఒకరోజు కాలపరిమితి వివరాలు

**Members enrolled for at least one year and a day**

లయన్స్ ఇంటర్నేషనల్ బోర్డు నిర్ణయం ప్రకారం క్లబ్‌లో చేరి ఒక సంవత్సరం - ఒక రోజు - గడువు పూర్తి చేసుకున్న సభ్యులలో పదిమందికి ఒకరికి

లయన్స్ మల్టిపుల్ జిల్లా ఎన్నికల్లో ఓటింగ్‌లో పాల్గొనే అవకాశాలుంటాయి.

ఇక్కడ మరికొన్ని వివరాలు :

1) వేరే లయన్స్ క్లబ్ నుంచి ఈ క్లబ్‌లోకి ట్రాన్స్‌ఫర్ అయి వచ్చిన సభ్యుడు, మొదటి సంస్థలో ఒక సంవత్సరం ఒక రోజు కాలపరిమితి పూర్తి చేసుకున్న వాడయితే, ట్రాన్స్‌ఫర్ అయిన సంస్థతో ఓటింగ్ అవకాశం కల్గిన సభ్యులతో కలిపి లెక్కలోకి వస్తారు.

2) ఆరు నెలలోగా తిరిగి చేరిన (రీ ఇన్‌స్టేట్ అయిన) సభ్యులు కూడా ఈ కాలపరిమితి పూర్తి చేసుకున్నవారైతే, ఓటుహక్కు గల వారితో కలిపి లెక్కించవచ్చు.

3) కొత్తగా చార్టర్ అయిన లయన్స్ క్లబ్ కూడా, ఒక సంవత్సరం ఒకరోజు కాలపరిమితి పూర్తి చేసుకొన్నది కాని పక్షంలో, ఆ క్లబ్‌లో ఒక సంవత్సరం ఒక రోజు కాలపరిమితికి తక్కువ ఉన్న సభ్యులు కాక ఎంతమంది సభ్యులున్నాసరే ఒక వోటుని మాత్రమే ఇవ్వడం జరుగుతుంది.

4) స్టేటస్‌కో లోంచి బైటపడిన లయన్స్‌క్లబ్ విషయంలో కూడా, ఆ సమయానికి ఒక సంవత్సరం ఒకరోజు కాలపరిమితి పూర్తి చేసుకున్న సభ్యులు ఎంతమంది వున్నారో అంతమందికీ పదిమందికి ఒక్కరు చొప్పున ఓటు అవకాశం కల్పిస్తారు.

5) ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్‌కు డెలిగేషన్ సంఖ్యకు ప్రతి 25 మందికి ఒకరికి చొప్పున కేటాయించే విషయంలో ఈ ఒక సంవత్సరం ఒక రోజు కాలపరిమితి వర్తించదు.

## ఇంటర్నేషనల్ బోర్డు చేసిన నిర్ణయాలను అతిక్రమిస్తే...?

ఏదైనా లయన్స్ క్లబ్, లేక ఎవరైనా సభ్యుడు బోర్డు నిర్ణయాలను అతిక్రమంచి గానీ, రాజ్యాంగం, ఉపనియమావళిని ఉల్లంఘించి గానీ వ్యవహరించినప్పుడు తగినచర్యలు తీసుకోవడానికి ఇవీ మార్గదర్శక సూత్రాలు.

a) జరుగుతున్న ఉల్లంఘన లేదా అతిక్రమణల గురించి ఆ వ్యక్తిని గాని, ఆ క్లబ్‌ని గాని హెచ్చరించి, మార్గం మార్చుకొమ్మని ఉద్బోధించడం.

b) ఇంటర్నేషనల్ సూచించిన మార్గదర్శక సూత్రాలను పాటించడంలో విఫలం అయినప్పుడు ఆ వ్యక్తి సభ్యత్వాన్ని ఆ క్లబ్ సభ్యత్వం నుండి రద్దు చేయమని కోరడం.

c) ఇది సభ్యుడికి సంబంధించిన విషయమై, నెల రోజులలోపు వ్యక్తి సభ్యత్వాన్ని రద్దుచేయడంలో అతని మాతృసంస్థ విఫలమైనప్పుడు, ఆ క్లబ్‌ను స్టేటస్‘కో’లో వుంచడం

## లయన్స్ జిల్లా వివాద తీర్మానం
## DISTRICT DISPUTE RESOLUTION

సాధారణంగా వివాదాలనేవి సభ్యత్వానికి సంబంధించినవిగా వుంటాయి. లేదా, క్లబ్ సరిహద్దులకు సంబంధించినవిగా వుంటాయి. ఒక్కోసారి, నియమాలను అవగాహన చేసుకోలేకపోవడం (Interpretation) లో కూడా వుంటాయి.

రాజ్యాంగం, ఉపనియమావళిని ఉల్లంఘిస్తునట్లు కన్పించినప్పుడూ, వాటిలో కొత్తగా చేర్చిన మార్పుల్ని అర్థం చేసుకోలేకపోవడంలోనూ వుంటాయి.

డిస్ట్రిక్ట్ కేబినెట్ సమావేశాలలో పాలసీలను రూపొందించడంలో ఏర్పడతాయి.

అభిప్రాయ భేదాలు ఏర్పడినప్పుడు ఇతర మార్గాలలో వాటిని పరిష్కరించ లేనప్పుడు అవి వివాదాలుగా మారతాయి.

ఒక్కోసారి క్లబ్‌ల మధ్య వివాదాలు ఏర్పడుతుంటాయి. అలాగే క్లబ్‌కూ డిస్ట్రిక్ట్‌కూ మధ్య వివాదాలు ఏర్పడుతుంటాయి.

ఈ వివాదాలు ఏర్పడినప్పుడు పరిష్కరించేందుకు శాస్త్రీయమైన రీతిలో ఒక విధానాన్ని ఇంటర్నేషనల్ బోర్డు ఆమోదించింది.

A) వివాదాన్ని రేపిన వ్యక్తి క్లబ్ జిల్లా గవర్నర్ గారికి ఆ విషయాన్ని లిఖిత పూర్వకంగా తెలియజేస్తూ జిల్లా వివాద తీర్మానాన్ని (District Dispute Resolution) అమలుచేయవలసిందిగా కోరతారు.

B) డిస్ట్రిక్ట్ కేబినెట్ అనుమతి తీసుకొని, జిల్లా గవర్నర్ గారు 15 రోజుల లోపు ముగ్గురు మధ్యవర్తుల్ని (Conciliators) పరిష్కర్తులుగా నియమిస్తారు.

C) ఈ పరిష్కర్తలు ఈ విషయానికి సంబంధించి అందరినీ పిలిచి వారి వారి వాదాలను వింటారు.

D) ఈ పరిష్కర్తలు ఈ జిల్లాకే చెందిన పాస్ట్ గవర్నర్ స్థాయి లయన్స్ నాయకులై వుండాలి. వారూ, వారి మాతృ సంస్థలు కూడా గుడ్ స్టాండింగ్‌లో వుండి వుండాలి, అయితే, వీరు గానీ, వీరి మాతృ సంస్థలు గానీ ఈ వివాదంతో ఎలాంటి సంబంధమూ లేని వారుగా వుండాలి.

E) పరిష్కర్తల ప్యానెల్‌ను ఏర్పాటు చేసేప్పుడు ఇరుపక్షాల కోర్కెల్ని మన్నించి వారి వారికి ఆమోదయోగ్యులైన వ్యక్తుల్ని ఇద్దరిని ప్యానెల్‌గా నియమిస్తారు. ఈ ఇద్దరూ మూడవ వ్యక్తిని సూచిస్తారు. ఆ మూడవ వ్యక్తి ప్యానెల్ చైర్మన్‌గా వ్యవహరిస్తారు.

f) ఈ ప్యానెల్‌ను ఏర్పాటు చేయడంలో జిల్లా గవర్నర్ గారిదే తుది నిర్ణయం.

g) వివాదపడిన ఇరుపక్షాలన్నీ 30 రోజులలోగా పరిష్కర్తలు సమావేశపరిచి, సరిఅయిన, అందరికీ ఆమోదయోగ్యమైన తీర్మానం చేసి వివాదం పరిష్కరిస్తారు.

h) పరిష్కర్తల ప్యానెల్ ఆదర్శం వివాదాన్ని పరిష్కరించడమే!

i) ఈ ప్రయత్నం వలన కూడా వివాదం సులువైన రీతిలో పరిష్కారం కానప్పుడు చట్టబద్ధమైన, న్యాయబద్ధమైన ధర్మబద్ధమైన తీర్పుని పరిష్కర్తలు ప్రకటిస్తారు. ఈ తీర్పు ఇరుపక్షాలకూ శిరోధార్యంగా వుంటుంది.

## వివాదాలు - న్యాయపోరాటాలు

## LEGAL DISPUTES

మేధావుల వేదిక కాబట్టి, లయనిజం వంటి అంతర్జాతీయ స్థాయి సంస్థల్లో కూడా అప్పుడప్పుడు వివాదాలు సంభవించవచ్చు. వాటిని పరిష్కరించుకోవడానికి లయన్స్ ఇంటర్నేషనల్ వివాద తీర్మానాన్ని ప్రతిపాదించి, చర్చించి నిర్ణయాలు తీసుకునే పద్ధతిని సూచించింది. దీన్ని Dispute Resolution అంటారు.

వివాద తీర్మానాల్ని క్లబ్ స్థాయిలో గానీ, జిల్లా స్థాయిలో గానీ, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ స్థాయిలో గానీ, ఇంటర్నేషనల్ స్థాయిలో గానీ, వివాదం స్థాయిని బట్టి పరిష్కరించుకునేందుకు అవకాశం వుంది. వివాదాలను ముదిరేలా ప్రయత్నించకుండా లయనిజం పరిధిలోనే పరిష్కరించుకోవడం లయన్స్ ప్రతి ఒక్కరి బాధ్యత!

వివిధ ఎన్నికల సమయాలలోనూ, ఆధిపత్యాన్ని ప్రదర్శించడంలోనూ, నిధుల వినియోగంలోనూ ఇలాంటి వివాదాలు ఏర్పడుతుంటాయి సాధారణంగా!

వీటన్నింటినీ కాదని లయన్స్ సభ్యులు, అనవసరంగా కోర్టుల కెక్కే ప్రయత్నాలు చేయడాన్ని మన మల్టిపుల్ డిస్ట్రిక్ట్ ఆమోదించిన రాజ్యాంగం నిషేధిస్తోంది.

ఒక సభ్యుడు తన స్వంత లయన్స్ క్లబ్ పైన గానీ, లయన్స్ జిల్లా పైన గానీ, మల్టిపుల్ జిల్లా పైన గానీ, లయనిజం పరిధిలో వున్న లయన్స్ ఇంటర్నేషనల్ పైన గానీ, అవకాశాలను వినియోగించుకోకుండా నేరుగా కోర్టుకు వెడితే, వెంటనే, ఆ సభ్యుణ్ణి క్లబ్‌లోంచి క్రమశిక్షణా చర్యగా తొలగించమని మల్టిపుల్ జిల్లా రాజ్యాంగం విశేషించి పేర్కొంది.

ఏ కారణం చేతనయినా, ఆ లయన్స్ క్లబ్ కోర్టుకు వెళ్ళిన తన సభ్యుడి సభ్యత్వాన్ని తక్షణం తొలగించలేకపోతే, ఆ క్లబ్‌ని స్టేటస్‌కోలో పెట్టమని ఇంటర్నేషనల్‌ను జిల్లా గవర్నర్ కోరవచ్చు.

ఒక లయన్స్ క్లబ్ ఇలా కోర్టుకు వెళ్ళిన పరిస్థితుల్లో కూడా తక్షణం ఆ క్లబ్ కార్యకలాపాన్ని స్తంభింపచేస్తూ స్టేటస్‌కో లో వుంచేందుకు ఇంటర్‌నేషనల్‌కు రికమెండ్ చేసే అధికారం గవర్నర్ గార్కి వుంది.

**డిస్ట్రిక్ట్ బకాయిలు చెల్లించకపోతే...?**

చాలామందికి ఓ దురభిప్రాయం వుంది. లయన్స్ క్లబ్‌ని స్టేటస్‌కోలో పెట్టే అధికారం లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్‌కు మాత్రమే వుంది కాబట్టి ఇంటర్నేషనల్ బకాయిలు మాత్రం ముందు శ్రద్ధగా కడితే సరిపోతుందని! డిస్ట్రిక్ట్ బకాయిలు, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ బకాయిలు చెల్లించకపోయినా కొంపలంటుకొనేది ఏమీ లేదని! ఈ విధంగానే, కొందరు ఇతరులకు సలహాలు ఇస్తుంటారు కూడా! ఇది నిజంగానే పొరబాటు అభిప్రాయం.

క్లబ్‌లతో గవర్నర్ గారికుండే వ్యక్తిగత సాన్నిహిత్యం రీత్యా కొంత సరళంగా కొందరు గవర్నర్‌లు వ్యవహరిస్తే వ్యవహరించవచ్చు.

కానీ, ఇంటర్నేషనల్‌కు చెల్లించినట్లే, డిస్ట్రిక్ట్‌కూ, మల్టిపుల్ డిస్ట్రిక్ట్‌కు కూడా అన్ని బకాయిలూ చెల్లించడం నక్రమంగా జరగకపోతే, మొదట క్లబ్ దానికదే గుడ్‌స్టాండింగ్ స్టేటస్‌ని కోల్పోతుంది. అందువలన ఓటు హక్కుతో సహా అన్ని అవకాశాలూ కోల్పోయినట్లే అవుతుంది.

కన్వెన్షన్లు జరిగేటప్పుడు ఆయా క్లబ్‌లు మాత్రమే కాదు, డెలిగేట్స్ కూడా గుడ్‌స్టాండింగ్‌లో వున్నవారైతేనే ఓటుహక్కుని తదితర హక్కుల్నీ పొందగలుగుతారు. వివిధ పదవులకు పోటీ చేసే అవకాశాలు కూడా వీరికుండవు. డిస్ట్రిక్ట్ తదితర బకాయిలు చెల్లింప చేయడంలో విఫలమైనప్పుడు క్లబ్‌ని స్టేటస్‌కోలో వుంచవలసిందిగా సూచించే అధికారం గవర్నర్ గారికుంది.

## లయన్స్ క్లబ్‌కు సభ్యత్వంలో శ్రేష్ఠత్వం
## CLUB IN GOOD STANDING

మనం సభ్యులుగా వున్న మన లయన్స్ క్లబ్ ఇంటర్నేషనల్ అసోసియేషన్ ఆఫ్ లయన్స్ క్లబ్స్‌లో సభ్యురాలిగా వుంటుంది. మన క్లబ్‌లో మనం ఎంతమంది వున్నామో అంతమంది పేర్న ఇంటర్నేషనల్‌కు చెల్లించవలసిన సభ్యత్వ రుసుము చెల్లించినప్పుడు మాత్రమే, ఈ ఇంటర్నేషనల్ అసోసియేషన్‌లో మన లయన్స్ క్లబ్ సభ్యత్వం శ్రేష్ఠత్వంలో (Good Standing)లో వుంటుంది.

a) "స్టేటస్ కో"లో లేని అన్ని రుసుములు చెల్లించిన ప్రతి లయన్స్ క్లబ్ గుడ్ స్టాండింగ్‌లో వుంటుంది.

b) ఇంటర్నేషనల్ రాజ్యాంగానికి, నియమాలకూ అనుగుణంగానూ, ఇంటర్నేషనల్ బోర్డుపాలసీకి అనుగుణంగానూ పనిచేసే ప్రతి క్లబ్ గుడిస్టాండింగ్‌లో వుంటుంది.

c) ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్, మల్టిపుల్ రుసుములు, బకాయిలతో సహా చెల్లించిన ప్రతి క్లబ్ గుడ్ స్టాండింగ్‌లో వుంటుంది.

d) గత 90 రోజుల్లో 50 డాలర్ల కన్నా తక్కువ బకాయిలు మాత్రమే వున్న లయన్స్ క్లబ్ గుడ్ స్టాండింగ్‌లో వుంటుంది.

## పనిచేయని క్లబ్ అంటే...

### NON FUNCTIONING CLUB

Non Operating, fictious క్లబ్స్ గురించి ఇంటర్నేషనల్ ముందుగానే హెచ్చరిస్తోంది...

★ నెలనెలా ఎం.ఎం.రిపోర్టులు పంపడం

★ రెగ్యులర్ సమావేశాలు జరపడం

★ తరువాతి కాలానికి చెల్లించవలసిన అన్ని బకాయిలు చెల్లించడం

★ జోన్, రీజియన్, డిస్ట్రిక్ట్ కార్యక్రమాలకు ఆ క్లబ్ సభ్యులు హాజరుకావడం

ఏ లయన్స్ క్లబ్ అయినా ఈ నాలుగు ప్రధాన బాధ్యతల్నీ నెరవేర్చడంలో విఫలం అయితే అది పనిచేయని (Non Operating) క్లబ్‌గా ముద్రపడి పోతుంది. క్లబ్ పాలనా బాధ్యతలు తీసుకున్న వ్యక్తులు గవర్నర్, వైస్ గవర్నర్, రీజియన్ చైర్మన్, జోన్ చైర్మన్‌లతో తప్పనిసరిగా సత్సంబంధాలు నెలకొల్పుకొని పనిచేయవలసి వుంటుంది.

బకాయిలు చెల్లించకుండా, రిపోర్ట్‌లు పంపకుండా, జోన్ అడ్వయిజరీలు, రీజియన్ సెమినార్‌లకు రాకుండా, తమ క్లబ్ తరపున కార్యక్రమాలు ఏమీ చేపట్టకుండా వుంటే ఆ క్లబ్‌ని పనిచేయని స్థితిలోకి నెట్టినట్టే భావించవలసి వుంటుంది.

## స్టేటస్ కో అంటే...

### STATUS QUO AND CHARTER CANCELLATION

పనిచేయని స్థితిలోకి వెళ్ళిన క్లబ్ ఇంక 'స్టేటస్ కో' స్థితిని ఎదుర్కొంటుంది.

a) ఒక క్లబ్‌ని 'స్టేటస్ కో'లో వుంచడానికి ఇప్పుడు చెప్పబోతున్న కారణాల్లో ఏ ఒకటి వున్నా న్యాయబద్ధంగా ఆ 'క్లబ్'ని నిలుపు చేసే అవకాశాలుంటాయి.

లయన్స్ ఆదర్శాల ప్రకారం నడుచుకోవడంలో విఫలం కావడం.

లయన్స్ క్లబ్‌గా నిర్వహించవలసిన పవిత్ర సేవా బాధ్యతలకు వ్యతిరేకంగా ప్రవర్తించడం.

గడువు తీరిన 90 రోజుల లోపల ఇంటర్నేషనల్ డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ బకాయిల్ని చెల్లించ లేకపోవడం.

కార్యక్రమాలలో తగిన సంఖ్యలో పాల్గొన లేకపోవడం.

ఆరునెలల పాటు వరుసగా ఎం.ఎం. రిపోర్ట్‌లు పంపకుండా ఊరుకోవడం.

ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ పక్షాన ఎగ్జిక్యూటివ్ ఎడ్మినిస్ట్రేటర్ క్లబ్‌ని స్టేటస్‌కోలో పెట్టే అధికారం కలిగి వుంటాడు.

పనిచేయని లయన్స్ క్లబ్‌లోని సభ్యుల్ని డిసెంబర్ 31 వరకూ డిస్ట్రిక్ట్ గవర్నర్ గారు ప్రోత్సాహపరిచి, ఉత్తేజపరిచి క్లబ్‌కు ప్రాణ ప్రతిష్ట చేయాలని ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నాలు కూడా విఫలం అయితే, డిసెంబర్ నెలాఖరులోగా ఇంటర్నేషనల్‌కు ఈ క్లబ్‌ని స్టేటస్ కో లో వుంచవలసిందిగా రికమెండ్ చేసే అవకాశం వుంటుంది.

c) ఒకసారి క్లబ్‌ని 'స్టేటస్ కో'లో పెట్టిన తరువాత 90 రోజుల వరరకూ అది అమలులో వుంటుంది.

ఈలోగా ఆ క్లబ్‌ని బతికించే ప్రయత్నాలు జరుగుతూ వుంటే, "స్టేటస్ కో"ని మరికొన్నాళ్ళు పొడిగించే అవకాశం వుంటుంది.

క్లబ్‌కు ప్రాణ ప్రతిష్ట చేసే కార్యక్రమాన్ని రీ యాక్టివేషన్ ప్రోగ్రాం అంటారు.

ఇంటర్నేషనల్ ఆఫీస్‌లో క్లబ్ ఎడ్మినిస్ట్రేషన్ డివిజన్, క్లబ్‌ని "స్టేటస్ కో" లోంచి విడుదల చేయడమో, లేక ఛార్టర్‌ని ఉపసంహరించడమో నిర్ణయిస్తుంది.

d) సంవత్సరం ప్రారంభంలో, మొదటి 2 నెలల లోపు క్లబ్‌ని "స్టేటస్ కో"లో వుంచినట్లయితే ఆ సెమీ యాన్యువల్ పీరియడ్‌కు సభ్యత్వ రుసుము చెల్లించవలసిన అవసరం లేకుండా, పాత బకాయిలు చెల్లిస్తే సరిపోతుంది.

## 'స్టేటస్ కో'లో బైటపడేందుకు చేయూత
## ASSISTANCE FOR STATUS QUO CLUB

ఛార్టర్ ఉపసంహరణ జరిగేలోపు "స్టేటస్ కో"లోంచి బైటపడేందుకు చెయ్యగలిగినన్ని ప్రయత్నాలు చేస్తారు. క్లబ్‌కు ప్రాణం పోసేందుకు చేసే ప్రయత్నాలు ఇలా వుంటాయి.

క్లబ్‌ని స్టేటస్ కోలో వుంచిన తర్వాత, మొదట జోన్ ఛైర్మన్ దాని విషయమై తీసుకోదగిన చర్యల గురించీ, స్టేటస్ కోలో పడటానికి గల కారణాల గురించీ డిస్ట్రిక్ట్ గవర్నర్‌కు వివరాలు అందజేయవలసి వుంటుంది.

క్లబ్ పరిస్థితిని ఆకళింపు చేసుకున్న గవర్నర్ గారు "రీబిల్డింగ్ కమిటీ"ని నియమిస్తారు.

ఈ రీబిల్డింగ్ కమిటీ జిల్లాలోని ఒక పాస్ట్ గవర్నర్ గారి నాయకత్వంలో పనిచేస్తుంది.

"స్టేటస్ కో" లోంచి ఆ క్లబ్‌ను విడుదల చేయించడం, క్లబ్‌ని పునర్నిర్మించడం అనేవి ఈ కమిటీ బాధ్యతలు. అందుకు 90 రోజులు, అవసరం అయితే మరో 90 రోజులు గడువుగా నిర్ణయిస్తారు.

పునర్నిర్మాణ కమిటీ సాధ్యమైనన్ని సార్లు క్లబ్ సభ్యుల్ని కలిసి వారిని ప్రోత్సాహపరిచే ప్రయత్నాలు చేస్తుంది.

తమ ప్రయత్నాలు ఎంతవరకూ వచ్చాయో, క్లబ్‌ని బ్రతికించేందుకు సాధ్యాసాధ్యతలు ఎంత వున్నాయో వివరిస్తూ నెలకొకసారి డిస్ట్రిక్ట్ గవర్నర్ గారికి ప్రోగ్రెస్ రిపోర్ట్ అందిస్తుంది.

ఈ ప్రోగ్రెస్ రిపోర్ట్‌ను పరిశీలించి పునర్నిర్మాణ కార్యక్రమం చురుకుగా సాగుతున్న విషయాన్ని ఇంటర్నేషనల్ కార్యాలయానికి ఎప్పటికప్పుడు గవర్నర్‌గారు తెలియజేస్తుంటారు. ఇలా చేసినందువలన అవసరం అయితే, మరికొంత కాలం గడువు లభించే అవకాశం వుంది.

'స్టేటస్ కో' లోంచి 'విడుదల' చేయమని కోరుతూ అందుకోసం నిర్దేశించిన విడుదల ఫారాలను పూర్తి చేసి గవర్నర్ గారికి రీబిల్డింగ్ టీమ్ వారు అందజేస్తారు. ఆయన వాటిని ఇంటర్నేషనల్ కార్యాలయానికి పంపిస్తారు. స్టేటస్ కో లోంచి బైటపడేందుకు క్లబ్‌కు ఇవ్వగల్గిన చేయూత ఇది.

రీబిల్డింగ్ కమిటీ ఈ పునర్నిర్మాణం విషయంలో విఫలమైనప్పుడు, ఇంక ఆ క్లబ్‌కు ప్రాణ ప్రతిష్ఠ చేయడం సాధ్యం కాదని భావించిన పక్షంలో ఆ సంగతి గవర్నర్ గారికి తెలియ చేయడం జరుగుతుంది. గవర్నర్ ఆ క్లబ్ చార్టర్ ఉపసంహరించవలసిందిగా ఇంటర్నేషనల్‌కు రికమెండ్ చేస్తాడు.

చార్టర్ ఉపసంహరించడం జరిగింది అంటే, అంతర్జాతీయ లయన్స్ సంస్థల సమాఖ్య (The International Association of Lions clubs) లోంచి ఆ క్లబ్ సభ్యత్వాన్ని కోల్పోయినట్లవుతుంది.

మాతృసంస్థని కోల్పోయిన సభ్యులు కూడా లయనిజంలోంచి తమ సభ్యత్వాన్ని కోల్పోయిన వారౌతారు.

## స్టేటస్ కో లోంచి విడుదలైన క్లబ్ పునఃప్రతిష్ఠ
## REACTIVATION OF STATUS QUO LIONS CLUBS

'స్టేటస్ కో' లోంచి విడుదల అయి తిరిగి యాక్టివ్ స్టేటస్‌ను ఆ క్లబ్ పొందగలగడం అంటే

కోల్పోయిన ప్రతిష్ఠను సంపాదించుకోవడం లాంటిది. అందుకు కొన్ని నియమాలూ, పద్ధతులూ వున్నాయి.

a) క్లబ్‌ను పునర్నిర్మించాలంటే, సభ్యత్వాలు కట్టని వారినీ, క్లబ్‌కు ఇబ్బందులు కల్గించిన వారినీ తొలగించి, మిగిలిన వారిని ఉత్తేజితుల్ని చేసి, అవసరమైతే కొత్తవారిని చేర్చుకొని... గండం గట్టెక్కించగలగాలి.

అలా, క్లబ్‌లో మిగిలిన పాత సభ్యులు, కొత్తగా చేర్చుకున్న సభ్యుల అడ్రస్‌లు, తదితర వివరాలు స్పష్టంగా గవర్నర్ గారి ద్వారా ఇంటర్నేషనల్ కార్యాలయానికి పంపవలసి వుంటుంది. పునర్నిర్మించేప్పుడు పంపే ఈ లిస్ట్‌లో కనీసం 10మంది సభ్యులు విధిగా వుండాలి.

b) ఈ క్లబ్‌లో గతంలో లయనిజంలో వుండి మానేసిన పూర్వపు లయన్స్ (Former Lions) ఎవరైనా కొత్తగా చేర్తుంటే, వారి వివరాలు కూడా అందజేయాల్సి వుంటుంది. వారు గతంలో ఏ క్లబ్‌లో సభ్యులుగా వున్నదీ, ఎప్పుడు చేరిందీ, ఎప్పుడు మానేసిందీ వగైరా వివరాలు తెలియజేయాలి.

c) పునఃప్రతిష్ఠ జరిగిన క్లబ్‌కు ప్రస్తుతం అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధికారి వివరాలు తెలపాలి.

d) ఇంటర్నేషనల్ రికార్డ్ ప్రకారం క్లబ్ చెల్లించవలసి వున్న బకాయిలు ఏకమొత్తంగా చెల్లించాలి.

e) కొత్తగా చేర్చిన సభ్యుడికి 25 డాలర్ల చొప్పున ప్రవేశ రుసుం చెల్లించాలి.

f) కొనసాగుతున్న పాత సభ్యులందరికీ ఒక్కొక్కరికీ 5 డాలర్ల చొప్పున అదనంగా చెల్లించవలసి వుంటుంది.

g) అయితే – స్టేటస్ కో లో పడిన మొదటి 90 రోజుల్లోగా ఈ రీయాక్టివేషన్ జరిగిన పక్షంలో, ప్రతి సభ్యునికీ 5 డాలర్ల అదనపు రీయాక్టివేషన్ ఫీ చెల్లించనవసరం వుండదు. 90 రోజులు దాటిన తర్వాత క్లబ్ పునర్నిర్మాణం జరిగినప్పుడే అదనపు రుసుము చెల్లించవలసి వుంటుంది.

h) గతంలో సభ్యులుగా వుండి తిరిగి జేరిన వ్యక్తులు కూడా ఎడ్మిషన్ రుసుము 25 డాలర్లు కట్టి కొత్త సభ్యులుగా చేరవలసి వుంటుంది.

అంతకుమునుపు లయనిజంలో సభ్యుడిగా కొనసాగిన సర్వీస్ కాలం వివరాలు ఇంటర్నేషనల్‌కు స్పష్టంగా తెలియజేస్తే ఆ పీరియడ్‌ని కూడా అతని సర్వీస్‌లో కలపడం జరుగుతుంది.

i) క్లబ్ సభ్యత్వంలోంచి డ్రాప్ చేసిన ఆరునెలలు దాటిపోతే, ఆ సభ్యుడు తిరిగి కొత్త సభ్యుడిగా చేరవలసిందేనని గుర్తుంచుకోవాలి.

జోన్ చైర్మన్ సహకారంతో, డిస్ట్రిక్ట్ గవర్నర్ గారు అనారోగ్యం పాలయిన ఆ క్లబ్‌తో సంబంధాలు ఏర్పరచుకొని, క్లబ్‌కు ప్రాణం పోసే ప్రయత్నాలు చేస్తారు. తన జిల్లాలోని క్లబ్‌లన్నీ ఆరోగ్యవంతంగా, ఉత్తేజవంతంగా పనిచేస్తూ లయనిజం ఆశయాలను నెరవేర్చేవిగా వుండాలని గవర్నర్ గారు కోరుకొంటారు.

## క్లబ్ ఛార్టర్ రద్దు

## CHARTER CANCELLATION OF CLUB

ఇన్ని ప్రయత్నాలలో ఏ ప్రయత్నమూ కలిసి రాకపోతే గత్యంతరం లేని స్థితిలో డిస్ట్రిక్ట్ గవర్నర్ గారు ఆ క్లబ్ ఛార్టర్‌ని రద్దు పరచవలసిందిగా ప్రతిపాదిస్తారు.

ఆ ప్రాంతానికి సంబంధించిన ఇంటర్నేషనల్ డైరెక్టర్ నుంచి గాని, డిస్ట్రిక్ట్ గవర్నర్ నుంచి గానీ, ఈ క్లబ్ పునర్నిర్మాణం విషయంలో కృషి చేస్తున్న ఇతరుల నుంచి గానీ

చార్టర్ రద్దుకు సంబంధించిన సమాచారాన్ని 'ఇంటర్నేషనల్' సేకరించుకోవచ్చు.

అయితే, ఈ విషయాన్ని క్లబ్‌కు లిఖిత పూర్వకంగా తెలియజేస్తూ, జిల్లా గవర్నర్ గారి సూచన మేరకే చార్టర్ ఉపసంహరణ అనేది జరుగుతుంది.

ఇంటర్నేషనల్ కొత్తగా చేసిన నిర్ణయం ప్రకారం, ఒక క్లబ్‌ని "స్టేటస్ కో"లో పెట్టాలన్నా, "స్టేటస్ కో"లోంచి విడుదల చేయాలన్నా, గవర్నర్ గారు అందుకు సిఫార్స్ చేస్తూ రాసిన లేఖ మీద వైస్ గవర్నర్ గారు, మెంబర్ షిప్ చైర్మన్ కూడా సహ సంతకాలు చేయాల్సి వుంటుంది!

## క్లబ్ పునర్నిర్మాణ కార్యక్రమం
## 'క్లబ్ పునర్నిర్మాత' అవార్డు
## REBUILDING PROGRAMME - REBUILDING LION AWARD

ఏ లయన్స్ క్లబ్‌లోనయినా 15 మందికన్నా తక్కువగా సభ్యులుంటే, అది పునర్నిర్మింప చేసే స్థితిలో వున్నట్టే లెక్క!

ఒకవేళ 15 మంది కన్నా ఎక్కువ మందే వున్నా, గత రెండేళ్ళలో 25% సభ్యుల్ని డ్రాప్ చేసిన క్లబ్‌ని కూడా పునర్నిర్మాణ కార్యక్రమంలో చేర్చవలసిన క్లబ్‌గానే పరిగణించవలసి వుంటుంది.

పునర్నిర్మాణ కార్యక్రమం 'స్టేటస్ కో'లో పడకపోయినా, తగినంత సభ్యత్వం, తగినంత ఉత్సాహం కొరవడిన క్లబ్‌లకు ఈ రీబిల్డింగ్ కార్యక్రమం వర్తిస్తుంది.

లయనిజంలో బాగా అనుభవం, పరిజ్ఞానం, వున్న వ్యక్తుల్ని ఎంపికచేసి, వారి ద్వారా ఆయా క్లబ్‌లకు రావలసిన సలహాలు సహకారాలను అందింప చేయడం ఈ కార్యక్రమం బాధ్యత.

ఏడాది పొడవునా ఈ సిక్ క్లబ్‌ను జాగ్రత్తగా చూసుకొంటూ, సమావేశాలు, సేవా కార్యక్రమాలు చక్కగా జరిపిస్తూ, క్లబ్‌లో కొత్త సభ్యులను చేర్చేలా ప్రోత్సహిస్తూ, మళ్ళీ దారిలో పెట్టే ప్రయత్నాలను ఈ మార్గదర్శకులు నెరవేరుస్తారు. వీళ్ళని రీబిల్డింగ్ లయన్స్ లేదా క్లబ్ పునర్నిర్మాతలంటారు.

a) రీబిల్డింగ్ లయన్‌గా జిల్లా గవర్నర్ గారు యాక్టివ్‌గా పనిచేస్తున్న మరొక లయన్స్ క్లబ్‌కు చెందిన వ్యక్తిని ఎంపిక చేస్తారు.

b) ఆ క్లబ్‌కు మరొక సీనియర్ లయన్ సహకారం అవసరం అని, జిల్లా గవర్నర్ తన అధికార పర్యటన సందర్భంలోనో, మరేదైనా సందర్భంలోనో ఆ క్లబ్‌కు వెళ్ళినప్పుడు గుర్తించిన పక్షంలో ఈ రీబిల్డింగ్ లయన్‌ని నియమించడం జరుగుతుంది.

c) జోన్ ఎడ్వయిజరీ సమావేశాలు, కేబినెట్ సమావేశాలలో సహకారం అవసరం అయిన క్లబ్‌ల గురించి చర్చించడం జరుగుతుంది.

d) అన్ని కోణాలలోంచీ పరిశీలించిన తర్వాత, పరిస్థితి ఇలానే కొనసాగితే క్లబ్‌ని చేజార్చుకోవాల్సి వస్తుందని గవర్నర్‌గారు దృఢంగా అభిప్రాయపడ్డప్పుడు రీబిల్డింగ్ కార్యక్రమం అమలుచేస్తారు.

e) ఒక క్లబ్‌ని బలహీనమైన క్లబ్‌గా ముద్ర వేయబోయే ముందు చాలా జాగ్రత్తగా ఆలోచించి, ఎన్నో కోణాల్లోంచి పరిశీలించిన తర్వాతే ఈ నిర్ణయానికి వస్తారు డిస్ట్రిక్ట్ గవర్నర్.

పునర్నిర్మాణ కార్యక్రమం వలన ఆ లయన్స్ క్లబ్‌లో గుణాత్మకమైన (Qualitative changes) మార్పులు చోటు చేసుకోవాల్సి వుంటుంది. ఈ క్రింద సూచించిన అభివృద్ధి కన్పిస్తేనే రీబిల్డింగ్ కార్యక్రమం విజయవంతం అయినట్లు!

1. పునర్నిర్మించబడిన తర్వాత ఆ క్లబ్ సాధ్యమైనంత త్వరలో ఒక మేజర్ సర్వీస్ యాక్టివిటీ చేపట్టి పూర్తిచేసి వుండాలి.
2. సమాజంలో ఎక్కువమంది పాల్గొనేలా ఒక మేజర్ ఫండ్ రైజింగ్ కార్యక్రమం చేపట్టగలగాలి.
3. చక్కని రెగ్యులర్ మీటింగ్‌లు, అర్థవంతమైన బోర్డ్ మీటింగ్‌లూ - అన్నీ ప్లాన్ ప్రకారం సక్రమంగా జరిగేలా వుండాలి.
4. క్లబ్‌లో సభ్యుల మధ్య, క్లబ్‌కీ బైట సమాజానికి మధ్య సంబంధ బాంధవ్యాలు పబ్లిక్ రిలేషన్స్ చక్కగా నడుపుతూ వుండాలి.
5. జోన్, రీజియన్, డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్, వీలైతే ఇంటర్నేషనల్ మీటింగ్‌లలో క్లబ్ పాల్గొనడం ద్వారా లయన్స్ సమాచారం ఎక్కువగా తెలుసుకోగలిగి వుండాలి.
6. కొత్త సభ్యుల్ని, మంచి క్వాలిటీ సభ్యుల్ని ఎక్కువ సంఖ్యలో చేర్పించి వారికి సగౌరవంగా స్వాగతం పలికి, ఇండక్షన్, ఇండాక్ట్రినేషన్‌లు చేయించగలగాలి.
7. ఇవన్నీ పునర్నిర్మాత పాత్ర ప్రమేయాలతో జరుగతూ వున్నప్పుడు ఆ వ్యక్తి రీబిల్డింగ్ లయన్ అవార్డ్‌కు అర్హుడౌతాడు.
8. రీబిల్డింగ్ లయన్ జిల్లా గవర్నర్ గారికి క్లబ్ పురోగతి గురించి వివరణాత్మకమైన రిపోర్ట్ అందిస్తాడు.
9. అన్నీ పరిశీలించిన మీదట, ఆ వ్యక్తి చేసిన కృషికి తగిన గుర్తింపుగా, జిల్లా గవర్నర్ ఆయన పేరును సంవత్సరాంతంలో ప్రతిపాదిస్తూ, క్లబ్ యాక్టివ్‌గా పనిచేస్తున్న వైనాన్ని ఇంటర్నేషనల్‌కు తెలియజేస్తాడు.

జిల్లా గవర్నర్ గారి సూచన మేరకు ఇంటర్నేషనల్ నుంచి రీబిల్డింగ్ లయన్ అవార్డ్ అందుతుంది. ఒక క్లబ్‌కు ఒక రీబిల్డింగ్ అవార్డ్ మాత్రమే ఇవ్వడం జరుగుతుంది.

10. ఇదంతా జిల్లా గవర్నర్ గారి బాధ్యత! గవర్నర్ నేతృత్వంలో, ఆయన నియమించిన వ్యక్తి క్లబ్ బాగోగులు చూడడం జరుగుతోంది. ఇదంతా ఎప్పటికప్పుడు జిల్లా గవర్నర్ గారి దృష్టికి వచ్చేలా జరగాలి. ఒకవేళ, రీబిల్డింగ్ లయన్ పని తీరు చాలినంతగా లేనప్పుడు, అతన్ని మార్చి, వేరొకరిని పునర్నిర్మాతగా ప్రకటించే అధికారం గవర్నర్ గారికి వుంది.

రీబిల్డింగ్ లయన్‌ని నియమించకపోయినా, క్లబ్‌ని పునర్నిర్మించవలసిన బాధ్యత ఎలాగైనా గవర్నర్ గారిదే కదా...!!

**క్లబ్ రీయాక్టివేషన్ కార్యక్రమం సర్వీస్ అవార్డ్**

సర్వీస్ అవార్డ్ అనేది 'స్టేటస్ కో'లో పడిన క్లబ్‌కు ప్రాణ ప్రతిష్ఠ చేసిన వ్యక్తికి అందించే అవార్డ్. బలహీనంగా వున్న క్లబ్‌కు జవసత్వాలు పొదిగిన వ్యక్తికి ఇచ్చేది రీబిల్డింగ్ లయన్ అవార్డ్ అంటారు. ఈ కార్యక్రమాన్ని రీబిల్డింగ్ కార్యక్రమం అంటారు.

కొన ఊపిరితో వున్న క్లబ్ అంటే, "స్టేటస్ కో"లో పడిన క్లబ్‌కు ఊపిరి ఊది బతికించే కార్యక్రమాన్ని రీయాక్టివేషన్ కార్యక్రమం అంటారు. అందుకు ఎవరైనా ఒక వ్యక్తి బాధ్యుడుగా వున్నప్పుడు ఆ వ్యక్తికి సర్వీస్ అవార్డ్ ఇస్తారు. ఈ రెండు కార్యక్రమాల మధ్య తేడాని స్పష్టంగా గమనించారు కదా!!

ఇంక సర్వీస్ అవార్డ్ ఎలా వస్తుందో పరిశీలిద్దాం...

a) "స్టేటస్ కో"లోకి వెళ్ళిన లయన్స్ క్లబ్‌ని తిరిగి యాక్టివ్ క్లబ్‌గా తీర్చిదిద్దిన లయన్స్ సభ్యుడికి ఈ అవార్డు వస్తుంది.

b) ఆ ప్రాంతానికి చెందిన ఇంటర్నేషనల్ డైరెక్టర్ గానీ, లయన్స్ గవర్నర్ గానీ సూచించిన వ్యక్తికి ఈ బాధ్యతను నెరవేర్చిన గుర్తింపుగా ఈ అవార్డు వస్తుంది.

c) క్లబ్ "స్టేటస్ కో" లోంచి బైట పడిన ఆరు నెలల కాలంలో, అది బాగా పనిచేస్తున్న తీరుని గమనించి, దాని పురోభివృద్ధిని ఇంటర్నేషనల్‌కు తెలియజేస్తూ, ఈ అవార్డ్‌కు తన రికమెండేషన్ పంపుతారు డిస్ట్రిక్ గవర్నర్.

d) అయితే, ఈ రికమెండేషన్ అనేది రీయాక్టివేషన్ జరిగిన 9 నెలల లోపు జరగవలసి వుంటుంది.

**అన్ని కార్యక్రమాలకూ హాజరయ్యే సభ్యునికి పర్‌ఫెక్ట్ అటెండెన్స్ అవార్డు.**

★ క్లబ్ కార్యక్రమాలన్నింటికీ సంవత్సరం పొడవునా విడవకుండా హాజరైన సభ్యులకు Perfect Attendance Award అందజేస్తారు.

★ ఇది, క్లబ్ నాయకత్వం డబ్బులు చెల్లించి తెప్పించుకొని, తమ సభ్యులకు అందచేయవలసిన అవార్డు.

★ 'అటెండెన్స్ మేకప్ రూల్స్' గురించి విడిగా తెలియజేయడం జరిగింది. వాటిని పాటిస్తూ వుంటే ఎక్కువ మంది సభ్యులకు ఈ అవార్డు వచ్చే అవకాశం వుంది.

★ క్లబ్ ప్రెసిడెంట్ గారు తన సభ్యులకు ఈ అవార్డును తెప్పించి ఇస్తానని ప్రకటించి, ఎక్కువ మంది సభ్యులు క్లబ్ కార్యక్రమాల్లో పాల్గొనేలా ప్రోత్సహించవచ్చు కూడా!

## ప్రెసిడెంట్ ఎక్సలెన్స్ అవార్డ్

క్లబ్ అధ్యక్షుడిగా పనిచేసిన లయన్‌కు అంతర్జాతీయ స్థాయిలో అందించే అత్యుత్తమ అవార్డు ఇది.

దీని గురించిన అవగాహన కల్పించుకొని, ముందుగానే దీన్ని పరిశీలించి, అందుకు తగ్గట్లుగా వ్యవహరించినట్లైతే ప్రెసిడెంట్ ఎక్సలెన్స్ అవార్డును దక్కించుకోవడం సులువే అవుతుంది. అందుకు ప్రెసిడెంట్ గారికి, సెక్రటరీ గారికి కొంచెం ప్రత్యేకమైన ఆసక్తి అవసరం.

ప్రెసిడెంట్ ఎక్సలెన్స్ అవార్డ్ పొందడానికి కొన్ని రూల్స్ వున్నాయి.

సెక్రటరీ 'కిట్'లో DA-1 ఫారం వుంటుంది. ముందుగా దాన్ని తీసి పరిశీలించండి. అందులో 'ఎ' నుంచి 'h' వరకూ కొన్ని ప్రశ్నలు రూపంలో పాయింట్లున్నాయి. ఈ పాయింట్లను "అవును" - "కాదు" పద్ధతిలో పూర్తి చేసి సంవత్సరం చివరలో ఇంటర్నేషనల్‌కు పంపడమే!

ఆ వివరాలన్నింటినీ కూలంకషంగా చర్చిద్దాం.

a) లయన్స్ అంతర్జాతీయ సంస్థ రాజ్యాంగానికి నియమావళికీ, ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ - నిర్ణయాలకూ అనుగుణంగానే తన క్లబ్ ఈ ఏడాది కాలం పనిచేసిందనీ, లయనిజం పేరునీ, ప్రతిష్ఠనీ, లయన్స్ ఎంబ్లమ్‌నీ, లయన్స్, లయన్స్ క్లబ్, లయనెస్, లియో, లయన్స్ ఇంటర్నేషనల్, లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్ వంటి లయన్స్ స్వంత పారిభాషక పదాలను (Insignias) దుర్వినియోగం చేసే ఎలాంటి చర్యనూ చేపట్టకుండా వుండాలి.

b) ఏడాది మొత్తంలో కనీసం ఒక భారీ సేవాకార్యక్రమం చేసి వుండాలి. లయన్స్ ఇంటర్నేషనల్ ఆమోదించిన సేవా కార్యక్రమాలకు అనుగుణమైనదిగా ఈ భారీ సేవా కార్యక్రమం వుండాలి. (in line with the Intl. Programme)

c) ఈ క్రింది మూడింటిలో కనీసం ఒకటైనా నెరవేర్చి వుండాలి :

1) క్లబ్ సభ్యులలో మరణించిన వారినీ, ట్రాన్స్‌ఫర్ అయినవారినీ మినహాయిస్తే, సంవత్సరం చివరినాటికి సభ్యుల సంఖ్య పెరిగి వుండాలి. (Net Increase)

2) ఒక లయన్స్ క్లబ్ కొత్తగా వ్యవస్థాపించి వుండాలి.

3) ఎవరినీ డ్రాప్ చెయ్యకుండా సభ్యుల్ని యథాతథంగా వుంచి నూరుశాతం రిటెన్షన్ అయినా సాధించి వుండాలి.

4) 50 డాలర్ల కన్నా వుంచి వున్న బకాయిలన్నీ మార్చి 31 నాటికి చెల్లించి బాకీ లేని క్లబ్‌గా వుండాలి.

e) ఇంటర్నేషనల్ కార్యాలయానికి ఈ క్రింది రిపోర్టుల్ని ఆయా నిర్దేశిత సమయాలలో ఎప్పటికప్పుడు పంపి వుండాలి.

1) ఎం.ఎం.రిపోర్టు - వచ్చేనెల 20 నాటికి ఈ నెల ఎం.ఎం.రిపోర్ట్ అమెరికాలోని ఇంటర్నేషనల్ కార్యాలయానికి అందేలా పంపించాలి. అమెరికాకు బొంబే ఆఫీసు నుంచి సకాలంలో మన ఎం.ఎం.రిపోర్ట్ చేరాలంటే మనం కనీసం 5వ తేదీలోపు పంపితే గానీ సమయం సరిపోదు.

2) సంవత్సరాంతంలో ఏడాది మొత్తం చేపట్టిన కార్యక్రమాల సారాంశాన్ని ఎ-1 ఫారంలో పూర్తిచేసి జూన్ 30 లోగా ఇంటర్నేషనల్ కార్యాలయానికి అందేలా పంపాలి.

3) వచ్చే సంవత్సర కాలానికి ఎన్నికైన క్లబ్ ఆఫీసర్లు అంటే, ప్రెసిడెంట్, సెక్రటరీ, ట్రెజరర్, మెంబర్‌షిప్ కమిటీ ఛైర్మన్ - వీరందరి చిరునామాలు, టెలిఫోన్ నంబర్లతో PU 101 ఫారాన్ని మే 31వ తేదీ లోపుగా ఇంటర్నేషనల్ కార్యాలయానికి అందేలా పంపాలి. అంటే మే మొదటి వారంలోనే పోస్ట్ చేయడం అవసరం అన్నమాట!

f) క్లబ్ ప్రెసిడెంట్‌గా ఈ ఏడాది కాలంలో ఈ క్రింది లయన్స్ సమావేశాలకు హాజరయి వుండాలి.

1) కనీసం రెండు జోన్ సమావేశాలు.

2) క్లబ్ ఆఫీసర్‌ల కోసం జిల్లా స్థాయిలో నిర్వహించిన స్కూలింగ్

3) డిస్ట్రిక్ కన్‌వెన్షన్ గానీ, మల్టిపుల్ డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్ గానీ, ఇంటర్నేషనల్ కన్‌వెన్షన్ గానీ హాజరయి వుండాలి.

అత్యవసర స్థితిలో, ఏదైనా ఒక కార్యక్రమానికి హాజరు కాలేనప్పుడు, తన పక్షాన మరొక లయన్‌ను హాజరు కావలసిందిగా పంపించినా ఈ అవార్డుకు అర్హత ఏర్పడుతుంది.

g) ప్రెసిడెంట్ గారు తన క్లబ్‌లో కొత్తగా చేరిన సభ్యులను సక్రమంగా ప్రమాణం చేయించి, వారికి లయనిజం వివరాలు అందింప చేసినట్లు (Induction Indoctrination) ధృవీకరించవలసి వుంటుంది. విడిగా ఒక సర్టిఫికెట్ రూపంలో ఈ ధృవీకరణను రాసి జతచేస్తే మంచిది.

h) ప్రతి లయన్స్ క్లబ్ తన సభ్యుల మనోగతాన్ని వారి వారి అభిప్రాయాల్ని, ఆలోచనల్ని తెలుసుకోవడానికి క్లబ్ రెట్రీట్ కార్యక్రమాన్ని జరపమని ఇంటర్నేషనల్ సూచిస్తుంది.

ప్రెసిడెంట్ ఎక్సలెన్స్ అవార్డు పొందాలంటే, ఆ ఏడాది కాలంలో క్లబ్ ఈ ఎనిమిది పాయింట్లనూ నెరవేర్చగలిగి వుంటే సరిపోతుంది.

ఈ పాయింట్లు వున్న ఫారాన్ని DA-1 ఫారం అంటారు. దాన్ని పూర్తిచేసి, జోన్ ఛైర్మన్‌గారి తోనూ, గవర్నర్ గారితోనూ సంతకం చేయించి జులై 21లోగా ఇంటర్నేషనల్ కార్యాలయానికి అందేలా పంపవలసి వుంటుంది.

ఎలక్ట్రానిక్ ఫైలింగ్ పద్ధతిలో నేరుగా ఇంటర్నేషనల్ కార్యాలయానికి Fax ద్వారా పంపించినా సరిపోతుంది.

DA-1 ఫారాన్ని ఇంటర్నేషనల్ పరిశీలించి, ఆమోదిస్తే, ప్రెసిడెంట్ ఎక్సలెన్స్ అవార్డ్ అని రాసి వున్న పిన్ని డిస్ట్రిక్ట్ గవర్నర్ ద్వారా ప్రెసిడెంట్ గారికి బహూకరింపచేస్తారు.

తరంగం ఐదు

# ఏలుబడి

పాలనా పరిణతి - నాయకత్వ పటిమ

## ADMINISTRATION
## THE ELEMENTS OF INNOVATION

లయన్స్ సభ్యుల్లో సద్గుణం (Quality in a Lion) అంటే, అమితమైన మంచితనం (లేదా) అసాధారణమైన ప్రతిభ అనిఅర్థం.

లయన్స్ సభ్యుడైన వ్యక్తిలో ఇలాంటి అత్యంత ప్రత్యేకమైన ప్రతిభా వ్యుత్పత్తి ఏదో ఒకటి కన్పించి తీరాలి.

అలాంటివి ప్రదర్శించగలిగినప్పుడు లయన్స్ సభ్యులు సమాజంలో ఇతరులకన్నా భిన్నంగా రాణిస్తారు. వారి వారి వృత్తి వ్యాపారాలనుబట్టి, వారివారి ప్రవృత్తులనుబట్టి వ్యక్తుల ప్రతిభాసంపన్నత అనేది ఆధారపడి వుంటుంది. అది మనుషులందరిలోనూ సమానంగా వుండే అంశం కాదు.

'సకల గుణాభిరాముడు' అనదగిన వ్యక్తి లయనిజంలో గొప్పగా రాణించకపోవచ్చు. పెద్దగా విద్యా సంపన్నత లేని వ్యక్తులు అద్భుతమైన నాయకులుగా లయనిజంలో ముందు వరుసలో నిలబడగలగవచ్చు.

వ్యక్తిత్వ వికాసాన్ని పెంపొందించుకోగలిగిన వ్యక్తులు లయనిజంలో ఉన్నతవ్యక్తులై ఎదుగుతారు.

**లయనిజంలో సభ్యుడిగా రాణించాలంటే...?**

a) సభ్యత్వానికి కావలసిన కనీస అర్హతల్ని లయన్స్ రాజ్యాంగం ఇలా చెప్తోంది -

- మెజారిటీ తీరిన వ్యక్తులై వుండాలి
- మంచి నడవడి కలిగి ఉండాలి
- సమాజంలో కీర్తి ప్రతిష్ఠలు కల్గినవారై ఉండాలి.

b) మంచి సభ్యుడికి కావాల్సిన, లక్షణాల్ని లయనిజం నెలకొల్పిన సాంప్రదాయాలు ఇలా చెప్తున్నాయి.

- స్నేహ సంబంధాలు పెంచుకోవాలనే తాపత్రయం కల్గినవారై వుండాలి.
- సేవాతత్పరతతో కార్యక్రమాలు చేపట్టడానికి ముందుకు దూకే స్వభావం వుండాలి.
- వితరణ శీలి అయివుండాలి.
- పదిమందితో కలిసిపోగలిగి, కలుపుగోరు తనంతో నవ్వుతూ, నవ్విస్తూ నలుగురినీ ముందు తానే పలకరిస్తూ సాగిపోగలిగే తత్వాన్ని క్లబ్బబుల్ (Clubbable) గా వుండడం అంటారు. క్లబ్బబుల్ అంటే కలుపుకోరుతనం అని!
- మన ఆహ్వానాన్ని మన్నించి, మీనమేషాలు లెక్కించకుండా చేరిన వ్యక్తులు లయనిజంలో ఎక్కువగా రాణిస్తారు.

## సభ్యుడైన తర్వాత ...
## (AFTER BECOMING A MEMBER ...)

1. కార్యక్రమాలకు తప్పనిసరిగా హాజరుకావడం క్లబ్ సమావేశాలు సేవా కార్యక్రమాలు, ఇతర లయన్స్‌క్లబ్ సమావేశాలు, సేవా కార్యక్రమాలు. సెమినార్లు, వర్క్‌షాపులూ, స్కూలింగ్స్, కన్వెన్షన్లు, కాన్ఫరెన్సులు. వీటికి తప్పనిసరిగా హాజరు కావాలి.

2. కార్యక్రమాలకు ఉదారంగా చేయూత (Contributions for service )

లయిన్స్ సభ్యులంతా ఉత్సాహంగా పాల్గొని చేయూతనిస్తేనే కార్యక్రమాలు విజయవంతంగా జరుగుతాయి.

చేయూతలు అనేక రకాలుగా వుంటాయి.
ఆర్థికంగా చేయూత నందించడం
వ్యక్తిగతంగా పాల్గొని చేయూత నందించడం
ఇవ్వవలసిన బకాయిలు అడగక మునుపే చెల్లించి చేయూత నందించడం
లయనిజంలో తన ప్రతిష్ఠనీ, సమాజంలో తన క్లబ్ ప్రతిష్ఠనీ పెంపొందింప చేయడం, మాటలలోనూ, చేతలలోనూ నాణ్యత ప్రదర్శించడం
అందిన అవకాశాల్ని సద్వినియోగం చేసుకొంటూ క్లబ్‌లో బాధ్యతల్ని స్వీకరించి, దాని అభివృద్ధికి తోడ్పడడం. తీసుకున్న బాధ్యతలకు నూరు శాతం న్యాయం చెయ్యడం

అడిగిన వారికి లేదనకుండా మనస్ఫూర్తిగా సహకరించే మనస్తత్వం కలిగివుండడం

సమయపాలన పాటించడం.

లయనిజానికి సంబంధించిన పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవడం

లయనిజం ఆదర్శాలను, ప్రవర్తనా నియమావళిని అనుసరిస్తూ తన వ్యక్తిగత జీవితాన్ని ఉన్నతంగా తీర్చిదిద్దుకోవడం

క్లబ్ విషయాలకు మొదటి ప్రాధాన్యత ఇవ్వగలగడం. లయనిజంలో చేరడాన్ని గర్వకారణమైన, ఉన్నతమైన విషయంగా భావించుకోగలగడం

ఇలాంటివన్నీ కలిగిన వ్యక్తులే లయనిజానికి చేయూత నందిస్తున్న సకల గుణ సంపన్నులైన సభ్యులుగా రాణించగల్గుతారు!!

## సభ్యులు జారిపోకుండా క్లబ్‌లకు కాయకల్ప చికిత్స

### RETENTION CLINICS

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ గారు 'రిటెన్షన్' కార్యక్రమం పైన ప్రత్యేక దృష్టి సారించి ప్రచార కార్యక్రమం ప్రారంభించారు. Retention Campaign అని పేరు పెట్టారు ఈ కార్యక్రమానికి.

క్లబ్‌లోంచి సభ్యులు ఎక్కువమంది మానుకోవడానికి మూడు ముఖ్యమైన కారణాల్ని పరిశీలించారు.

1. సుదీర్ఘ ఉపన్యాసాలు, విసుగు పుట్టే సమావేశాలు (Boring Meetings)

2. అనాయా ద్వేషాలు, ఇతరులను కలవనివ్వకపోవడం, రాజకీయాలు (Club Cliques & Politics)

3. సభ్యుడికి తగిన గుర్తింపుతో కూడిన పాత్ర కల్పించకపోవడం (Lack Of Involvement). దీనినే LOC అని మన లయన్స్ పెద్దలు అంటూ వుంటారు.

ఈ మూడింటినీ నివారించగలిగితే జారిపోయే జబ్బుకు కాయకల్ప చికిత్స చేసినట్లే! అందుకే ఈ ప్రయత్నాన్ని "రిటెన్షన్ క్లినిక్" అన్నారు.

రిటెన్షన్ క్లినిక్‌లో జారిపోయే జబ్బు పడిన క్లబ్‌కు అసలైన జబ్బు ఎక్కడ వుందో స్కాన్ చేసి తెలుసుకొని నివారణోపాయాలు ప్రయోగిస్తే తప్ప నిజమైన ఆరోగ్యవంతమైన క్లబ్‌లు నిలబడజాలవు - అనేది ఈ రిటెన్షన్ క్లినిక్‌ల ఆలోచనలోని అంతరార్థం.

ఈ చికిత్స చేయవలసింది డిస్ట్రిక్ట్ గవర్నరో, ఇంటర్నేషనల్ డైరెక్టరో పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్లో కాదు. వారికీ కొంత బాధ్యత ఉన్నప్పటికీ ఎవరికి వారు తమ క్లబ్ స్థాయిలో జాగ్రత్త పడవలసిన అంశాలు ఇవి :

- మీ క్లబ్ వాస్తవ స్థితి ఏమిటో ఒకసారి నిశితంగా పరిశీలించి చూడండి.
- మీ క్లబ్‌లో మీతోపాటు ఇతర సభ్యులు క్లబ్ నడుస్తున్న తీరు గురించి ఏం అనుకొంటున్నారో తెలుసుకోవడానికి ప్రయత్నం చేయండి.

క్లబ్ రెట్రీట్ (Club Retreat) అంటే ఇదే! ఇది జరిపితేనే ప్రమాద సూచనలు పసిగట్ట గలుగుతారు ఎవరైనా!

- క్లబ్ సభ్యుల్లో ఉత్సాహం కొరవడి మానుకొందామనే ఆలోచన రావడానికి దారితీస్తున్న అసలైన సమస్య ఎక్కడుందో గుర్తించే ప్రయత్నం చెయ్యండి.
- రోగం ఏమిటో తెలిసితే మందులు వాడడం తేలిక! వ్యాధి నిర్ధారణ ముఖ్యం! దోషాలకు కారణమయ్యే అంశాల పట్ల కఠినంగానూ, నిర్మొహమాటంగానూ క్లబ్ సభ్యులు వ్యవహరించ గలిగితే, క్లబ్‌లో తిరిగి ఉత్సాహం నెలకొంటుంది. ఇలా ఆత్మ పరిశీలన చేసుకోగలగడాన్ని evaluation అన్నారు.

క్లబ్‌లో నాయకత్వ బాధ్యతలున్న వ్యక్తులు, సీనియర్లు, పూర్వాధ్యక్షులు, కేబినెట్ సభ్యులు - ముందుకు వచ్చి ఈ బాధ్యత తీసుకొని, తన మాతృసంస్థ మూసివేతకు గురికాకుండా కాపాడుకోగలగాలి.

ఈ ప్రయత్నాలు మీరు ప్రారంభిస్తే చాలామంది అభిప్రాయాలు మీకు తెలుస్తాయి. మీ అభిప్రాయాలు కూడా చాలామంది సభ్యులకు తెలుస్తాయి. అవసరమైతే ఇందుకు ఇతర క్లబ్‌లలోని సీనియర్ సభ్యులు, ఆర్‌సీ, జడ్‌సీల సహకారం కూడా తీసుకోండి.

కొత్త ఉపాయాలు తట్టడానికి అసోసియేషన్ వెబ్‌సైట్ www.lionsclubs.org. తెరిచి చూడండి.

### 'నవ శతాబ్ది' లయన్స్ క్లబ్స్
### NEW CENTURY LIONS CLUB

లయనిజంలో యువతరానికి ప్రాధాన్యత పెంచడం కోసం కొత్త కార్యక్రమాన్ని ప్రారంభించి అందరూ యువకులే వున్న లయన్స్ క్లబ్‌లకు 'న్యూసెంచరీ లయన్స్ క్లబ్స్' అని పేరుపెట్టారు.

2000 సంవత్సరం జూన్ నుంచి ఈ క్లబ్‌లు అమలులోకి వచ్చాయి.

వయో పరిమితి దాటిన లియోలనీ, జేసీస్‌ని లయనిజంలోకి ఆహ్వానించడానికి ఈ కార్యక్రమాన్ని ప్రధానంగా ప్రారంభించారు.

18 సంవత్సరాల నుంచి 35 సంవత్సరాల లోపు వయసున్న స్త్రీ పురుషులంతా ఈ న్యూసెంచరీ క్లబ్‌లో సభ్యులుగా చేరడానికి అర్హులు.

న్యూ సెంచరీ క్లబ్ ప్రారంభం అయ్యేనాటికి 35 ఏళ్ళు మించని వ్యక్తులే అందులో సభ్యులుగా వుండాలి. 7 సంవత్సరాల వరకూ ఈ క్లబ్‌లో 35 ఏళ్ళు మించినవారిని చేర్చుకోకూడదు.

ఎనిమిదేళ్ళు దాటిన తర్వాత న్యూ సెంచరీ లయన్స్ క్లబ్ యువతరం ముద్రని కోల్పోయి మామూలు క్లబ్‌గా మార్తుంది.

20 మంది చార్టర్ సభ్యులతోనే ఈ క్లబ్ కూడా ప్రారంభించవచ్చు.

న్యూ సెంచరీ క్లబ్‌లో సభ్యులు కాగోరే లియోలు తమ లియో సభ్యత్వ సర్టిఫికెట్‌ను జతపరిస్తే, వారికి 30 డాలర్ల చార్టర్ ప్రవేశరుసుము లేదా 25 డాలర్ల ప్రవేశ రుసుము మినహాయింపు ప్రకటించడం జరిగింది.

న్యూసెంచరీ లయన్స్‌క్లబ్ సభ్యులకు ప్రత్యేకంగా డిజైన్ చేసిన పిన్‌ని బహూకరిస్తారు.

రెగ్యులర్ క్లబ్‌కు ప్రతినెలా ఎం.ఎం.రిపోర్ట్ పంపవలసి వుంటుంది కదా... కానీ, న్యూ సెంచరీ లయన్స్ క్లబ్‌కు మూడు నెలలకొకసారి రిపోర్ట్ పంపితే సరిపోతుంది.

యువతరానికి ఉపయోగపడే సేవా కార్యక్రమాలకు ప్రాధాన్యత నిస్తూ వారు స్వంతంగా కార్యక్రమాలను రూపొందించుకొని నిర్వహించవచ్చు. సీనియర్ లియోక్లబ్ లాగా ఈ న్యూసెంచరీ లయన్స్ క్లబ్‌లు పనిచేస్తాయి.

ఆర్థిక స్వాతంత్ర్యం సంపాదించుకున్న లియోక్లబ్ సభ్యుల్ని లయన్స్‌గా ఆహ్వానించేందుకు ఈ న్యూసెంచరీ లయన్స్ క్లబ్‌లు ఎక్కువగా తోడ్పడతాయి.

న్యూసెంచరీ లయన్స్ క్లబ్ ఏర్పాటు చేయాలంటే 20 మంది సభ్యులు తప్పనిసరిగా వుండాలి. అంతమంది సమకూరనప్పుడు "న్యూసెంచరీ బ్రాంచ్ క్లబ్" కూడా ఏర్పాటుచేసుకోవచ్చు. ఇంకొన్నాళ్ళు ప్రయత్నిస్తే ఈ న్యూసెంచరీ బ్రాంచ్ క్లబ్' ఇరవై మంది సభ్యులకు పెరిగి, కొత్తక్లబ్‌గా అవతరించే అవకాశం వుంటుంది కదా!

- ఇది Quality young Adult ల కోసం చేపట్టిన పత్యేక కార్యక్రమం

## విద్యాలయాలలో లయన్స్ క్లబ్‌లు
## (CAMPUS LIONS CLUBS)

ప్రపంచవాప్తంగా జరిపిన ఒక సర్వేలో యూనివర్సిటీ విద్యార్థుల్లో 47 శాతం మంది లయనిజం పట్ల ఆకర్షితులుగా వున్నారని తేలింది. క్యాంపస్ లయన్స్‌క్లబ్స్ ఆలోచన రావడానికి ఈసర్వే ఒక ముఖ్యకారణం.

"క్యాంపస్" అనే మాటకి లయనిజం అర్థంకూడా విద్యాలయం అనే!

- ఏదైనా విశ్వవిద్యాలయంలో గానీ, పెద్ద విద్యాలయంలో గానీ ఈ లయన్స్ క్లబ్‌లు ఏర్పరచవచ్చు.
- మెడికల్, ఇంజనీరింగ్, 'లా', ఆర్ట్స్, సైన్స్ కళాశాలల్లో కూడా క్యాంపస్ క్లబ్‌లు ఏర్పాటు చేయవచ్చు. విద్యార్థులు, ప్రొఫెసర్లు, ఆ విద్యాలయానికి సంబంధించి సేవాతత్పరులైన ఇతరులూ ఆ క్యాంపస్‌కి పరిమితంగా ఏర్పడిన లయన్స్ క్లబ్‌లో సభ్యులుగా చేరవచ్చు.
- వీరిలో విద్యార్థులు ఆ మేరకు సర్టిఫికేట్ జతచేస్తే వారికి 30 డాలర్ల చార్టర్ ప్రవేశ రుసుము అలాగే, భవిష్యత్తులో ఈ క్యాంపస్ క్లబ్‌లో చేరే విద్యార్థులకు 25 డాలర్ల ప్రవేశరుసుములను పూర్తిగా మినహాయింపునిస్తున్నారు.

పూర్వంగానీ, ప్రస్తుతంగాని లియోక్లబ్ సభ్యులుగా వున్నవారికి కూడా ప్రవేశరుసుము పూర్తిగా మినహాయింపు వుంది.

క్యాంపస్ క్లబ్, ఆ విద్యాలయానికి అనుసంధానంగా ఎన్నాళ్ళయినా క్యాంపస్ క్లబ్‌గానే వుంటుంది. దానిని క్యాంపస్ క్లబ్‌గా కొనసాగింప చేసినందువలన ఆ క్లబ్‌లో కొత్తగా చేరే విద్యార్థులకు 25 డాలర్ల ఎడ్మిషన్ రుసుము మినహాయింపు వుంటుంది.

## ఓ మంచి క్లబ్‌ని స్థాపించండి
## EXTENSION

ఓ మంచి సద్గుణ సంపన్నమైన లయన్స్‌క్లబ్ చేయదగిన మంచి పని అని చెప్పదగింది ఏదైనావుంటే, అది మరో 'మంచి' లయన్స్‌క్లబ్‌ను స్పాన్సర్ చేయడమే.

రోమ్ నగరం ఒకరోజులో నిర్మాణం కాలేదు కదా– ఏదీ తెల్లవారేప్పటికి పూర్తి కాకపోవచ్చు – పూర్తిచేయడానికి చేయవలసిన ప్రయత్నాలు మనం నిజాయితీగా కొనసాగించగలగాలి – కొత్త క్లబ్‌ల వ్యవస్థాపన ఇలాంటిదే! కొత్త క్లబ్‌లను ఏర్పరచడానికి ఓపిక కావాలి. సమయం కేటాయించ గలగాలి – దాని లోతుపాతులన్నీ తెలుసుకోవాలి. అందుకు 'కిటుకు'లను అర్థం చేసుకోగలగాలి.

### కొత్త క్లబ్‌లు దేనికి?

లయన్స్ అంతర్జాతీయసంస్థ సేవా సమర్థతని పెంపొందింప చేయుడానికి కొత్తక్లబ్‌లు అవసరం!

అట్టడుగు మానవుని అవసరాలకు తగినంత స్వచ్ఛంద సేవలు అందడానికి ప్రేమ, కరుణ, దాతృత్వం కల్గిన వ్యక్తుల్ని మరింతగా సంఘటిత పరచడానికి కొత్తక్లబ్‌లు అవసరం.

నాయకత్వ పటిమ, సేవానిరతి కల్గిన వ్యక్తి లయనిజంలో ప్రవేశించడానికి అంగీకరించి నప్పుడు, కొత్తక్లబ్‌లో మొదటి వరుసలో కూర్చోబెట్టడం వలన ఎక్కువ ప్రయోజనం కల్గుతుంది. కొత్త క్లబ్‌లు అందుకు అవసరం.

పునరావకాశాలు (Repeated Opportunities) కొత్తక్లబ్‌ల వలన లభిస్తాయి.

### కొత్తక్లబ్‌ల్ని ఇలా ప్రారంభించండి

కొత్త క్లబ్‌ల కోసం ప్రయత్నాలు ప్రారంభించడం అంటే, ఓ పుణ్య కార్యం కోసం మహాసంకల్పం చెప్పుకోవడమే!

మొదట 'సర్వే' చెయ్యాలి. ఏ ప్రాంతంలో క్లబ్‌ను వ్యవస్థాపించ దలిచామో ఆ ప్రాంతంలో పరిచయస్థులు, ప్రముఖులు, పెద్దల్ని కలిసి కొత్తక్లబ్ ఆలోచనల గురించి వారితో కొంత చర్చించాలి.

ఒక లయన్స్‌క్లబ్‌ను వ్యవస్థాపించడానికి కనీసం ఇంతమంది జనాభా వున్న ఊరుకావాలనే నిబంధన ఏదీ లేదు. అయితే 20 నుంచి 25మంది సుగుణాత్మక సభ్యులను చేర్చగలిగే సమర్థత ఆ ఊళ్ళో వుందా అనేది ముఖ్యం. లేదనుకున్నప్పుడు రెండు ఊళ్ళని కలిపి ఒక క్లబ్ ఏర్పాటు చేసుకోవచ్చు.

ఈ ప్రాంతం అభివృద్ధి చెందబోతోందనీ, భవిష్యత్తులో మరింత ఎక్కువమంది సభ్యుల్ని చేర్చుకొని క్లబ్ అభివృద్ధిలోకి వస్తుందనే నమ్మకంవున్న ప్రాంతంలోనే (Developing Area) కొత్త క్లబ్‌ను ప్రారంభించాలి.

**క్లబ్‌ను ప్రారంభించేముందు ప్రాథమికచర్య**

సర్వే పూర్తయిన తర్వాత స్పాన్సర్ చేసే క్లబ్ మొదటగా ఒక ఎక్స్‌టెన్షన్ కమిటీని నియమిస్తుంది. క్లబ్‌ను వ్యవస్థాపించే బాధ్యత ఈ కమిటీకి అప్పగిస్తుంది.

అనుభవం, పరిజ్ఞానం, ఆ ప్రాంతీయులతో పరిచయం, అక్కడ మంచిపేరు ప్రఖ్యాతులూ వున్న వ్యక్తులను ఎంపికచేసి వారికి ఆ బాధ్యత అప్పగించగలిగితే మంచి క్లబ్ ఏర్పడుతుంది.

**ఎక్స్‌టెన్షన్ కమిటీ చేయవల్సిన విధులు**

గ్రూపుగా అందరూ కలిసి ఆ ప్రాంతాన్ని సందర్శిస్తారు. అక్కడ పెద్దల్ని, పురప్రముఖుల్ని, వివిధ వృత్తి వ్యాపార వాణిజ్యవేత్తల్ని కలుసుకొంటారు.

తమ రాక ఎందు నిమిత్తమో వివరిస్తారు. లయనిజం గురించి, సేవా కార్యక్రమాల గురించి వారికి గల సందేహాలు తీరుస్తారు.

తిరిగి వచ్చి ఈ వివరాలన్నీ క్లబ్ బోర్డుకు నివేదిస్తారు. ఎక్స్‌టెన్షన్ కమిటీ ఇచ్చిన రిపోర్ట్‌ను బోర్డు చర్చించిన తర్వాత ఈ ప్రతిపాదనని బోర్డు ఆమోదించినట్లయితే ఆ నిర్ణయాన్ని జనరల్ బాడీకి నివేదిస్తారు. సభ్యుల సహకారాన్ని ఈ విషయంలో అర్థిస్తారు.

కొత్త క్లబ్‌లో చేరడానికి ఉత్సాహం చూపించిన వ్యక్తుల పేర్లను జెనరల్ బాడీకి అందజేస్తారు. జెనరల్ బాడీ కొత్త క్లబ్ ఏర్పాటుకు ఆమోదం తెలుపుతూ తీర్మానిస్తే కథ ఇంకొంచెం ముందుకు నడుస్తుంది.

**ఆమోదం తీర్మానాన్ని ఎవరెవరికి పంపాలి?**

కొత్త క్లబ్ ఏర్పాటుకు 'గ్రీన్ సిగ్నల్' కోసం ఈ ఆమోదం తీర్మానాన్ని గవర్నర్ గారికి ముందు పంపించండి. కొత్త క్లబ్ పరిసర ప్రాంతాల్లో వున్న ఇతర లయన్స్‌క్లబ్‌లకు్కూడా ఆవిషయం తెలియజేసి వారి సహకారం కూడా అర్థించండి. పరిసర ప్రాంత క్లబ్‌లనుంచి ఏదైనా అభ్యంతరం ఉంటే దానిని ముందు పరిష్కరించుకోండి.

ఎక్స్‌టెన్షన్ ఛైర్‌పర్సన్‌లు ఇద్దరు, గైడింగ్ లయన్లు ఇద్దరు, క్లబ్ అధ్యక్షులు, కార్యదర్శి, కోశాధికారి, క్లబ్‌లో ఇతర ముఖ్యులు కలిసి క్లబ్ ఏర్పాటుకు బయల్దేరవలసి వుంటుంది.

కొత్త క్లబ్‌లో సభ్యులుగా కాగోరేవారితో అతిశయోక్తులు, లేనిపోని ఆశలు చూపించేలా మాట్లాడడాన్ని అనుమతించకండి.

ముఖ్యంగా ఖర్చు ఎంత అవుతుందనే విషయంలో వాస్తవాలను వివరించండి.

చాలా కొత్త క్లబ్‌లు మరుసటి సంవత్సరం సభ్యత్వ రుసుములు కట్టవలసి వచ్చినప్పుడు, సరైన సమాచారం లేక ఇబ్బందులు పడడాన్ని గమనించడం జరిగింది. అందుకే, వాస్తవాలు అర్థంఅయ్యేలా ముందే చెప్పండి. వీలైతే లిఖితపూర్వకంగా ఇవ్వండి.

**కొత్త క్లబ్‌లకు ఎనిమిదిరకాల సమావేశాలు**

కొత్తగా ప్రారంభమయ్యే లయన్స్‌క్లబ్‌కు దాని అవతరణ కోసం ప్రయత్నాలు ప్రారంభించిన నాటి నుంచి వివిధ దశలలో మొత్తం ఎనిమిదిరకాల సమావేశాలు జరిపి, లయనిజం గురించి సమాచారం సంపూర్తిగా అందించడం జరుగుతుంది.

**1. INFORMATION MEETING :**

**పరిచయకార్యక్రమాలు**

కొత్తక్లబ్‌లో చేరబోయే సభ్యులను ఆహ్వానించి జరిపే మొదటి కార్యక్రమం ఇది. ఇది మొదటి ఆర్గనైజేషన్ మీటింగ్ :

క్లబ్ రెగ్యులర్ సమావేశం లాగానే దీన్ని జరపవలసి వుంటుంది.

సభ్యులు కాబోతున్న వారిని సభకు పరిచయం చేయండి.

10 నిమిషాలు చొప్పున ముఖ్యమైన నాలుగైదు అంశాలు లయనిజం గురించి సీనియర్లచేత వివరింపచేయండి.

1. లయనిజం ఘనచరిత్ర, UNO ఏర్పాటులో దాని ప్రముఖ పాత్ర, LCIF, లయన్స్ క్వెస్ట్‌కార్యక్రమం - వగైరా విషయాలు,

2. లయన్స్‌క్లబ్స్ ఇంటర్నేషనల్ వ్యవస్థాగత అంశాలు (organisational Set up)

3. సభ్యత్వం పొందేందుకు అర్హతలు, అవకాశాలు, నాయకత్వ లక్షణాల పెంపుదల, వ్యక్తిత్వ వికాసం - మానసిక సంతృప్తి మొదలైన అంశాలు.

4. సభ్యుడిగా చేరిన వ్యక్తి విధులు - బాధ్యతలు, ఆర్థికపరమైన విషయాలు, సభ్యత్వరుసుము వివరాలు, పదవులు, బాధ్యతలు మొదలైన అంశాలు.

ఒకరిద్దరు కొత్త సభ్యులచేత వారి ప్రతిస్పందన గురించికూడా మాట్లాడించండి. వారి స్నేహితులను తర్వాతి సమావేశానికి తీసుకురమ్మని కోరండి రుసుములు చెల్లింపు గురించి మరోసారి గుర్తుచేయండి.

**2. లయనిజం వివరాలు మరింత లోతుగా**

**(INDOCTRINATION MEETING)**

రెండో సమావేశానికి మరికొంత మంది కొత్తవారు వచ్చేలా చూడండి.

సభ్యుల పరస్పర పరిచయాలు, స్వపరిచయాల అనంతరం మరికొన్ని లయనిజం విషయాలు వివరింప చేయండి.

లయన్స్ నినాదం, L-1-ONS వివరణ

లయన్స్ ఆదర్శం - We serve

రెండు ప్రధాన లక్ష్యాలు - స్నేహం సేవ (fellowship of Service)

ఆదర్శాలు, ప్రవర్తనా నియమావళి, ప్రధాన కార్యక్రమాలు, లయన్స్ చిహ్నం, రంగులు. లయన్స్ జిల్లా, మల్టిపుల్‌జిల్లా, ఇంటర్నేషనల్ సంస్థల వివరాలు. పేరెంట్ క్లబ్ చరిత్ర, దాని విజయాలు. ఇలాంటి అంశాల్ని క్లుప్తంగా, వేగంగా మాట్లాడగల్గిన వారిచేత మాట్లాడించండి. ఇక్కడ కూడా సుదీర్ఘ ఉపన్యాసాలను అనుమతించకండి.

**3. వ్యవస్థాపరమైన సమావేశం**

**ORGANISATIONAL MEETING**

ఇది కొత్త క్లబ్ ప్రారంభానికి కొద్దిరోజులు ముందుగా జరిగే మూడవ సమావేశం.

ఈ సమావేశం నాటికి చేరవలసిన సభ్యులు, చెల్లించవలసిన బకాయిలు ఇవన్నీ పూర్తయి క్లబ్ ప్రారంభోత్సవానికి సిద్ధం అవుతూ వుంటుంది.

ఈ మూడో సమావేశాన్ని వ్యవస్థాపరమైన (ఆర్గనైజేషనల్) సమావేశం అనడం ఎందుకంటే, ఒక విధంగా ఇది నామినేషన్ కమ్ ఎలక్షన్ సమావేశం లాంటిది కాబట్టి!

కనీసం 20 మంది సభ్యులు చేరినత్వాతే ఈ మూడో సమావేశం జరపండి.

చేరిన సభ్యులందరూ ఈ సమావేశానికి తప్పనిసరిగా హాజరయ్యేలా చూడండి.

చార్టర్ సభ్యులు కావడం వలన కలిగే ఉపయోగాలు స్పష్టీకరించండి.

క్లబ్‌లో మూడు స్థాయిలలో సభ్యులు పనిచేయడం గురించి వివరించండి.

a) సాధారణ సభ్యులు - కార్యక్రమాలకు చేయూత

b) క్లబ్ కమిటీ ఛైర్‌పర్సన్‌లు - కార్యక్రమ నిర్వాహకులు

c) బోర్డ్ ఆఫ్ డైరెక్టర్‌లు - కార్యక్రమ నిర్దేశకులు

వివిధ క్లబ్ ఆఫీసర్లు, వారి బాధ్యతలు వివరించండి.

కొత్తసభ్యులకు ఎన్నికలు జరపండి. వారికి అప్పుడే విషయ పరిజ్ఞానం తక్కువగా వుంటుంది కాబట్టి, స్పాన్సర్ చేస్తున్న క్లబ్ వారే పేర్లు ప్రతిపాదించి, ఆమోదింపచేస్తారు.

చార్టర్ ప్రెసిడెంట్‌గా అంగీకరించిన వ్యక్తి ఎక్కువ పరిజ్ఞానంకలిగి, సానుకూలంగా ప్రతిస్పందించేవాడై వుండి, వయసులో తక్కిన వారికన్నా కొద్దిగా పెద్ద వాడైవుంటే మంచిది.

ప్రారంభోత్సవానికి తేదీ, సమయం స్థలం నిర్ణయించుకొని గవర్నర్‌గారిని ఆహ్వానించండి.

స్పాన్సర్ చేస్తున్న క్లబ్ ప్రెసిడెంట్ సెక్రటరీలు సంతకాలుచేసి, జాగ్రత్తగా పూర్తిచేసిన చార్టర్ అప్లికేషన్ తదితర ఫారాలను గవర్నర్ గారికి అందించండి.

అలాగే, చార్టర్ సభ్యుల ప్రవేశ రుసుము 30 డాలర్ల చొప్పున ప్రతి సభ్యుడినుంచి వసూలుచేసి, ఆ మొత్తానికి డీ.డీ. తీసి ప్రారంభోత్సవానికి ముందే జిల్లాగవర్నర్ గారికి అందజేయండి.

డీ.డీ.ని **"లయన్స్‌క్లబ్స్ ఇంటర్నేషనల్ (ముంబై)"** పేరుతో తీయవలసి వుంటుంది.

ఈ కొత్తక్లబ్‌లోకి ఇతర క్లబ్‌లలోంచి గానీ, స్పాన్సరింగ్ క్లబ్‌లోంచిగానీ సభ్యులు ఎవరైనా ట్రాన్స్‌ఫర్ అయివస్తోంటే వారికి ఒక్కొక్కరికి ఛార్టర్ ట్రాన్స్‌ఫర్ ఫీ నిమిత్తం 20 డాలర్లు చెల్లించ వలసి వుంటుంది.

## 4. ప్రారంభ సమావేశం

**(Inaugaration Meeting)**

కొత్తక్లబ్ ప్రారంభ సమావేశం కూడా రెగ్యులర్ సమావేశం మాదిరే జరపమని లయన్స్ ఇంటర్నేషనల్ సూచిస్తోంది.

తక్కువ సమయంలో సమర్థవంతంగా మంచి విషయాలు వివరించగలిగే ఇండక్షన్ ఆఫీసర్, ఇన్‌స్టలేషన్ ఆఫీసర్ లను ఆహ్వానించండి. వీరు పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్‌లైతే మంచిది.

ప్రారంభ సభకు ఎట్టి పరిస్థితుల్లోనూ కొత్త సభ్యులు అందరూ హాజరయ్యేలా చూడండి. వారంతా సకుటుంబ సపరివారంగా విచ్చేసేలా ప్రోత్సహించండి.

లేపెల్ పిన్స్, డిస్ట్రిక్ట్ డైరెక్టరీ కాపీలు, మెంబర్‌షిప్ కార్డులు వగైరా అన్నీ, వారికి బహూకరించడానికి సిద్ధంగా వుంచుకోండి.

కొత్త సభ్యులతో తలా ఒక దీపం గాని, కొవ్వొత్తిగాని వెలిగించచేస్తే బావుంటుంది.

క్లబ్ ప్రారంభానికి ముందుగానీ, తర్వాత గానీ కొత్తక్లబ్ బోర్డు డైరెక్టర్ల సమావేశం ఏర్పాటుచేసి, జిల్లాగవర్నర్ గారితో మాట్లాడించడం, ఎక్‌టెన్షన్ ఛైర్మెన్‌లు ఇద్దరూ, గైడింగ్ లయన్లు ఇద్దరూ ఆ సమావేశంలో పాల్గొనడం మంచిది. వీలైతే, క్లబ్ ప్రారంభం నాడే ఒకటీ రెండు సేవా కార్యక్రమాలు నిర్వహింపచేస్తే ఇంకా మంచిది.

కొత్తక్లబ్ ఎక్స్‌టెన్షన్ ఫారాలు ఇంటర్నేషనల్‌కు పంపిన తర్వాత, మనం పంపిన రికార్డునంతా టైప్‌చేసి కంప్యూటరీకరిస్తారు. ఇంటర్నేషనల్ రికార్డులో మనం పంపిన డేటాలో తప్పులేవైనా ఉన్నాయేమో సరిచేసి పంపమని వాటి కాపీలు కొత్త క్లబ్ సెక్రటరీకి పంపుతారు. వాటిని సరిచేసి ముంబై ఆఫీసుకు పంపాలి.

చార్టర్‌ను జిల్లా గవర్నర్ గారికి పంపుతారు. ఆయన కొత్త క్లబ్‌కు దాన్ని బహూకరిస్తారు.

ఈలోగా ఇంటర్నేషనల్ నుంచి నేరుగా Welcome అనే పుస్తకం మరికొంత సమాచారంతో కూడిన కిట్స్ కొత్త సెక్రటరీగారి చిరునామాకు అందుతాయి. అందులో మెంబర్ సర్టిఫికేట్ కూడా ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్‌గారి సంతకంతో వుంటుంది. దానిమీద చార్టర్ ప్రెసిడెంట్ కూడా సంతకంచేసి వాటిని బహూకరించవలసి వుంటుంది.

### 5. చార్టర్ బహూకరణోత్సవం (CHARTER PRESENTATION & DISTRICT GOVERNOR'S OFFICIAL VISIT)

క్లబ్ చార్టర్ పైన ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ సంతకం చేసిన రోజు చార్టర్ ఆమోదం పొందిన రోజుగా భావించబడ్తుంది. అది జిల్లా గవర్నర్ గారికి అందిన వెంటనే దాని బహూకరణోత్సవం జరుపుకోవలసిందిగా కొత్త క్లబ్‌వారికి తెలియజేసి తన వీలుని బట్టి తేదీని నిర్ణయిస్తారు.

90 రోజులు దాటకుండా, ఈ లోపే చార్టర్ బహూకరణోత్సవం జరపడం మంచిది.

సాధారణంగా చార్టర్ ప్రెజెంటేషన్ రోజునే జిల్లాగవర్నర్‌గారు అధికార పర్యటనా కార్యక్రమాన్ని కూడా కలిపి నిర్వహిస్తారు. ఆవిధంగా అది రెండంచెల కార్యక్రమం.

కొత్త క్లబ్ చార్టర్ నైట్ ఛైర్‌పర్సన్, నాయకత్వంలో గైడింగ్ లయన్స్ నేతృత్వంలో ఈ కార్యక్రమం జరుగుతుంది. కొత్తక్లబ్ సభ్యులు కుటుంబ సభ్యులతో వేడుకగా జరుపుకోవలసిన ఉత్సవం ఇది. పురప్రముఖుల్ని, పెద్దల్ని కూడా ఈ కార్యక్రమానికి ఆహ్వానించడం మంచిది. వీలైతే నలుగురి సమక్షంలో ఏదైనా సేవాకార్యక్రమం చేస్తే బావుంటుంది.

చార్టర్ మెంబర్ కిట్స్, సర్టిఫికేట్స్ అతిథుల చేతుల మీదుగా బహూకరింపచేస్తారు ఈ సభలో.

ఈ కార్యక్రమానికి ముందుగా, గవర్నర్‌గారి సమక్షంలో ఓ గంటసేపు ప్రత్యేక బోర్డు సమావేశాన్ని నిర్వహిస్తారు. దానికి జిల్లా గవర్నర్‌గారే స్వయంగా అధ్యక్షత వహిస్తారు.

మినిట్స్ పుస్తకాలు, ఎక్కౌంట్లు వగైరా అప్పటికే తయారు చేసిన రికార్డుని గవర్నర్ గారికి చూపించి ప్రశంసలు పొందుతారు.

కొత్తక్లబ్‌కు లయన్స్ జిల్లా ప్రముఖులుగానీ, స్పాన్సరింగ్ క్లబ్ ప్రముఖులుగానీ గోంగ్ & గ్యావెల్, క్లబ్ బ్యానర్, మెంబర్ బ్యాడ్జెస్, నేమ్‌టాగ్స్, PST కాలర్స్, సేవాకార్యక్రమాలకు ఆర్థికసహాయం వంటివి బహూకరించి కొత్త క్లబ్‌ను ప్రోత్సహించవచ్చు.

### 6. క్లబ్ ఆఫీసర్లకు శిక్షణా సమావేశం PST SCHOOLING / TRAINING

క్లబ్ ప్రెసిడెంట్, సెక్రటరీ, ట్రెజరర్, వైస్‌ప్రెసిడెంట్లకు లయనిజం పాలనాపరమైన అంశాల పై తగిన శిక్షణ ఇస్తారు. శిక్షణ ఇవ్వడంలో అనుభవజ్ఞులైన సీనియర్ సభ్యులచేత ఈ స్కూలింగ్‌ని నిర్వహింప చేస్తారు.

**చర్చనీయాంశాలు :**

ఎజెండా తయారీ, మినిట్స్ రాయడం, ఎం.ఎం రిపోర్ట్ తయారుచేయటం. జమా

ఖర్చుల స్టేట్‌మెంట్ తయారీ, బడ్జెట్, క్లబ్ రికార్డ్స్, కేలండర్ ఆఫ్ ఈవెంట్స్, ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్ కార్యక్రమాలు, క్లబ్ సమావేశాలలో సభ్యుల హాజరు పెంపు, క్లబ్ సభ్యత్వ బకాయీలు, వినియోగం, ఆర్సీ, జడ్సీ, జిల్లాగవర్నర్‌ల పాత్ర, లయనెస్, లయన్‌లేడీస్, లియోక్లబ్స్, ప్రెసిడెంట్, సెక్రటరీ, ట్రెజరర్, ఇతర క్లబ్ ఆఫీసర్ల విధులు.

## 7.కొత్త క్లబ్ కమిటీలకు ఓరియెంటేషన్

### ORIENTATION FOR NEW CLUB COMMITTEES

అధ్యక్షులు క్లబ్‌లో నియమించిన వివిధ కమిటీలు పనిచేయడం మొదలుపెడితే, క్లబ్ ఆరోగ్యవంతంగా ఎదగడం ప్రారంభిస్తుంది. అందుకని క్లబ్ కమిటీల చైర్‌పర్సన్‌లతో ప్రత్యేకంగా సెమినార్ నిర్వహించి, వారికి వారివారి విధుల్ని విశదీకరించడం అవసరం. అందువలన :

క్లబ్ ఆఫీసర్లపైన పనిభారం తగ్గుతుంది.

ఎక్కువ ప్రాజెక్ట్‌లు, ఉన్నతమైన కార్యక్రమాలు పెంపొందించేందుకు వీలుకల్గుతుంది.

క్లబ్‌లో ఉత్సాహంగా పాల్గొంటున్న వ్యక్తుల్లో అంతర్లీనంగా దాగున్న ప్రతిభాపాటవాలు బైటకు వస్తాయి.

ప్రెసిడెంట్ కిట్‌లో వివిధ కమిటీల బాధ్యతలకు సంబంధించిన సమాచారం వుంటుంది. దాన్ని అందించి, వివరించేందుకు వీలు కల్గుతుంది.

విషయ పరిజ్ఞానం కలిగి, సమర్థవంతంగా వివరించగలిగిన ఫాకల్టీ మెంబర్స్ దొరికితే అదృష్టం. కమిటీల చైర్‌పర్సన్‌లు నివేదించిన ప్రతిపాదనలను బోర్డులో చర్చించి నిర్ణయం తీసుకొంటారు.

## 8.క్లబ్ సభ్యులకు ఓరియెంటేషన్

### ORIENTATION FOR NEW CLUB MEMBERS

విషయ పరిజ్ఞానం కల్గిన లయన్స్ సభ్యుడు క్లబ్‌కు “ఆదాయం” (ASSET) గా వుంటాడు తెలిసీ తెలియని పరిజ్ఞానం కల్గిన సభ్యుడు అన్నింటికీ అడ్డుతగులుతూ, క్లబ్‌కు భారంగా (Liability) మారిపోతాడు.

క్లబ్ సభ్యులకు, క్లబ్ ఆఫీసర్లకు ఎన్నిసార్లు ఓరియెంటేషన్ కార్యక్రమాలు జరిపించినా మంచిదే!

అన్నప్రాశన రోజు అవకాయ పెట్టిన రీతిగా క్లబ్ ప్రారంభోత్సవం రోజున చెప్పిన విషయాలు ఎంత మేధావికైనా ఆకళింపుగా వుండవు.

పరిశీలన మీద కొంత, పెద్దలు చెప్పగా విన్నవి కొంత, అనుభవంమీద కొంత లయనిజాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తారు.

సభ్యులకు ఓరియేంటేషన్ కొత్త వారికైనా, పాతవారికైనా తరచూ జరుగుతూ వుండాలి. కొత్త సభ్యులకు మరీ అవసరం. ఓరియేంటేషన్‌లో ముఖ్యంగా చేపట్టవలసిన అంశాలు:

లయనిజం చరిత్ర

ప్రపంచ శాంతిక్రమంలో లయనిజం పాత్ర

వ్యవస్థాపరమైన అంశాలు

సమావేశాలు, కన్వెన్షన్‌లు

సభ్యుడి బాధ్యతలు హక్కులు

అటెండెన్స్ మేకప్‌రూల్స్

జోన్, రీజినల్, డిస్ట్రిక్ట్, మల్టిపుల్ సమావేశాలు

సభ్యత్వరుసముల చెల్లింపు

కొత్త సభ్యులను చేర్పించడం

అందివచ్చిన అవకాశాలను అంగీకరించడం

క్లబ్ ప్రతిష్ఠను ఇతోధికం చేయడం

క్లబ్ కార్యక్రమాలపట్ల స్వంత కుటుంబ సభ్యుల ఆమోదం పొందడం.

## క్లబ్‌లను బలోపేతం చేయండి!

### స్ట్రాంగ్ క్లబ్ అంటే ఏది?

### STRONG CLUB

20 మంది కన్నా ఎక్కువ సభ్యత్వం కల్గిన క్లబ్
'స్టేటస్‌కో' లో లేని క్లబ్
క్లబ్ రాజ్యాంగం, ఉపనియమావళికి అనుగుణంగా నడిచే క్లబ్
ఇంటర్నేషనల్, డిస్ట్రిక్ట్ రుసుములూ పూర్తిగా చెల్లించిన క్లబ్
ప్రతినెలా ఎం.ఎం రిపోర్ట్‌లు డిస్ట్రిక్ట్‌కూ, ఇంటర్నేషనల్‌కూ సక్రమంగా పంపుతూ వుండే క్లబ్
జోన్ ఎడ్వయిజరీ సమావేశాలు, రీజియన్, జోన్, డిస్ట్రిక్ట్‌సమావేశాలకు విడవకుండా హాజరయ్యేక్లబ్
నెలకు రెండు రెగ్యులర్ సమావేశాలు, ఒక బోర్డు సమావేశం జరుపుతున్నక్లబ్
ఒక సభ్యుణ్ణి అదనంగా చేర్చడంగాని, ఒక కొత్తక్లబ్‌ను వ్యవస్థాపించడంగానీ, 100% రిటెన్షన్ (ఎవరినీ డ్రాప్‌చెయ్యకుండా వుండడం) గానీ సాధించిన క్లబ్.
సేవాకార్యక్రమాలు చక్కగా నిర్వహిస్తున్న క్లబ్
మూడునెలలకొకసారి, ఆరునెలలకొకసారి జమాఖర్చుల రిపోర్ట్సు డిస్ట్రిక్ట్‌కూ, ఇంటర్నేషనల్‌కూ పంపుతూవుండేక్లబ్.

### వీక్ క్లబ్ అంటే ఏది?

పైనపేర్కొన్న వాటిలో ఏది చెయ్యకపోయినా అది వీక్‌గావున్న క్లబ్‌గానే భావించబడ్తుంది.
20 మంది కన్నా తక్కువ సభ్యత్వం కల్గిన క్లబ్
రెగ్యులర్ మీటింగ్‌లు, బోర్డు మీటింగులూ జరపని క్లబ్
సేవాకార్యక్రమాలు చేపట్టని క్లబ్
ఎం.ఎం రిపోర్ట్‌లు సక్రమంగా పంపని క్లబ్
జమాఖర్చుల రిపోర్ట్ పంపని క్లబ్
రుసుములు చెల్లించని క్లబ్
జోన్ అడ్వయిజరీలకు రాని క్లబ్
స్కూలింగ్‌లు, సెమినార్‌లు ఇతర కార్యక్రమాలలో పాల్గొనని క్లబ్
లయనిజం స్ఫూర్తిని ప్రదర్శించని క్లబ్
(Conduct Unbecoming a Lions club)

### సాధికారిక "హోదా"లు

### OFFICIAL PROTOCOL

లయనిజంలో అంతర్జాతీయస్థాయి నించి, క్లబ్ స్థాయివరకూ లయన్స్ సభ్యులు వివిధ హోదాలలో వివిధ బాధ్యతలను నెరవేరుస్తుంటారు.

వారివారి హోమ్‌క్లబ్‌లు గుడ్‌స్టాండింగ్‌లో వుండి, వారు కూడా గుడ్ స్టాండింగ్‌లో వున్నప్పుడు మాత్రమే సభ్యులకు ఈ హోదాలను పొందే అవకాశం వుంటుంది.

ఇంటర్నేషనల్ బోర్డు డైరెక్టర్లు ఆమోదించిన ప్రోటోకాల్ పోలసీ ప్రకారం ఈ విధంగా ఆయా అధికారుల్ని మనం గుర్తించవలసి వుంటుంది.

అవరోహణ క్రమంలో, అంటే, పైనించి క్రిందికి అధికారుల వరుస ఇలావుంటుంది. (Order of Precedence) :

2003 - 04 సంవత్సరం వరకూ ఇది తాజా సమాచారం.

1. ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్
2. ఇమ్మీడియేట్ పాస్ట్ ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్
3. ఇంటర్నేషనల్ వైస్ ప్రెసిడెంట్ (1వ)
4. ఇంటర్నేషనల్ వైస్ ప్రెసిడెంట్ (2వ)
5. ఇంటర్నేషనల్ డైరెక్టర్స్
6. పాస్ట్ ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్స్

(చిట్టచివరి వ్యక్తిపేరు పైన వుంటుంది. వెనుక నుంచి ముందుకు ఈ వరుస నడుస్తుంది)

8. ఏరియా ఇంపాక్ట్ టీమ్ లీడర్
9. మల్టిపుల్ కౌన్సిల్ చైర్‌పర్సన్
10. డిస్ట్రిక్ట్ గవర్నర్
11. అసోసియేషన్ ఎగ్జిక్యూటివ్ ఎడ్మినిస్ట్రేటర్
12. అసోసియేషన్ సెక్రటరీ
13. అసోసియేషన్ ట్రెజరర్
14. ఇమ్మీడియేట్ పాస్ట్ కౌన్సిల్ చైర్‌పర్సన్
15. పాస్ట్ కౌన్సిల్ చైర్‌పర్సన్

(ఒకరి కంటే ఎక్కువ వున్నప్పుడు, చిట్టచివరి వ్యక్తిపేరు ముందు వస్తుంది. అక్కడినించీ వెనక్కి, వరుసక్రమం నడుస్తుంది)

16. ఇమీడియేట్ పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్
17. వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్
18. పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్
19. మల్టిపుల్ డిస్ట్రిక్ట్ సెక్రటరీ
20. మల్టిపుల్ డిస్ట్రిక్ట్ ట్రెజరర్

(ఇక్కడివరకు ఈ 20 మందినీ ఇంటర్నేషనల్ ఆఫీసర్స్‌గా వ్యవహరిస్తారు)

21. డిస్ట్రిక్ట్ కాబినెట్ సెక్రటరీ
22. డిస్ట్రిక్ట్ కేబినెట్ ట్రెజరర్
23. రీజియన్ చైర్‌పర్సన్
24. జోన్ చైర్‌పర్సన్
25. డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్

(ఒకరికన్నా ఎక్కువమంది వున్నప్పుడు వారిని అక్షరక్రమంలో A నుండి ప్రారంభించి గుర్తిస్తారు)

(ఈ ఐదు హోదాలనూ డిస్ట్రిక్ట్ ఆఫీసర్స్ అంటారు. జిల్లా గవర్నర్‌గారి నియామకం ప్రకారం ఇంకా ఇతర పదవులు ఏవైనా వున్నప్పుడు వారి ప్రోటోకాల్ హోదాకూడా, గవర్నర్‌గారి నిర్ణయానుసారమే వుంటుంది!)

26. క్లబ్ ప్రెసిడెంట్
27. ఇమీడియేట్ పాస్ట్ క్లబ్ ప్రెసిడెంట్
28. క్లబ్ సెక్రటరీ
29. క్లబ్ ట్రెజరర్
30. పాస్ట్ క్లబ్ ప్రెసిడెంట్స్
31. మల్టిపుల్ డిస్ట్రిక్ట్ సెక్రటరీ (ఉద్యోగిఅయితే)
32. మల్టిపుల్ డిస్ట్రిక్ట్ ట్రెజరర్ (ఉద్యోగిఅయితే)

కాన్ఫరెన్స్‌లూ, కన్వెన్షన్‌లూ, పెదపెద్ద కార్యక్రమాలూ జరిగేప్పుడు ఒక్కోసారి ఇంత ప్రోటోకాల్‌నూ అమలుచేయవలసిన పరిస్థితులు రావచ్చు. హాజరయ్యే అతిథులను బట్టి ఉంటుంది. ఇంటర్నేషనల్ ఆఫీసర్లు ఎవరు హాజరౌతున్నా ఆసమావేశంలో ప్రోటోకాల్ నిబంధనల్ని తప్పనిసరిగా పాటించాలి.

లయన్స్ కార్యక్రమాలకు పురప్రముఖుల్ని కూడా ఆహ్వానించి నప్పుడు వారిని ఈ వరసలో ఎలా ఆహ్వానించాలనే మీమాంస ఏర్పడుతుంది.

ఒక్కో ప్రాంతంలో ఒక్కోరకం అలవాట్లు సాంప్రదాయాలుంటాయి.

మన తెలుగు ప్రాంతాలలో సభాధ్యక్షుల్ని పిలిచి, ముఖ్య అతిథిని వెంటనే ఆహ్వానించే అలవాటు ఎక్కువ. అలాంటప్పుడు లయన్స్ కానివారు ముఖ్యఅతిథిగా వచ్చినట్లయితే, ప్రెసిడెంట్‌గారి కుడిపక్క కుర్చీలో ఆసీనులు కావలసిందిగా ముందే ఆహ్వానించడంలో తప్పులేదు. వేదికపైకి ఆహ్వానించేప్పుడు క్రిందినించి పైకి ఆరోహణ క్రమంలోనూ, (Ascending Order) బహుమతులు మెమెంటోలు సన్మానసత్కారాలు చేసేప్పుడు పైనించి క్రిందికి అవరోహణ క్రమంలోనూ (Discending Order) అతిథుల్ని సంబోధించాలని గుర్తుంచుకోండి.

సాధారణంగా ముఖ్యఅతిథి పై ఆఫీసర్ అయివుంటారు. కాబట్టి క్రింది నించిపైకి వరుసక్రమంలో ఆఖరున వస్తారు. ఇది లయన్స్ ఆఫీసర్లకే పరిమితం అయిన విధానం.

## యువతరం కార్యక్రమాల్లో ముఖ్యమైంది లియోక్లబ్

### తాజాసమాచారమ్

### YOUTH PROGRAM & LEOCLUBS

యువతరంలో సేవాకార్యక్రమంపట్ల అభినివేశం - పెంపొందించడం ద్వారా నాయకత్వాన్ని, అనుభవాన్ని, అవకాశాల్ని అందిపుచ్చుకోవడం ధ్యేయంగా, స్నేహ సంబంధాల్ని పెంపొందించుకొంటూ పరస్పర అవగాహనని కల్పించుకొనేలా చేయడానికి లియోక్లబ్స్ వ్యవస్థని ప్రారంభించింది ఇంటర్నేషనల్. లియోక్లబ్‌కు సంబంధించిన కొన్ని ముఖ్య వివరాలు.

లియోక్లబ్, దానిని వ్యవస్థాపించిన లయన్స్ క్లబ్‌కు అనుసంధానం (Auxilliary) గా వుంటుంది. గానీ అందులో ఒకభాగం ఎంతమాత్రమూ కాదు.

పేరెంట్ లయన్స్‌క్లబ్ సభ్యులు కనీసం ఒకరైనా లేకుండా లియోక్లబ్ రెగ్యులర్ సమావేశాలు, బోర్డ్ సమావేశాలు జరపకూడదు.

ఒకవేళ లియోక్లబ్ సమావేశం లయన్స్ ఎవరూ లేకుండా జరపవలసివస్తే, 15 రోజులలోగా ఆ సమావేశం నిర్ణయాలను ఒకరిపోర్ట్ రూపంలో పేరెంట్ క్లబ్‌సెక్రటరీకి అందజేయాలి. అందులో ప్రత్యేక చర్చనీయాంశాలున్నప్పుడు, లియోక్లబ్ ప్రతినిధులు ముగ్గురు, లయన్స్‌క్లబ్ ప్రతినిధులు ముగ్గురు, కలిసి ప్రత్యేకంగా సమావేశం అయి, చర్చించి, ఒక నిర్ణయానికి వస్తారు.

పేరెంట్ క్లబ్ నియమించిన లియోక్లబ్ కమిటీ అనుమతితో మంచి నడవడి కల్గిన యువతీయువకుల్ని సభ్యులుగా చేర్చవలసి వుంటుంది.

**లియో క్లబ్‌లో సభ్యత్వ కేటగిరీలు**

లియోక్లబ్‌ల్లో నాలుగు రకాల సభ్యత్వాలున్నాయి.

1. ఆల్ఫా సభ్యత్వం. 12 నుంచి 17 సంవత్సరాల యువతీయువకులు ఈ సభ్యత్వం లోకి వస్తారు.

2. ఒమెగా సభ్యత్వం : 18 నుంచి 28 సంవత్సరాల యువతీయువకులకు ఈ సభ్యత్వాన్నిస్తారు.

3. ఆల్ఫా సభ్యులైనా, ఒమెగా సభ్యులైనా క్లబ్‌లో యాక్టివ్ సభ్యత్వం కల్గివుంటేనే సర్వహక్కులూ బాధ్యతలూ వుంటాయి. లియోక్లబ్‌లోగానీ లియోడిస్ట్రిక్ట్‌లోగానీ పదవులు పొందేందుకు అవకాశం వుంటుంది.

4. మెంబర్ - ఎట్ - లార్జ్ సభ్యత్వం : ఇతర ప్రాంతాలకు తరలి వెళ్ళి, సభ్యత్వాన్ని ఈ లియోక్లబ్‌లోనే కొనసాగించేవారికి, స్థానికం గానే వున్నా ఆరోగ్యం తదితర సమంజస కారణాల రీత్యాగాని లియోక్లబ్ బోర్డ్ సభ్యులు ఈ సభ్యత్వాన్ని కేటాయించవచ్చు. లయన్స్‌లో మెంబర్ ఎట్ లార్జి మాదిరే లియోలో కూడా ఈ సభ్యత్వానికి ఓటింగ్ హక్కుగాని, పోటీ చేసే హక్కుగానీ వుండదు.

లియోక్లబ్‌లలో మెంబర్‌షిప్ ట్రాన్స్‌ఫర్ సౌకర్యం, పేరెంట్ లయన్స్ క్లబ్ అనుమతితో కల్పించబడ్తుంది.

క్లబ్‌ని ప్రారంభించేప్పుడే, ఆల్ఫా క్లబ్‌గానో, ఒమేగా క్లబ్‌గానో దాన్ని ముందుగానే తెలియజేస్తే ఆ మేరకు సర్టిఫికేషన్ ఇస్తారు. యూత్‌ప్రోగ్రామ్స్ డిపార్ట్‌మెంట్ ఇంటర్నేషనల్ హెడ్‌క్వార్టర్స్‌లో దీని బాధ్యతలు చూస్తారు.

లియోక్లబ్‌ని స్పాన్సర్ చేసిన లయన్స్ క్లబ్ మూసివేతకు గురి అయినప్పుడు 90 రోజుల వ్యవధిలోపు ఈ లియోక్లబ్ మరో పేరెంట్

లయన్స్ క్లబ్‌ను ఎంచుకొని, వారి అనుబంధ సంస్థగా మారవలసి వుంటుంది. లేకపోతే ఈ లియోక్లబ్ కూడా రద్దు పరిస్థితిని పొందుతుంది.

**లియో క్లబ్‌లో సభ్యుల్ని చేరిస్తే ప్రోత్సాహకాలు :**

- 2003 సంవత్సరంలో "లియో అక్టోబర్ మెంబర్‌షిప్ గ్రోత్ అవార్డు"ని కొత్తగా ప్రవేశపెట్టారు.
- ఏప్రియల్‌ని లియోక్లబ్ అవగాహనా మాసం గానూ, అక్టోబర్ నెలని సభ్యత్వం పెంపొందించు కునే మాసంగానూ ప్రకటించారు.
- ముగ్గురుకన్నా ఎక్కువమంది లియోలను స్పాన్సర్ చేసిన లియోను లియో అక్టోబర్ మెంబర్‌షిప్ గ్రోత్ అవార్డు ఇస్తారు.

**లియోక్లబ్ ఫీజు ఎవరు చెల్లించాలి?**

మన ఆదర్శాలలో ఒకటవదైన To Create & Foster the spirit of Understanding కు అనుగుణంగా లియోక్లబ్‌ను స్థాపిస్తున్నాం కాబట్టి, అది మన సేవా కార్యక్రమాలలో ఒకటిగా భావిస్తున్నాం.

అందుకని, ఇంటర్నేషనల్‌కు చెల్లించవలసిన 5 డాలర్ల రుసుముని ప్రతిలియో సభ్యుడిపేరునా పేరెంట్ క్లబ్ ద్వారా మాత్రమే చెల్లించవలసి వుంటుంది. అయితే, లియోక్లబ్ పాలనాపరమైన ఖర్చులనిమిత్తం కొంత ఛార్జిని లియోసభ్యుల నుంచి పేరెంట్‌క్లబ్ వసూలు చేయడానికి అనుమతి వుంది.

**రెండు లయన్స్ క్లబ్‌లు కలిసి ఒక లియో క్లబ్ స్థాపన**

ఒక లియోక్లబ్‌ని అనేక లయన్స్‌క్లబ్‌లు కలిసి వ్యవస్థాపించే అవకాశాన్ని కూడా లయన్స్ ఇంటర్నేషనల్ కల్పించింది.

ఆ మేరకు జిల్లా గవర్నర్‌గారు రెండుగాని అంతకన్నా ఎక్కువ లయన్స్‌క్లబ్‌లకు సంయుక్తంగా అనుమతిని మంజూరు చేయవలసి వుంటుంది. ఇలా సంయుక్తంగా వ్యవస్థాపించిన లయన్స్‌క్లబ్‌లు సంయుక్తంగా ఒక లియో కమిటీని నియమిస్తాయి. ఈ లియో కమిటీ ఆ లియోక్లబ్‌ని నడిపిస్తుంది. ఇది ఎల్లకాలం కొనసాగవలసిన సమష్టి కార్యక్రమం!

**లియో మెంబర్ కిట్**

ఐదు డాలర్లు చెల్లించి లియోక్లబ్ సభ్యులను ఇంటర్నేషనల్‌కు రిపోర్టు చేసినప్పుడు లియో లేపెల్‌బటన్, మెంబర్‌షిప్ సర్టిఫికేట్, లియోక్లబ్ హాండ్ బుక్, మరికొంత సమాచారంతో కూడిన కొన్ని బ్రోచర్లు కలిపి ఒక కిట్‌ను పంపుతుంది.

లయన్స్ ఇంటర్నేషనల్

లియోక్లబ్‌ని వ్యవస్థాపించినప్పుడు 100 డాలర్లు చెల్లింపవలసి వుంటుంది.

లియోసభ్యులు 20 మందికన్నా తక్కువగా వున్నాసరే, సంవత్సరానికి 90 డాలర్లకు పేరెంట్ క్లబ్‌కు బిల్లు వస్తుంది. లియోక్లబ్‌లో 20 మంది కన్నా ఎక్కువమంది సభ్యులుంటే, ప్రతిసభ్యునికి 5డాలర్లు చెల్లించవలసి వుంటుంది. అదనపు బిల్లుకూడా పేరెంట్‌క్లబ్‌కే వస్తుంది. రిపోర్ట్ చేసిన నెలనుంచి ప్రోరేటా పద్ధతితో మిగిలిన నెలలకు ఈ సభ్యత్వం చెల్లించవలసి వుంటుంది. లియోక్లబ్ పేరుతో ఇంటర్నేషనల్‌లో ఎలాంటి అక్కౌంటూ ఉండదు. లియో చెల్లింపులన్నీ పేరెంట్ క్లబ్ ద్వారా మాత్రమే జరగాలి.

**లియో క్లబ్‌లకు సంబంధించిన ఆఫీసర్లు**

లియోక్లబ్ కార్యక్రమానికి సంబంధించి ఇంటర్నేషనల్ సూచించిన వివిధ ఆఫీసర్లు ఈవిధంగా వుంటారు :-

1. లియో క్లబ్ అడ్వయిజర్ : పేరెంట్ క్లబ్ అధ్యక్షులు తన సభ్యుల్లోంచి ఒకరిని లియో అడ్వయిజర్‌గా నామినేట్ చేస్తారు.
2. డిస్ట్రిక్ట్ లియోక్లబ్ ఛైర్‌పర్సన్ : జిల్లాగవర్నర్ గారు నియమించే పదవి ఇది.

3. మల్టిపుల్ డిస్ట్రిక్ట్ లియోక్లబ్ చైర్ పర్సన్ : మల్టిపుల్ కౌన్సిల్ చైర్మన్ ఈ పదవికి పాస్ట్ గవర్నర్స్‌లోంచిగానీ సీనియర్ సభ్యుల్లోంచి గానీ ఒకరిని నియమిస్తారు.

4. లియో డిస్ట్రిక్ట్ ప్రెసిడెంట్ : లియోక్లబ్‌ల సభ్యులు, వార్షిక సమావేశంలో ఎన్నికలద్వారా లియో డిస్ట్రిక్ట్ ప్రెసిడెంట్‌ను ఎన్నుకుంటారు.

5. లియో మల్టిపుల్ డిస్ట్రిక్ట్ ప్రెసిడెంట్ : లియోడిస్ట్రిక్ట్ ప్రెసిడెంట్లంతా కలిసి ఈ పదవికి తమలోంచి ఒకరిని ఎన్నుకొంటారు.

లియోక్లబ్‌ను వ్యవస్థాపిస్తే, పేరెంట్‌క్లబ్ ప్రెసిడెంట్‌గారికీ, లియో అడ్వయిజర్ గారికీ లియో ఎక్స్‌టెన్షన్ అవార్డు ఇస్తారు.

కనీసం ఆరు లియోక్లబ్‌లుంటే, ఒక లియోడిస్ట్రిక్ట్‌ను రూపొందించవచ్చు

## మోనార్క్ షేవ్రాన్ అవార్డులు
## (MONARCH CHEVRON AWARDS)

లయనిజంలో సభ్యునిగా చేరి 10 సంవత్సరాలు పూర్తిచేసుకున్న వారికి మోనార్క్ షేవ్రాన్ అవార్డ్‌ను బహూకరిస్తారు.

ఆ తర్వాత ప్రతి 5 సంవత్సరాలకూ ఒక మోనార్క్ షేవ్రాన్ అవార్డును బహూకరిస్తారు.

ఈ షేవ్రాన్ అవార్డుని ఇంటర్నేషనల్ క్లబ్ సప్లైస్ డివిజన్‌కు క్లబ్ సెక్రటరీ ద్వారా ఆర్డర్ పెట్టి తెప్పించుకోవాల్సి వుంటుంది.

జూలై 1, 1999 నుంచీ ఈ షేవ్రాన్ అవార్డులను అమ్మకంవస్తువుల జాబితాలోకి చేర్చారు.

A) చార్టర్ సభ్యత్వం 10 సంవత్సరాలు పూర్తయిన వారికి"చార్టర్ మోనార్క్ షేవ్రాన్" తెప్పించవచ్చు.

B) క్లబ్ కార్యదర్శి ఈ రికార్డునంతా పరిశీలించి ఎవరెవరికి ఈ అవార్డులు వస్తాయో వారందరికీ తెప్పించి, సగౌరవంగా బహూకరింప చేయడంలో బాధ్యత వహించ వలసి వుంటుంది.

C) కాలపరిమితి దాటిపోయినా, అశ్రద్ధచేయకుండా సభ్యులకు వాటిని అందచేయడం క్లబ్ ఆఫీసర్ల కనీస ధర్మం.

D) పూర్వపు గుర్తింపుపొందిన లయనెస్‌లు లయన్స్‌గా చేరినప్పుడు, అలాగే, జేసీస్ ఇంటర్నేషనల్‌లో సభ్యులుకూడా లయన్స్‌గా చేరినప్పుడు, వారివారి మాతృసంస్థల్లో సర్వీస్‌ని కూడా కలిపి లెక్కించి ఈ షేవ్రాన్ అవార్డులను తెప్పించవచ్చు. అయితే, అందుకు Reinstated Lions / Junior chamber International Service credit form ని ఆ సభ్యులు ఉపయోగించిన వారై ఉండాలి.

E) 10 సంవత్సరాల కాలం పూర్తవడంతో మొదలై, 15 ఏళ్ళకు, 20 ఏళ్ళకు, 25 ఏళ్ళకూ ఇలా ప్రతి ఐదు సంవత్సరాల గుణకారంతో ఈ మోనార్క్ షేవ్రాన్ అవార్డులను తెప్పించి, కుటుంబ సభ్యులందరి సమక్షంలో గౌరవ పూర్వకంగా మంచి సమావేశం ఏర్పాటుచేసి వాటిని బహూకరించండి!

చార్టర్ మోనార్క్ షేవ్రాన్ అవార్డుమీద పదిసంవత్సరాలకు V ఆకారం గీతలున్న అవార్డునిస్తారు. మరో 5 ఏళ్ళకు దానికింద చిన్న గీతలున్నదానికీ ఇంకో ఐదేళ్ళకు, అంటే మొత్తం 20 ఏళ్ళ సభ్యత్వానికి రెండు పెద్దగీతలు V ఆకారంలో వున్నవి బహూకరిస్తారు.

f) చార్టర్ మోనార్క్ షేవ్రాన్ అవార్డ్‌లో అడుగున 'చార్టర్ మెంబర్' అని అదనంగా రాసి వుంటుంది.

g) ప్రస్తుతం అమలులో వున్న రేట్ల ప్రకారం చార్టర్ మోనార్క్ షేవ్రాన్ 1.40 డాలర్ల ఖరీదు, మోనార్క్ షేవ్రాన్ 1.30 డాలర్ల ఖరీదు అవుతాయి.

# CHEVRON AWARDS

## Charter Monarch Chervron Awards




## Monarch Chevron awards




**ఇంటర్నేషనల్ ఆఫీసర్ల హోదాని ఇలా గుర్తించండి**

వైస్ డిస్ట్రిక్ గవర్నర్‌తో ప్రారంభించి ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ వరకూ ఒక్కొక్క ఆఫీసర్‌కి ఒక్కోరకమైన బ్యాడ్జి వుంటుంది. దేని ఆకారం దానిదే! ఈ బ్యాడ్జిని బట్టి ఆయా ఆఫీసర్ల హోదాని గుర్తిస్తాం మనం. వీరి జీవిత భాగస్వాముల కూడా ఇలాంటివే బ్యాడ్జెస్ వుంటాయి. కానీ, $\frac{1"}{4}$ తక్కువ సైజులో వుంటాయి.

**A) INTERNATIONAL PRESIDENT**




అడ్డంగా దీర్ఘ చతురస్రాకారంలో 3" X 2" సైజులో ఈ బ్యాడ్జివుండి, దానిమీద ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ గారి పేరు, హోదా రాసివుంటాయి. దానికిపైన ఎడమవైపున మూలమీద ఐమూలగా రెండు గీతలు నీలిరంగులో వుంటాయి.

**B. PAST INTERNATIONAL PRESIDENTS**




ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్‌గారి బ్యాడ్జిమాదిరే ఉంటుంది. కానీ, ఐమూలగా వుండే నీలం గీతలు అడుగున కుడివైపు వుంటాయి.

**C. INTERNATIONAL VICE - PRESIDENTS**

**INTERNATIONAL DIRECTORS**




వీరిక్కూడా ఇదే మాదిరి ఇంతే సైజు బ్యాడ్జి ఇస్తారు. కానీ, ఒకే నీలం రంగు గీత ఎడమవైపు పైన ఐమూలగా వుంటుంది.

**F) PAST INTERNATIONAL DIRECTORS**




ఇది 2"X3" సైజులో దీర్ఘచతురస్రాకారంగా నిలువుగా వుండి, కింద కుడివైపున ఐమూలగా ఒక నీలంగీత వుంటుంది.

**D) COUNCIL CHAIR PERSON & PAST COUNCIL CHAIR PERSON**



5 అంగుళాల సైజులో అష్టభుజి (Octogonal) ఆకారంలో ఈ బ్యాడ్జి వుంటుంది. వీరి జీవిత భాగస్వామికి కూడా ఇదే బ్యాడ్జి ఇస్తారు.

**DISTRICT GOVERNORS**




దీర్ఘ వృత్తాకారంలో (Ovel), అడ్డంగా 3" X 2" సైజులో ఈ బ్యాడ్జి వుంటుంది.

వీరి జీవిత భాగస్వాములకూడా ఇదేమాదిరి బ్యాడ్జిలు ఇస్తారు.

**G) PAST DISTRICT GOVERNORS**




దీర్ఘ చతురస్రాకారంలో నిలువుగా వుంటుది. 2"X3" సైజులో వుంటుంది. దీనిమీద ఎలాంటి నీలం గీతలూ వుండవు.

**VICE – DISTRICT GOVERNORS**




నలుచదరంగా $2\frac{3''}{4}$ సైజులో ఈ బ్యాడ్జి వుంటుంది.

ఇంటర్నేషనల్ డైరెక్టర్ ఆపై హోదా కలిగిన ఆఫీసర్లకు మాత్రమే నీలంరంగు గీతలు కుడివైపునో, ఎడమవైపునో వుంటాయి. ఇది గమనించండి!

**లయన్స్ సేవాకార్యక్రమాలకు అంతర్జాతీయ నిధి చేయూత**

**LCIF SUPPORT FOR MAJOR SERVICE PROJECTS**

ఇవన్నీ లయన్స్ అంతర్జాతీయ సేవాసంస్థ ప్రపంచ వ్యాప్తంగా విస్తరించిన తన లయన్స్‌క్లబ్‌లకు సూచించిన సేవాకార్యక్రమాలు.

వీటిలో ప్రతిఒక్క సేవాకార్యక్రమాన్ని నిర్వహించవలసిన తీరుతెన్నులను వివరిస్తూ ఎంతో సమాచారాన్ని కూడా రూపొందించింది.

ఉత్సాహంవున్నవారు ఇంటర్నెట్ ద్వారా లయన్స్ సేవా కార్యక్రమాలలోంచి ఈ వివరాలను డౌన్‌లోడ్ చేసుకోవచ్చు కూడా!

ఈ కార్యక్రమాలను లయన్స్ అంతర్జాతీయ సంస్థ తన కార్యక్రమాలుగా ప్రకటించింది. అంటే, ADOPT చేసుకొన్న కార్యక్రమాలు ఇవన్నీ అని అర్థం!

వీటిలోంచి, ఏ లయన్స్‌క్లబ్ అయినా భారీ స్థాయిలో ఏ కార్యక్రమాన్నయినా చేపడితే, LCIF

ద్వారా ఆర్థిక సహాయం అందచేసే అవకాశం కూడా వుంటుంది.

LCIF నిధులు పొందేందుకు మార్గదర్శకన సూత్రాలు ఇవి :

1. WE SERIVE – " మనం సేవలందిద్దాం" అనే మన సదాశయానికి అనుగుణంగా, అంతర్జాతీయంగా కార్యక్రమాల్ని రూపొందించి నప్పుడు.. exemplifies the "We Service" Motto and has relevance to Lions International

2. ప్రజలకు, సంబంధించిన మానవతా అవసరాలకోసం రూపొందించిన అతిముఖ్యమైన సేవా కార్యక్రమం అయినప్పుడు... (Meets Important Community or humanitarian need)

3. ఎక్కువమంది ప్రజలకు, ఆర్తులకు భారీస్థాయిలో సేవలందించినప్పుడు... (Achieves measurable Out Comes benefiting Service recipients)

4. లయన్స్ సభ్యులు అత్యధిక సంఖ్యలో పాల్గొని స్వయంగా కార్యక్రమ నిర్వహణలో పాల్పంచుకునేలా వున్నప్పుడు...

5. లయన్స్ సభ్యుల నాయకత్వపటిమని పెంపొందించుకునేందుకు ఉపయోగపడేలా కార్యక్రమాలు రూపొందించుకున్నప్పుడు... (Includes Leadership Roles for Lions)

6. లయన్స్ సేవాతత్పరతని సర్వప్రజానీకానికీ తెలియపరిచే విధంగా ప్రజా అవగాహన కార్యక్రమం అయినప్పుడు...

(Promotes Public awareness of the Lions Service Mission)

7. దీర్ఘకాలం ఆ సేవా కార్యక్రమం ఫలాలు ఎక్కువమంది ప్రజలకు అందేవిగా వున్నప్పుడు (Sustainable)

ఇలాంటి కార్యక్రమాలను రూపొందించుకొని లయన్స్‌సేవాసంస్థలు ఇంటర్నేషనల్ వారి సహాయానికి అభ్యర్థన పంపుకోవచ్చు.

## డయాబెటిస్ అవగాహనా కార్యక్రమం

## DIABETES AWARENESS PROGRAMME

మార్చి 1984 నుంచి లయనిజం ప్రధానకార్యక్రమంగా అమలులోకి వచ్చింది ఈ మధుమేహవ్యాధి అవగాహనా కార్యక్రమం.

జిల్లా గవర్నర్ ద్వారా ఈ కార్యక్రమానికి బాధ్యత వహించేందుకు నియమించబడిన డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్‌కు మొదట ఈ కార్యక్రమం పట్ల అవగాహన వుండి వుండాలి.

అంధత్వనివారణా కార్యక్రమం ప్రధానమైనదిగా నడుస్తున్న (Sight First) లయనిజానికి, అంధత్వానికి మరోకారణ భూతమైన షుగర్ వ్యాధిపట్ల ప్రత్యేకశ్రద్ధ కనబరచడం ఒక తప్పనిసరి అయ్యింది. డయాబెటిస్ రెటినోపతి అనే వ్యాధి వలన షుగర్‌వ్యాధిలో అంధత్వం ప్రాప్తిస్తూ వుంటుంది.

ఈ వ్యాధిని దృష్టిలో పెట్టుకునే డయాబెటిస్ అవేర్‌నెస్ కార్యక్రమాన్ని ప్రారంభించింది లయనిజం.

2003లో ఈ కార్యక్రమానికి సంబంధించి అనేక గణనీయమైన మార్పుల్ని ప్రతిపాదించారు LEHP (లయన్స్ హెల్త్ ప్రోగ్రాం) కార్యక్రమాన్ని ఈ ఏడాది సైట్‌ఫస్ట్ కార్యక్రమంలోంచి డయాబెటిస్ కార్యక్రమంలోకి మార్పుచేశారు. అలాగే, మానసిక వత్తిడి ఎక్కువగా వున్నందువలన (TENSION, STREES వగైరా) షుగర్ వ్యాధి పెరిగే అవకాశం వుంది కాబట్టి, షుగర్ రోగులకు మానసోల్లాసాన్ని కల్గించే కార్యక్రమాలు చేపట్టడం, మహిళలకు షుగర్ వ్యాధి పట్ల అవగాహన కల్పించడం వంటి

అనేక మార్పుల్ని 2003 సంవత్సరంలో ప్రతిపాదించారు.

## నూతన సభ్యుల ప్రపంచ ప్రతిష్ఠాపనాదినోత్సవం

### WORLD WIDE INDUCTION DAY

పండగ పేరుచెప్పి కొత్త బట్టలు కుట్టించు కొంటాం ఇది మన అలవాటు. మనుషులందరికీ ఇలాంటి అలవాట్లే వుంటాయి.

కొత్త సభ్యుల్ని ఎప్పుడూ చేర్పిస్తూనే వుంటాం. కానీ, ఒక పండగ పేరుచెప్పినప్పుడు దానికోసం మరింతగా శ్రమించి ఆకార్యక్రమాన్ని విజయవంతం చేయాలని చూస్తాం.

అలాంటి పండగల్లో ఒకటి 'నూతన సభ్యుల ప్రపంచ ప్రతిష్ఠాపనా దినోత్సవం Worldwide Induction Day.

లయన్స్ ఇంటర్నేషనల్ ముందుగానే ఈ దినోత్సవం ఏతేదీ జరిగేదీ ప్రకటిస్తుంది.

ఏప్రియల్ 17, 2004 శనివారంనాడు ఈ లయనిస్టిక్ సంవత్సరానికి సంబంధించిన నూతన సభ్యుల ప్రపంచ ప్రతిష్ఠాపనోత్సవం జరుగుతోంది.

సభ్యుల్ని అత్యధిక సంఖ్యలో చేర్పించడమే ఈ కార్యక్రమం లక్ష్యం. అందుకోసం ప్రజా సంబంధాలను పెంపొందింపచేసే పథకాలు చేపట్టడం, అర్థవంతమైన కార్యక్రమాలు రూపొందించడం - ఇవన్నీ చేసి ఆనాటికి అధికసంఖ్యలో సభ్యులు ప్రమాణ స్వీకారం చేసేలా చూడవలసి వుంటుంది.

సామాజిక స్పృహకల్గిన వ్యక్తిని మనం గుర్తించి ఆ వ్యక్తిని లయనిజంలోకి ఆహ్వానించడం ద్వారా, ఆ వ్యక్తి లోని సేవాతత్పరతని మనం గౌరవిస్తున్నామని అర్థం!

ప్రపంచవ్యాప్తంగా ఒకేసారి వేలాదిమంది కొత్తసభ్యుల్ని లయనిజంలోకి ప్రవేశపెట్టే గొప్ప సన్నివేశం ఇది.

- దీన్ని జిల్లా స్థాయిలోగాని, కొన్ని రీజియన్‌లు కలిపి ప్రాంతీయ స్థాయిలోగానీ నిర్వహిస్తే కొత్తగాచేరే సభ్యులకు ఉత్సాహవంతంగా వుంటుంది.
- ఎక్కువ మంది కొత్త సభ్యులతో ప్రమాణ స్వీకారం చేయించిన క్లబ్‌లను గుర్తించడం. ప్రోత్సాహకాలు అందించడం చెయ్యగలిగితే ఈ కార్యక్రమం మరింత ఉత్సాహంగా సాగుతోంది.
- ఈ సందర్భంగా పత్రికలద్వారా లయనిజం సేవా వ్యాప్తిని ప్రచారంలోకి తీసుకువచ్చే అవకాశాన్ని వినియోగించుకోవచ్చు.
- ఇలాంటి వైభవోపేత కార్యక్రమాలు ఆకర్షణీయంగా జరిగినప్పుడు సభ్యుల్లో అసంతృప్తి భయాలు తొలగిపోయి, లయనిజాన్ని వదిలి వెళ్ళిపోవాలనే నెగెటివ్ ఆలోచనలు రాకుండా వుంటాయి.
- కొత్త సభ్యులు, పాతసభ్యులూ ఒకచోట చేరి జరుపుకునే సామూహిక ఉత్సాహం ఈ కార్యక్రమం.



# LIONS CLUB INTERNATIONAL

## Lions on the March - Membership

## Years Ending June 30 : 1917-2001



**క్లబ్ బ్రాంచ్, "బ్రాంచ్ క్లబ్" పదాలల్లో ఏది సరైన పదం?**

క్లబ్ బ్రాంచ్ సరి అయిన పదం

**వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్, డిస్ట్రిక్ట్ వైస్‌గవర్నర్ పదాలలో ఏది సరైన పదం?**

వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్

**పేరెంట్ క్లబ్, హోమ్‌క్లబ్ రెండూ ఒకటేనా?**

క్లబ్‌ను స్పాన్సర్ చేసినవారు పేరెంట్‌క్లబ్, అది పితృసంస్థ. తను సభ్యుడుగా వున్నది హోమ్‌క్లబ్. ఇది మాతృ సంస్థ.

**లయనిజంలో పాస్ట్ గవర్నర్, ఎక్స్-గవర్నర్, మాజీ గవర్నర్ పదాలలో ఏది సరైన పదం?**

పాస్ట్ గవర్నర్, పదవీ విరమణ చేసిన ఇంటర్నేషనల్ ఆఫీసర్లనూ, క్లబ్ ఆఫీసర్లనూ 'మాజీ' అని గానీ 'ఎక్స్' అనిగాని సంబోధించకూడదు. మాజీలైన మంత్రులకు ఎమ్మెల్యేలకూ, ఎంపీలకూ ఎలాంటి ప్రోటోకాల్ వుండదు.

కానీ, పదవీ విరమణచేసిన లయన్స్ ఆఫీసర్లకు ప్రోటోకాల్ వుంటుంది. ఒక పాస్ట్ గవర్నర్‌గా, పాస్ట్ ప్రెసిడెంట్‌గా - అలాగే, ఇతర పదవులు చేసిన వారికి అదనపు బాధ్యతలూ వుంటాయి. ఈ కారణంచేత లయనిజంలో వీరెవ్వరూ ఎప్పటికీ "మాజీలు" కారు.

పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్, (PDG), పాస్ట్ మల్టిపుల్ కౌన్సిల్ ఛైర్మన్ (PMCC), పాస్ట్ ఇంటర్నేషనల్ డైరెక్టర్, (PID), పాస్ట్ ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ (PIP) - ఈవిధంగా వ్యవహరించాలి.

**రీజియన్ మీట్, రీజియనల్ మీటింగ్, రీజియనల్ కాన్ఫరెన్స్ - వీటిలో ఏది రాజ్యాంగ బద్ధమైన వాడుక ?**

లయన్స్ అంతర్జాతీయ రాజ్యాంగం ఉపనియమావళి ప్రకారం "రీజియనల్ మీటింగ్" అని మాత్రమే వుంది. కాబట్టి ఆ విధంగా ఉపయోగించడమే పద్ధతి. రీజియన్ మీట్ అని కుదించి వాడ్తుంటారు.

**'కీ' అవార్డు అంటే ఏమిటి? అది ఎలా వస్తుంది?**

కొత్త సభ్యుల్ని చేర్పించినవారికి కీ అవార్డు ఇస్తారు. పూర్వం అక్టోబర్, మార్చి నెలల్లో చేర్పించిన వారికి మాత్రమే ఈ 'కీ' అవార్డులిచ్చేవారు. అక్టోబర్ గ్రోత్, మార్చి గ్రోత్ అని పేర్లుండేవి. ఇప్పుడు ఏడాది మొత్తానికీ వర్తింపచేశారు (Year Round Growth Programme) మొదటి ఇద్దరు సభ్యులకు ఒక కీ అవార్డు ఇస్తారు. 5 (ఐదు) మంది సభ్యులను చేర్పించిన తర్వాత అక్కణ్ణించి 5,10,15,20.... ఇలా "కీ" అవార్డులు లభిస్తాయి. చేర్పించిన సభ్యులు 1 సంవత్సరం 1 నెల కాలపరిమితి దాటేవరకు సభ్యులుగా కొనసాగితేనే ఈ "కీ" అవార్డు లభిస్తుంది.

**ఇంటర్నేషనల్ అందించే అవార్డుల వివరాలు:**

- కొత్త సభ్యులను చేర్పిస్తే అందించే ప్రత్యేక గుర్తింపులు ఏమిటి?

మొదటి కొత్తసభ్యుణ్ణి చేర్పించి నందుకు President's Certificate, అలాగే రెండో కొత్త సభ్యుణ్ణి చేర్పించినందుకు - Silver Certificates ముగ్గురు సభ్యులను స్పాన్సర్‌చేస్తే President's Membership excellence Certificate అందుతుంది. ముగ్గురు అంతకన్నా ఎక్కువ మందిని చేర్పించిన వారికి మెంబర్‌షిప్ ఎక్సెలెన్స్ పిన్‌కూడా ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ నుంచి అందుకోవచ్చు.

41 మంది సభ్యులున్న క్లబ్‌లో 8మంది కొత్త సభ్యులను చేర్పించినా, 22 మంది సభ్యులున్న క్లబ్‌లో 5 మంది కొత్తసభ్యులను చేర్పించినా, 21 మందికన్నా తక్కువ సభ్యులున్న క్లబ్‌లో కనీసం 3 మంది కొత్తవారిని

చేర్పించినా క్లబ్ బ్యానర్‌కు తగిలించే "బ్యానర్‌ప్యాచ్" (Banner Patch) బహూకరిస్తారు.

పైన చెప్పిన కేటగిరీలలో ఒక్కో ఏరియాలో అందరికన్నా ఎక్కువ మంది సభ్యులను చేర్పించిన క్లబ్‌కు 232 డాలర్ల (పదివేల రూపాయిలకు మించి ఖరీదైనది) విలువైన ఫ్లాగ్‌సెట్ (Intenational flag Set) బహూకరిస్తారు.

క్లబ్ మెంబర్‌షిప్ కమిటీ చైర్మన్ తన పదవీకాలంలో తన క్లబ్‌లోగాని, ఇతర క్లబ్‌లలోగానీ కనీసం (3) ముగ్గురు సభ్యులకు కొత్తగా చేర్పించగలిగి, ఆ క్లబ్ ఒక సభ్యుణ్ణి అదనంగా చూపించగలిగితే (Net gain), ఆ మెంబర్‌షిప్ కమిటీ చైర్మన్‌కు ఒక లేపెల్‌పిన్ లభిస్తుంది. ఈ పిన్‌ని క్లబ్‌మెంబర్ షిప్ డైరెక్టర్ అవార్డ్ అంటారు.

- ఎంబాసిడర్ ఆఫ్ గుడ్‌విల్ అవార్డ్స్ ఏడాదికి ఎంతమందికిస్తారు?

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్‌గారి నిర్ణయానుసారం ప్రపంచ వ్యాప్తంగా మహోన్నత సేవలందించిన సీనియర్ లయన్స్ సభ్యులు 35 మంది వరకూ ఒక సంవత్సరంలో ఈ అవార్డును పొందే అవకాశం వుంది.

జిల్లా 324C4 నుంచి లయన్ కొత్తపల్లిరామారావు PDG గారికి ఈ అవార్డు 2000 - జూన్‌లో లభించింది.

- న్యూహారిజాన్స్ అవార్డ్

అద్భుతమైన సేవలకు గుర్తింపుగా ఇచ్చే అవార్డు ఇది. లయన్స్ యూత్ ఔట్‌రీచ్ కార్యక్రమాలలో ప్రతిభావంతమైన పాత్ర పోషించిన వారికి - లయన్స్ సభ్యులకు, యువతకు కూడా ఈ అవార్డులు లభిస్తాయి. ఉదయిస్తున్న సూర్యుడి గుర్తును ముద్రించిన సర్టిఫికేట్‌ను బహూకరిస్తారు.

ఇంటర్నేషనల్ జరిపిన కార్యక్రమాల వివరాలు జతపరుస్తూ యూత్ ప్రోగ్రామ్స్ డిపార్ట్ మెంట్‌కు అప్లికేషన్ పంపవలసి వుంటుంది. దీనికోసం ప్రత్యేకమైన అప్లికేషన్ ఫారం అంటూ ఏదీలేదు. ముగ్గురువరకూ ఈ అవార్డుని ఇచ్చే అవకాశం వుంది.

సర్టిఫికేట్ ఆఫ్ మెరిట్, లయన్స్ క్రెస్ట్, బ్యానర్ ప్యాచ్, డిస్ట్రిక్ట్ లయన్స్ క్రెస్ట్ ఎఛీవ్‌మెంట్ అవార్డు, యంగ్‌లీడర్స్ ఇన్ సర్వీస్ అవార్డు, యంగ్ అంబాసిడర్స్ ఆఫ్ ది 21st సెంచరీ అవార్డు - ఇలా అనేక అవార్డులు యువతరానికి సంబంధించిన కార్యక్రమాలలో ప్రోత్సాహకాలుగా వున్నాయి.

మనం వాటిగురించి పెద్దగా ఆలోచించడం లేదు. ఆ కార్యక్రమాలు చేపట్టడం మొదలు పెడితే, ఆయా అవార్డులకు కదలిక వస్తుంది.

- ప్రెసిడెన్షియల్ అవార్డ్

425 మంది దీక్షాదక్షులైన లయన్స్ సభ్యులకు ఇంటర్నేషనల్ ప్రెసిడెన్షియల్ అవార్డ్ బహూకరిస్తారు. 2002-03 సంవత్సరంలో 575 మందికి బహూకరించారు.

- ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ సర్టిఫికేట్ ఆఫ్ అప్రిసియేషన్.

ఈ సర్టిఫికేట్‌లు ఎంత మందికైనా ఒహూకరించవచ్చు.

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ గారి నిర్ణయానుసారం ప్రముఖమైన సేవలు అందించిన లయన్స్‌కు వీటిని బహూకరిస్తారు.

**దేశాధినేతలకు లయనిజం అవార్డులు**

వివిధ అధికార హోదాలలో పనిచేసే దేశాధినేతలకు ప్రభుత్వాధినేతలకు లయనిజంద్వారా ప్రతి సంవత్సరం కొన్ని అవార్డులు అందిస్తుంటారు.

• హెడ్ ఆఫ్ ది స్టేట్ మెడల్ :

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ గారి నిర్ణయానుసారం సార్వభౌమాధికారం కలిగిన ప్రభుత్వాధినేతకు ఈ అవార్డునిస్తారు.

ఇంటర్నేషనల్‌కు ప్రెసిడెంట్ అధికార పర్యటనల సమయంలో ఆయాదేశాలను సందర్శించినప్పుడు సాధారణంగా ఈ అవార్డులు అందజేస్తుంటారు. ప్రత్యేకంగా భూగోళాన్ని చిత్రించిన ఒక మెడల్, ఒక సర్టిఫికేట్‌లు ఈ అవార్డులో వుంటాయి. ఒక్కోసారి ఇంటర్నేషనల్ వైస్ ప్రెసిడెంట్స్ ద్వారా కూడా దీన్ని బహూకరింప చేయవచ్చు.

• మెడల్ ఆఫ్ డిస్టిన్‌క్షన్

సార్వభౌమాధికారం లేని ప్రభుత్వాధినేతలు అంటే, భారతదేశపు ప్రధాన మంత్రి వంటి వారికి అందజేసే బహుమతి. లయన్స్ ఎంబ్లమ్‌కింద AMICITIA అనే లాటిన్ అక్షరాలు రాసి వుంటాయి. ఈ మెడల్‌మీద.

స్థానిక సంస్థల (మున్సిపల్ కార్పోరేషన్ వంటివి) అధిపతులకు - మేయర్ మున్సిపల్ చైర్మన్ వంటి వారికి అందజేసే అవార్డులో ఒక నక్షత్రం, దానికింద MERITUM అనే లాటిన్ అక్షరాలు రాసి వుంటాయి.

**ORDER OF THE LION :**

లయన్స్‌కాని మానతావాదులు విజ్ఞానవేత్తలు, వేదాంతులు ఇలాంటి ప్రముఖులకు ఈ అవార్డు లభిస్తుంది. ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్‌గారి తుది నిర్ణయంతో దీన్ని ప్రకటిస్తారు.

**ఇంటర్నేషనల్ లీడర్‌షిప్ అవార్డ్‌కు అర్హతలేమిటి?**

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ గారి నిర్ణయంలో అద్భుతమైన నాయకత్వ పటిమ కనబరిచిన వ్యక్తులకు దీన్ని బహూకరిస్తారు.

730 మందికి వీటిని బహూకరిస్తారు అయితే 2002 - 2003 సంవత్సరంలో మరో 250 మందికి అదనంగా బహూకరించారు.

**డయాబెటీస్ కార్యక్రమాలకు కొత్తగా ప్రకటించిన రెండు అవార్డులు ఏమిటి?**

• **DIABETES AWARENESS INCENTIVE AWARD :**

ఇది షుగర్‌వ్యాధి అవగాహనా కార్యక్రమాలకిచ్చే ప్రోత్సాహక బహుమతి. దీన్ని అద్భుతంగా సాధించిన డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్‌కు డిస్ట్రిక్ట్ గవర్నర్‌గారు ఈ ఇంటర్నేషనల్ అవార్డును బహూకరిస్తారు.

• **NEW HOLIZONS AWARD IN DIABETES EDUCATION :**

షుగర్ వ్యాధి పట్ల అవగాహననీ, షుగర్ వ్యాధి పరిజ్ఞానాన్ని ఎక్కువగా పెంపొందింప చేసిన క్లబ్‌కు డిస్ట్రిక్ట్ గవర్నర్ గారు ఈ ఇంటర్నేషనల్ అవార్డును బహూ కరిస్తారు.

**సాంస్కృతిక కార్యక్రమాలకు ఇంటర్నేషనల్ గుర్తింపు ఉంది తెలుసా?**

లయనిజం అంటే కేవలం సేవా కార్యక్రమాలు మాత్రమేనని, సాంస్కృతిక కార్యక్రమాలు మన ఆశయం కాదని చాలా మంది అంటుంటారు. ఇది వాస్తవం కాదు.

సామాజిక సాంస్కృతిక వారసత్వం వలనే ఈ ఆధునిక మానవుడు ఏర్పడ్డాడు. లయనిజం ఆదర్శాలలో 3వ అంశం సామాజిక, సాంస్కృతిక, నైతిక పరమైన సంక్షేమం కోసం కృషిచేస్తాం - అన్న ఆలోచన ప్రకారం లయనిజం సాంస్కృతిక రంగంలో సేవల్ని చక్కగా గుర్తిస్తోంది. ఎక్కువ కార్యక్రమాలను చేయవలసిందిగా ప్రోత్సహిస్తోంది కూడా! సాంస్కృతిక (cultural) కార్యక్రమాలతో పాటు మానసోల్లాస కార్యక్రమాలను కూడా (Recreational) ప్రోత్సహించమని లయనిజం సూచిస్తోంది.

షుగర్‌వ్యాధి కార్యక్రమాలలో ఈ రిక్రియేషన్ కార్యక్రమాలను కూడా ప్రవేశపెట్టడం జరిగింది.

ఈ నేపథ్యంలో నూతనంగా Lions Clubs Community and Cultural Activity Awardను గవర్నర్‌గారి ద్వారా క్లబ్‌కు బహూకరించేందుకు వ్యవస్థాపించారు.

- సాంస్కృతిక రంగానికి సంబంధించిన పరిజ్ఞానం విధానాలు, విలువలు, మెళకువలు, అవగాహనలకు సంబంధించిన ప్రజా కార్యక్రమాలను నిర్వహించడం.
- 'Quality of LIfe' ని సాధించే కార్యక్రమాలకు ప్రాధాన్యత నివ్వడం
- ఈ కార్యక్రమాల ద్వారా పౌర సంబంధాలను పెంపొందింపచేయడం -

ఇవన్నీ ఈ అవార్డుకు క్లబ్‌ను ఎంపిక చేయడానికి పరిగణించే అంశాలు.

**లయన్స్ అంతర్జాతీయ హ్యూమాని టేరియన్ అవార్డు ఎవరికిస్తారు ?**

a) ఇది LCIF కు సంబంధించిన అవార్డు

b) వ్యక్తిగతంగా గాని, ఒక గ్రూపుగా గాని వ్యక్తులు చేసిన సేవలకు గుర్తింపుగా ఇస్తారు.

c) లయన్స్, లయన్స్ కాని వారి నుంచి కూడా ఈ అవార్డుకు పేర్లు సూచించమని కోరుతూ ముందుగానే ప్రకటనలు చేస్తారు. డిసెంబర్ 31 నాటికి ప్రతిపాదనలు అందవలసి వుంటుంది.

d) తమని నామినేట్ చెయ్యమని ఎవ్వరూ కోరరు. ఇతరులు ఆ వ్యక్తి అర్హతల్ని LCIF కమిటీ దృష్టికి తీసుకురావలసి వుంటుంది.

e) ఈ అవార్డుతో పెద్దమొత్తంలో డబ్బుని కూడా అందచేస్తారు. దానిని ఎలా వినియోగిస్తారో కూడా ముందుగా ఈ ప్రతిపాదనల్లో తెలియజేయవలసి వుంటుంది.

**జేసీస్ సభ్యులు లయనిజంలో చేరితే లాభం ఏమిటి?**

ఒకప్పుడు జేసీస్‌లో సభ్యులుగా వున్న వ్యక్తులు (జూనియర్ ఛాంబర్స్ ఇంటర్నేషనల్) లయనిజంలో సభ్యులుగా చేరిన పక్షంలో, లయనిజంలో సర్వీసు కాలానికి జేసీస్‌లో పనిచేసిన కాలాన్ని కలిపే అవకాశం కల్పించారు.

అందుకోసం, రీ ఇన్‌స్టేటెడ్ లయన్స్ జూనియర్ ఛాంబర్ ఇంటర్నేషనల్ సర్వీస్ క్రెడిట్‌ఫారం వుంటుంది. దాన్ని పూర్తిచేసి పంపితే, జేసీస్‌లో పనిచేసిన కాలాన్ని లయనిజం సర్వీసుతో కలుపుతారు.

1997 అక్టోబర్‌లో ఇంటర్నేషనల్ బోర్డు నిర్ణయానుసారం జేసీస్ సంస్థతో కో ఆపరేటివ్ సర్వీస్ అగ్రిమెంట్ వలన ఈ సర్వీస్ క్రెడిట్ లభిస్తోంది. జేసీస్‌లో సభ్యత్వం పూర్తయిన 2 సంవత్సరాల లోపుగా లయనిజంలో చేరిన వారికే ఈ సదుపాయం వర్తిస్తుంది.

**ట్రాన్స్‌ఫర్ మెంబర్ ఫారాన్ని ఇంటర్నేషనల్‌కు ఎవరు పంపాలి?**

వేరే క్లబ్ నుంచి ఈ క్లబ్‌కు ట్రాన్స్‌ఫర్ అయి ఒక సభ్యుడు వస్తున్నప్పుడు ME - 20 అనే ట్రాన్స్‌ఫర్ మెంబర్‌ఫారాన్ని పూర్వపు క్లబ్ (Former Club) సెక్రటరీ ద్వారా పూర్తిచేయించి తీసుకువస్తారు.

ఏ నెలలో సభ్యుణ్ణి ఆ క్లబ్‌లోంచి డ్రాప్ చేశారో ఆ నెల నుంచి ఆరు నెలల లోపు ఏదో ఒక క్లబ్‌లో ఆ వ్యక్తి చేరాలి.

ఆ వ్యక్తి తనంత తానుగా అప్లై చేసుకుంటే చేర్చుకోవడం పద్ధతి కాదు. వేరే క్లబ్ ఆహ్వానం మీద మాత్రమే చేర్చగలుగుతారు.

ఏ కారణం చేతనయినా ఈ ఫారాన్ని ఆ సభ్యుడు అందించ లేకపోతే, అతను

గుడ్‌స్టాండింగ్‌లో వున్న గుర్తుగా మెంబర్‌షిప్ కార్డును అందజేసినా సరిపోతుంది.

**క్లబ్‌కు సరిహద్దు లున్నాయా?**

Club Boundaries

ప్రతి లయన్స్ క్లబ్‌కూ హద్దులున్నాయి. ఒకే సరిహద్దుల్లో అనేక క్లబ్‌లుండవచ్చు. ఈ గ్రంధాన్ని తయారుచేస్తున్న నాటికి విజయవాడలో 50 లయన్స్ క్లబ్స్ వున్నాయి. ఈ క్లబ్‌లన్నీ ఒకే సరిహద్దుల్లో వ్యవస్థాపించ బడ్డాయి.

క్లబ్ ఏ ప్రాంతంలో వుందో, దాని మున్సిపాలిటీ లేక పంచాయితీ హద్దులే ఆ క్లబ్ సరిహద్దులు గా వ్యవహరించబడతాయి.

ఈ హద్దులు దాటి ఇంకో చోట సేవాకార్యక్రమాలు గాని, ఇతర కార్యక్రమాలు గానీ నిర్వహించడానికి ఎవరికీ అభ్యంతరాలు వుండవు.

కానీ ఆ ఇంకోచోటు అనేది మరోక్లబ్ హద్దు అయినప్పుడు వారిని కూడా సంప్రదించడం, కలుపుకోవడం, ఆహ్వానించడం అవసరం. ఈ కనీస మర్యాదని మరిచిపోకండి!

**అక్టోబర్, మే నెలల్ని ఏ మాసాలుగా ప్రకటించారు?**

అక్టోబర్ నెలలో రెండు ప్రధాన కార్యక్రమాలు 1) అక్టోబర్ 9న వరల్డ్ లయన్స్ సర్వీస్ డే (2) అక్టోబర్ 24న ఐరాస దినోత్సవం - ఈ రెండూ వస్తున్నాయి. ఈ కారణంగా, అక్టోబర్ మాసాన్ని అంతర్జాతీయ సంబంధాల మాసంగా ప్రకటించారు.

మే నెలని లయన్స్ కుటుంబ మాసం Lion Family Monthగా ప్రకటించారు.

• ఐరాస దినోత్సవం రోజున ఏం జరుగుతుంది?

అక్టోబర్ 24న లయన్స్ ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్ గారు ఐక్యరాజ్యసమితి సెక్రటరీ జనరల్‌ను కలుసుకొని శుభాకాంక్షలందిస్తారు.

ఇకోసాక్ (Ecosoc) అధికారులతో సమావేశం అయి ఐక్యరాజ్యసమితిలో లయన్స్ రోజును ఘనంగా జరిపే అంశాలు చర్చిస్తారు.

ఇకోసాక్‌లో లయనిజం తరఫున సభ్యుల్ని ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్‌గారు నియమిస్తారు. వారు కూడా ఈ సమావేశంలో పాల్గొంటారు.

క్లబ్ స్థాయిలోనూ, డిస్ట్రిక్ట్ స్థాయిలోనూ మనం ప్రపంచ శాంతి గురించి సెమినార్లు, ఐరాస పాత్ర మీద చర్చా వేదికలు, మాక్ పార్లమెంట్ వంటివి జరుపుకోవడం మన బాధ్యత.

ఐక్యరాజ్యసమితి ప్రతినిధుల్ని గానీ దాని సేవా విభాగాలనీ ప్రతినిధుల్ని గానీ ఆహ్వానించి అక్టోబర్ 24న ఐరాస దినోత్సవం జరపమని లయన్స్ ఇంటర్నేషనల్ ప్రపంచవ్యాప్తంగా లయన్స్ క్లబ్‌లకు సూచిస్తోంది.

**1 Year Director, 1st Year Director - ఈ రెండింటిలో ఏది సరైనది? ఎందుకు?**

లయన్స్ రాజ్యాంగంలో 1st Year Director, 2nd Year Director అనే వ్యవహారమే కన్పిస్తుంది.

బోర్డు డైరెక్టర్‌ల పదవీకాలం రెండు సంవత్సరాలు.

ఈ ఏడాది బోర్డుకు ఎన్నికైన వ్యక్తి రెండేళ్ళపాటు బోర్డులో వుంటారు.

మొదటి సంవత్సరం బోర్డు డైరెక్టర్‌ని 1st Year Director అంటారు. ఈయన మరుసటి సంవత్సరం సెకండ్ ఇయర్ డైరెక్టర్‌గా వ్యవహరించబడ్తారు. వన్ ఇయర్ డైరెక్టర్, టు ఇయర్ డైరెక్టర్ అనడం సరికాదు.

**ఇంటర్నేషనల్ లయన్స్ ట్రేడింగ్ పిన్ క్లబ్ గురించి మీకు తెలుసా?**

వివిధ లయన్స్ లేపెల్ పిన్స్‌ని సేకరించడం ఒకరికొకరు మార్చుకోవడం (ట్రేడింగ్) కోసం

ఈ క్లబ్‌ని ఇంటర్నేషనల్ బోర్డు అనుమతితో ఏర్పాటుచేశారు.

ఇంటర్నేషనల్ కన్వెన్షన్ సమయంలో ఇనుమడించిన ఉత్సాహంతో పిన్‌ట్రేడింగ్ జరుపుతారు. అయితే, ఎవరూ పిన్‌లను అమ్మకూడదు. ఖరీదుకు కొనకూడదు. ఈ క్లబ్‌కు బోర్డు ఆమోదించిన ఓ రాజ్యాంగం, ఎన్నికలు, నియమ నిబంధనలూ వున్నాయి.

- లయన్స్ ఇంటర్నేషనల్ స్టాంప్ క్లబ్ కూడా ఇలాంటిదే!

లయన్స్, లయనెస్‌లు, లియోలు వారి కుటుంబ సభ్యులు ఇంటర్నేషనల్ లయనిజాన్ని పెంపొందింప చేయడానికి కృషి చేయడంలో భాగంగా పోస్టల్ స్టాంప్‌ల సేకరణ చేసే ఉద్దేశంతో ఈ స్టాంప్ క్లబ్‌ని ఏర్పాటుచేశారు.

లయన్స్ క్లబ్ ఇంటర్నెట్ క్లబ్, నాణాల సేకరణకు సంబంధించిన న్యూమిస్మాటిస్ట్స్ (Numismatists) క్లబ్‌లు కూడా ఇదే ఆశయంతో పనిచేస్తున్నాయి.

**లయనిజంలో అధికార భాష గుర్తింపుకు కావలసిన అంశాలు ఏమిటి?**

జూన్, 2003 సంవత్సరం ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లో హిందీ భాషలో అనువాదాల్ని మొదటిసారిగా మైక్రోఫోన్ సిస్టమ్‌ద్వారా భారతీయులు వినే అవకాశం కల్పించారు.

చైనా, ఇంగ్లీషు, ఫిన్నిష్, ఫ్రెంచ్, జర్మన్, ఇటాలియన్, జపాన్, కొరియా, పోర్చుగీసు, స్పానిష్, స్వీడిష్ భాషలు మొత్తం పన్నెండిటిని ఇంటర్నేషనల్ అధికార భాషలుగా గుర్తించింది. 13వది హిందీ. ఆలస్యంగానైనా ఈ గుర్తింపు మన జాతీయ భాషకు రావడం మనకు గర్వకారణం. దీన్ని సాధించడంలో మన నాయకులు నిర్వహించిన పాత్ర గొప్పది!

అధికార భాషా గౌరవానికి కొన్ని ప్రత్యేక అంశాలు వున్నాయి.

a) స్వతంత్ర భాష అయి వుండాలి.

b) ఆ భాషని ఉపయోగించే క్లబ్‌లు కనీసం 725 వుండి వుండాలి.

c) ఆ భాష మాట్లాడే వారు కనీసం 30 వేలమంది లయన్స్ సభ్యులుగా వుండి వుండాలి.

జూన్ 1981 వరకూ ఆమోదించబడిన భాషలను అధికారికంగా అలానే వుంచుతూ కొత్తగా ఆమోదించే వాటి విషయంలో ఈ నియమాలను అనుసరించడం మొదలుపెట్టారు.

ఒక భాషని అధికార భాషగా గుర్తించిన తర్వాత పై నియమాలకు అనుకూలమైన స్థితి లేకపోతే ఆ భాషకు అధికార హోదాని తొలగించే అవకాశం ఇంటర్నేషనల్ బోర్డుకు వుంది.

**గైడింగ్ లయన్ పిన్స్ చాలామందికి రావడం లేదు - ఎందుకని?**

గైడింగ్ లయన్‌గా వ్యవహరిస్తున్న వ్యక్తులకు ప్రత్యేకమైన గైడెన్సు లేకపోవడం వలనే చాలా మంది గైడింగ్ లయన్స్‌కు ఇంటర్నేషనల్ నుంచి తగిన గుర్తింపులు రాకుండా పోతుంటాయి.

ఈ కారణం చేతనే "సర్టిఫైడ్ గైడింగ్ లయన్స్" కార్యక్రమం ప్రారంభించి, రెండు సంవత్సరాల పదవీకాలంగా ప్రకటించి తగిన శిక్షణన్నిచ్చి, శిక్షణ పూర్తి అయిన తర్వాతే నియామకం చేయడం అనే పద్ధతి అవలంభిస్తున్నారు.

సర్టిఫైడ్ గైడింగ్ లయన్స్‌గా ప్రతిజిల్లాకు ఇద్దరిని గవర్నర్ గారు నియమిస్తారు.

వారు కొత్తగా ఏర్పడిన క్లబ్‌లకు గైడింగ్ లయన్ పాత్ర నిర్వహిస్తారు.

కొత్త క్లబ్‌లు ఏర్పరచినప్పుడు ఆయా క్లబ్‌లకు స్పాన్సర్ చేసిన పేరెంట్ క్లబ్‌ల నుంచి గానీ, ఇతరుల లోంచి సీనియర్ సభ్యులు ఇద్దరిని గైడింగ్ లయన్స్‌గా గవర్నర్‌గారు నియమిస్తారు.

వీరి పదవిలో ఒక సంవత్సర కాలమే వుంటారు. గైడింగ్ లయన్, సర్టిఫైడ్ గైడింగ్ లయన్ల మధ్యగల తేడాని గమనించారు గదా! వారి బాధ్యతలు ఇవి...

- కొత్త క్లబ్ కార్యక్రమాలన్నింటికీ హాజరు కావడం
- తగు సలహా సంప్రదింపులతో వారిని ముందుకు నడిపించడం
- పేరెంట్ క్లబ్‌తో కలిసి సంయుక్తంగా అనేక కార్యక్రమాలు నిర్వహింప చేయడం.

A) జిల్లా కార్యక్రమాలన్నింటికీ తప్పనిసరిగా కొత్తక్లబ్ ఆఫీసర్లు హాజరయ్యేలా ప్రోత్సహిస్తారు.

B) ఇవన్నీ బాగానే చేస్తారు అంతా! కానీ, ఆరునెలల కొకసారి క్లబ్ స్థితిగతుల గురించి ఇంటర్నేషనల్‌కు ఒక రిపోర్ట్‌ను పంపవలసి వుంటుంది. ఆ రిపోర్ట్ ఫారం గైడింగ్ లయన్ కిట్‌లో వుంటుంది.

దాన్ని సకాలంలో పూర్తి చేసి పంపక పోవడం వలన గైడింగ్ లయన్ 'పిన్'ని ఇంటర్నేషనల్ నుంచి చాలామంది పొందలేక పోతున్నారు. ఇది అశ్రద్ధ వలన జరుగుతున్న అంశమే! సర్టిఫైడ్ గైడింగ్ లయన్స్ 3 నెలల కొకసారి ఈ రిపోర్ట్ పంపవలసి వుంటుంది.

**తిరిగి చేరిన లయన్స్‌కు పాతసర్వీస్ ఎలా కలుస్తుంది?**

ఒకప్పుడు సభ్యుడిగా వుండి మానుకొని, కొన్నాళ్ళ తర్వాత తిరిగి చేరిన లయన్స్ సభ్యుడికి పాత సర్వీస్ కాలాన్ని పునరుద్ధరించే సదుపాయం 1996 మార్చి నెలలో ఇంటర్నేషనల్ బోర్డు తీర్మానం ద్వారా కల్పించారు. అది జులై 1996 నుంచీ అమలులోకి వచ్చింది.

ఈ తీర్మానం ద్వారా గతంలో "బ్రేక్స్" వున్న వారందరికీ పాత సర్వీసు కాలాన్ని ఆ కాలంలో పూర్తి చేసిన పదవీ యోగ్యతల్ని తిరిగి పొందేందుకు అవకాశం ఏర్పడింది.

అయితే, సభ్యత్వ రుసుము కట్టని కారణంగానూ, క్రమశిక్షణా చర్యల కారణంగానూ అప్పట్లో క్లబ్ సభ్యత్వంలోంచి తొలగించబడిన వారికి మాత్రం ఈ సదుపాయం వర్తించదు.

ఇదంతా దానికదే జరిగే వ్యవహారం కాదు. అందుకు "రీ ఇన్‌స్టేటెడ్ లయన్ సర్వీస్ క్రెడిట్ ఫారం" వుంటుంది. ఈ ఫారాన్ని పూర్తిచేసి ఇంటర్నేషనల్‌కు పంపాలి.

మనం పంపిన ఈ సమాచారం ఇంటర్నేషనల్ ప్రధాన కార్యాలయంలో వున్న సమాచారంతో సరిపోయినప్పుడు పూర్వపు సర్వీస్ పునరుద్ధరణ చేస్తారు.

ఒకవేళ ఖచ్చితమైన తేదీలు నెలలు చెప్పలేకపోయినప్పటికీ, అంచనా వేసి నెలలు సూచించినా ఇంటర్నేషనల్ కార్యాలయంలో అధికారులు మనకోసం శ్రమపడి పాత రికార్డునంతా పరిశీలిస్తారు.

**ప్రివిలేజ్‌డ్ సభ్యత్వానికీ, ఎఫిలియేట్ సభ్యత్వానికీ తేడా ఏమిటి?**

పైకి ఇవి రెండూ ఒకరకంగానే కన్పిస్తాయి. కాని లోతుగా ఆలోచిస్తే కొన్ని తేడాలున్నాయి.

తన స్వంత వృత్తి వ్యాపారాలలో తీరిక లేకుండా వున్న వ్యక్తులకు క్లబ్ బోర్డు ఆమోదంతో, సమావేశాలకూ, కార్యక్రమాలకు హాజరు కాకుండా మినహాయింపు నిచ్చే సభ్యత్వాలు ఇవి రెండు. ప్రివిలేజ్‌డ్ సభ్యత్వం

తీసుకోవాలంటే ఆ సభ్యుడు 15 సంవత్సరాల సర్వీసు పూర్తి చేయాల్సి వుంటుంది.

ఎఫిలియేటెడ్ సభ్యత్వాన్ని కొత్తగా చేరే సభ్యుడిక్కూడా కేటాయించవచ్చు.

ప్రివిలేజ్డ్ సభ్యుడు క్లబ్ కార్యక్రమాలకు హాజరు కాలేకపోయినా డిస్ట్రిక్ట్, మల్టిపుల్ డిస్ట్రిక్ట్, ఇంటర్నేషనల్ కన్వెన్షన్‌లలోనూ, క్లబ్‌లో జరిగే బిజినెస్ సమావేశాలలోనూ ఓటింగ్‌లో పాల్గొనే అవకాశం వుంటుంది.

కానీ, ఎఫిలియేటెడ్ మెంబర్‌కు క్లబ్ బిజినెస్ మీటింగ్‌లో పాల్గొనే అవకాశం మాత్రమే వుంటుంది.

ఇవి రెండూ ప్రధానమైన తేడాలు.

కానీ, రెండు రకాల సభ్యులూ క్లబ్‌లోగానీ, డిస్ట్రిక్ట్‌లో గాని, ఇంకా ఆ పైన గాని ఎలాంటి పదవులూ పొందేందుకు అర్హులు కారు.

**గోంగ్ & గ్యావెల్ ప్రయోజనాలు ఏమిటి?**

- 'GONG'అనే పదాన్ని 'గోంగ్' అని పలకాలి. గ్యాంగ్ అనకండి. గ్యాంగ్ అనే మాటకు విపరీతార్థాలున్నాయి. గోంగ్ అంటే ధ్వనించేదని!
- గ్యావెల్‌ని ధ్వనింపచేయడానికి ఒక వస్తువు కావాలి. అది కంచుతో చేసింది కావచ్చు. పింగాణితో చేసినదీ కావచ్చు - చెక్కతో చేసినది కూడా కావచ్చు.
- మనం కంచుతో చేసిన గోంగ్‌ని వాడుతున్నాం.

ఇంటర్నేషనల్ క్లబ్ సప్లైస్ వారి అమ్మకాలలో చెక్కతో చేసిన "వుడెన్ బ్లాక్" లు కూడా వున్నాయి.

- గ్యావెల్‌ని అధికార దండంగా వ్యవహరిస్తారు. దీన్ని దేనిమీదైనా తాడించడం అంటే సంకల్పాన్ని చెప్పుకున్నట్టు
- గ్యావెల్‌ని తాడించే అధికారం సభాధ్యక్షుడికి మాత్రమే వుంటుంది.
- సభ ప్రారంభ సూచనగానూ, ముగింపు సూచన గానూ గ్యావెల్‌ని తాడిస్తారు. సభలో గందరగోళం నెలకొన్నప్పుడు 'ఆగండి' అని చెప్పడానికి గ్యావెల్‌ని తాడిస్తారు.
- ఎజెండా ప్రకారం చర్చ జరిగిన తర్వాత సెక్రటరీ గాని, దాన్ని ప్రతిపాదించిన సభ్యుడు గానీ, లేక స్వయంగా సభాధ్యక్షుడు గానీ, ఆ చర్చల సారాంశాన్ని ఒక తీర్మానంగా చదువుతారు. సభ్యులు ఆమోదసూచకంగా కరతాళధ్వని చేస్తారు. అప్పుడు సభాధ్యక్షుడు గ్యావెల్‌ని తాడించడం ద్వారా ఆ తీర్మానం జరిగినట్లు ప్రకటిస్తారు.

గ్యావెల్‌ని తాడించిన తర్వాత సభాధ్యక్షుడి ప్రకటనకు అందరూ కట్టుబడి వుండాలి.

అందుకే, ఇన్‌స్టలేషన్ ఆఫీసర్లుగా వచ్చిన పెద్దలు క్లబ్ అధ్యక్షుడికి గ్యావెల్‌ని బహూకరిస్తూ, దీన్ని చాలా జాగ్రత్తగా ఉపయోగించమని హెచ్చరిస్తారు.

అందరికీ ఆమోదయోగ్యమైన నిర్ణయం సంతృప్తికరంగా జరిగితేనే సభాధ్యక్షుడిగా గ్యావెల్‌ని తాడించాలనే సంగతి గుర్తుంచుకోవాలి.

**సమావేశాలలో ఎమ్సీ పాత్ర ఏమిటి?**

a) సభాధ్యక్షుడి స్థానంలో ఎవరున్నప్పటికీ, భారీ కార్యక్రమాలు జరిగేప్పుడు కార్యక్రమ నిర్వహణ బాధ్యతల్ని అనుభవజ్ఞులైన లయన్స్ సభ్యుల సహకారం అవసరం అవుతుందవచ్చు. ఒక్కోసారి.

b) మాస్టర్ ఆఫ్ సెరిమనీస్ పేరుతో ఈ వ్యాఖ్యాతల్ని మనం వ్యవహరిస్తుంటాం. ఇంటర్నేషనల్ నుంచి వచ్చే సమాచార పత్రాలలో "EMCEE" అని రాస్తుండడం గమనార్హం. మనం కూడా EMCEE అనే వ్యవహరిద్దాం.

c) ఈ ఎమ్‌సీ ఎక్కడ కూర్చొని కార్యక్రమాలు నిర్వహించాలనేది స్థానికంగా వున్న అలవాటు ప్రకారం వుంటుంది. దానికి ఖచ్చితమైన నియమాలంటూ ఏమీ లేవు.

వేదికపైన ఒక పక్కగా కూర్చోవచ్చు. సభలో ఒక పక్కగా కూర్చోవచ్చు. వేదికమీద హెడ్ టేబుల్ దగ్గర చివరి కుర్చీలో కూర్చుని కూడా నడిపించవచ్చు.

d) వేదిక మీద ప్రోటోకాల్ వున్న వ్యక్తి ఎమ్‌సీ అయితే, ఆయనకు కేటాయించబడిన సీట్‌లో కూర్చునే కార్యక్రమాన్ని నిర్వహించవచ్చు కూడా!

ఉదాహరణకు ఒక పాస్ట్ గవర్నర్ కేబినెట్ ఇన్‌స్టలేషన్‌కు ఎమ్‌సీ చేస్తున్నప్పుడు పాస్ట్ గవర్నర్‌గా తన సీట్లో కూర్చొనే కార్యక్రమాన్ని నిర్వహించవచ్చన్నమాట!

- ఎమ్‌సీ గా చేసే వ్యక్తికి లయనిజం పరిజ్ఞానం వుండాలి. ప్రోటోకాల్ వివరాలు క్షుణ్ణంగా తెలిసినవారై వుండాలి. అప్పటికప్పుడు అందంగా సమర్థవంతంగా సమాధానం చెప్పగల నేర్పరి అయివుండాలి. చక్కని గళం, మంచి పదజాలం వుండి అందరినీ ఆకట్టుకునే భాష వుండి వుండాలి.
- సుదీర్ఘ ఉపన్యాసాల ధోరణిలో ఎమ్‌సీ నిర్వహణ సాగకూడదు.

పదాలను తూకం వేసినట్లు మాట్లాడగలిగితే అందరి మెప్పు పొందుతారు.

- ఎమ్‌సీని ఏర్పాటు చేసినందువలన మామూలుగా గంటసేపు జరిగే కార్యక్రమం పదినిమిషాలు ముందే ముగిసేలా వుండాలి. అదీ సమర్థవంతమైన సభా నిర్వహణ అంటే! వారివలన అమూల్యమైన సభాకాలం వృధా కాకూడదు.

### చార్టర్ నైట్ స్పెల్లింగ్ ఏమిటి?

2003-04 సంవత్సరంలో కొత్తక్లబ్‌ల వ్యవస్థాపనకు సంబంధించిన కిట్‌ని కొత్తపద్ధతిలో రూపొందించారు.

అందులో చార్టర్‌నైట్ ఛైర్‌పర్సన్ కోసం ప్రత్యేకంగా కొంత సమాచారం ఇచ్చారు.

అందులో "Charter Night" అనే పదానికి సంబంధించిన వివరణ వుంది.

ఇప్పటిదాకా చాలామంది "NITE" అని రాయడానికి అలవాటుపడి వున్నారు. నిజానికి అది డిక్షనరీ పదం కాదు. ఆ పదానికి వార్షికోత్సవ వేడుకలు అనే అర్థం ఎక్కడా కన్పించదు.

లయన్స్ ఇంటర్నేషనల్ 'NIGHT' అనే వ్యవహరిస్తోంది ఈ పదాన్ని.

"ఈ పదాన్ని వాడడంలో తికమక పడకండి. మీ వార్షికోత్సవం పగలు జరగనీండీ, రాత్రిపూట జరగనీండీ, ఎప్పుడు జరిగినా మీ సభ్యుల్లో ఎక్కువమంది కుదిరే సమయాన్ని ఎంచుకోండి-" అని వివరణ ఇచ్చారు.

నిజానికి NIGHT అనే మాట నైటింగేల్ లాంటిదే! అది పగలైనా పాడుతుంది కూడా! కానీ, దాన్ని NIGHT-IN-GALE అనే పిలుస్తాం మనం.

చార్టర్ నైట్ కూడా ఇలాంటిదే! పగలు జరిపినా అభ్యంతరం లేదు!!

### అన్ని సభ్యత్వ కేటగిరీల వారినీ ఇంకో క్లబ్‌లోకి ట్రాన్స్‌ఫర్ చేయవచ్చా?

ఏడురకాల సభ్యత్వ కేటగిరీలలో కేవలం యాక్టివ్ మరియు జీవిత సభ్యత్వ కేటగిరిలకు చెందిన వ్యక్తులను మాత్రమే ఇంకోక్లబ్‌లోకి ట్రాన్స్‌ఫర్ చేయగల్గుతాం. మిగిలిన ఐదు కేటగిరిలలో సభ్యత్వాలు పొందిన వ్యక్తులు ఆ క్లబ్ బోర్డు నిర్ణయానుసారం ఆయా

సభ్యత్వాలలో ఆమోదించబడినవారు. వారి సభ్యత్వ కేటగిరీలు ఆ క్లబ్‌కు మాత్రమే పరిమితం. వారిని మరొక క్లబ్‌లోకి ట్రాన్స్‌ఫర్ చేసే సమస్య తలెత్తదు.

**కొత్త సభ్యుడికి నేరుగా ఏ సభ్యత్వాన్ని కేటాయించవచ్చు?**

యాక్టివ్ సభ్యత్వాన్నిగానీ, గౌరవ సభ్యత్వాన్నిగానీ, తప్పనిపరిస్థితుల్లో ఎఫిలియేటెడ్ సభ్యత్వాన్నిగానీ నూతనంగా సభ్యుడిగా చేర్తున్న వ్యక్తులకు కేటాయించవచ్చు. చార్టర్ మెంబర్‌గా చేరేవారి విషయంలో కూడా ఇదే అంశాలు వర్తిస్తాయి.

**ఎలాంటి రుసుములూ చెల్లించకుండా క్లబ్‌లో జీవిత సభ్యుడిగా మారే అవకాశం ఎవరికుంది?**

ఇమీడియేట్ పాస్ట్ ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్‌గారికిఈ అవకాశంవుంది.

**సభ్యత్వాన్ని తొలగించేందుకు మార్గదర్శక సూత్రాలు ఏమిటి?**

**A.** సాధారణ సభ్యుడిని రుసుములు చెల్లించకపోవడం వంటి కారణాల వలన క్లబ్ సభ్యత్వంలోంచి తొలగించడానికి బోర్డు సభ్యుల మెజారిటీ నిర్ణయం సరిపోతుంది.

**B.** క్లబ్ ఆఫీసర్లుగా వున్నవారిని తొలగించడానికి క్లబ్ సభ్యులు - మొత్తంలో 2/3 వంతులమంది హాజరై ఆ మేరకు ఓటువేస్తేనే ఆ తొలగింపు చట్టబద్ధమౌతుంది.

**ఐ.రా.స. లో లయన్స్ దినోత్సవం రోజున ఏం జరుగుతుంది?**

దాదాపు 20 సంవత్సరాలుగా ఐక్యరాజ్యసమితి ప్రధానకార్యాలయంలో న్యూయార్క్ నగరంలో లయన్స్ సభ్యులతో ఒకరోజు "(ANNUAL LIONS DAY WITH U.N.) కార్యక్రమాన్ని మనం వైభవోపేతంగా జరుపుతున్నాం.

2004 మార్చి 12న ఈ కార్యక్రమం ఈ సంవత్సరంలో జరగబోతోంది.

రిజిస్ట్రేషన్ ముందుగా చెల్లించిన మొదటి 600 మందికి మాత్రమే ఈ కార్యక్రమంలో పాల్గొనే అవకాశం లభిస్తుంది.

లయన్లు లయనెస్‌లు, లియోలుకూడా ఇందులో పాల్గొంటారు. గెస్ట్‌లను కూడా తీసుకువెళ్ళవచ్చు.

కార్యక్రమంలో ముఖ్యాంశాలు :

ఐక్యరాజ్య సమితి పక్షాన లయనిజం పక్షాన వార్తలు ప్రసంగాలు

సెక్రటరీ జెనరల్, ఐక్యరాజ్యసమితి ప్రసంగం

పీస్ పోస్టర్ కంటెస్ట్ గ్రాండ్ ప్రైజ్ బహూకరణ

ఐక్యరాజ్యసమితి రాయబారులతో ప్రత్యేక విందుభోజనం, ఐక్యరాజ్యసమితి కార్యాలయ సందర్శన వంటివి వుంటాయి.

**లయనిజం ఆర్థికసాయాన్ని, మానవ సాయాన్ని అందిస్తున్న ఐక్యరాజ్య సమితి విభాగాలు ఏవి?**

UNICEF (యునైటెడ్ నేషన్స్ చిల్డ్రన్స్ ఎమర్జెన్సీ ఫండ్), WHO (వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్), UNESCO (యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషనల్, సైంటిఫిక్ అండ్ కల్చరల్ ఆర్గనైజేషన్).

**లయనెస్ లయన్స్‌క్లబ్ అంటే ఏమిటి?**

లయనెస్ క్లబ్ సభ్యులుగా వున్న మహిళలు అందరూ కలసి లయన్స్‌గా మారదలిచినప్పుడు, అవసరం అనుకొంటే "లయనెస్ లయన్స్‌క్లబ్" గా దాన్ని వ్యవహరించడానికి అనుమతి వుంది. "లయనెస్ లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ" ఇలా వ్యవహరించవచ్చున్నమాట. లయనెస్ లయన్స్ పిన్‌ని వారికోసం ప్రత్యేకంగా క్లబ్ సప్లైస్ డివిజన్‌లో దొరుకుతుంది కూడా!

**లయన్స్ కన్వెన్షన్లన్నింటికీ కోరమ్ ఒకటేనా?**

డిస్ట్రిక్ట్ కన్వెన్షన్ జరపడానికి కోరం 50మందిగానూ, మల్టిపుల్ కన్వెన్షన్‌కు 100 మందికోరమ్‌గా మన మల్టిపుల్ డిస్ట్రిక్ట్ 324 నిర్ణయించింది. డిస్ట్రిక్ట్ కేబినెట్ సమావేశాలకు మెజారిటీ ఓటింగ్ సభ్యులహాజరు కోరమ్‌గా నిర్ణయించడమైనది.

'ఓటింగ్ సభ్యులు' అంటే, డిస్ట్రిక్ట్‌గవర్నర్, ఇమీడియేట్ పాస్ట్ గవర్నర్, వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్

కేబినెట్ సెక్రటరీ, కేబినెట్ట్రెజరర్, రీజియన్ చైర్ పర్సన్‌లు, జోన్ చైర్‌పర్సన్‌లు, ఇంటర్నేషనల్ సూచించిన ప్రత్యేక కార్యక్రమాల కమిటీలకు డిస్ట్రిక్ట్‌చైర్ పర్సన్‌లు - వీళ్ళు మాత్రమే కేబినెట్‌లో ఓటింగ్ మెంబర్స్‌గా వ్యవహరించబడతారు వీరితో మెజారిటీ సభ్యుల హాజరు 'కోరమ్' అవుతుంది.

**LCIF ప్రకటిస్తున్న అవార్డులు ఏవి?**

1. లయన్స్ క్లబ్ కూడా వెయ్యిడాలర్లు చెల్లించి LCIF ద్వారా క్లబ్‌ప్లేక్ (CLUB PLAQUE) ని పొందే అవకాశం వుంది.

2. క్లబ్‌లో ఒక సభ్యుడు ఎంజెయంఫ్ అయినప్పుడు క్లబ్ బ్యానర్ ప్యాచ్‌ని, ఒక షేవ్రాన్‌ని కూడా ఆ క్లబ్‌కు అందిస్తారు. ప్రతి సంవత్సరం కనీసం ఒకసభ్యుడు మెల్విన్‌జోన్స్ ఫెలో అవుతున్నప్పుడు మరుసటి సంవత్సరం క్లబ్‌కు షేవ్రాన్ లభిస్తుంది.

3. క్లబ్‌లో సభ్యులందరూ నూరుశాతం 20 డాలర్లచొప్పున విరాళం చెల్లించి కంట్రిబ్యూటింగ్ సభ్యులుగా LCIF లో నమోదు అయితే, ఆ క్లబ్‌కు బ్యానర్‌ప్యాచ్, షేవ్రాన్‌లు లభిస్తాయి.

4. 10 డాలర్లచొప్పున క్లబ్‌లోనూరుశాతం సభ్యులు LCIFకు విరాళాలు అందిస్తే ఆక్లబ్‌కు LCIF ఛైర్మన్ ద్వారా సర్టిఫికేట్ వస్తుంది.

5. క్లబ్‌లో సభ్యులందరూ ఎం.జె.యఫ్‌లు గా మారితే ఆ క్లబ్‌కు 3'×5' క్లబ్ బ్యానర్‌ని బహూకరిస్తారు. ఈ విధంగా 100% సభ్యులున్న క్లబ్‌గా ఆస్టేటస్ ప్రతిసంవత్సరం నిలుపుకొంటూ వుంటే, ప్రతిఏడాదీ ఒక షేవ్రాన్‌ని ఆక్లబ్‌కి బహూకరిస్తారు. అంటే, కొత్త సభ్యుణ్ణి రిపోర్ట్ చేయడం అంటే, ఆ కొత్త సభ్యుడుకూడా ఎం.జె.యఫ్ అయితీరాల్సి వుంటుంది.

6. అలాగే, 100 శాతం సభ్యులు ప్రోగ్రెస్ మెల్విన జోన్స్ ఫెలోలుగామారితే, డైమండ్ బ్యానర్ ప్యాచని బహూకరిస్తారు. ప్రోగ్రెసివ్ ఎంజెఎఫ్‌లు అవుతున్న ప్రతిసారీ ఒక డైమండ్ బ్యానర్ ప్యాచ్ అందజేస్తారు.

7. క్లబ్ ప్రెసిడెంట్‌గారు తన పదవీకాలంలో కనీసం 20 మంది MJF లకు తన క్లబ్‌ద్వారా తీసుకురాగలిగతే ఆ అధ్యక్షుడిని LCIF ప్రత్యేక సర్టిఫికేట్ అందజేస్తారు.

8. డిస్ట్రిక్ట్‌లో ప్రతి లయన్స్‌క్లబ్ ఏదొక రూపేణ LCIF కు విరాళాలు అందజేసినట్లయితే, ఆ జిల్లా గవర్నర్ గారికీ, ఆ జిల్లాలోని LCIF డిస్ట్రిక్ట్ చైర్‌పర్సన్‌కూ 100% సపోర్ట్ సర్టిఫికేట్ ఆఫ్ అప్రిసియేషన్‌కు అందిస్తారు.

9. జిల్లాలో ప్రతి లయన్స్ సభ్యుడు 20 డాలర్లు విరాళం LCIFకు అందించినట్లయితే, EXCFL 100 సర్టిఫికేట్‌ను జిల్లాగవర్నర్‌గారికి అందజేస్తారు.

**గవర్నర్ అభ్యర్థి ఎన్నికైనట్లు ఎలెక్షన్ ఆఫీసర్ ప్రకటిస్తే సరిపోతుంది?**

డిస్ట్రిక్ట్ కన్‌వెన్షన్‌లో మెజారిటీ డెలిగేట్స్ 'Yes' అని ఓటుచేసినప్పుడు ఆ అభ్యర్థి గవర్నర్‌గా ఎన్నికైనట్లు భావించబడతారు. కానీ, ఈ ఎన్నికని ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ ధృవీకరించవలసి వుంటుంది. ఈ ధృవీకరణ తర్వాతమాత్రమే అధికారికంగా వీరుగవర్నర్‌గా ఎన్నికైనట్లు ప్రకటించబడతారు.

**కేబినెట్ సెక్రటరీ, కేబినెట్ ట్రెజరర్ పదవులు చేయడానికి కావలసిన కనీసపు అర్హతలు ఏమిటి?**

ప్రత్యేకమైన అర్హతలు అంటూ ఏమీలేవు. గుడ్ స్టాండింగ్‌లో వున్న క్లబ్‌లో, గుడ్ స్టాండింగ్‌లో వున్న సభ్యులు అయివుంటే సరిపోతుంది.

**మధ్యంతర డిస్ట్రిక్ట్ కాన్ఫరెన్స్** (Medterm District Conference) **లో చేపట్టకూడని అంశం ఏమిటి?**

"ఎన్నికలు"

**అధికారిక లయన్స్ జెండా ఏ విధంగా వుంటుంది?**

లయన్స్ జెండా ఏ విధంగా వుండాలో లయన్స్ ఇంటర్నేషనల్ స్పష్టంగా నిర్దేశించింది.

లయన్స్ జెండా తప్పనిసరిగా తెల్లటి గుడ్డకు బంగారపు అంచు పెట్టి, దాని మధ్యలో లయన్స్ ఎంబ్లమ్‌ని ముద్రించి, లయన్స్ ఇంటర్నేషనల్ అని అక్షరాలు చక్కగా కనిపించేలా రాసి వుండాలి. బంగారపు రంగు అంచు కుట్టడం కుదరకపోతే, బంగారపు రంగులో మందపాటి 'బోర్డర్'ని ముద్రించి వాడుకోవచ్చు.

ఇందులో మొదటిదాన్ని హాలులోపల జరిగే సభల్లో (Indoor Meetings) వాడతారు. రెండవదాన్ని బహిరంగ ప్రదేశంలో జెండా కర్రమీద ఎగరేయడానికి వాడతారు.

అధికారికంగా లయన్స్ ఇంటర్నేషనల్ తయారుచేసిన లయన్స్ జెండాల్ని క్లబ్ సప్లైస్ ద్వారా మనం తెప్పించుకోవచ్చు.

**కాన్‌స్టిట్యూషన్‌కూ, బైలాస్‌కూ గల ప్రధాన తేడా ఏమిటి?**

ఒక సంస్థ నిర్మాణ నిర్వహణలకు సంబంధించిన మౌలిక విషయాలు కాన్‌స్టిట్యూషన్‌లో పొందుపరచడం జరుగుతుంది. మార్పులకు లోను కాకుండా వుండే రీతిని ఇందులో విషయాలు చేర్చబడి వుంటాయి. వీటిని మార్పు చేయాలంటే, లయన్స్ కన్వెన్షన్‌లో హాజరైన డెలిగేట్లలో 2/3 వంతుకు మించిన సభ్యుల ఆమోదం కావలసి వుంటుంది. ఇందుకు నిర్ధిష్టమైన కాలపరిమితికి ముందే చేపట్టనున్న మార్పులను, పూర్వపు అంశాన్ని స్పష్టంగా పేర్కొంటూ సభ్యులందరికీ విధిగా నోటీసు పంపవలసి వుంటుంది.

బైలాస్‌లో చేర్చబడిన అంశాలు మెజారిటీ ఓటుతో సవరణ చేయడానికి వీలుగా వుంటాయి. అయితే, వీటిని ముందుగా నోటీస్‌లో స్పష్టీకరించడం అవసరం.

**డిస్ట్రిక్ట్ గవర్నర్ పదవి ఖాళీ అయితే ఏ విధంగా పూరిస్తారు?**

ఇమీడియేట్ పాస్ట్ డిస్ట్రిక్ట్ గవర్నర్, వైస్ డిస్ట్రిక్ గవర్నర్, రీజియన్ ఛైర్‌పర్సన్‌లూ, జోన్ ఛైర్‌పర్సన్‌లూ, కేబినెట్ సెక్రటరీ, కేబినెట్ ట్రెజరర్, ఆనరరీ కమిటీ (పాస్ట్ గవర్నర్స్) - వీరంతా కలిసి ఇమీడియేట్ పాస్ట్ గవర్నర్ గారు నిర్ణయించిన తేదీ సమయం స్థలంలో సమావేశమై అన్ని అర్హతలూ వున్న లయన్ సభ్యులను ఎంపిక చేసి ఇంటర్నేషనల్ బోర్డు అనుమతికి పంపుతారు.

ఇమీడియేట్ పాస్ట్ గవర్నర్ గారు అందుబాటులో లేకపోతే, అందుబాటులో వున్న తక్షణ పూర్వ గవర్నర్ గారు సమావేశానికి అధ్యక్షత వహిస్తారు. సమావేశానికి నోటీసు పంపుతారు. డిస్ట్రిక్ట్‌లో ఇంటర్నేషనల్ ఆఫీసర్లుగా పనిచేసిన వారంతా ఈ సమావేశంలో పాల్గొంటారు. వీరు, వీరి హోమ్ క్లబ్స్ కూడా గుడ్ స్టాండింగ్‌లో వుండాలి.

ఖాళీ అయిన గవర్నర్ పదవిని పూరించేందుకు ఉద్దేశించిన ఈ సమావేశంలో ఒక వ్యక్తి పేరును సూచిస్తూ చేసిన నిర్ణయాన్ని అధ్యక్ష స్థానంలో వున్న ఇమీడియేట్ పాస్ట్ గవర్నర్, లేదా పాస్ట్ గవర్నర్ గారు ఇంటర్నేషనల్ బోర్డుకు 7 రోజులలోగా అందేలా పంపుతారు. ఈ సమావేశాన్ని సక్రమంగా నిర్వహించి నట్లుగా ఆహ్వానాలు, హాజరైన సభ్యుల సంతకాలు వగైరా సాక్ష్యాధారాలతో సమావేశం తీర్మానం కాపీని ఇంటర్నేషనల్ బోర్డుకు సమర్పిస్తారు.

సమావేశానికి ఆహ్వానితులు అందరికీ ఒక్కొక్క ఓటు వుంటుంది. వారికి నచ్చిన అభ్యర్థికి వారు స్వేచ్ఛగా ఓటు వేయవచ్చు.

నామినేషన్ వేయదలచిన అర్హత గలిగిన అభ్యర్థుల నుంచి నామినేషన్లు కోరుతూ వర్తమానం కూడా ఈ నోటీస్‌లో వుంటుంది. వచ్చిన నామినేషన్ల లోంచి మెజారిటీ ఓటింగ్ ప్రక్రియ ద్వారా ఎన్నికైన అభ్యర్థి పేరును ప్రతిపాదిస్తూ ఇంటర్నేషనల్ ఆమోదం కోసం పంపుతారు.

వైస్ డిస్ట్రిక్ట్ గవర్నర్ పదవి ఖాళీ అయినా కూడా ఇదే పద్ధతిలో అభ్యర్థి ఎంపిక చేసి ఖాళీని పూరిస్తారు. అయితే, ఈ అభ్యర్థి పేరును ఇంటర్నేషనల్ బోర్డు ఆమోదం కోసం పంపవలసిన అవసరం వుండదు.

**ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ ఎవరు?**

ఇంటర్నేషనల్ ప్రెసిడెంట్, ఇమీడియేట్ పాస్ట్ ప్రెసిడెంట్, 1వ, 2వ ఇంటర్నేషనల్ వైస్ ప్రెసిడెంట్స్, మరికొంతమంది డైరెక్టర్లు కలిసి ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్లుగా వ్యవహరించబడతారు.

సరిసంఖ్యలో వుండే (Even number years) సంవత్సరాలలో అంటే 2000, 2002, 2004 ఇలాంటి సంవత్సరాలలో 16 మంది ఇంటర్నేషనల్ డైరెక్టర్లు ఎన్నికవుతారు.

- ఇండియా, సౌత్ ఆసియా, ఆఫ్రికా, మిడిల్ ఈస్ట్ దేశాలు = 1
- ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, పపువా, న్యూగెనియా, ఇండోనేషియా,సౌత్ పసిఫిక్ ద్వీప సమూహాలు = 1
- యూరోప్ లోని దేశాలు, ఓరియెంట్ & సౌత్ ఈస్ట్ ఆసియా = 3
- సౌత్ అమెరికా, సెంట్రల్ అమెరికా, మెక్సికో, కారిబియన్ ద్వీప సమూహాలు = 2
- అమెరికా సంయుక్త రాష్ట్రాలు మరియు బెర్ముడా, బహామాస్ ద్వీప సమూహాలు = 7

బేసిసంఖ్యలో వుండే (Odd numbers years) 2001, 2003, 2005... ఇలాంటి సంవత్సరాలలో 17 మంది ఇంటర్నేషనల్ డైరెక్టర్లు ఎన్నికవుతారు.

- ఇండియా, సౌత్ ఆసియా, ఆఫ్రికా, మిడిల్ ఈస్ట్ దేశాలు = 2
- కెనడా = 1
- యూరప్ = 3
- ఓరియెంట్ & సౌత్ ఈస్ట్ ఆసియా = 3
- సౌత్ అమెరికా, సెంట్రల్ అమెరికా, మెక్సికో, కరేబియన్ ద్వీప సమూహాలు = 1

అమెరికా సంయుక్త రాష్ట్రాలు మరియు బెర్ముడా, బహామాస్ ద్వీప సమూహాలు = 8

ఈ పట్టికని పరిశీలించి సరి సంవత్సరాలకు, బేసి సంవత్సరాలకు మొత్తం డైరెక్టర్ల సంఖ్య, దేశాలకు కేటాయించిన డైరెక్టర్ల సంఖ్యలో గల తేడాలని గమనించండి.

**ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల విధులు, అధికారాలు ఏమిటి? BOARD POWERS**

లయన్స్ క్లబ్స్ ఇంటర్నేషనల్‌కు గల విస్తృతమైన అధికారాలన్నీ ఇంటర్నేషనల్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల ద్వారా వ్యక్తీకరించబడతాయి. ఈ ఇంటర్నేషనల్ బోర్డుని ఈ మహాసంస్థ కార్యనిర్వాహక వర్గం Executive Body గా పేర్కొనవచ్చు.

ఈ అసోసియేషన్‌కు సంబంధించిన అందరు ఆఫీసర్లు, కమిటీలు ఇతరుల పనితీరు విషయంలో అజమాయిషీ పూర్తిగా ఈ బోర్డుకు వుంటుంది. బోర్డు సభ్యులలో 2/3 వంతుల మంది ఆమోదించిన బడ్జెట్‌కు అమలు చేస్తారు. కన్వెన్షన్లకు సంబంధించిన విషయాలు కూడా బోర్డుకే అధికారాలుంటాయి. అసోసియేషన్‌కు

సంబంధించిన ఏ విధానపరమైన నిర్ణయాన్నైనా ఇంటర్నేషనల్ బోర్డు తీసుకుంటుంది.

బోర్డు అనుమతి అవసరమయిన అనేక అంశాలను ఈ గ్రంథంలో సవివరంగా అందించడం జరిగింది. పరిశీలించండి.

**క్లబ్ రిట్రీట్ (Club Retreat) ఎలా జరపాలి?**

ఈ పదం ఎక్కడ వుపయోగించబడిందో మీకు గుర్తుందా? గత రెండు మూడు సంవత్సరాలుగా విస్తృతంగా వ్యాప్తిలో వున్న పదం ఇది. క్లబ్ ప్రెసిడెంట్ ఎక్స్‌లెన్స్ అవార్డు పొందడానికి కావలసిన అర్హతల్లో క్లబ్ రిట్రీట్ కార్యక్రమం చేసి వుండడం ఒకటి.

ప్రెసిడెంట్ గారు ఈ కార్యక్రమాన్ని చేసినట్లు టిక్ పెట్టి పంపిస్తుంటారు. కాని, ఆ కార్యక్రమాన్ని ఇంటర్నేషనల్ సూచించిన మేరకు జరిపినట్లైతే చాలా ప్రయోజనకరంగా వుంటుంది. మార్చి 2003, "The LION" మేగజైన్‌లో క్లబ్ రిట్రీట్ నిర్వహణ గురించి ఒక వివరణాత్మకమైన వ్యాసం ప్రచురించబడింది. గమనించండి.

క్లబ్ రిట్రీట్ కార్యక్రమాన్ని ప్రతి లయన్స్ క్లబ్ తమ సభ్యులందరినీ ఆహ్వానించి, కనీసం ఒక పూట జరుపుకోవాల్సిన కార్యక్రమం.

ఈ సమావేశానికి ప్రత్యేకమైన ఎజెండా అంటూ ఏదీ వుండదు. హాజరైన సభ్యులందరికీ ముందుగా రిజిస్ట్రేషన్ ఫారాలను అందిస్తారు.

రిజిస్ట్రేషన్ ఫారంలో ప్రతి సభ్యుడూ క్లబ్ గానీ, జోన్ గాని, రీజియన్ గాని, డిస్ట్రిక్ట్ గానీ, ఆపై స్థాయిలలో గాని, జరుగుతున్న అంశాలలో తమకు ఏ మాత్రం నచ్చని ఐదింటిని రాయాలి.

అలాగే, తమకు బాగా నచ్చిన ఐదు అంశాల్ని కూడా రాయాలి. హాజరైన సభ్యులంతా ఇలా రాసిన వాటిలో ఎక్కువ మందికి నచ్చని ఐదు అంశాల్ని ఎక్కుమందికి నచ్చిన ఐదు అంశాల్ని ప్రత్యేకంగా చర్చ జరుపుతారు.

నెగెటివ్ అంశాల మీద, పాజిటివ్ అంశాల మీద విడివిడిగా చర్చించడం మంచిది.

భోజనానికి ముందు సెషన్లో నెగెటివ్ విషయాల్ని, భోజనం తర్వాత పాజిటివ్ విషయాల్ని చర్చకు చేపట్టడం కూడా మంచిది.

ఈ రిట్రీట్‌కు క్లబ్ అధ్యక్షుడిచే నియమించ బడిన ఫెసిలిటేటర్‌గా వ్యవహరిస్తారు.

ఆయన బాగా లయనిజం పరిజ్ఞానం కలిగినవాడై చక్కగా నిర్వహించగలవాడుగా వుంటే కార్యక్రమం రాణిస్తుంది.

క్లబ్ అధ్యక్షులు, క్లబ్ బోర్డు సభ్యులు, క్లబ్ ఆఫీసర్లంతా హాజరైన ఈ కార్యక్రమంలో చర్చల సారాంశాన్ని నిగ్గు తీసి తీర్మానాల రూపంలో తయారుచేసి ఏకగ్రీవ ఆమోదం పొందగలిగితే ఆ క్లబ్ పనితీరుకు ఈ తీర్మానాలు లక్ష్మణ రేఖలుగా ఉపయోగపడతాయి.

ఇలాంటి రిట్రీట్స్‌ని క్లబ్ స్థాయిలోనే కాదు, జోన్, రీజియన్ జిల్లా స్థాయిలలో కూడా జరుపుకోవడం వలన దిశా నిర్దేశం జరుగుతుంది. సభ్యుల అభిప్రాయాలు తెలుసుకునే అవకాశం కలుగుతుంది. పొరపాటు అవగాహనలను సరిచేసుకోవడానికి వీలౌతుంది. అందరికీ నచ్చిన కార్యక్రమాలేవో తెలియడం వలన అలాంటి వాటికి భవిష్యత్తులో మంచి ప్రాధాన్యత ఇచ్చేందుకు వీలౌతుంది.

క్లబ్ రిట్రీట్ అనేది ఒక అభిప్రాయ సేకరణ కార్యక్రమం. ఎగ్జిట్ పోల్ ఫలితాల లాగా ఇవి అప్పుడప్పుడూ ఆశ్చర్యపోయేటన్ని నిజాల్ని ఆవిష్కరిస్తాయి కూడా!



# SUBJECT INDEX

# లయన్స్ క్లబ్ రాజ్యాంగం ఉపనియమావళి

## CLUB CONSTITUTION & BY-LAWS




## అంతర్జాతీయ లయన్స్ సేవా సంస్థల సమాఖ్య

**International Association of Lions Clubs**

లయన్స్ రాజ్యాంగం ఉపనియమాల ప్రామాణిక పత్రాన్ని (Standard Form) క్లబ్‌లు తమ అధికారిక "రాజ్యాంగం ఉపనియమాలు' 'గా యథాతథంగా ఆమోదించడం కోసం ఉద్ధేశించి ఇక్కడ అందించడం జరుగుతోంది.

వీటిని ఆమోదించిన (Adoption) వెంటనే, క్లబ్ సెక్రటరీ ఈ క్లబ్ రాజ్యాంగం కాపీని తన రికార్డు పుస్తకంలో భద్రపరచవలసి వుంటుంది.

ఈ రాజ్యాంగం మరియు ఉపనియమావళి గానీ, ఎప్పటికప్పుడు జరిగే సవరణలు గానీ వాటిని ఆమోదించినప్పటి నుంచీ అమలులోకి వస్తాయి.

అంతర్జాతీయ లయన్స్ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ ఒక పాలసీగా ప్రకటిస్తున్న అంశం ఏమిటంటే, క్లబ్ పాలనాపరమైన అంశాలన్నీ తప్పనిసరిగా ఈ క్లబ్ రాజ్యాంగం మరియు ఉపనియమావళి ఆలంబనగానే జరగవలసి వుంటుంది.

ఇందులోని అంశాలన్నీ అంతర్జాతీయ రాజ్యాంగం ఉపనియమావళికి అనుగుణంగానే రూపొందించబడి వుంటాయి.

### ప్రామాణికమైన లయన్స్ క్లబ్ పాలనావ్యవస్థ

**STANDARD LIONS CLUB ORGANIZATION PLAN**

క్లబ్ ఆఫీసర్లు మరియు డైరెక్టర్లు (బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్) అధ్యక్షులు, కార్యదర్శి, కోశాధికారి, 1వ ఉపాధ్యక్షులు, 2వ ఉపాధ్యక్షులు, 3వ ఉపాధ్యక్షులు (ఐచ్ఛికం), లయన్ టేమర్, టెయిల్ ట్విస్టర్ (ఐచ్ఛికం), తక్షణ పూర్వ అధ్యక్షులు (IPP) ఇద్దరు (లేక అంతకుమించి) మొదటి సంవత్సరం డైరెక్టర్స్, ఇద్దరు (లేక అంతకుమించి) రెండవ సంవత్సరం డైరెక్టర్స్, మెంబర్‌షిప్ డైరెక్టర్

### పాలనాపరమైన సంఘాలు

**ADMINISTRATIVE COMMITTEES**

అటెండెన్స్ కమిటీ, రాజ్యాంగం మరియు ఉపనియమావళి కమిటీ, సభలూ సమావేశాల కమిటీ (Convention), (డిస్ట్రిక్ట్, మల్టిపుల్, ఇంటర్నేషనల్ స్థాయిలో ప్రతిసంవత్సరం విధిగా జరిగే సమావేశాల్ని కన్‌వెన్షన్స్ అంటారు) ఆర్థికపరమైన అంశాల (Finance) కమిటీ, ఇన్ఫర్‌మేషన్ టెక్నాలజీ కమిటీ, లయన్స్ ఇన్ఫర్మేషన్ కమిటీ, మెంబర్‌షిప్ కమిటీ, ప్రోగ్రామ్ కమిటీ, పబ్లిక్ రిలేషన్స్ కమిటీ, బులెటిన్ కమిటీ (ఎడిటర్), గ్రీటర్ కమిటీ, లీడర్‌షిప్ డెవలప్‌మెంట్ కమిటీ

### కార్యక్రమ నిర్వాహక కమిటీలు

**(ACTIVITIES COMMITTEES)**

★ యూత్ ఔట్‌రీచ్ (యువతరానికి సంబంధించిన సేవాకార్యక్రమాలు నిర్వహిస్తారు)
★ డయాబెటిస్ అవగాహన కమిటీ
★ అంధత్వ నివారణ కార్యక్రమాల కమిటీ (Sight Conservation and work with the Blind)



Lion Dr. **G. V. PURNACHAND** MJF of Lions club of Vijayawada Vidyadhara is the District Chairperson, Orientation and District P.R.O.

He Joined Lionism in 1985 - 86. He served the District as Cabinet Secretary, Region Chairman, Zone Chairman and District Chairman.

He is also Chairman, Vidyadhara Lions Service and Charitable Trust.

He was 100% President (Twice), Lion of the District (Twice) Lion of the Region (Thrice) and Distringuished Lion of the Multiple District 324.

He Received 5 extension Awards, 3 Guiding Lion Awards, 4 International President's Appreciation Awards. He is also a Melvin Jones Fellow.

Ln. Dr. Purnachand has been active in numerous Social & Cultural Activities, among them, serving as General Secretary, National Medical Association AP. State Unit, Secretary, Krishna District WriterÕs Association etc., are few.

He was elected as Member of erstwhile A.P. Sahitya Academi at his 28th year. Andhra Pradesh Adhikara Bhasha Sangham felicitated him on the occassion of his Silver Jubilee year as writer and Presented BHASHABIGNA Puraskaram. He also received the prestigious Mahakavi Jashua Visishta Sahithee Award for his famous Historical Novel "SAPTA SINDHU".

He was one of the founders of MINI POETRY MOVEMENT in Telugu. He is a versatile Poet & Author and Published 35 Books on Various Subjects.

"ANTHARANGAM" is the Latest among 5 Books he has written sofar on Lionism.

Professionally He is a Popular Ayurvedic Consultant Physician having patients all over the State.

Lion Dr. Purnachand and his wife Lion Aruna Devi have one Daughter Chetana and one Son Kartik Manogna.

Lion Dr. G.V. PURNACHAND MJF

# ANTARANGAM



DEDICATED TO

LIONS PRIDE OF THE STATE

Lion **Er. Chigurupati Vara Prasad** PMJF

International Director

AN INTRODUCTION TO LIONISM Lion Dr. G.V. PURNACHAND MJF

186

